# చైతన్య భగవద్గీత

## అథ చతుర్థోఽధ్యాయః - నాల్గవ అధ్యాయము

## జ్ఞానయోగః - జ్ఞానయోగము

### వేదార్థం

సర్వులు ఆశించే పరమ పురుషార్థము మోక్షము. అది సర్వోపద్రవ రహిత స్థితి కనుక సర్వులకు ఏకైక ఆశ్రయమై ఉంది. మోక్షము జ్ఞానరూపంలో ఉన్నందున జ్ఞాన మొక్కటే మోక్ష సాధనము. జ్ఞానయోగమును పొందుటకు కావలసిన యోగ్యత కర్మయోగము వలన ప్రాప్తిస్తుంది. కనుక కర్మయోగము ఉపాయముగా కలిగిన జ్ఞానయోగము మోక్ష సాధనము అని వేద నిర్ణయము. ఇదే వేదోక్త ధర్మము.

కర్మయోగము ఉపాయము. జ్ఞానయోగము ఉపేయము. కర్మయోగమును హేతువుగా కలిగిన జ్ఞాన యోగము సాక్షాత్తు మోక్ష సాధనము. ఈ విధంగా ప్రవృత్తి లక్షణమైన కర్మయోగమును ఉపాయంగా కలిగిన నివృత్తి లక్షణమైన జ్ఞానయోగముతో వేదార్థము సమాప్త మవుతుంది. నిష్ఠాద్వయ రూపమైన వేదార్థమును భగవానుడు రెండు, మూడు అధ్యాయాలలో ఉపన్యసించాడు. వేదము ప్రతిపాదించే నిష్ఠాద్వయ వేదోక్త ధర్మాన్ని సంపూర్ణంగా ప్రసంగించుట చేత, సాంఖ్య కర్మయోగాలలో వేదార్థం సమాప్తమైందని భగవానుని అభిప్రాయము. కనుకనే, వంశ కథనాన్ని స్తుతించాడు ***(అతః పరిసమాప్తం వేదార్థం మన్వానః తం వంశకథనేన స్తౌతి శ్రీ భగవాన్).***

### సంప్రదాయ ప్రసక్తి

వేదార్థము పూర్వాధ్యాయముల రెండిటితో పరిసమాప్త మైందని భావించడం చేత, నాల్గవ అధ్యాయమును సంప్రదాయ ప్రసక్తితో ప్రసంగించడానికి భగవానుడు ప్రారంభించాడు. ఇక్కడ సంప్రదాయం అంటే, గురుశిష్య పరంపరాగత మైన విద్యావంశాన్ని ప్రస్తావించడం అని అర్థము. విద్యావంశము అంటే, తాము ప్రబోధించిన విషయమును గతంలో ఎవరెవరు గురుస్థానంలో శోభిస్తూ ఎవరెవరికి బోధించారో ఆ వివరాలను తెలపడం. ఇదే విద్యావంశం. దీనిని వంశకథనం అని కూడా ఉపనిషత్తులు అభిభాషించాయి. బృహదారణ్యకోపనిషత్తు చివరలో ఈ ప్రస్తావన ఉంది. వంశకథనాన్ని వినిపిస్తే, ఇక చెప్పవలసింది ఏమీ లేదని భావము. ఒక విధంగా మూడవ అధ్యాయంతో వేదార్థం సిద్ధించింది కనుక గీత సమాప్త మైందనే భావము. మరి అలాంటప్పుడు, మిగిలిన పదహైదు అధ్యాయాల విషయ మేమిటి? అనే సంశయం పుట్టుకొస్తుంది.

నిష్ఠాద్వయ రూపమైన వేదార్థం సమాప్తమైంది. సమాప్తంలో వంశకథన మనే సంప్రదాయ ప్రసంగాన్ని వినిపించడం చేత, ప్రసంగోపాత్త మైన అనేక అవాంతర విషయాలు తెరపై కొచ్చి దివ్య వెలుగులను విరజిమ్మాయి. ఈ విషయాలన్నీ మున్ముందు వివరిస్తాను.

వంశకథనం అనే సంప్రదాయోపన్యాసమును గ్రంథారంభంలో ప్రస్తావించవచ్చు. లేదా, గ్రంథాంత మందు వివరించవచ్చు. ప్రస్తుతము నాల్గవ అధ్యాయములో విద్యావంశాన్ని ప్రరోచనార్థం, అంటే విస్పష్టం చేయడం కోసం వినిపించడం వల్ల వేదార్థం పరిసమాప్త మైందని భావించడం జరుగుతూ ఉంది.

### కాల్పనికం కాదు

వేదము అపౌరుషేయము. సృష్టికి ముందే వేదము ఉంది. వేదజ్ఞానము తోనే భగవంతుడు సృష్టిని చేశాడు. వేదము, వేదనారాయణుడు వేరు కాదు. అందుచేత, వేదము ప్రమాణమైంది.

వేదజ్ఞానమే గీతలో చెప్పబడింది. గీతను చెప్పినవాడు వేదపురుషుడే గాని సామాన్య మానవుడు కాడు. ఈ సత్యాన్ని అంగీకరించలేని కొందరు వేదమార్గానుయాయులు శ్రీకృష్ణుని ఉత్తమ మానవుడని, గీతను కాల్పనిక గ్రంథము అని భావించారు. అంటే, గీత వేదము లాగా అపౌరుషేయము కాదని, కాలంలో ఆవిర్భవించిన పౌరుషేయ మని భావించారు.

ఈ విధమైన కృత్రిమ శంకను నివారిస్తూ నాల్గవ అధ్యాయం ప్రారంభ మవుతూ ఉంది. గీత కాల్పనిక గ్రంథము కాదని, కపోల కల్పితము అసలే కాదని నిర్ధారణ చేస్తూ, వంశకథనం స్తుతింప బడింది.

ఇంతవరకు రెండు, మూడు అధ్యాయాలలో బోధించిన విషయం - అనగా కర్మయోగమును ఉపాయముగా గల మోక్షసాధన మైన జ్ఞానయోగము శ్రీకృష్ణుడు అర్జునుని కొరకు ప్రత్యేకంగా బోధించినదా? లేక, గతంలో ఇంకెవరైనా బోధించారా? పురాతనంగా వచ్చిన సనాతన విద్య యేనా? లేక, కాలానుగుణంగా ప్రాప్తించిన కొంగ్రొత్త ఉపదేశమా? ఒకవేళ గతంలో ఇతరులు బోధించి నట్లైతే, ఆ బోధించిన వారెవరు? ఎవరికి బోధించారు?

నూతనమైన కాల్పనిక సిద్ధాంతాలు మోక్షప్రియులైన భారతీయులకు ఆమోద యోగ్యాలు కావు. పురాతనమే అంగీకారము. సనాతనమే సంపూర్ణము. అదే ప్రమాణమైన వేదము. అలాంటిది గతంలో ప్రవచించినదే అయితే, పునః ఇప్పుడు బోధించ వలసిన అవసరం ఏముంది? అవసరం ఉండే శ్రీకృష్ణుడు బోధించాడని అనుకుందాం. అలాంటప్పుడు అర్జునుడికే ఎందుకు బోధించవలసి వచ్చింది? శ్రీకృష్ణుడు బోధించే అద్భుతమైన విషయాన్ని విని అర్థం చేసుకొనే సామర్థ్యం అర్జునునికి ఉందా? ఉంటే, అర్జునునికి ప్రత్యేకంగా ఉన్న ఆ అర్హత లేమిటి? ఈ ప్రశ్న లన్నిటికీ నాల్గవ అధ్యాయం ప్రారంభం లోనే భగవానుడు అనుగ్రహించే మూడు శ్లోకాలలో సమాధానాలు లభిస్తాయి.

**కాగితపు పడవలు కడతేర్చవు**

నదిని దాటాలంటే నౌక ఉండాలి. నౌకలే మనిషిని కడ చేర్చుతాయి. కాగితపు పడవలు ముంచేవే గాని తేల్చేవి కావు. తేల్చడమే చేత గానివి కడతేర్చే దేముంటుంది?

నదిని దాటడానికి నౌక అవసర మైనట్లే, జీవన నదీ ప్రవాహాన్ని దాటడానికి జ్ఞాననౌక అవసరం. జ్ఞానం లేని మాటలు ముంచడానికి పనికొస్తాయే గాని తేల్చలేవు.

నావ ఒక్కటే నదిని దాటించి కడ చేర్చుతుంది. జ్ఞాన మొక్కటే జీవన నదిని దాటించి కడ తేర్చుతుంది. జ్ఞానం కలిగిన మహాత్ముల వద్ద శ్రవణం చేసి నపుడే అజ్ఞానం అంతరిస్తుంది. ఈ విషయాన్ని కూడా నాల్గవ అధ్యాయం సుస్పష్టంగా వివరిస్తుంది. ఏదేదో వింటూ పోయేవాళ్ళు ఎక్కడికైనా చేరవచ్చు. వినదగినది విన్నవాళ్ళే విముక్తిని పొందుతారు. తమకూ జ్ఞానం లేక, జ్ఞానం లేకుండా బోధించే వారి మాటల్ని వింటూ పోయేవారు విషయాన్ని అంటిపెట్టుకొని ఉంటారే గాని వంట పట్టించుకోలేరు అన్నది మహాభారతము.

*యస్య నాస్తి నిజప్రజ్ఞా కేవలం తు బహుశ్రుతః*
*న స జానాతి శాస్త్రార్థం దర్వీ సూతరసాన్ ఇవ ॥*

స్వయంగా తనకు జ్ఞానం లేక, అనేక విషయాలను ఆలకించిన వాడు, అన్ని పదార్థాలలో మునిగి లేస్తున్నా రుచిని గ్రహించ లేని గరిటె లాగా, శాస్త్రార్థాన్ని గ్రహించలేడు.





**నాల్గవ అధ్యాయము**

ఇది నాల్గవ అధ్యాయము. నాలుగు చక్రాలపై రథం నడిచినట్లు, ప్రధానంగా నాలుగు విషయాలను ప్రవచిస్తూ ఈ అధ్యాయం సాగుతుంది. (1) అవతార వైశిష్ట్యాన్ని వివరించే జ్ఞాన వైభవము. (2) అవతరించిన పరమాత్మలో గోచరించే కర్మ వైభవము. (3) కర్మలన్నీ యజ్ఞాలు కావాలని ప్రబోధించే యజ్ఞ వైభవము. (4)జ్ఞానము కన్నా పవిత్ర మైనది లేదంటూ జ్ఞాన వైభవము.

**దివ్య జ్ఞానము**

జ్ఞానమే ప్రధానంగా కలిగిన ఈ నాల్గవ అధ్యాయములో జ్ఞాన సంబంధమైన నాలుగు పవిత్ర జ్ఞానమయ సాధనలు అద్భుతంగా ప్రవచింప బడ్డాయి. మొదటిది జ్ఞాన తపస్సు (శ్లో 10), జ్ఞానాగ్ని (19, 37). రెండవది జ్ఞానయజ్ఞము (29, 33). మూడవది జ్ఞాననౌక (36). నాల్గవది జ్ఞానఖడ్గము (42). జ్ఞానమయమైన సాధ్య సాధనాలను ప్రవచించి జ్ఞానయోగము అనే పేరును ఈ అధ్యాయం సార్థకం చేసుకున్నది.

ఇంతటి అద్భుతమైన విషయాన్ని అర్జునుడు ప్రశ్నించగలడా? ఏమో, అందుకనే ప్రశ్నతో పని లేకుండా తానే స్వయంగా ప్రస్తావించి ప్రవచించాడు పరమేశ్వరుడు. దూడను చూచి గోమాత చేపునట్లు, అర్జునుని చూచి *(పార్థో వత్సః)* గోపాలనందనుడు ప్రశ్నతో సంబంధం లేకుండా స్వయంగా ప్రేమతో ప్రవచించిన గీత లోని ఎనిమిది అధ్యాయాలలో ఈ అధ్యాయము మొదటిది. మొద లెట్టడం జరిగితే అజ్ఞానాన్ని తుద ముట్టించినట్లే. చదవండి.

**శ్రీ భగవానువాచ :**

ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహ మవ్యయమ్ ।
వివస్వా న్మనవే ప్రాహ మను రిక్ష్వాకవేఽబ్రవీత్ ॥ 1

*ఇమం-వివస్వతే-యోగం-ప్రోక్తవాన్-అహం-అవ్యయం*
*వివస్వాన్-మనవే-ప్రాహ-మనుః-ఇక్ష్వాకవే-అబ్రవీత్*

| | | | | | |
|---|---|---|---|---|---|
| అవ్యయం | = నాశము లేని | | వివస్వాన్ | = | సూర్యుడు |
| ఇమం యోగం | = ఈ యోగమును | | మనవే | = | మనువు కొరకు |
| వివస్వతే | = సూర్యుని కొరకు | | ప్రాహ | = | చెప్పాడు |
| అహం | = నేను | | మనుః | = | మనువు |
| ప్రోక్తవాన్ | = చెప్పాను | | ఇక్ష్వాకవే | = | ఇక్ష్వాకుని కొరకు |
| | | | అబ్రవీత్ | = | చెప్పెను |

**శ్రీ భగవానుడు చెబుతున్నాడు :**

**ఈ యోగము నశించేది కాదు. దీనిని మొదట నేను సూర్యునికి చెప్పాను. సూర్యుడు మనువుకు చెబితే, మనువు ఇక్ష్వాకునకు చెప్పాడు.**

**వ్యాఖ్య**

**చెప్పిందే చెబుతున్నాడు**

ఈ యోగమును *(ఇమం యోగం)* ప్రస్తుతం పార్థునికి బోధిస్తున్న వాసుదేవుడు గతంలో కూడా బోధించి ఉన్నాడు. ఎవరికి ఎప్పుడు బోధించాడు? అని ప్రశ్నిస్తే, సృష్ట్యారంభంలో సూర్యునికి ఉపదేశించినట్లు చెబుతున్నాడు. అంటే, నేడు బోధిస్తున్న గీతాచార్యుడు సృష్ట్యాది లోనే ఉండి బోధించాడని అర్థము. సృష్ట్యాదిలో భగవంతుడు తప్ప మరొకరు లేరు. *స దేవ సోమ్యేద మగ్ర ఆసీ దేక మేవాద్వితీయం.* నామరూపాత్మక మైన ఈ దృశ్యమాన

ప్రపంచము పుట్టక ముందు ఏకము, అద్వితీయము అయిన బ్రహ్మమే సద్రూపంగా ఉండింది అని ఛాందోగ్యశ్రుతి. కనుక శ్రీకృష్ణుడు భగవంతుడు. ఈ కారణం గానే ఆయన వాచకం భగవానువాచ అయింది.

ఈ యోగము ***(ఇమం యోగం)*** అని భగవానుడు ప్రస్తావించడం ప్రసన్న గంభీరంగా ఉంది. ఈ యోగము అంటే సాంఖ్య, కర్మ యోగాలలో బోధింపబడిన యోగం అని అర్థం ***(ఇమం అధ్యాయ ద్వయేన ఉక్తం యోగం).*** అంతేగాని కేవలం కర్మయోగము మాత్రమే అని గ్రహించకూడదు. ఇలాంటి చోటే భగవద్గీత మ్రింగుడు పడని వెలగపండు అవుతుంది. వ్యాఖ్యానకర్తల బండారం కూడా బయట పడుతుంది. స్పష్టత కొరకు యత్నించే వారికి శంకరభాష్యం దారిదీపంగా శోభిస్తుంది.

**ఆదిలో ఆదిత్యునికి**

ప్రవృత్తి లక్షణ మైన కర్మయోగమును ఉపాయముగా కలిగిన నివృత్తి లక్షణమైన జ్ఞానయోగమే మోక్షసాధన మని వేదోక్త ధర్మము. ఈ యోగమును ***(ఇమం యోగం)*** నేను వివస్వతునకు అనగా ఆదిత్యునికి బోధించాను. ***(వివస్వతే అహం ప్రోక్తవాన్)*** అన్నాడు భగవంతుడు. ఎప్పుడు బోధించాడు? సృష్ట్యాదిలో బోధించాడు ***(సర్గాదౌ).***

సూర్యునికి వివస్వతుడు అనే పేరు కూడా ఉంది. 'వివస్' అంటే తేజస్సు లేదా కాంతి. ***వివోఽ స్య అస్తీతి వా వివస్వాన్*** - గొప్ప తేజోవంతుడు లేదా కాంతి కలవాడు కనుక ఆదిత్యుడు వివస్వతుడు. బుద్ధిలో ప్రకాశం ఉన్నవాడే భగవంతుని బోధను గ్రహించగలడు.

జగత్తును పాలించే క్షత్రియ వంశానికి సూర్యుడు మూలపురుషుడు. క్షత్రియులు బలవంతులుగా, బుద్ధిమంతులుగా ఉండాలని భావించి, వారికి శక్తిని సమకూర్చేందుకు ఈ యోగాన్ని ముందుగా సూర్యునికి బోధించాడు ***(జగత్పాలయిత్రూణాం క్షత్రియాణాం బలాధానాయ).***

పాలకులకు యోగబలం ఉంటే పాలితులకు యోగక్షేమాలు ఉంటాయి. భోగులు, రోగులు, విద్యాహీనులు పాలకులు అయితే పాలితులు దుఃఖభాగు లవుతారు. దీనులై హీను లవుతారు. ఈ కారణం గానే పరమేశ్వరుడు సృష్ట్యాది యందే క్షత్రియులకు మూల పురుషుడైన సూర్యునికి బోధించాడు. ఈ సందర్భమున **ఉక్తవాన్** అనకుండా **ప్రోక్తవాన్** అనడంలో చాలా ఔచిత్య ముంది. కేవలం చెప్పడం కాకుండా, సంశయ రహితంగా, స్పష్టంగా చెప్పడం జరిగింది అని భావము.

**వివస్వతుని వైభవము**

ధనమైనా, జ్ఞానమైనా దాతృత్వం కల వ్యక్తుల వద్దే శోభిస్తుంది. సూర్యుడు గొప్ప దాత. కాంతి ప్రదాత. జీవన ప్రదాత. అందుకే సూర్యుని ప్రత్యక్ష దైవంగా వేదం వర్ణించింది. ఓ ఆదిత్యుడా! నీకు నమస్కారము. నీవు ప్రత్యక్షంగా కర్మ కర్తవు. సాక్షాత్తు బ్రహ్మమై శోభిస్తున్నావు ***(నమస్తే ఆదిత్య, త్వమేవ ప్రత్యక్షం కర్మ కర్తాసి, త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి).***

సూర్యునిలో అన్నీ దైవ లక్షణాలే. జ్ఞాని లక్షణాలే. తాను స్వయంగా కాంతిమయుడు. సమస్త జగత్తుకు ఆయనే వెలుగు. తాను మండుతూ అందరి బ్రతుకుల్ని పండిస్తూ ఉంటాడు. ఆ దివ్యాత్ముని సన్నిధిలో జీవించే వారికి చీకట్లు ఉండవు. ఇక్కట్లు తెలియవు.

తాను కర్మకర్తే గాని తనలో కర్మ లేదు. కర్మఫలాల యందు ఆయనకు ఆసక్తీ లేదు. ఆయన వల్లనే సర్వులూ కర్మలను ఆచరిస్తారు. కాని, ఎవరి కర్మలకూ తాను కారణం కాడు. కర్మలలో ఆసక్తి లేదని కర్మలను త్యజించడు. కర్మ యందే ఉంటాడు. సదా ప్రకాశాన్ని అందిస్తూనే ఉంటాడు.

**న మాం కర్మాణి లిమ్పన్తి న మే కర్మఫలే స్పృహా**

'అర్జునా! నన్ను కర్మలు అంటవు. నాకు కర్మఫలాల యందు ఆసక్తి లేదు' అని ఈ అధ్యాయం లోనే





పద్నాల్గవ శ్లోకంలో భగవంతుడు ప్రవచిస్తాడు. విశిష్టమైన ఈ దైవ స్వభావము సూర్యునిలో ప్రస్ఫుటంగా ప్రకటిత మవుతూ ఉంటుంది. అంతేకాదు, దైవ స్వరూపము, దైవ లక్షణం కూడా స్పష్ట మవుతూ ఉంటుంది.

ప్రపంచంలో ప్రాణుల ఉత్పత్తికి సూర్యుడే కారణము. అలా పుట్టిన ప్రాణులు వర్ధిల్లుటకు సూర్యుడే కారణము. అలా జగత్తును పోషించే వాడు కనుక ఆయనను **పూషా** అని కీర్తించారు. అలాగే సూర్యుని కిరణాలను భరించలేక కొన్ని ప్రాణులు మరణిస్తూ ఉంటాయి. కనుక సృష్టి స్థితి లయాలకు కారణంగా తెలుస్తూ ఉన్నందున సూర్యుణ్ణి సాక్షాత్తు భగవంతునిగా భావించి ఆరాధించారు. సూర్యుని నామధేయంతో ఒక మతమే పుట్టుకొచ్చింది. అదే సౌరమతము.

సూర్యదేవుని వైభవాన్ని ఉపనిషత్తులు కూడా శ్లాఘించాయి. నూట ఎనిమిది ఉపనిషత్తులలో సూర్యోపనిషత్ కూడా ఉంది. అందులో సృష్టి స్థితి లయాలకు సూర్యుడే కారణమని స్తుతించడం జరిగింది.

'సూర్యుని నుండే సమస్త భూతాలు ఆవిర్భవిస్తున్నాయి ***(సూర్యాద్వై ఖల్విమాని భూతాని జాయన్తే).*** ఓ ఆదిత్యుడా! నీకు నమస్కారము. నీవే బ్రహ్మవివి. నీవే విష్ణుదేవుడవు. నీవే రుద్రుడవు అని సూర్యోపనిషత్ స్తుతించింది ***(నమస్తే ఆదిత్య, త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి, త్వమేవ ప్రత్యక్షం విష్ణురసి, త్వమేవ ప్రత్యక్షం రుద్రోఽ సి).***

వివస్వతునికి వేదనారాయణుడు వేదోక్త ధర్మాన్ని సృష్ట్యాదిలో బోధించాడు. వేద నారాయణుడు, వేద జ్ఞానము రెండు కావు. ఆదిదేవుడు ఆదిత్యునికి జ్ఞానాన్ని ఉపదేశించిన తరువాత ఇరువురిలో ఉన్న జ్ఞానము ఒక్కటే. అంటే, ఇరువురూ ఒకే స్వరూపము అని అర్థం. ఇదే ఆర్షవిజ్ఞాన వైభవము. తత్త్వమసి మహావాక్య తాత్పర్యము. జ్ఞానమును అందించిన తరువాత గురుశిష్యులు ఇరువురు ఒకే వైభవంతో శోభిస్తారు. ఆదిత్యుడు ఆదిదేవుని కన్నా వేరుగా లేడు. కనుకనే, కిరణాలు కలిగిన వెలుగులలో నేను సూర్యుణ్ణి అన్నాడు గీతాచార్యుడు ***(జ్యోతిషాం రవిః అంశుమాన్ - 10 - 21).***

**ఉంచుకోలేదు - పంచిపెట్టాడు**

ఉన్న వాళ్ళందరూ ఉన్నవాళ్ళే. ఉన్నవా ళ్ళందరూ ఉన్నతిని సాధించిన వారు కారు. ఉన్న దానిని పంచుకున్న వాళ్ళే ఉన్నతులు. ఎత్తైనవారు. సూర్యుడు కాంతి కలవాడు. అంతేకాదు. తన కాంతిని అహరహము తారతమ్యం లేకుండా పంచుతూ ఉంటాడు. విరివిగా వితరణ చేస్తూ ఉంటాడు. అందుకే సూర్యుణ్ణి **వివస్వాన్** అంటున్నాడు భగవంతుడు. ***వివిధం వస్తే ఆచ్ఛాదయతి వివస్వాన్.*** తన కాంతి చేత సమస్తాన్ని కప్పేవాడు కనుక ఆయన **వివస్వాన్** అయ్యాడు.

జ్ఞానం కలిగిన వారు వారి కున్న జ్ఞానాన్ని ఇతరులకు పంచాలి. శోక విముక్తు లైన వారు శోకగ్రస్తులను తరింప చేయాలి. అదే వేద వైభవము. ఆర్ష సంస్కృతీ ప్రాభవము.

***స్వయం తీర్ణః పరాన్ తారయతి,*** తాను తరించిన వాడు పరులను తరింప చేయాలి. కనుక ఆదిదేవుని నుండి వేదార్థ జ్ఞానమును అందుకున్న ఆదిత్యుడు ఆ జ్ఞానమును తన పుత్రుడైన మనువుకు అందించాడు. మనువు ఆ తరువాత తన కుమారుడైన ఇక్ష్వాకునికి ఉపదేశించాడు.

**అనుమానమా! ప్రమాణమా!**

సాధ్యానికి సాధన హేతువై ఉంటుంది. జ్ఞానయోగము అనే సాధ్యానికి కర్మయోగము హేతువుగా ఉంది. ఏదయినా సరే, సాధ్యము అయింది అంటే, అది కాలం లోనే సాధ్యమై ఉంటుంది. కాలంలో సాధ్య మైనది కాలంలో నశిస్తుంది. కనుక, సాధ్యమైనది ఏదైనా అనిత్యమే.

మోక్షము కనుక జ్ఞానసాధ్యం అయితే, అది కూడా అనిత్యమై నశిస్తుంది. ఈ అనుమానాన్ని తొలగించే నిమిత్తం, తాను సూర్యునికి బోధించిన యోగము **అవ్యయమ్** అని ప్రవచించడం జరిగింది.

వేదము కాల్పనికము కాదు కనుక వేద జ్ఞానము అవ్యయము. పరమేశ్వరుడు బోధించిన ఈ యోగమునకు వేదమే ఆధారము. ప్రామాణికమైన వేదజ్ఞానము వలన కలిగే మోక్షము కూడా అవ్యయము. మరి అవ్యయమైన మోక్షాన్ని అందించే యోగం క్షరం ఎలా అవుతుంది? ఎలా నశిస్తుంది? **అవ్యయం అవ్యయ ఫలత్వాత్**. యోగం వల్ల కలిగే ఫలం అవ్యయ మైనపుడు యోగము కూడా అవ్యయమే కావాలి.

వేదము అవ్యయము కనుక వేదార్థాన్ని ప్రవచించే ఈ యోగము కూడా అవ్యయము. యోగఫలంగా అవ్యయమైన మోక్షము లభించే టప్పుడు, యోగము కూడా అవ్యయమే అవుతుంది. ఈ అవ్యయ యోగమును పరమేశ్వరుడు సూర్యునికి ఉపదేశించాడు. సూర్యుడు తన కుమారుడైన మనువుకు బోధిస్తే, మనువు తన కుమారుడైన ఇక్ష్వాకు మహారాజుకు బోధించాడు. ఈ విధంగా వేదజ్ఞానము పరంపరా ప్రాప్తమైంది. సంప్రదాయంగా శోభించింది.

**ఏవం పరమ్పరాప్రాప్త మిమం రాజర్షయో విదుః ।**
**స కాలే నేహ మహతా యోగో నష్టః పరంతప ॥** 2

*ఏవం-పరంపరాప్రాప్తం-ఇమం-రాజర్షయః-విదుః*
*సః-కాలేన-ఇహ-మహతా-యోగః-నష్టః-పరంతప*

| | | | | | |
|---|---|---|---|---|---|
| పరంతప | = | అర్జునా! | సః యోగః | = | ఆ యోగము |
| ఏవం | = | ఈ రీతిగ | మహతా | = | చాలా |
| పరంపరా ప్రాప్తం | = | పరంపరగా వచ్చిన | కాలేన | = | కాలానికి |
| ఇమం | = | ఈ యోగమును | ఇహ | = | ఇప్పుడు |
| రాజర్షయః | = | రాజర్షులు | నష్టః | = | నశించింది |
| విదుః | = | తెలుసుకున్నారు | | | |

**పరంతపా! ఈ విధంగా ఈ యోగము పరంపరగా ప్రాప్తించింది. దీనిని రాజర్షులు గ్రహించారు. కాల క్రమంలో ఈ యోగము గుప్తమై లుప్తమైంది. కనిపించకుండా పోయింది.**

**వ్యాఖ్య**

**ధర్మయుక్తి - శాసన శక్తి**

ఆదిత్యునితో ఆరంభమై గురుశిష్య పరంపరగా ప్రాప్తమైన ఈ పురాతన యోగమును రాజర్షులు తెలుసుకున్నారు. అంటే, ఈ యోగం క్షత్రియ పరంపరలో సాగింది అని అర్థము.

సృష్ట్యాదిలో పరమేశ్వరుడు సూర్యునికి ఉపదేశించిన ఈ యోగమును సూర్యుడు తన పుత్రుడైన మనువుకు బోధించాడు. మావవ సంతతి మనువు నుండి ఆవిర్భవించింది కనుక 'మానవ' అనే పిలుపు వచ్చింది. ఆ తరువాత మనువు తన కుమారుడైన ఇక్ష్వాకు మహారాజుకు బోధించాడు. ఇదంతా సూర్యవంశము. ఇక్ష్వాకుని వంశంలో భరతుడు, హరిశ్చంద్రుడు, దిలీపుడు, భగీరథుడు, రఘుమహారాజు, దశరథుడు, శ్రీరామచంద్రుడు ఇలా రాజులు పరంపరగా వచ్చారు. వీరందరూ సూర్యవంశీయులే. వీరందరూ యోగవిదులే. ధర్మయుతులే. జ్ఞానరూపులే. అందుచేత రాజర్షులని పిలువ బడ్డారు.

**రాజానాం చ తే ఋషయః చ రాజర్షయః**



ఎవరైతే రాజులుగా ఉండి పరిపాలిస్తూ, ఋషులుగా కూడా జీవించారో వారిని రాజర్షులు అంటారు. అంటే, రాజులుగా రాజత్వము, ఋషులుగా ఋషిత్వమును కలిగి ఉన్నారని భావము. శాసనకర్త లైన రాజులు ధర్మదృష్టి కలిగి ప్రజలకు జ్ఞానపూరితమైన ధర్మపాలనను అందించారు.

**రాజర్షయః** అంటే రాజులు, ఋషులు అని కూడా అర్థం చెప్పుకోవచ్చు. ఆదిత్యుని నుండి పరంపరా ప్రాప్తమైన జ్ఞానాన్ని అందుకొని కొందరు రాజర్షులై ప్రజలను పాలించారు. మరి కొందరు కొంత కాలం పాలించి, ఆ తరువాత క్రమంగా వానప్రస్థాన్ని, సన్యాసాన్ని స్వీకరించారు. అలాంటివారు ఆరంభంలో రాజులుగా అందల మెక్కి, రాజర్షులుగా సన్యాసాన్ని స్వీకరించి ఋషులుగా భాసించారు. అలా ఋషులైన వారు తమ శిష్యులకు ఈ యోగమును బోధించారు. వారిది ఋషి పరంపర అయింది.

రాజర్షులైన ప్రభువులు ప్రజలకు ధర్మ పరిపాలనను అందించారు. అలాంటి వారికి ధర్మ మీమాంస తలెత్తితే ఋషులను ఆహ్వానించి వారి నుండి స్ఫూర్తిని పొందేవారు. జనక, దశరథాదులు అలా ఆచరించినట్లు ఇతిహాసాలు, పురాణాలు వక్కాణిస్తున్నాయి. ఈ విధంగా పరంపరా ప్రాప్తమైన ఈ యోగం అటు రాజుల చేత, ఇటు ఋషుల చేత దివ్యంగా వ్యాప్తి చేయబడింది.

బావుంది. మరి, ఇలా పరంపరా ప్రాప్తంగా యోగం ఉండే టప్పుడు, అదే యోగాన్ని ఇప్పుడు కురుక్షేత్రంలో బోధించ వలసిన అవసర మేమిటి? ఆ విషయాన్నే శ్లోకం ఉత్తరార్థంలో వివరిస్తున్నాడు వాసుదేవుడు.

**సంప్రదాయ విచ్ఛిన్నము**

పరంపరాప్రాప్తంగా వచ్చిన ఈ యోగ సంప్రదాయము చాలా కాలం తరువాత ***(మహతా కాలేన)*** నశించింది అంటున్నాడు.

పై విధంగా ***(ఏవం)***, ఆదిత్యుడు మొదలైన మహాత్ముల నుండి పరంపరా ప్రాప్తంగా వస్తున్న ఈ యోగమును ***(ఇమమ్)*** ఇటీవల వారైన, అంటే జనకాదులు మొదలైన వారు ***(రాజర్షయః)*** తెలుసుకున్నారు. తదనుగుణంగా జీవించి పాలించారు. అలాంటిది చాలా కాలం తరువాత ***(కాలేన దీర్ఘేణ)***, ప్రస్తుతము అనగా మనము నివసిస్తున్న ద్వాపర యుగాంతమందు ***(ఇహ)***, ఈ యోగము నశించింది ***(యోగో నష్టః)***. అంటే సంప్రదాయ విచ్ఛేదము జరిగింది అని భగవానుడు చెప్పుచున్నాడు.

**అవ్యయానికి వ్యయమా?**

సృష్ట్యాదిలో తాను సూర్యునికి బోధించిన ఈ యోగము అవ్యయము, అనగా నశించేది కాదని భగవానుడే స్వయంగా ప్రవచించాడు. ఒకవైపు ఈ యోగము అవ్యయము అంటూ, రెండవ శ్లోకం లోనే ఈ యోగము నశించింది అని చెప్పడంలో పరస్పర వైరుధ్యము లేదా? ఉన్నట్లే ఉంది. కాస్త విచారిద్దాం.

పరమేశ్వరుడు నిత్యుడు కనుక నశించేవాడు కాడు. పరమేశ్వరుడు నిత్యుడై నపుడు నిత్యుడైన పరమేశ్వరుని జ్ఞానం నిత్యం కాకుండా పోతుందా? మరి నిత్యుడైన పరమేశ్వరుడు నశించ నపుడు, నిత్యమైన ఆయన జ్ఞానం ఎలా నశిస్తుంది?

అనాది అని కీర్తింప బడుతున్న వేదమును ఆధారముగా కలిగిన ఈ యోగము అనాది కాకపోతుందా? ఆది లేని వేదము అంతము కూడా లేనిదై శోభిస్తూ ఉంది. అందుచేతనే వేదజ్ఞానము అనంత ఫలానికి హేతువైంది. ప్రమాణ మైంది. అనంత ఫలానికి కారణమైన యోగము అంత మెలా అవుతుంది? ఎలా నశిస్తుంది? ఇక్కడ యోగము నశించడము అంటే వాడుకలో లేకుండా పోవడ మని అర్థము. వ్యవహారంలో మృగ్య మైందని, విచ్ఛిన్న సంప్రదాయ మైందని భావము.

జానపద కళలు నశించాయి అని మనం అంటుంటాము కదా! దాని అర్థ మేమిటి? ప్రస్తుతం వాడుకలో లేవు అని అర్థము. అంటే, ఆ కళను బోధించే వాళ్ళు, అభ్యసించే వాళ్ళు ఇరువురూ లేకుండా పోయారని అర్థము. ఆచరణలో లేకపోతే ఏదైనా అదృశ్య మవుతుంది. ఇదే విచ్ఛిన్న సంప్రదాయము. పునః దానిని అభ్యసించి వ్యాప్తి చేస్తే అదే సజీవ మవుతుంది.

**అధికారంలో అంధకారం**

అజ్ఞానం అందల మెక్క కూడదు. అధికారంలో అంధకారం అలుము కుంటే, పాలనావ్యవస్థ కుంటు పడుతుంది. ప్రభువులు దారి తప్పితే, ప్రజలు గాడిలో నిలవరు. ఇలాంటి సమయా ల్లోనే యోగం నశిస్తుంది. ధర్మం నశిస్తుంది. శాంతి కనుమరు గవుతుంది.

జనకుడు మొదలు ధర్మరాజు వరకు అధికారంలో ఉన్నవా రందరు ధర్మాన్ని అంటిపెట్టుకొనే ఉన్నారు. యోగాన్ని అనుష్ఠిస్తూనే ఉన్నారు. ద్వాపర యుగాంతంలో పరిస్థితి విషమించింది. ధర్మాన్ని అధికార పీఠంపై నిలబెట్టిన ధర్మరాజు అడవుల పాలయ్యాడు. దుర్యోధనుని దుష్ట పాలనలో దుర్దశ ఏర్పడింది. ధర్మం దూరమైంది. యోగం బలహీన పడింది.

పాలించేవారు ప్రజ్ఞావంతులై ఉండాలి. అందుకనే వేదోక్తధర్మం రాజ పరంపరలో నడిచింది. శాసక స్థానంలో ధర్మం శోభించా లనేది భగవంతుని సంకల్పం. అందుకే సృష్ట్యాదిలో రాజులకే బోధించడం జరిగింది.

జనకుడు పాలించే టప్పుడు ధర్మం శాసక స్థానంలో ఉండింది. హరిశ్చంద్రుడు, భరతుడు, సగరుడు, శ్రీరాముడు, ధర్మరాజు పాలించే కాలాల్లో కూడా ధర్మం శాసక స్థానం లోనే ఉండింది. దుర్యోధనుని కాలంలో ధర్మం లేనే లేదా? యోగం అసలే లేదా? ఉండింది. యోగం ఉండింది. ధర్మం కూడా అల్పమో, స్వల్పమో ఉండింది. కాని, శాసక స్థానంలో లేదు.

దుర్యోధనుడు పాలించే రోజుల్లో వ్యాసభగవానుడు ఉన్నాడు. శుకబ్రహ్మ ఉన్నాడు. భీష్ముడు ఉన్నాడు. విదురుడు ఉన్నాడు. సంజయుడు ఉన్నాడు. నివృత్తి మార్గాన్ని బోధించిన సనత్కుమారుడు కూడా ఉన్నాడు.

మరి జ్ఞానం ఉంది కదా! యోగం ఉంది కదా! ధర్మం ఉంది కదా! నిజమే. ఉంది. కాని, శాసకస్థానంలో లేదు. పాలించే పీఠంపై సుప్రతిష్ఠం కాలేదు. పీఠ మెక్కిన వారి నుండి జారి పోయింది. అశక్తులైన వారు పట్టుకోలేక జార విడిచారు. ధర్మము, యోగము దుర్బలుల చేతిలో నిలువలేక పోయాయి.

ఇక్కడే పరిస్థితి సంక్లిష్టంగా మారింది. ధర్మానికి గ్లాని ఏర్పడింది. వేదోక్త ధర్మము కను మరుగైంది. పరమ పురుషార్థ సంబంధము తెగి పోయింది. దీని కంతటికి కారణము ఒక్కటే. పరంపరా ప్రాప్తంగా సంక్రమిస్తున్న వేదోక్త ధర్మము బలహీనులు, ఇంద్రియ నిగ్రహం లేని అప్రయోజకుల చేతిలో పడటమే. శ్రీశంకరులు కూడా అలాగే అభిభాషించారు.

***దుర్బలాన్ అజితేన్ద్రియాన్ ప్రాప్య నష్టమ్ యోగమ్ ఇమమ్ ఉపలభ్య, లోకం చ అపురుషార్థ సంబంధినమ్ !***

ఇంద్రియ నిగ్రహం లేని బలహీనులను చేరి పరంపరా ప్రాప్త మైన యోగం నశించి పోయింది. ప్రపంచంలో పరమ పురుషార్థ మైన మోక్షంతో సంబంధం లేకుండా పోయింది అన్నారు భాష్యంలో శ్రీ శంకరులు.

ఈ పరిస్థితిని చక్కదిద్దే ప్రయత్నంలో శ్రీకృష్ణపరమాత్మ అర్జునునికి గీతను బోధించాడు. ఆ తరువాత, అంటే మళ్ళీ నాలుగు వేల సంవత్సరాలు గడిచిన తరువాత, అలాంటి పరిస్థితినే చక్కదిద్దే కార్యంలో నిమగ్నమై శ్రీ ఆదిశంకరాచార్యస్వామి గీతకు భాష్యాన్ని రచించారు.





**ముళ్ళు ఉంటే ఉండనీ**

**గులాబీని గుబాళించనీ**

వ్యసనాలు విజృంభించి నపుడే వ్యవస్థ వెలుగు చూడాలి. చీకట్లు ముసిరి నపుడే దీపాన్ని వెలిగించుకోవాలి. ఆ ప్రయత్నంలో ద్వాపర యుగాంతంలో భగవద్గీత ఆవిర్భవించింది.

కంస, దుర్యోధన, శిశుపాలాది దుష్టజన దుచ్చేష్టలతో, దురహంకారాలతో నశించిన పవిత్ర సంస్కృతిని చక్కదిద్దే ప్రయత్నంలో వాసుదేవుడు గీతను వినిపించాడు. రణగొణ ధ్వనులతో అల్లకల్లోలంగా గోచరిస్తున్న సమరభూమిలో గీతా గానాన్ని మురళీనాదంలా వినిపించాడు. అక్కడ ఉన్నవా ళ్ళెందరు? పద్దెనిమిది అక్షౌహిణుల సైన్యము. గీతను విన్నవా ళ్ళెందరు? ఇద్దరు లేక ముగ్గురు. ఎందరు విన్నా రనేది కాదు. ఏమి విన్నారు అనేది ముఖ్యం. ఉన్నవాళ్ళకి మిగిలింది మోహం. విన్నవాళ్ళలో అర్థం చేసుకున్న వాళ్ళకు తొలగింది మోహం.

పరంపరాప్రాప్తంగా సంప్రదాయ ప్రవంతిలో పవిత్రంగా ప్రవహించి, ఒక దుర్దశలో కనుమరు గైన వేదోక్త ధర్మాన్ని పునః కురుక్షేత్రంలో ఆవిష్కరించాడు గీతాచార్యుడు. ఆనాటి నుండి భారతావనిలో గీత వినిపిస్తూనే ఉంది. వ్యాఖ్యానాలు కనిపిస్తూనే ఉన్నాయి. కాని, జీవనశైలి కళ తప్పింది.

ఏదేదో జరిగింది. కాని, జరగ వలసింది మాత్రం జరగ లేదు. జరగ వలసింది జరగ నపుడు, జరగ కూడనివి చకచకా జరిగి పోతాయి. అలాంటప్పుడే చెత్తంతా పేరుకు పోతుంది. దానిని నిర్మూలించడం ఆ తరువాత బృహత్కార్యమే అవుతుంది. చెత్తను ఎవరైనా నింప గలరు. చెత్తను దూరం చేసి చిత్తును ప్రస్ఫుటం చేయడం అందరూ చేయలేరు. దానికి నిర్మలమైన హృదయం కావాలి. వినిర్మలమైన జ్ఞానం తోడు కావాలి. అలాంటి పుణ్యశ్లోకులు, యుగపురుషులే, ఆ కార్యాన్ని నిర్వహించ గలరు. ఆ గురుతర బాధ్యత గీత ఆవిర్భవించిన నాలుగు వేల సంవత్సరాల తరువాత శ్రీ శంకరులపై పడింది.

శ్రీ శంకరులు జీవించి యున్న కాలాన్ని విశ్లేషించి అర్థం చేసుకుంటే, ఎక్కడ చూచినా కంటకాలే. కఠోర ధ్వనులే. అన్నీ ముళ్ళే. చిక్కుముడులే. ముడి విప్పే ప్రయత్నంలో అందరూ ముడులు పెంచుకుంటూ పోయారు. నాస్తిక దర్శనాలు ఒక వైపు విలయతాండవం చేస్తూ ఉంటే, అర్థరహిత కర్మకాండ మరో వైపు వికటాట్టహాసం చేసింది. ఒక వైపు భారతీయ సమాజంలో భగవద్గీత శోభిస్తూ ఉన్నా, శుష్క పాండిత్యాలు వినిపించే వికృత వ్యాఖ్యల మధ్య గీతా హృదయం జనావళికి దూరమై పోయింది. అక్కడే, ఆ కంటకాల మధ్యే శంకరభాష్య గులాబీ గుబాళించింది.

నశించిన వేదోక్త ధర్మాన్ని పునః ప్రతిష్ఠ చేసే మహాకార్యంలో శ్రీకృష్ణ భగవానుడు భగవద్గీతను వినిపిస్తే, దూరమైన గీతా హృదయాన్ని జిజ్ఞాసువుల బుద్ధులకు పట్టించే పవిత్రకార్యంగా ఆచార్యుల వారు గీతకు భాష్యాన్ని రచించారు. ప్రతి పదాన్ని, పదము యొక్క అర్థాన్ని సుస్పష్టం చేస్తూ గీతను, గీతామాత హృదయాన్ని జన హృదయాలకు పట్టించారు.

***తదిదం గీతాశాస్త్రం సమస్త వేదార్థ సార సంగ్రహ భూతం దుర్విజ్ఞేయార్థం। తదర్థావిష్కరణాయ అనేకైః వివృత పదపదార్థ వాక్యార్థ న్యాయమపి అత్యన్త విరు ద్ధానే కార్థత్వేన లౌకికైః గృహ్యమాణమ్ ఉపలభ్య అహం వివేకతః అర్థ నిర్ధారణార్థం సంక్షేపతః వివరణం కరిష్యామి।***

'సమస్త వేదార్థ సార సంగ్రహమైన గీతాశాస్త్రము యొక్క తాత్పర్యాన్ని గ్రహించడం చాలా కష్టమైన కార్యము. గీత యొక్క అర్థాన్ని వివరిస్తూ, చాలా మంది వ్యాఖ్యాతలు పదాలను, పదముల యొక్క అర్థాలను, వాక్యముల యొక్క అర్థాలను, పూర్వపక్ష సిద్ధాంతాలను (న్యాయం) కూడా వివరించారు. అయినా గీత లోని

విషయాలు పరస్పర విరుద్ధంగా ఉన్నాయని లోకంలో వినిపిస్తూ ఉండటం చూసి, నేను ప్రతి పదాన్ని ఎక్కడికక్కడ వివేచన చేసి, గీతాజ్ఞానమును (గీతా హృదయం) స్పష్టంగా నిర్ధారణ చేయడానికి సంక్షిప్తంగా వివరణమును అందిస్తాను' అన్నారు ఆచార్యులు.

నేటికి పదమూడు వందల సంవత్సరాలు గడిచినా శంకర భాష్యం ప్రతిభావంతుల్ని, వివేకవంతుల్ని ప్రభావితం చేస్తూనే ఉంది. తాము ప్రభావితం కాక పోగా, పని కట్టుకొని విమర్శించే ప్రబుద్ధులు కూడా లేక పోలేదు. వాళ్ళను విమర్శించడం కన్నా విస్మరించడమే సముచిత మని నా అభిప్రాయము.

**నేటి దుస్థితి**

నేడు మనం వసిస్తున్న సమాజం ఎలా ఉందో ప్రత్యేకంగా చెప్ప నవసరం లేదు. అంతా దుస్థితే. అన్ని చోట్ల దుర్గతే. శాసక స్థానంలో ధర్మం లేదు. ప్రజలలో ధర్మం అదృశ్య మైంది. పొట్టకూటి చదువులకే పట్టాలు. మరో వైపు జీవనశైలి పట్టాలు తప్పింది. రాజత్వము రాటు తేలిపోతే, ఋషిత్వము అజ్ఞానంలో కూరుకుపోతూ ఉంది.

ఆధ్యాత్మికత వ్యాపార ప్రకటనల స్థాయికి దిగజారి పోయింది. పేరు ప్రఖ్యాతులు ఆర్జించాలనే నికృష్టమైన భావన సన్యాసులలో కూడా చేరి పోయింది. 'పేరు గొప్ప - ఊరు దిబ్బ' అన్నట్లైంది ఆధునిక సన్యాసము.

పేరుకు సర్వసంగ పరిత్యాగులే. పరివ్రాజకాచార్యులే. జ్ఞానాభిలాష కాగడా పెట్టి వెతికినా కనిపించదు. శాస్త్రజ్ఞానం శూన్యం. అరువు తెచ్చుకున్న మాటలు, కరువు తీర్చుకొనే ప్రచార ఆర్భాటాలు తప్ప, తరించాలనే ఆరాటం ఎవరిలో ఉందో అర్థం కావడం లేదు.

రెండు మూళ్ళ ఎనిమిది అని విశ్వసించే సమాజంలో గణితం బ్రతికి ఉన్నట్లేనా? పరమ పురుషార్థమే అర్థం గాని వ్యక్తులు ముముక్షువు లవుతారా? ముముక్షువులే కాని వారు ముక్తిప్రదాత లవుతారా?

మమ్మల్ని నమ్మితే తరించి పోతారని కొందరు. ధ్యానం తోనే మోక్షం అని మరి కొందరు. వ్యాధుల్ని నయం చేస్తామని ఇంక కొందరు. వేడుకోవడమే మార్గమని కొందరు. ఆడుకోవడం లోనే అజ్ఞానాన్ని ఆట కట్టించాలని ఇంక కొందరు. పాడుకోవడం లోనే పరమార్థం సిద్ధిస్తుందని మరి కొందరు - ఇలా ఎన్నని? తాయెత్తులతో తరింప చేసేవారు. తీర్థం పోసి గట్టెక్కించే వారు. మాయలేనా! మంత్రాలేనా! సభలేనా! సమావేశాలేనా! అన్ని వైపుల నుండి ఇన్ని విధాలుగా దీపాలు ఆర్పేవాళ్ళు విస్తృతంగా పర్యటిస్తున్న ఈ రోజుల్లో - మనం సాధించ దగింది మోక్ష మొక్కటే గాని ఈ అర్థరహిత వ్యాపకాలు కావు అని చెప్పేవా ళ్ళెవరు? చెప్పినా వినేవా ళ్ళెవరు? సుడిగాలిలో ఫిడేలును శృతి చేయడం సాధ్యమా? అలాగని అవ్యయమైన యోగము నశించి పోవలసిందేనా?

**సంప్రదాయ మార్గంలో**

**చైతన్యోద్యమం**

నేటి సమాజానికి గీతాజ్ఞానాన్ని పట్టించాలని సంకల్పించిన చైతన్యోద్యమం అంచెలంచెలుగా ప్రాకి, కొంత సమాజాన్ని జాగృతం చేసిన తరువాత, సంప్రదాయాన్ని జీర్ణించుకొని, పరమ పురుషార్థం వైపు నడక సాగించడానికి సాధకులు సిద్ధపడిన ఈ దశలో, వారి బుద్ధులకు గీతా హృదయాన్ని పట్టించాలనే దృఢ నిశ్చయంతో **చైతన్య భగవద్గీత** ముస్తా బయింది.

ఇది ఒక సామాన్య కార్యక్రమంగా చేపట్టింది కాదు. ఐదు వేల సంవత్సరాలుగా సాగిన చరిత్రను





వడబోసి, విశిష్ట సంప్రదాయ దృక్పథంతో, ఆధునిక సామాజిక స్పృహను, భావితరాలలో పురోగమించే అధునాతన సాంకేతిక శాస్త్రీయ పరిజ్ఞానమును స్మృతిలో ఉంచుకొని, సమాజాభ్యుదయాన్ని, వ్యక్తి శ్రేయస్సును కాంక్షిస్తూ శ్రీ శంకరాదులు నడిచిన బాటలో సాగిపోతున్న తాత్త్విక ప్రయోజన ప్రవాహం. సాత్త్విక మంగళ ప్రస్థానం.

అర్జునుని 'పరన్తపా!' అని సంబోధించాడు శ్రీకృష్ణుడు. ఇలా సంబోధించడం వెనుక నిగూఢమైన అర్థముంది. పరంపరాప్రాప్తంగా వచ్చిన ఈ యోగము దుర్బలుల, అజితేంద్రియుల చేతిలో పడి నశించి పోయిందని పలికిన వాసుదేవుడు, తిరిగి ఆ యోగాన్ని అర్జునునికి బోధిస్తున్నాడు. అజితేంద్రియు లైన బలహీనులు విచ్ఛిన్న సంప్రదాయానికి కారణ మైతే, బలవంతుడు, జితేంద్రియుడు అయిన అర్జునుడు ఈ యోగాన్ని పడేసుకోకుండా నిలుపుకుంటా డనే నమ్మకం ఉండటం చేతనే 'పరంతపా!' అని అర్జునుని సంబోధించాడు గీతాచార్యుడు.

విపక్షంలో ఉన్నవారిని 'పరులు' అంటారు ***(విపక్షభూతాః పరాః)***. వారిని తపింప చేయువాడు ***(తాపయతి)*** 'పరంతపుడు'. అంటే శత్రుతాపనుడు అని అర్థము. కామక్రోధాదు లనే శత్రువులను తపింప చేయువాడు అని భావము. బలవంతుడు అని అర్థము. దుర్బలుల వల్ల యోగం నశిస్తే, బలవంతుడైన అర్జునుని వల్ల తిరిగి వెలుగు చూస్తుంది అనేది అభిప్రాయము.

అంతేకాదు. సంప్రదాయం విచ్ఛిన్నం కావడానికి రాజపరంపరలో వచ్చిన వాళ్ళు దుర్బలులే గాక అజితేంద్రియులు అని చెప్పుకున్నాం. కాని, అర్జునుడు ఏ విధంగా చూసినా జితేంద్రియుడే. పండ్రెండు సంవత్సరాలు కఠోర తపస్సును ఆచరించి ఇంద్రియాలను శుద్ధి చేసిన మహాయోగి. అమరావతిలో ఊర్వశిని నిర్ద్వంద్వంగా తిరస్కరించి నపుడే అర్జునుడు జితేంద్రియుడని తేలి పోయింది. అందుకే పార్థుడు 'పరంతపుడు'. గీతా శ్రవణానికి అర్హుడు. అధికారిగా అర్జునునికి శ్రీకృష్ణుడే స్వయంగా కితాబు నిచ్చి బోధిస్తున్నాడు.

*ఏ కొందరి లోనో భాసిస్తున్న ఈ యోగాన్ని అందరిలో శోభింప చేయాలని, అందరికీ అందుబాటులో ఉంచాలని భావించిన అచ్యుతుడు అర్జునుణ్ణి నిమిత్తంగా తీసికొని బోధించడానికి ఉపక్రమించాడు. మంచిదే. మరి, కొన్ని దశాబ్దాలుగా కృష్ణార్జునులు కలిసే జీవిస్తున్నారు కదా! ఈ బోధను ఇంతవరకు ఎందుకని అర్జునునికి అందించలేదు? ఇప్పుడే బోధించడానికి కారణ మేదైనా ఉందా? ఉంటే, ఏమిటది? చెబుతున్నాడు.*

**స ఏవాయం మయాతేఽద్య యోగః ప్రోక్తః పురాతనః ।**
**భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేత దుత్తమమ్ ॥** 3

***సః-ఏవ-అయం-మయా-తే-అద్య-యోగః-ప్రోక్తః పురాతనః***

***భక్తః-అసి-మే-సఖా-చ-ఇతి-రహస్యం-హి-ఏతత్-ఉత్తమం***

| | | | | | |
|---|---|---|---|---|---|
| పురాతనః | = | ప్రాచీనమైన | అద్య | = | ఇప్పుడు |
| సః | = | ఆ | మయా | = | నా చేత |
| యోగః ఏవ | = | యోగమే | అయం | = | ఇది |
| మే | = | నా యొక్క | ప్రోక్తః | = | చెప్పబడినది |
| భక్తః | = | భక్తుడవు | ఏతత్ | = | ఇది |
| సఖా చ | = | సఖుడవు | ఉత్తమం | = | శ్రేష్ఠ మైనది |
| అసి ఇతి | = | అయి ఉన్నా వని | రహస్యం హి | = | రహస్య మైనది కదా! |
| తే | = | నీకు | | | |

**నువ్వు నాకు భక్తుడివి. స్నేహితుడివి. కనుకనే పురాతన మైన ఈ యోగాన్ని నీకు చెబుతున్నాను. ఈ యోగము శ్రేష్ఠ మైనది. రహస్య మైనది కూడా.**

**వ్యాఖ్య**

శ్రీకృష్ణుడు కురుక్షేత్రంలో అర్జునునికి బోధిస్తున్న విషయం క్రొత్తగా పుట్టు కొచ్చింది కాదు. అర్జునుని కొరకు శ్రీకృష్ణుడు ప్రత్యేకంగా ఆలోచించిన విషయం అసలే కాదు. ఇది ఊహల ఊయల కాదు. వాస్తవాల పల్లకీ. సృష్ట్యాది నుండి పరంపరాగతంగా గురువులు మోసుకొచ్చిన పల్లకీ. ఆ ప్రాచీన జ్ఞానమునే శ్రీకృష్ణుడు అర్జునునికి బోధిస్తున్నాడు. అందుకే, ఈ యోగము అదే ***(అయం యోగః సః ఏవ)*** అని గీతాచార్యుడు ఉపదేశిస్తున్నాడు.

**పురాతనం - పూర్ణ స్వరూపం**

బ్రహ్మము అనంతము. అనంతమైన బ్రహ్మము యొక్క జ్ఞానము కూడా అనంతమే. సృష్టికి ఆది ఉండొచ్చు. సృష్టికి కారణమైన బ్రహ్మమునకు ఆది లేదు. ఆది లేదు కనుక అంతమూ లేదు. అంతము లేనివాడు కనుక బ్రహ్మము అనంతము. కనుకనే బ్రహ్మము పురాతనము.

బ్రహ్మము పురాతన మైనపుడు బ్రహ్మజ్ఞానము అధునాతన మెలా అవుతుంది? జ్ఞానము అధునాతనమై, బ్రహ్మము పురాతన మైతే, పురాతన మైన బ్రహ్మము అధునాతన కాలం వరకు జ్ఞానము లేకుండా ఉన్నట్లే కదూ? బ్రహ్మకు సంబంధించిన జ్ఞానము లేకుండా బ్రహ్మము ఉన్నట్లైతే, ఆ బ్రహ్మమును బ్రహ్మముగా ఏ జ్ఞానంతో గ్రహించినట్లు? 'బ్రహ్మజ్ఞానము' కాని జ్ఞానముతో బ్రహ్మమును గ్రహించి ఉండాలి. అంటే, 'అబ్రహ్మ జ్ఞానము'తో బ్రహ్మమును గ్రహించినట్లు అంగీకరించాలి. ఇది సాధ్యమేనా? ఒక వస్తువుకు సంబంధించిన జ్ఞానముతో వేరొక వస్తువును తెలుసుకొనే దెలా?

కనుక, అనంత మైన బ్రహ్మము పురాతన మైతే, అట్టి బ్రహ్మమునకు సంబంధించిన జ్ఞానము కూడా పురాతనమే. ఇదే వేదోక్త ధర్మము. ఈ యోగమే సృష్ట్యాదిలో సూర్యునికి ఉపదేశింప బడింది. తిరిగి ఈ యోగమే కురుక్షేత్రంలో అర్జునునికి అనుగ్రహింప బడుతూ ఉంది ***(సః ఏవ అయం యోగః పురాతనః, అద్య మయా తే ప్రోక్తః)***.

**మళ్ళీ ఎందుకు?**

శ్రీకృష్ణుడు అర్జునునికి బోధిస్తున్న విషయం పురాతనమే అయినపుడు, మళ్ళీ దానిని బోధించవలసిన అవసర మేముంది? ఉంది. ఉండబట్టే బోధించడం జరిగింది. ఈ యోగం పురాతనమే అయినా (1) అందరికీ అందలేదు. (2) అందిన వారిలో నిలవలేదు. ఈ కారణాల వల్ల మళ్ళీ అందించే ప్రయత్నం జరుగుతూ ఉంది.

ఈ సందర్భంలో ఒక్క విషయాన్ని మనం జాగ్రత్తగా అవలోకించాలి. అర్జునుడు సామాన్యుడు కాడు. గొప్ప విద్యావంతుడు. సంస్కారవంతుడు. కురుక్షేత్రంలో అడుగిడే నాటికి ఏడు పదులు దాటేశాడు కూడా. మరి, ఈ యోగం ఒకటి ఉన్నట్లు అర్జునుడికి తెలుసా? అర్జునుడికి తెలిసే ఉంటే, శ్రీకృష్ణుడు మళ్ళీ ఎందుకు చెబుతాడు? ఒకవేళ చెప్పినా, తెలిసిన దానిని మళ్ళీ అర్జునుడు ఆసక్తితో ప్రశ్నిస్తూ ఎందుకు వింటాడు?

అర్జునునికి ఎన్నో విద్యలు తెలుసు. కాని, ఇంతవరకు తెలియ వలసింది తెలియ లేదు. అర్జునుని పరిస్థితే ఇలా ఉంటే, సామాన్యులు ఎలా ఉంటారో ఊహించడం కష్టసాధ్య మేమీ కాదు.

అర్జునుడికి ఈ యోగం అందక పోవడానికి కారణ మేమిటి? దానిని తెలిసిన జ్ఞానులు ఆ కాలంలో లేరా? వ్యాసు డేమయ్యాడు? సనత్కుమారు డేమయ్యాడు? శ్రీ శుకుడు వ్యాసుని కుమారుడే కదా! వీళ్ళందరూ





జ్ఞానులే కదా! నిజమే. జ్ఞానులు ఉన్నారు. జ్ఞానమూ ఉంది. కాని, ఏ కొందరి లోనో ఉంది. విస్తృతంగా వాడుకలో లేదు.

ఎన్నో విద్యలు అందుబాటులో ఉన్నాయి. ఎవరికి ఏది అవసరమో దానిని అభ్యసిస్తున్నారు. బ్రహ్మజ్ఞానము ఒకటి ఉందని, అదే ప్రతి ఒక్కరు ప్రయత్నించి సాధించ దగిన పురుషార్థ మని తెలియకుండా పోయింది.

ఆనాటి విషయం అలా ఉంచండి. నేటి పరిస్థితి ఏమిటి? నేటి సమాజంలో ఎన్నో విద్య లున్నాయి. ఎవరికి కావలసింది వాళ్ళు అభ్యసిస్తున్నారు. ఏది అభ్యసిస్తే ఆదాయం అధిక మవుతుందా అని ఆలోచిస్తున్నారు. బ్రహ్మజ్ఞానము యొక్క అవసరం ఎవరికి తెలుస్తూ ఉంది?

ఇక్కడ మరొక ఆసక్తికర మైన విషయం కూడా ఉంది. విశ్లేషించి అర్థం చేసుకుంటే నాటికి, నేటికి ఒక గొప్ప తేడా కొట్టొచ్చినట్లు కనిపిస్తుంది. ఆనాడు నేడు ఉన్నంతగా ఆధ్యాత్మిక ప్రచారం లేదు. ఈ రోజుల్లో అందరూ బోధించేవారే. అందరూ ఆలకించేవారే. 'అన్ని వైపులా ఉదకమే - తీరదెన్నటికీ దాహం' అన్నట్లు, అన్నిచోట్ల ప్రచారాలే, విచారం కాగడా పెట్టి వెతికినా కనిపించదు.

వాస్తవానికి అందరూ విముక్తి పోరాటం లోనే ఉన్నారు. ముక్తి అందరికీ కావాలి. విముక్తిని అందరూ అభిలషిస్తున్నారు. కాని, బంధ విముక్తిని కోరేవారు అరుదై పోయారు. రోగ విముక్తిని కోరుతున్నారు. ఋణ విముక్తిని అభిలషి స్తున్నారు. నిరుద్యోగ విముక్తికై నిరీక్షిస్తున్నారు. పాప విముక్తికి ప్రాకు లాడుతున్నారు. దుఃఖ విముక్తిని కాంక్షిస్తున్నారు. ఇవన్నీ ముక్తులు కావని, తాత్కాలిక ఉపశమనాలే నని, బంధవిముక్తి, అంటే మోక్షప్రాప్తియే ఏకైక పురుషార్థ మని గ్రహించలేక పోతున్నారు. చెప్పేవాళ్ళకు తెలియడం లేదు. వినేవాళ్ళకి తెలిసి రావడం లేదు. ఎంతో ఉన్నట్లుంది. విచారిస్తే అంతా శూన్యమే. అన్నీ శుష్క ప్రలాపాలే.

**తత్త ద్వస్తు స్వభావజ్ఞః తత్ఫలం వేత్తి నా పరః**

ఎవరికి ఏది స్వభావమో వారు దానినే తెలుసుకుంటారు. ఎవరికి ఏది ఇష్టమో వాళ్ళు దానినే అనుసరిస్తారు. గొప్ప దైనంత మాత్రాన అవసరం లేని దాని కొరకు ఎవరూ ప్రయత్నించరు కదా!

మరి, మోక్షాన్ని గురించి కూడా ప్రవచించే సాంప్రదాయక బోధకులు కొందరు ఉన్నారు కదా? అవును ఉన్నారు. మరి, వాళ్ళ బోధలు ఎందుకు ఫలించడం లేదు? ఎవరన్నారు ఫలించడం లేదని? ఫలిస్తున్నాయి. కాకపోతే, పరిమితమైన సంఖ్య కనిపిస్తూ ఉంది. అందరూ వింటున్నా, కొందరికే అవగత మవుతూ ఉంది. ఈ పరిస్థితి యుగాలకు పరిమితం కాదు. ద్వాపరమైనా, కలియుగ మైనా పెద్ద తేడా లేదు. ఎందుకని? ఇది రహస్య మైన విద్య. ఉత్తమ మైన విద్య. ఉత్తమ మైన రహస్యంగా శోభిస్తున్న విద్య.

**ఉత్తమమైన రహస్యం**

అర్జునా! నేను నీకు బోధిస్తున్న జ్ఞానము ఉత్తమమైన రహస్యం అంటున్నాడు భగవంతుడు. అంటే పరమేశ్వరుడు బోధిస్తున్న జ్ఞానము (1) ఉత్తమ మైనది (2) రహస్య మైనది. ఈ రెండు విషయాలు అవగత మైతే, ఆ తరువాత జ్ఞానోపదేశము ఉత్తమ మైన రహస్యంగా అర్థ మవుతుంది.

జగత్తులో మనకు లభించే ఏ జ్ఞానమైనా పరిమితం గానే ఉంటుంది. పరిమిత ఫలితాన్నే ఇస్తుంది. వెలితిని దూరం చేసే శక్తి ప్రాపంచిక విద్యలకు లేదు. బ్రహ్మజ్ఞానము అలాంటిది కాదు. అది సంపూర్ణ జ్ఞానము. తన కన్నా అన్యంగా ఏ జ్ఞానమూ లేనిది. అన్ని జ్ఞానాలకు తానే ఆధార మైనది. పైగా, సంసార దుఃఖాన్ని శాశ్వతంగా పోగొట్టేది. పూర్ణత్వాన్ని కల్పించేది. అందుచేత అది ఉత్తమం అని చెప్పబడింది.

మరి, అంతటి ఉత్తమమైన జ్ఞానము ఎందుకని రహస్యమైంది? అందరికీ అందుబాటులో ఎందుకని లేకుండా పోయింది? దీనిని కాస్త సూక్ష్మంగా పరిశీలించి అర్థం చేసుకోవాలి. అసలు రహస్యం అంటే ఏమిటి?

అర్థం కానపుడే ఏదయినా రహస్యం అవుతుంది. అర్థం కాకపోవడం అనేది మళ్ళీ రెండు విధాలుగా ఉంటుంది. దేనిని మనం అర్థం చేసుకోవాలని భావిస్తున్నామో అది మనకు అందుబాటులో లేనపుడు అది రహస్య మవుతుంది. అంటే, అదేదో దూరంగా ఉందనే భావించ నవసరం లేదు.

ఒక వ్యక్తికి ఒక విషయం తెలుసు. అది అతని మనస్సులో ఉంది. ఎంత అడిగినా అతను చెప్పడం లేదు. అది మనకు రహస్యమై కూర్చుంది.

అలా కాకుండా, ఆ వ్యక్తి మనకు చెప్పినా, ఆ చెప్పింది మనకు అర్థం కానపుడు అది కూడా రహస్యమే అవుతుంది. చెబితే ఎందుకని అర్థం కాదు అని మీరు ఎదురు ప్రశ్న వేయవచ్చు. కాని, 'అబ్బ! అతనికి వెయ్యి సార్లు చెప్పినా అర్థం కావడం లేదు' అని గతంలో ఇతరులను గూర్చి మనం చేసిన వ్యాఖ్యను జ్ఞాపకం చేసుకుంటే, మన ప్రశ్నకు మన నుండే సమాధానం వస్తుంది.

మనకు ప్రపంచంలో అనేక విషయాలకు సంబంధించిన జ్ఞానం ఉంది. అవన్నీ మనం విద్యాభ్యాస కాలంలో నేర్చుకున్నాము. అప్పట్లో అందని వాటిని ఇప్పుడు కూడా నేర్చుకుంటూనే ఉన్నాము. ప్రస్తుతం గీతాచార్యుడు బోధిస్తున్నది అలాంటి విషయ సంబంధమైన జ్ఞానం కాదు. సత్యజ్ఞానము. బ్రహ్మజ్ఞానము.

విషయ జ్ఞానము ఏదీ సత్యం కాదు. విషయాలే సత్యం కానపుడు విషయ జ్ఞానం సత్య మెలా అవుతుంది? అసత్య మైన విషయానికి సంబంధించిన జ్ఞానము ఎప్పుడూ సత్యం కాదు. ఏ వస్తు వైనా, ఏ విషయ మైనా ఒక ప్రదేశానికి, లేక కాలానికి సంబంధించి ఉంటుంది. అలాంటి వాటికి సంబంధించిన జ్ఞానము ఆయా ప్రదేశాలకు లేదా కాలాలకు పరిమితంగా ఉంటుంది. బ్రహ్మజ్ఞానము అలాంటిది కాదు. అది ఒక ప్రదేశానికి పరిమితం కాదు. కాలం దానిని ఇముడ్చుకో లేదు. బ్రహ్మము పూర్ణము. అన్నీ తన లోనే ఉంటాయి. కానీ, తాను అద్వితీయమై భాసిస్తూ ఉంటుంది. అందుకనే, అర్థం కాకుండా మిగిలిపోతూ, రహస్యంగా తెలియబడుతూ ఉంది. రహస్యం అంటే చెప్పకుండా దాచేది అని కాదు. విడమరచి చెప్పినా అర్థం కానిది అని భావం. ఎంత శ్రవణం చేసినా, ఎన్ని ప్రవచనాలు ఆలకించినా, మళ్ళీ 'జీవుడు అంటే ఏమిటి?' అని ప్రశ్నిస్తూ ఉంటారు. ఇలా అడిగే వాడే జీవుడు అని చెబితే ఏమి అర్థమవుతుంది? అందుకే రహస్యంగా మిగిలి పోతుంది.

**అర్జునుడు అర్హుడు**

ఉత్తమమైన రహస్యంగా చెప్ప బడుతున్న ఈ యోగమును పొందడానికి అర్జునుడు అర్హుడు. అందుకే శ్రీకృష్ణుడు బోధిస్తున్నాడు. పైగా, అర్జునుడు తనకు భక్తుడని, సఖుడని శ్రీకృష్ణుడు కితా బిచ్చాడు కూడా. పరమేశ్వరుని నుండి యోగ్యతా పత్రాన్ని అందుకున్న అర్జునుడు నిజానికి మహాత్ముడే.

కృష్ణార్జునుల స్నేహం ఈనాటిది కాదు. దశాబ్దాలు దొర్లిపోయాయి. ఇంత కాలం శ్రీకృష్ణుడు అర్జునునికి ఈ యోగాన్ని ఎందుకు బోధించ లేదు? అనేక ఆపదలలో అర్జునుడు చిక్కుకొని ఆవేదన చెందిన సమయాలలో అచ్యుతుడు ప్రక్కనే ఉన్నాడు. అయినా చెప్పలేదు. పన్నెండు సంవత్సరాలు అర్జునుడు అరణ్యాలలో నివసించాడు. వేదాంతాన్ని అధ్యయనం చేయడానికి అరణ్యాల కన్నా అనువైన ప్రశాంత వాతావరణం ఎక్కడ ఉంటుంది? అప్పుడు కూడా చెప్పలేదు. మరి, ఇప్పుడే ఎందుకని చెబుతున్నాడు?

ఇక్కడ ఒక్క విషయం మనకు సుస్పష్టంగా అర్థమవుతూ ఉంది. కేవలం స్నేహితుడు అని భావించి కృష్ణుడు చెప్పడం లేదు. స్నేహమే ప్రధాన మైతే ఎప్పుడో చెప్పి ఉండాలి. ఆపదలలో, దుఃఖంలో ఉన్నంత





మాత్రాన చెప్పాలని లేదు. కేవలం అదే అర్హత కాదు. శ్రీకృష్ణుణ్ణి అంటిపెట్టుకొని దగ్గరే ఉన్నంత మాత్రాన కూడా చెప్పవలసిన అవసరం లేదు. ఒకవేళ చెబితే ఏం పోతుంది? అని మీరు ప్రశ్నించవచ్చు. శ్రీకృష్ణుడు చెబుతాడనే అనుకుందాం.

అరణ్యవాసం కాలంలో 'అర్జునా! పురాతన మైన ఈ యోగం నాకు తెలుసు. చెబుతాను విను' అని శ్రీకృష్ణుడు ప్రస్తావించాడనే అనుకుందాం. దానికి సమాధానంగా, 'కృష్ణా! నాకు ఆ విషయం మీద ఆసక్తి లేదు. నాకు అవసరం లేదు' అని అర్జునుడు పలికితే ఏం చేయాలి? దగ్గర ఉన్నంత మాత్రాన ఆకలి లేని వాడికి అన్నం పెడితే తింటాడా?

అంటే, అప్పట్లో జ్ఞానం బోధిస్తే అర్జునుడు వినడా? వినడే వినడు. వినినా అర్థం చేసుకోలేడు. అర్థం కానపుడు విని సాధించే దేముంటుంది? అర్జునుడు ఎందుకని వినడు? అర్జునునికి జ్ఞానపిపాస లేదా? ఆ విషయంలో అర్జునుడికి ఆకలి లేనట్లేనా? అని మీరు అడగవచ్చు.

ఉంది. ఆకలి ఉంది. 'దుర్యోధనుని ఓడించాలి' అనే ఆకలి ఉంది. 'రాజ్యాన్ని హస్తగతం చేసుకోవాలి' అనే ఆకలి ఉంది. 'ప్రతీకారాన్ని తీర్చుకోవాలి' అనే ఆకలి ఉంది. అందుకనే అరణ్యాలలో వసిస్తూ కఠోర తపస్సు చేశాడు. పాశుపతాస్త్రాన్ని పరమశివుని నుండి సాధించాడు. పరమశివుడు దర్శన మిచ్చినా దృష్టి పాశుపతాస్త్రంపై ఉండిందే గాని పరమ పురుషార్థ మైన మోక్షంపై లేదు. అలాంటి పరిస్థితిలో చెప్పి లాభం లేదు. అందుకే శ్రీకృష్ణుడు బోధించ లేదు.

మరి, ఇప్పుడు యుద్ధభూమిలో శ్రీకృష్ణుడు ఎందుకని చెబుతున్నాడు? ఇప్పుడు కూడా విజయుడు ప్రతీకారవాంఛ తోనే కదా రణరంగంలో ఉన్నాడు? నిజమే! అప్పుడు ప్రతీకారం తీర్చుకోవడానికి కఠోర మైన తపస్సు చేసి దివ్యమైన శస్త్రాస్త్రాలను సంపాదించు కున్నాడు. కాని, ఈనాటి పరిస్థితి వేరు. యుద్ధభూమిలో వాటిని పడేశాడు. సాధించిన వన్నీ నిరుపయోగ మని గ్రహించాడు. తనకు కావలసింది ఇవేవీ కావని, శ్రేయస్సే నని గ్రహించాడు. 'కృష్ణా! నాకు ఏది శ్రేయస్సో నిశ్చయంగా చెప్పు. నేను నీ శిష్యుణ్ణి' అని అర్థించాడు.

ఇక్కడే అర్జునుడు గీతను ఆలకించడానికి అర్హుడయ్యాడు. యోగ్యతను సంపాదించాడు. అందుకే శ్రీకృష్ణుడు నోరు విప్పాడు. నీవు నాకు భక్తుడివి. సఖుడివి. అందుకే ఈ ఉత్తమమైన రహస్యాన్ని నీకు చెబుతున్నాను అన్నాడు గీతాచార్యుడు.

అర్జునుడు అడిగాడు. శ్రీకృష్ణుడు చెప్పడం ఆరంభించాడు. ఎక్కడ? అని చూడలేదు. ఎప్పుడు? అని ఆలోచించ లేదు. రణరంగం లోనే చెప్పాడు. మధ్యాహ్నమే వినిపించాడు. అర్హత లేనపుడు ప్రశాంత వాతావరణాన్ని కూడా అంగీకరించ లేదు. అర్హత రాగానే రణగొణ ధ్వనులతో దారుణంగా గోచరిస్తున్న రణరంగం కూడా సానుకూలమే అనుకున్నాడు.

**భక్తి - స్నేహం**

అర్జునా! నువ్వు నాకు భక్తుడివి. సఖుడివి కూడా అన్నాడు గీతాచార్యుడు ***(భక్తః అసి, మే సఖా చ అసి ఇతి).*** భక్తునిలో భయం చోటు చేసుకొని ఉంటుంది. స్నేహితునిలో చనువు ఎక్కువగా ఉంటుంది. భయం ఉండేవాడు గురువును ప్రశ్నించి తెలుసుకోలేడు. స్నేహితుడు చనువుతో ఉంటాడు కనుక విధేయత లేకుండా ఉండటమే గాక, ప్రతి విషయాన్ని అతి తేలికగా తీసుకొనే ప్రమాదం ఉంటుంది. భయమైనా, చనువైనా రెండూ జ్ఞాన సముపార్జనకు అభ్యంతరాలే. ఈ రెండిటిలో ఏ ఒక్కటున్నా కార్యం సఫలం కాదు. ఈ రెండూ ఉండాలి. అంతే కాదు. పరస్పర సహకారులుగా మెలగాలి.

స్నేహం భయాన్ని పోగొడుతుంది. భక్తి అవిధేయతను చెంతకు రానివ్వదు. స్నేహపాత్రుడై ఉండి నిర్భయంగా చరిస్తూ, భక్తుడై ఉండి అవిధేయతకు తావు ఇవ్వనివాడు జ్ఞానాన్ని చక్కగా సముపార్జించ గలడు. అలా చూసి నపుడు భక్తుడుగా, స్నేహితుడుగా అర్జునుడు గీతాశ్రవణానికి పరిపూర్ణమైన అర్హతతో జాజ్వల్య మయ్యాడు.

*అంతా బాగానే ఉంది. కాని, అర్జునుణ్ణి సందేహం పట్టుకొంది. మనకు ఎంత ఆప్తు డైనా, స్నేహితుడైనా, 'మా నాన్నగారు శిశువుగా ఊయలలో పడుకొని ఉండేటప్పుడు, ప్రతిరోజు నేను ఉయ్యాల పాట పాడుతూ ఊపేవాణ్ణి' అని చెబితే మనకు ఎలా ఉంటుంది? అర్జునుడి పరిస్థితి అలాగే తయారైంది.*

*ఇప్పుడు నీకు నేను చెబుతున్న ఈ యోగాన్ని సృష్ట్యాదిలో సూర్యునికి చెప్పాను అన్నాడు శ్రీకృష్ణుడు. అదెలా సాధ్యం? అనేది పార్థుని శంక. ఇప్పటివాడు శ్రీకృష్ణుడు. ఎప్పటివాడో సూర్యుడు. శ్రీకృష్ణుడు సృష్ట్యాదిలో సూర్యునికి ఉపదేశించడ మేమిటి? ఇది సందేహమే కదా! అడిగేస్తున్నాడు.*

**అర్జున ఉవాచ :**

**అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః ।**
**కథ మేత ద్విజానీయాం త్వ మాదౌ ప్రోక్తవా నితి ॥** 4

**అపరం-భవతః-జన్మ-పరం-జన్మ-వివస్వతః**
**కథం-ఏతత్-విజానీయాం-త్వం-ఆదౌ-ప్రోక్తవాన్-ఇతి**

| | | | | | |
|---|---|---|---|---|---|
| వివస్వతః | = | సూర్యుని | ఆదౌ | = | ఆది యందు |
| జన్మ | = | జన్మము | త్వం | = | నీవు |
| పరం | = | మొదటిది | ప్రోక్తవాన్ ఇతి | = | చెప్పావు అనడం |
| భవతః | = | నీ యొక్క | కథం | = | ఎలా |
| జన్మ | = | జన్మము | ఏతత్ | = | దీనిని |
| అపరం | = | తరువాతిది | విజానీయాం | = | తెలిసికొనేది! |

**అర్జునుడు అడుగుతున్నాడు :**

**సూర్యుని తరువాత నువ్వు పుట్టావు. సూర్యుడు పూర్వ మెప్పుడో పుట్టాడు. నువ్వు సూర్యునికి బోధించావు అనే విషయాన్ని నే నెలా అర్థం చేసుకోను?**

**వ్యాఖ్య**

**దేహము - సందేహము**

రెండవ అధ్యాయంలో భగవానుడు గీతను బోధించడం ప్రారంభించిన తరువాత, మధ్యలో అనేక చోట్ల అర్జునుడు శ్రీకృష్ణుని ప్రశ్నిస్తూ, తన సందేహాలను నివృత్తి చేసుకుంటూ వచ్చాడు. ఈ సందర్భంలో మరొక సందేహము లేవ నెత్తాడు. ఇంతవరకు శ్రీకృష్ణుని బోధ విషయంలో తలెత్తిన సంశయాలను తీర్చుకుంటూ వచ్చాడు. ఇప్పటి సందేహము అలాంటిది కాదు. బోధించిన విషయంపై ఏర్పడిన శంక కాదు. అసలు బోధించే వాణ్ణే సందేహిస్తున్న పరిస్థితి. దీనిని అవధానంతో అర్థం చేసుకోవాలి.

ఈ యోగాన్ని సృష్ట్యాదిలో తాను సూర్యునికి బోధించినట్లు ఈ అధ్యాయం ప్రారంభ శ్లోకంలో చెప్పాడు శ్రీకృష్ణుడు. ఈ విషయం లోనే అర్జునుడు సందేహాన్ని వెలిబుచ్చు తున్నాడు.





శ్రీకృష్ణుడు తనకు ప్రస్తుతం బోధిస్తున్నాడు. బోధించే వాని శరీరం కళ్ళ ముందు కనిపిస్తూ ఉంది. సృష్టి ప్రారంభంలో సూర్యునికి తానే బోధించినట్లు శ్రీకృష్ణుడు చెబుతున్నాడు. అంటే, ప్రస్తుతం ఏ శరీరంతో అయితే అగుపిస్తూ బోధిస్తున్నాడో, సూర్యునికి బోధించి నపుడు ఉండింది కూడా ఈ దేహమేనా? లేక మరొక దేహమా? ఇది అర్జునుని సందేహం. దేహాన్ని దర్శిస్తూ కదిలించిన సందేహం.

అర్జునునికి బోధించిన దేహం తోనే సూర్యునికి బోధించాడు అని అంగీకరిద్దామా అంటే, శ్రీకృష్ణుని జననము అర్జునునికి తెలియనిది కాదు. ఆయన పుట్టిన తిథి నక్షత్రాలు కూడా తెలుసు. పుట్టింది కారాగృహంలో అని కూడా తెలుసు. ఎప్పుడు పుట్టాడో, ఎక్కడ పుట్టాడో, ఎవరికి పుట్టాడో అన్నీ తెలుసు. అంతే కాదు, శ్రీకృష్ణుడు పుట్టక ముందే వసుదేవుడు అనేక పర్యాయాలు సూర్యునికి అర్ఘ్యము సమర్పించి ఉన్నాడు. అంటే, కృష్ణునికి ముందే సూర్యుడు ఉన్నాడు. తాను పుట్టక ముందే ప్రకాశిస్తున్న ఆదిత్యునికి శ్రీకృష్ణుడు ఎలా బోధిస్తాడు?

కృష్ణా! నీ వేమో ఇటీవల వసుదేవుని గృహంలో జన్మించావు ***(అపరమ్ అర్వాన్ వసుదేవ గృహే భవతః జన్మ).*** సూర్యుడేమో సృష్టి ప్రారంభం లోనే ఆవిర్భవించాడు ***(పూర్వం సర్గాదౌ ఉత్పత్తిః ఆదిత్యస్య).*** అలాంటప్పుడు నువ్వు సూర్యునికి సృష్ట్యాదిలో బోధించినా వని ఎలా అర్థం చేసుకోను? నీ మాటలలో వైరుధ్యము లేదని ఎలా భావించను? ***(తత్ కథమ్ ఏతత్ విజానీయామ్ అవిరు ద్ధార్థతయా).*** ఇదీ సందేహం.

సూర్యునికి బోధించినది ఈ దేహంతో నేనా? లేక మరొక దేహమా? ఈ దేహమే అయితే, ఇప్పుడు పుట్టిన దేహం అప్పుడు లేదు కదా? ఒకవేళ, ఆ దేహం వేరు అంటావా! అదే వాస్తవ మైతే, ఆ దేహ మేమిటి? ఇప్పటి దేహం పుట్టినట్లే, ఆ దేహం కూడా పుట్టి ఉండాలి. అది కూడా సృష్టికి ముందు పుట్టి ఉండాలి. అప్పుడే సూర్యుడికి బోధించడం సాధ్య పడుతుంది. అలాగే జరిగి ఉంటే, ఈ దేహానికి దేవకీ వసుదేవులు కారణ మైనట్లు, ఆ దేహానికి కారణ మెవరు?

అదలా ఉంచితే, ఇలా పుట్టడమే వాస్తవ మైతే, శ్రీకృష్ణుడికి కూడా జన్మ ఉన్నట్లే కదా! జన్మ ఉన్నప్పుడు మరణం కూడా ఉంటుంది కదా! జనన మరణాలు ఉండేటప్పుడు శ్రీకృష్ణుడు కూడా మన లాగ జీవుడే కదా! జీవుడైన శ్రీకృష్ణుడు సర్వులూ ప్రత్యక్ష దైవంగా భావించే సూర్యుడికి ఎలా బోధిస్తాడు?

బోధించాడనే అనుకుందాం. అక్కడ బోధించిన దేహం ఇప్పుడు పుట్టిన దేహం అయ్యేందుకు అవకాశం లేదు కదా! ఇలా, దేహాలను ధరిస్తూ, పరిత్యజిస్తూ జన్మాంతరాలలో ప్రయాణం చేసే వాడికి గత జన్మలలో చేసిన పనులు జ్ఞాపక ముంటాయా?

**జన్మాంతరానుభూతం చ న స్మర్యతే**

పూర్వజన్మ స్మృతులు జీవులకు తెలియవు అని శాస్త్రవచనం. మన అనుభవం కూడా ఈ విషయాన్నే ధృవీకరిస్తూ ఉంది. శ్రీకృష్ణుడు జనన మరణాల ఊబిలో చిక్కుకున్న జీవుడే అయితే, సూర్యునికి బోధించినట్లు జ్ఞాపకం ఉండే అవకాశం లేదు. అలా ఉండేట ట్లైతే అర్జునునికి కూడా తన గత జన్మల వివరాలు తెలియాలి.

ఇలా విశ్లేషిస్తూ పోతే, శ్రీకృష్ణుడు జన్మలెత్తే జీవుడే అయితే, ఆయన దగ్గర వినాల్సిన అవసరం అర్జునునికి లేదు. కనుక, సూర్యునికి బోధించిన వాడు దేవుడే అయి ఉండాలి అనే నిర్ణయానికి రావలసి ఉంటుంది. ఈ నిర్ణయమే సరియైన దైతే, ఇది భగవంతుని అవతార వైశిష్ట్యాన్ని ఆవిష్కరిస్తుంది.

ఇంతకీ, శ్రీకృష్ణుడు భగవంతుడు అని అర్జునుడు భావిస్తున్నాడా? అతనిది భగవదవతారము అనే జ్ఞానము పార్థునికి ఉందా?

**తెలిసే అడుగుతున్నాడు**

అర్జునుడు మహామేధావి. ప్రజ్ఞావంతుడు. శ్రీకృష్ణుడు భగవంతుడు అనే సత్యం అర్జునునికి తెలియకుండా ఉండే అవకాశం లేదు. శ్రీకృష్ణుని జీవితంలో బాల్యము నుండి జరుగుతున్న ఎన్నో వైభవాలు, లీలలు అర్జునునికి తెలియనివి కావు. రాజసూయ యాగంలో భీష్ముడు శ్రీకృష్ణుని భగవంతునిగా భావించి భాషించిన మాటలకు అర్జునుడు ప్రత్యక్ష సాక్షి. అరణ్యవాసం చేసి నపుడు శ్రీకృష్ణుడు పాండవులను భగవంతుడుగా ఎలా రక్షించింది అర్జునునికి తెలియని విషయమా? తెలియబట్టే, యుద్ధానికి ముందు ద్వారకకు వెళ్ళి నప్పుడు, శ్రీకృష్ణుణ్ణి కోరుకొని చతురంగ బలాలను తృణీకరించాడు.

ఇకపోతే, మన సంస్కృతిలో అవతార వైశిష్ట్యము ఉందని పార్థునికి తెలియని విషయం కాదు. శ్రీరాముడు మొదలైన వారు భగవంతుని అవతారమే నని అర్జునునికి తెలుసు.

ఈ ఆధారాలను బట్టి శ్రీకృష్ణుడు భగవంతుడే నని అర్జునునికి తెలుసు. ఈ విషయంలో సందేహం అవసరం లేదు. శ్రీకృష్ణుడు ఆ విధంగా భగవంతుడే అని నిర్ధారణ చేయడానికి సాక్ష్య మేమిటి? సాక్ష్యం అవసరమే అనుకుంటే, శ్రీ శంకరులే సాక్షి.

**శ్రీ ఆదిశంకరుల సాక్షిగా**

శ్రీకృష్ణుడు అవతారమూర్తి అనే జ్ఞానం అర్జునునికి ఉంటే, మళ్ళీ ఈ ప్రశ్నను వేయడ మెందుకు? అనే శంక కదుల్తుంది. శ్రీకృష్ణుడు భగవంతుడే అనే విషయంలో అర్జునునికి రెండవ ఆలోచన లేదు. కాకపోతే, తెలిసి కూడా తెలియనట్లు ప్రశ్నించడానికి రెండు కారణాలు కనిపిస్తాయి.

శ్రీకృష్ణుడు భగవంతుడే నని తెలిసినా, అవకాశం వచ్చింది కనుక, పరమాత్మ ముఖతః ఈ సత్యాన్ని విని ఆనందించాలని, పరవశించాలని పార్థుడు భావించి ఉండొచ్చు. ఇది నేను ఊహిస్తున్న మొదటి కారణం.

మనం కూడా ప్రాణతుల్యంగా ప్రేమించే వారితో భాషించేటప్పుడు, 'నాకు తెలుసు. అయినా, నీ నుండి వినాలని అలా అడిగాను' అంటూ ఉంటాము. ప్రేమకార్యాలు ఎప్పుడూ అలాగే ఉంటాయి.

ఇక రెండవ కారణం చెప్పుకుందాం. అర్జునుడు కృష్ణ భక్తుడు. ఆ విషయాన్ని గడచిన శ్లోకంలో శ్రీకృష్ణుడే ధృవీకరించాడు కూడా. భక్తుడైన అర్జునునికి భగవంతుని విషయంలో సందేహం ఉంటుందా? సందేహం లేనపుడు ఎందుకు ప్రశ్నించాడు?

పరమేశ్వరుని విషయంలో పార్థునికి అచంచలమైన విశ్వాసం ఉంది. కాని, సాధారణ మానవులు పరస్పర విరుద్ధంగా కనిపించే భగవ ద్వచనాలను అపార్థం చేసుకొని సందేహించకుండా ఉండాలని, వారి ఆక్షేపణలను కూడా అర్జునుడే అడిగి సంశయ విచ్ఛేదము గావించాడు. ఇదే రెండవ కారణము. ముఖ్య కారణం కూడా. సరే, ఇలా భావించడానికి ఆధార మేమిటి? ఉంది. శ్రీ శంకరుల సాక్షిగా ఉంది.

***భగవతా విప్రతిషిద్ధమ్ ఉక్తమ్ ఇతి మా భూత్ కస్యచిత్ బుద్ధిః***
***ఇతి పరిహారార్థం చోద్యమ్ ఇవ కుర్వన్***

శ్రీకృష్ణుడు చెప్పింది చాలా విరుద్ధంగా ఉంది అనే భావన ఎవ్వరికీ కలగ కూడదు అనే సంకల్పంతో అర్జునుడు ఆక్షేప పూర్వకంగా ప్రశ్నించినట్లు శ్రీ శంకరభాష్యము.

సర్వజ్ఞుడు, సర్వేశ్వరుడు అయిన భగవంతుని విషయంలో ఎవ్వరికీ సందేహం కలగకుండా భగవానుడు అర్జునుని ప్రశ్నకు సమాధానం చెబుతున్నాడు.





**శ్రీ భగవానువాచ :**

బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున ।
తా న్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప ॥ 5

*బహూని-మే-వ్యతీతాని-జన్మాని-తవ-చ-అర్జున*
*తాని-అహం-వేద-సర్వాణి-న-త్వం-వేత్థ-పరంతప*

| | | | | | |
|---|---|---|---|---|---|
| అర్జున | = | అర్జునా! | తాని సర్వాణి | = | వాటి నన్నిటిని |
| మే | = | నాకు | అహం | = | నేను |
| తవ చ | = | నీకు | వేద | = | ఎరుగుదును |
| బహూని | = | అనేక | పరంతప | = | అర్జునా! |
| జన్మాని | = | జన్మలు | త్వం | = | నీవు |
| వ్యతీతాని | = | గడిచాయి | న వేత్థ | = | తెలుసుకోలేవు |

**శ్రీ భగవానుడు చెబుతున్నాడు :**

**అర్జునా! నీకు, నాకు అనేక జన్మలు గడచి పోయాయి. అవన్నీ నాకు తెలుసు. నీకు అవేవీ తెలియవు.**

**వ్యాఖ్య**

శ్రీకృష్ణుడు దేహానికి పరిమిత మైనవాడు అయితే జీవు డవుతాడు. జీవు డైనవాడు ఈశ్వర జ్ఞానంతో ఉండడు. సర్వజ్ఞత్వం లేనివా డవుతాడు. అలాంటివాడు సూర్యునికి సృష్ట్యాదిలో ఉపదేశించడం సాధ్య పడదు. అలా గాక శ్రీకృష్ణుడు ఈశ్వరుడే అయితే, దేహంలో ఉన్నా దేహానికి పరిమితుడు కాడు. కుండ లోని ఆకాశం కుండకు పరిమితం కానట్లు, దేహంలో ఉన్నా, ఈశ్వరుడు దేహానికి పరిమితం కాడు. సర్వవ్యాపిగా, సర్వజ్ఞుడుగా శోభిస్తూనే ఉంటాడు. ఈ విధమైన పరమేశ్వర వైభవాన్ని ఈ శ్లోకంలో ఆవిష్కరిస్తూ ఈశ్వరుడు కించిజ్ఞుడు కాడని ఋజువు చేస్తున్నాడు భగవంతుడు. ఈ సందర్భంలో జరుగుతున్న సంవాదము కృష్ణార్జునుల మధ్యే అయినా, వాస్తవానికి ఇది ఈశ్వర జీవ సంవాదము.

**జీవ భావన - ఈశ్వర స్వరూపము**

'అర్జునా! నీకు, నాకు అనేక జన్మలు గడిచాయి. నాకు అవన్నీ తెలుసు. నీకు అవేవీ తెలియవు' అని భగవంతుడు ఈ శ్లోకంలో పలికాడు. ఈ విషయాన్ని రెండవ అధ్యాయంలో ప్రస్తావించాడు కూడా. 'అర్జునా! నువ్వు, నేను, ఈ రాజులు గతంలో లేని వారము కాము. భవిష్యత్తులో లేకుండా పోయేవారమూ కాము' అని చెప్పే ఉన్నాడు *(2 - 12)*. ఇది చైతన్యస్థాయిలో ప్రవచించిందే గాని దేహస్థాయిలో ప్రసంగించింది కాదు.

గతంలో ఉన్న దేహము నేడు లేకున్నా, తాను ఉన్నాడు అంటే, తాను దేహానికి పరిమితుడు కాడు. తనకు దేహం ఉన్నా తాను దేహం కాడు. అతడే జీవుడు. చైతన్యరూపుడు. నశించేవాడు కాడు. తాను పోయేవాడు కాకపోయినా, పోయే దేహము తానని భ్రమిస్తూ ఉన్నాడు. ఇదే అజ్ఞానము లేదా అవిద్య. ఈ విధంగా అజ్ఞానము చేత కప్పబడిన వాడు జీవుడు. అంటే, జ్ఞానావరణము కలిగి ఉన్నాడని భావము. కనుక, అవిద్యోపాధి కలవాడు జీవుడు ***(అవిద్యోపాధిః సన్ ఆత్మా జీవ ఇతి ఉచ్యతే)***.

అవిద్యను ఉపాధిగా కలిగిన జీవుడు తాను ఈశ్వరుడు అని గ్రహించలేక, దేహంతో తాదాత్మ్యం చెంది, తాను కర్త అని భావిస్తూ ఉంటాడు. పరిమితుడుగా దుఃఖిస్తూ ఉంటాడు. ఈ ఉపద్రవం నుండి

బయట పడటానికి ఫలితాలను ఆశించి కర్మలు చేస్తాడు. ఈ విధంగా అవిద్యా - కామ - కర్మ సుడిగుండంలో చిక్కుకొని, కర్మార్జిత మైన దేహాలను పొందుతూ ఉంటాడు. జన్మలలో ఊరేగుతూ ఉంటాడు. అజ్ఞానమును ఆవరణముగా కలిగి ఉన్నాడు కనుక జన్మలలో జరిగే వాటిని తెలుసుకోలేడు.

జీవుడు ఎవడో కాడు ఈశ్వరుడే. జీవుడు చైతన్యరూపుడు. మరి ఈశ్వరుడు? ఆయన కూడా చైతన్యమే. మరి జీవచైతన్యం, ఈశ్వర చైతన్యం అని రెండు చైతన్యాలు ఉంటాయా? అలా ఉండగలవా? లేదు. కనుక చైతన్యం ఒక్కటే.

జ్ఞానావరణం కలిగి పరిచ్ఛిన్న భావంతో ఉండేవాడు జీవుడు. జ్ఞానావరణ లేనివాడై సర్వజ్ఞత్వంతో భాసించేవాడు ఈశ్వరుడు. జీవుడుగా ఉన్నంత వరకు సర్వజ్ఞత్వము ఉండదు కనుక జన్మ లెత్తుతాడే గాని, ఆ జన్మలను గూర్చి తెలుసుకోలేడు. జీవభావన తొలగితే జ్ఞానావరణం నశిస్తుంది కనుక సర్వజ్ఞత్వం ప్రాప్తిస్తుంది. అన్ని జన్మలు తెలిసి వస్తాయి.

జీవుడు ఉన్నచోటే ఈశ్వరు డున్నాడు. జీవుడే ఈశ్వరుడు. జీవభావన తొలగితే సర్వజ్ఞత్వాది లక్షణాలతో శోభించేవాడు ఈశ్వరుడే.

జీవభావనే అహంభావన. అహంభావనను దర్శించే అహం స్వరూపమే ఈశ్వర చైతన్యం. జీవభావన పరిమితం కనుక సర్వము తెలియదు. సర్వమును దర్శించే ఈశ్వర చైతన్యం పరిమితం కాకుండా పూర్ణమై ఉన్నందున తనను దర్శించే మరొక ద్రష్ట లేనిదై, సర్వజ్ఞత్వంతో శోభిస్తూ ఉంది.

**న హి విజ్ఞాతుః విజ్ఞాతేః విపరిలోపః విద్యతే**

'తెలుసుకొనే వాని స్వరూపమే అయిన తెలివికి నాశము ఉండదు కదా!' అని శ్రుతి ప్రమాణము. ఈ జ్ఞానమే సర్వమునూ తెలుసుకొంటూ ఉంది. ఈ స్థాయి నుండి భాషిస్తూ, తాను ఈశ్వరుడు కనుకనే, సర్వజ్ఞుడు కనుకనే, గడచిన జన్మ లన్నీ తెలుసునని, జ్ఞానావరణ ఉన్నందున అర్జునునికి తెలియవని బోధించాడు భగవంతుడు. వాస్తవానికి జ్ఞానావరణ లేని తనకు జన్మలు లేనివే అయినా, లోకదృష్టిలో ఉన్నట్లు తెలుస్తూ ఉన్నాయి.

సూర్యుడు ఉదయించాడు అంటాము. పుట్టుక లేని సూర్యునికి పుట్టుక అనేది లోకదృష్టిచే ఏర్పడిందే గాని వాస్తవం కాదు.

*మరి, జన్మంటూ లేకపోయినా, జన్మించినట్లు ఎందుకని దేహాలు ధరించాలి? అనే ప్రశ్న అర్జునునిలో ఉదయిస్తుందని ఆశంకిస్తూ, తన అవతార వైశిష్ట్యాన్ని వివరించుటకు భగవానుడు ఉపక్రమిస్తున్నాడు.*

**అజోఽపి స న్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్ ।**
**ప్రకృతిం స్వా మధిష్ఠాయ సమ్భవా మ్యాత్మమాయయా ॥ 6**

**అజః-అపి-సన్-అవ్యయాత్మా-భూతానాం-ఈశ్వరః-అపి-సన్**
**ప్రకృతిం-స్వాం-అధిష్ఠాయ-సంభవామి-ఆత్మమాయయా**

(అహం=నేను)

**అజః అపి సన్** = పుట్టుక లేనివాణ్ణే అయినా
**అవ్యయాత్మా** = వినాశము లేనివాణ్ణే అయినా
**భూతానాం** = ప్రాణులకు
ఈశ్వరః అపి సన్ = ప్రభువునే అయినా
స్వాం = నాకు సంబంధించిన
ప్రకృతిం = ప్రకృతిని
అధిష్ఠాయ = ఆశ్రయించి





ఆత్మమాయయా = నా మాయ చేతనే
సంభవామి = పుడుతున్నాను

**నేను పుట్టుక లేనివాణ్ణి. వినాశము తెలియని వాణ్ణి. ప్రాణులకు ప్రభువును. అయినా, ప్రకృతిని అధీనంలో ఉంచుకొని, నా మాయా శక్తి చేత అవతరిస్తూ ఉంటాను.**

**వ్యాఖ్య**

పుట్టడ మనేది కార్యము. కార్యమంటూ ఏదున్నా దాని వెనుక కారణం ఉంటుంది. ఉండాలి. కార్య రూపంగా దేహం వచ్చింది అంటే, అలా దేహం రావడం వెనుక కారణం ఉంటుంది. గత జన్మలలో ఆచరించిన పుణ్యపాప కర్మలే కారణంగా తెలుస్తున్నాయి. ఆ పుణ్యపాప కర్మల ఫలితాలను అనుభవించడానికి అనుగుణ మైన దేహమే ఈ జన్మలో ప్రాప్తిస్తుంది. గతంలో అందరి పాపపుణ్యాలు ఒకే విధంగా ఉండవు కనుక వాటి ఫలితంగా ప్రాప్తించడం చేత అందరి దేహాలు కూడా ఒకే విధంగా ఉండవు. దేహాకృతుల లోనే గాక, జీవితాలలో కలిగే అనుభవాలలో, సుఖదుఃఖాలలో గోచరించే తేడాలకు కూడా గతంలో ఆచరించిన పుణ్యపాప కర్మల లోని వ్యత్యాసమే ప్రబల కారణము.

**కర్మణా జాయతే జన్తుః కర్మణైవ ప్రలీయతే**

'కర్మ వల్లనే ప్రాణి పుడుతుంది. కర్మ వల్లనే మరణిస్తుంది' అని శాస్త్రవాక్యం. మరి భగవంతుడు, 'అర్జునా! నీకు, నాకు అనేక జన్మలు గడిచాయి' అని చెప్పడం జరిగింది. అర్జునుని విషయం అలా ఉంచితే, శ్రీకృష్ణునికి అనేక జన్మలు ఉన్నమాట వాస్తవమా? జన్మంటూ ఉంటే పాపపుణ్యాలు కారణాలుగా ఉండాలి కదా! నిత్యేశ్వరుడు, సర్వజ్ఞుడు అయిన పరమేశ్వరునకు కూడా పాపపుణ్యా లుంటాయా? ఉంటే, ఆయన భగవంతుడు ఎలా అవుతాడు? పాపపుణ్యాలు లేనపుడు, కారణమే లేనిది అవుతూ ఉంది కనుక, కార్యరూపంలో జన్మ ఎలా సాధ్య పడుతుంది? జన్మకే అవకాశం లేనపుడు అనేక జన్మలు గడిచాయి అని చెప్పడంలో ఔచిత్యం లేదు కదా!

ఇంతకీ శ్రీకృష్ణుని జన్మ విషయ మేమిటి? శ్రీకృష్ణుడు దేవుడే అయితే, జన్మ అనుపపన్నం. అలా కాకుండా, శ్రీకృష్ణుడు జీవుడే అయితే, నిత్యైశ్వర్యం, సర్వజ్ఞత్వం అనుపపన్నం. ఈ రెండు శంకలను పరిహరిస్తూ అవతార వైభవాన్ని భగవంతుడు వివరిస్తున్నాడు. తాను పుట్టుక లేనివా డైనను, నశించేవాడు కాక పోయినను, తన ఆత్మ మాయ చేత ప్రకృతిని వశ పరచుకొని పుట్టుచున్నట్లు చెబుతున్నాడు. ఇదే అవతార వైభవము.

**మాయా కార్యము - మాయా కాయము**

పుట్టిన ప్రతివాడు దేహవంతుడుగా కనిపించినట్లే, శ్రీకృష్ణుడు కూడా దేహవంతుడుగా అగుపిస్తున్నాడు. కర్మ చేత అందరూ పుడుతూ ఉంటే, మాయ చేత తాను సంభవిస్తున్నాడు. వాస్తవానికి తనకు పుట్టుక లేదు. పుట్టుక లేనివా డైనను *(అజః అపి సన్)* పుట్టిన వాని వలె తెలుస్తున్నాడు.

జన్మకు ఏ విధమైన కారణము లేనందున అతడు పుట్టేవాడు కాడు, కనుక అజుడు ***(జన్మ రహితః)*** పుట్టుక లేనివాడు. నశించే వాడు కాడు కనుక అవ్యయుడు. ఆయన అవ్యయుడు కనుక ఆయన జ్ఞానము కూడా అవ్యయమే. అంటే నశించేది కాదు అని అర్థము. కనుక ఆయన నశించని జ్ఞానశక్తి గలవాడు ***(అక్షీణ జ్ఞానశక్తి స్వభావః)***. జీవుల వలె పరిమితమైన జ్ఞానశక్తి కలవాడు కాడు. కనుక అజుడైన పరమేశ్వరునకు జనకుడు లేడు. అవ్యయుడైన పరమేశ్వరుని మించిన వాడూ లేడు ***(న తస్య కశ్చిత్ జనితా నచాఽధిపః - శ్రుతి వాక్యము)***. పుట్టుక అనే మొదటి వికారము ***(ఉత్పత్తిః)***. నశించుట అనే చివరి వికారము ***(వినాశః)*** ఈ రెండూ

ఎప్పుడైతే లేవో, వాటి మధ్య కనిపించే మిగిలిన నాలుగు వికారాలు కూడా లేనివే అని భావము. షడ్భావ వికారములు కలిగి ఉంటేనే దేహము. షడ్భావ వికారాలు ఎప్పుడైతే లేనే లేవో, ఇక అక్కడ దేహం ఎలా ఉంటుంది? ఉండలేదు. కాని, శ్రీకృష్ణుని దేహం ఉన్నట్లు కనిపిస్తూ ఉంది కదా! అవును. అందుకే దానిని మాయాకార్యంగా, మాయాకాయంగా, లీలాకాయంగా భావించక తప్పదు.

అజము, అవ్యయము అయిన సద్రూప చైతన్యమునకు జన్మ ఎలా కలుగుతుంది? ఒకవేళ కలిగినట్లుగా ***(ఇవ)*** ఉంది అంటే, అది మాయాకార్యం కావాలే గాని సత్య మయ్యేందుకు అవకాశం లేదు. ***(స తో హి మాయయా జన్మ జాయతే న తు తత్త్వతః).*** ఇక్కడ మరొక సూక్ష్మమైన విషయం కూడా ఉంది. జన్మంటూ కలిగితే ఉన్నదానికి కలగాలే గాని లేని దానికి ఎలా కలుగుతుంది? సత్తు అయిన దానికి వాస్తవంగా కాకపోయినా, మాయాకార్యంగా అయినా జన్మ కలుగుతుంది. అదే కనుక అసత్తు అయితే, అది లేనిదే కనుక వాస్తవం గానూ జన్మ కలుగదు. మాయాకార్యంగా కూడా కలిగే అవకాశం లేదు ***(అసతః మాయయా జన్మ తత్త్వతః న హి యుజ్యతే).*** ఎందుకని? లేని దానికి జన్మ ఎలా కలుగుతుంది? గొడ్రాలు కొడుకు వాస్తవంగానూ పుట్టలేడు. మాయా కార్యంగా కూడా పుట్టలేడు. ఎందుకని? లేనివాడే కనుక. ***(వంధ్యాపుత్రః న తత్త్వేన మాయయా వాఽపి జాయతే).*** ఇలా చూచినపుడు భగవానుని జన్మమే కాదు, జీవుని జన్మ కూడా మాయా కార్యమే. కాకపోతే, జీవుడు మాయకు లోబడి ఉంటాడు. ఈశ్వరుడు మాయను వశ పరచుకొని ఉంటాడు. అలా తనకు వశపడిన మాయ చేతనే ప్రకృతిని అధిష్ఠించి భగవానుడు లోకానుగ్రహార్థం పుడుతూ ఉంటాడు.

మాయనే కాదు. సమస్తాన్ని నియమించే వాడు పరమేశ్వరుడే. సర్వమును నియమించే తనను నియంత్రించే వారు లేనే లేరు. అందుచేత, తాను సర్వభూత మహేశ్వరుడు ***(భూతానాం ఈశ్వరః, భూతానాం బ్రహ్మాది స్తంబ పర్యన్తానామ్, ఈశ్వరః ఈశన శీలః).*** మాయాదేహంతో, లీలాశరీరంతో కనిపించారు కనుక, అవతార పురుషులైన శ్రీరాముణ్ణి, శ్రీకృష్ణుణ్ణి ఆయా కాలాలలో ప్రజలు దర్శించ గలిగారు. మాయాకార్యం కనుక దర్శనీయ మైంది. అదే సర్వభూత మహేశ్వరు డైన వానిని దర్శించడం సాధ్యపడదు. సర్వభూత గుణాలతో కూడి శాసించే కారణోపాధిని దర్శించే దెలా? ఈ సత్యాన్ని మోక్షధర్మము నందు భగవానుడే నారదునికి స్వయంగా తెలుపుతాడు.

***మాయా హ్యేషా మయాసృష్టా యన్మాం పశ్యసి నారద***
***సర్వభూత గుణై ర్యుక్తం న తు మాం ద్రష్టు మర్హసి ॥***

'నారదా! ఇది మాయా కార్యము. నాచే సృష్టింప బడింది. కనుకనే, నువ్వు నన్ను చూడగలుగు తున్నావు. సర్వభూత గుణాలతో కూడిన నన్ను నువ్వు చూడలేవు'.

కనుక అర్జునా! పుట్టుక లేనివాణ్ణే అయినా ***(అజః అపి సన్),*** నాశము లేనివాణ్ణే అయినా ***(అవ్యయః అపి సన్),*** సర్వభూతములకు ప్రభువునే అయినా ***(భూతానాం ఈశ్వరః అపి సన్)*** నా ప్రకృతిని వశ పరచుకొని ***(స్వామ్ ప్రకృతిమ్ అధిష్ఠాయ),*** నా మాయ చేతనే ***(ఆత్మ మాయయా),*** పుడుతూ ఉంటాను ***(సంభవామి)*** అంటున్నాడు గీతాచార్యుడు.

**సంభవము సమంజసము**

తన ప్రకృతిని వశ పరచుకొని ఆత్మ మాయ చేత పుడుతూ ఉంటాను అన్నాడు శ్రీకృష్ణ భగవానుడు. నా ప్రకృతిని వశ పరచుకొని **స్వాం ప్రకృతిం అధిష్ఠాయ** అంటున్నాడు. కృతిః అంటే కార్యము. సృష్టికార్యము. ***ప్రకర్షేణ కృతిః ప్రకృతిః.*** ప్రకర్షేణ అంటే చక్కగా అని అర్థము. చక్కగా చేయబడిన సృష్టికార్యము ఎక్కడ





జరుగుతూ ఉందో అది ఆయన ప్రకృతి. త్రిగుణాత్మక మైన దైవీమాయ ***(దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా -7 అ 14 శ్లో).*** ఈ మాయను అదుపులో ఉంచుకొని పుడుతూ ఉంటాడు.

ఇక్కడే కాస్త జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. దేహము నందు ఉన్న భావంతో దేహంలో లేడు. దేహదేహి భావానికి ఇక్కడ అవకాశం లేదు. మాయను వశ పరచుకొని ఉన్నా, తాను మాయకు అతీతంగా ఉన్నాడు. కేవలం తన మహిమ యందే దివ్యంగా శోభిస్తున్నాడు. ఈ విషయాన్ని వేదం ప్రశ్నించి మరీ రాబట్టింది.

**స భగవః కస్మిన్ ప్రతిష్ఠితః స్వే మహిమ్నిః**

ఓ భగవాన్! అతడు దేని యందు ప్రతిష్ఠితుడు? నాయనా! తన మహిమ యందే ప్రతిష్ఠితుడు. దేహము నందు ఉన్నట్లు తెలుస్తూ ఉండినా అది మాయామాత్రమే, లీలామాత్రమే అని గ్రహించాలి. అట్టి లీలా శరీరమును దర్శించడము కూడా సామాన్య మైన విషయం కాదు. అదొక గొప్ప భాగ్యం. అందరికీ లభ్య మయ్యేది కాదు. శ్రీకృష్ణుని అవతార సమయంలో నందగోకులం లోని కృతపుణ్యపుంజులకు ఈ భాగ్యం కలిగిందని శ్రీ మధుసూదన సరస్వతి మననం చేసుకొని పరవశించి తన్మయు డయ్యాడు.

***అహో భాగ్యం అహో భాగ్యం నందగోప వ్రజౌకసామ్ ।***
***యన్మిత్రం పరమానందం పూర్ణం బ్రహ్మ సనాతనమ్ ॥***

నందుని వ్రజపురంలో వసించిన వారి భాగ్యమే భాగ్యము. పరమానంద స్వరూపుడు, సనాతనుడు అయిన పరిపూర్ణ బ్రహ్మ స్వరూపము వారికి స్నేహితుడై మెలిగాడు.

*మరి, ఈ విధంగా భగవంతుడు సంభవించడ మనేది ఎప్పుడు జరుగుతుంది? ఎందుకు జరుగుతుంది? చెబుతున్నాడు.*

**యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత ।**
**అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజా మ్యహమ్ ॥** 7

***యదా-యదా-హి-ధర్మస్య-గ్లానిః-భవతి-భారత***
***అభ్యుత్థానం-అధర్మస్య-తదా-ఆత్మానం-సృజామి-అహం***

| | | | | | |
|---|---|---|---|---|---|
| భారత | = | అర్జునా! | భవతి | = | కలుగుతూ ఉందో |
| యదాయదా | = | ఎప్పుడెప్పుడు | తదా | = | అప్పుడు |
| ధర్మస్య | = | ధర్మమునకు | ఆత్మానం | = | ఆత్మయైన నన్ను |
| గ్లానిః | = | హాని | అహం | = | నేను |
| అధర్మస్య | = | అధర్మమునకు | సృజామి హి | = | సృష్టించు కుంటాను |
| అభ్యుత్థానం | = | అభివృద్ధి | | | |

**అర్జునా! ధర్మానికి హాని కలిగి నపుడు, అధర్మము వృద్ధి చెందినపుడు నన్ను నేను సృష్టించుకుంటూ ఉంటాను.**

**వ్యాఖ్య**

ప్రపంచాన్ని సృష్టించినట్లు, సర్వ జీవులను సృష్టించినట్లు, తాను సృష్టించిన ప్రపంచం లోనే తనను తాను భగవంతుడు సృష్టించు కుంటాడు. అదే అవతారము. ఇలా అవతరించడం వెనుక ధర్మమే ప్రధానమైన విషయంగా కనిపిస్తూ ఉంది. ధర్మాన్ని చక్క దిద్దడానికి భగవంతుడు స్వయంగా అవతరించడం కన్నా మరో మార్గం లేదా? తాను అవతరించకుండానే సంకల్ప మాత్రం చేత భగవంతుడు ప్రపంచాన్ని సరి చేయలేడా? చెయ్యొచ్చు. దాని వల్ల ధర్మస్థాపనము జరుగుతుందా?

గృహాన్ని నిర్మించడము ఎంత ముఖ్యమో, దానిని కాపాడుకోవడం అంత ముఖ్యము. రోగం వచ్చి నపుడు వైద్యుని అవసరం ఏర్పడవచ్చు. వైద్యుడు వైద్యం చేసి రోగాన్ని పోగొట్టవచ్చు. మళ్ళీ రాదనే నమ్మక మేమిటి? రోగ నిర్మూలనం ఎంత ముఖ్యమో, రోగం రాకుండా జాగ్రత్త పడటము కూడా అంతే ముఖ్యము.

చిన్న బిడ్డకు చేయి నందించి మెల్లగా అడుగులో అడుగు లేసుకొంటూ నడిచే తల్లిని మీరు చూచే ఉంటారు. ఆమె తన బిడ్డను చంక కెత్తుకొని చకచకా నడిచి పోగలదు. అలా చేయడం వల్ల తొందరగా వెళ్ళ గలుగుతుంది కూడా. అయినా, బిడ్డను మెల్లగా నడిపిస్తూనే తాను నడుస్తుంది. తాను ఎలా నడవాలి అనేది తల్లికి ముఖ్యం కాదు. బిడ్డకు నడకను నేర్పడమే ప్రధానం. ఇది అర్థమైతే, భగవంతుని అవతార వైభవమును బుద్ధికి చక్కగా పట్టించవచ్చు.

**ధరణి - ధర్మము**

ధర్మము అనేది జ్ఞానం తరువాత పవిత్రమైన పదము. ధర్మం శ్రేష్ఠమైంది. సమున్నత మైంది. సముత్కర్షంతో శోభించేది. సర్వమంగళ కారక మైంది. ధర్మం వల్లనే ధరణి ఉంది. తిరుగుతూ ఉంది.

***ధరతీతి ధర్మః*** ధర్మము అంటే ధరించేది. మోసేది అని అర్థము. అంటే, ***ధరతి లోకాన్ ఇతి ధర్మః*** - లోకాలను ధరించునది ధర్మము. ***ధృఞ్ ధారణే*** అనే ధాతువు నుండి ధర్మం అనే శబ్దం పుట్టింది. ***డుధాఞ్ ధారణ పోషణయోః*** ధారణ, పోషణ అనే రెండు లక్షణాలు ధర్మ శబ్దంలో ఇమిడి ఉన్నాయి. ప్రపంచమును ధరిస్తూ, దాని మనుగడకు కారణ మైనది ధర్మము. అలాగే జీవులను పాలించి రక్షించేది కూడా ధర్మమే. జనులు ఆచరించి తద్వారా సుఖశాంతులను పొందుటకు ఆధారమైనది ధర్మము ***(ధ్రియతే వా జనై రితి ధర్మః).*** అటు ధరణి మనుగడకు, ఇటు జీవుల అభ్యున్నతికి కారణమై ఉండటం చేత విశ్వదేహంలో ధర్మం వెన్నెముకలా నిలిచి ఉంది. ఊపిరిలా చలిస్తూ ఉంది. గుండెలా కొట్టుకుంటూ ఉంది. ప్రాణవాయువులా పని చేస్తూ ఉంది. కనుకనే, ***ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా*** సమస్త ప్రపంచము ధర్మమును ఆధారముగా చేసుకొని నిలబడి ఉంది అన్నది తైత్తిరీయ శ్రుతి. ధర్మము అంత మహోన్నత మైనది కనుకనే దానిని రక్షించడానికి స్వయంగా భగవంతుడే నడుం బిగించి అవతరిస్తాడు. నిరాకారుడు నరాకారుడై సాక్షాత్కరిస్తాడు.

**నర రూపం కాకపోయినా**

**నరుల కొరకే సంభవం**

భగవంతుడు అవతరించడానికి అవసరం ఉండాలి. అవతార ఆవిర్భావానికి అనుకూల మైన పరిస్థితులు ఉండాలి. అనువైన సందర్భం కూడా ఉండాలి. అన్నీ అనుకూల మైతే, అవతారం ఆవిర్భవిస్తుంది.

పరమేశ్వరుడు అవతరించడానికి ఏది లక్ష్యమో దానిని సాధించడమే అవతార ప్రయోజనము. అంతేగాని రూపము, కాలము, ప్రదేశము ముఖ్యమైనవి కావు. భగవంతుని పుట్టుక మానవుల పుట్టుక లాంటిది కాదని, భగవంతుని శరీరము లీలా శరీరమని ఇప్పటికే తెలుసు కున్నాము. మాయా శరీరానికి మాతాపితల అవసరం కూడా గౌణమే.

దేవకీ వసుదేవులకు శ్రీకృష్ణుడుగా అవతరిస్తే, కౌసల్యా దశరథులకు శ్రీరాముడుగా అవతరించాడు. అదితి కశ్యపులకు వామనుడుగా జన్మించి, పుట్టగానే పదహారు సంవత్సరాల బ్రహ్మచారిగా పెరిగి పోయాడు. ఇలా జరగడం సాధారణ విషయమా? ఎవరైనా పుట్టగానే పదహారు సంవత్సరాల బాలుడు కాగలరా?

అదలా ఉంచితే, మత్స్యంగా, కూర్మంగా, వరాహంగా కూడా భగవంతుడు అవతరించాడు. అంతకన్నా





ముఖ్యమైన అవతారం నారసింహావతారము. జడమైన స్తంభము నుండి ఎవరైనా పుట్టగలరా? అలాగే జరిగింది నారసింహమూర్తి జననం. అందుకే, భగవంతుని అవతారము మాయాకార్యము. లీలా విశేషము.

కనుక, అవతారము అనేది మానవాకారం లోనే ఉండాలి అనే నియమం లేదు. కాని, ఏ ఆకారంలో ఆదిదేవుడు అవతరించినా, అది మానవ సమాజం కొరకే. మానవ కళ్యాణం కొరకే. మేలు జరిగేది మాత్రం మానవులకే.

**ధర్మహాని**

సృష్టిలో నియతి ఉంది. అదే ధర్మం. ధర్మ రూపంలో ఉన్నది దైవమే. అందుకే ధర్మం శ్రేష్ఠమైంది. పవిత్రమైంది. ధర్మం ఉంటేనే సృష్టి. ధర్మం తోనే సమాజానికి క్షేమం. ధర్మం చెడితే, బ్రతుకు చెడుతుంది. సమాజంలో సుఖం కరు వవుతుంది. వ్యక్తిలో శాంతి నశిస్తుంది.

**సుఖం చ న వినా ధర్మాత్, తస్మాత్ ధర్మపరో భవేత్**

ధర్మం లేని చోట సుఖం ఉండదు. శాంతి మిగలదు. అందుచేత శాంతి సౌఖ్యాలను అభిలషించే వారు ధర్మమార్గం లోనే చరించాలి అన్నది ధర్మశాస్త్రం.

మనిషి ఒక్కడే ధర్మ జీవనాన్ని సాగిస్తాడు. ధర్మాన్ని అర్థం చేసుకొనే బుద్ధిని భగవంతుడు మానవునికే ప్రసాదించాడు. బుద్ధి లేని కారణంగా జంతువులు ధర్మ జీవనాన్ని కొనసాగించ లేక సహజాతాలతో బ్రతుకుతూ ఉంటాయి. కనుక, కర్మస్వేచ్ఛ లేని జంతువులలో ధర్మాధర్మాల ప్రసక్తి తలెత్తదు.

మనిషికి మనస్సు ఉంది. కర్మస్వేచ్ఛ ఉంది. అందుచేత, ధర్మంగా జీవించాలి అనుకుంటే ధర్మంగా జీవించ గలడు. అధర్మంగా జీవించాలి అనుకుంటే అధర్మంగా జీవించగలడు. ధర్మంగా జీవించినంత కాలం సృష్టి లోని నియతికి అనుగుణంగా జీవించడం చేత వ్యక్తి సుఖానికి లోటు రాదు. సమాజ అభ్యుదయానికి చేటు ఉండదు.

ధర్మంగా నడచుకో లేని వ్యక్తి నిశ్శబ్దంగా కూర్చోలేడు. అధర్మాన్ని ఆచరిస్తాడు. అధర్మంతో ప్రపంచం నడవదు. నడిచినా అధర్మం గానే నడుస్తుంది. అశాంతితో అలమటిస్తూ ఉంటుంది. ఈ విధంగా ధర్మం క్షీణిస్తూ ఉంటే, అధర్మం పెరుగుతూ ఉంటుంది. ఇక్కడే ధర్మానికి హాని ***(ధర్మస్య గ్లానిః)***. అధర్మానికి పుట్టుక ***(ఉద్భవః)*** కలుగుతుంది. పుట్టింది ఏదైనా పెరుగుతుంది. అదే అధర్మానికి **అభ్యుత్థానము**. అంటే వృద్ధి లేదా పెరుగుదల.

ధర్మాచరణ లేనపుడు ధర్మఫలాలు సమాజానికి అందవు. అంతా క్షయమే. అన్నిచోట్ల క్షామమే. ధర్మం లేకుండా ప్రపంచం నడవదు. నియతి కుంటు పడుతుంది. దానిని చక్క దిద్దడానికి నియంతే రావలసి ఉంటుంది. అదే అవతారము. ధర్మాచరణము అనేది మానవ సమాజానికి సంబంధించింది కనుక భగవంతుడు ఏ అవతార మెత్తినా, తత్ఫలితాలు అందేది మాత్రం మానవ సమాజానికే.

ధర్మం నశించింది అంటూ ఉంటాము. ధర్మము నశించదు. నశించేది ధర్మం కానే కాదు. ధర్మరూపంలో దైవం ఉండే టప్పుడు ధర్మం నశించడం అంటే దైవం నశించినట్లు భావించ వలసి ఉంటుంది.

ధర్మాన్ని ఎవరు నశింప చేయగలరు? ఆ శక్తి ఎవరి కుంది? అగ్నిని ముద్దెట్టుకుంటే మూతి కాలుతుంది. ఇదేమిటి? ధర్మం. ఈ ధర్మాన్ని నిలువరించ గలిగే సామర్థ్యం ఎవరికైనా ఉందా?

నేను ఇల్లు కట్టుకుంటాను. అవసరం లేదనుకుంటే కూల గొడతాను. కానీ ధర్మాన్ని నేను సృష్టించలేదు.

నేను సృష్టించని దానిని ఎలా నాశనం చెయ్యగలను? ధర్మం అనేది భవనం కాదు నశింప చేయడానికి. ధర్మ మనేది నియతి. ధర్మ మనేది జీవన విధానము. ధర్మాన్ని అనుసరిస్తే ధర్మ ఫలితాలు అందుతాయి. ధర్మాన్ని ధిక్కరిస్తే దుష్ఫలితాలు అందుతాయి. ఇదే గ్లాని. ఇదే హాని. ఈ హాని ధర్మాన్ని అనుసరించని వాళ్ళకే గాని ధర్మానికి కాదు.

అధర్మాన్ని అనుసరించే వారి సంఖ్య పెరిగి నపుడు ధర్మపరులు కూడా కష్టాల పాలవుతారు. కానలలో కాపురాలు పెడతారు. పాండవుల పరిస్థితి అదే కదా! అధర్మపరుల చేతిలో ధర్మాత్ములు చిక్కుకొని అల్లాడి పోతారు. నిండుసభలో ద్రౌపదికి జరిగింది అదే కదా!

అధర్మం పెరిగి నపుడు ఏ సమాజం అయినా ఇలాగే ఉంటుంది. అధర్మ మనేది అధర్మం జోలికి పోదు. ఎక్కడైనా, ఎప్పుడైనా అధర్మం అనేది ధర్మం పైనే విరుచుకు పడుతుంది. అన్యాయం న్యాయాన్ని కాలరాచే ప్రయత్నంలో ఉంటుంది. చెడు మంచిని కృంగదీస్తూ ఉంటుంది.

ఇదే ధర్మగ్లాని. ఇదే అధర్మ అభ్యున్నతి. ఇది సమాజ దేహంలో వ్రణం లాంటిది. దీనికి చికిత్స జరగాలి. ఈ కార్యానికి శ్రీకారం చుట్టి భగవంతుడు అవతరించడం జరుగుతుంది. తనకు తానే భగవంతుడు అవతరిస్తాడు. ఆయన అవతరించడానికి ప్రదేశ నియమం లేదు. కాల నియమం లేదు. ఎక్కడైనా ఆవిర్భవించ వచ్చు. ఎప్పుడైనా ఆవిర్భవించవచ్చు. అవతారము యొక్క లక్ష్యము నెరవేరడమే ప్రధానము.

**పుట్ట గొడుగులు**

వ్యవస్థలు ఒక వైపు శోభిస్తూ ఉంటాయి. వ్యసనాలు మరో వైపు క్షోభింప చేస్తూ ఉంటాయి. మానవ సమాజంలో ఇదొక విచిత్రమైన వింత ధోరణి. అవతార వైశిష్ట్యాన్ని అర్థం చేసుకొనే వాళ్ళు అరుదుగా ఉంటారు కాని, నేనే భగవాన్! నాదొక అవతారం! అంటూ విచిత్రంగా కొన్ని పుట్టగొడుగులు పుట్టుకొస్తూ ఉంటాయి. ఇవి కూడా అన్ని కాలాల్లో అగుపిస్తాయి. ఇంతెందుకు? శ్రీకృష్ణ పరమాత్మ అవతార కాలంలో కూడా పౌండ్రక వాసుదేవుడు ఒక వైపు నిలబడి గాండ్రిస్తూనే ఉన్నాడు.

నా నలభై సంవత్సరాల సేవా జీవనంలో లెక్కకు మించిన అవతారాలను చూశాను. రకరకాలైన అవతారాలు - విచిత్ర వేషధారణలు. నా చిన్నతనంలో నేను చూచిన ఇలాంటి అవతారాలను కూడా చాలా మంది ఆకాశాని కెత్తేశారు. ఈ రోజు వాళ్ళ పేర్లు తెలిసిన వాళ్ళు కూడా లేరు. ఏమైందో ఆ అవతారాల సందడి అంతా!

ఇప్పుడు కూడా ఆ సందడి ఉంది. కాకపోతే అంగడి మారింది. దేశకాల పరిస్థితుల్ని బట్టి వ్యాపారాలు మారాలి కదా మరి? అదే జరుగుతూ ఉంది. వీధి కాక వేషం. ఊరికాక అవతారం.

శాస్త్రం ప్రతిపాదిస్తున్న దశావతారాలు ఒక్కొక్క కాలంలో ఒక్కొక్కటి వచ్చినట్లుగా ఉంది. ఈ కలియుగ మహి మేమిటో గాని దశావతారాలు ఒకేసారి వచ్చి విడిది చేసిన ట్లున్నాయి. ఏ అవతారాన్ని ముందుగా వెళ్ళి దర్శించుకోవాలో అర్థం గాక జనం పిచ్చిపట్టి పోతున్నారు. పాపం! పిచ్చిజనం.

మొదటిది దర్శనావతారం. అంటే, ఆయన చూస్తే చాలు. జనం కడతేరి పోతారు. రెండవది స్పర్శనావతారము. ఆయన తాకితే చాలు జనం తరించి పోతారు. మూడవది దక్షిణావతారము. ముడుపులు చెల్లిస్తే చాలు. ముక్తి ముంగిట నిలుస్తుంది. నాల్గవది ఉత్తరావతారము. బాధల్ని వ్రాసి మడతపెట్టి ఇస్తే చాలు. అంతర్యంలో బోధలు అంది, ఆ తరువాత అందని ఎత్తుకు ఎగిరి పోతారు. ఐదవది హాస్యావతారము. ఆయన నవ్వుతాడు. నరులు నారాయణు లవుతారు. ఆరవది రాగావతారం. ఆయన రాగాన్ని ఆలపిస్తాడు.





జనులు తీరాన్ని చేరిపోతారు. ఏడవది రోగావతారం. ఆయన నీళ్ళు పోస్తాడు. భక్తుల భవరోగం నానిపోతుంది. చిరునామా కూడా చెప్పకుండా పారిపోతుంది. ఎనిమిదవది ధ్యానావతారం. కళ్ళు మూసుకుంటే చాలు కైవల్యమే. తొమ్మిదవది తీర్థావతారం. తీపి తీర్థంతో తాపత్రయాలన్నీ నశించి తన్మయు లవుతారు. పదవది యోగావతారం. నువ్వు కూర్చుంటే చాలు. కుండ అన్నీ కదుల్తాయి. కుండలినీ చలిస్తుంది. నువ్వు తరిస్తావు! ఇవి, నేటి సమాజంలో దశావతారాలు.

పేరు ప్రఖ్యాతుల కోసం నేడు అమాయకుల బ్రతుకుల్ని పాడు చేస్తే, ఒకనాడు ఆ పేరు ప్రఖ్యాతులు పాడై పోవడమే గాక, పాపాల మూటలు కూడా పేరుకు పోతాయి. మంచి చేయడం అందరికీ సాధ్యం కాక పోవచ్చు. కాని, ప్రయత్నిస్తే చెడు చేయకుండా ఎవరిని వారు నియంత్రించుకోవచ్చు. నిజం చెప్పాలంటే ఇది కూడా సమాజానికి శ్రేయస్కరమే. చివరగా నా అభిప్రాయం ఒక్కటే. ఎవరి వల్ల ధర్మం ఉద్ధరింప బడినా అట్టి పావనాత్ములను అవతారమూర్తులుగా భావించడం దోషం కాదు. అలాగని, పుట్టగొడుగులకు పట్టం కట్టి, పుట్టలో చేతులు పెట్టి ప్రశస్త మైన పుట్టుకను పాడు చేసుకోవద్దని మనవి.

*ధర్మానికి గ్లాని, అధర్మానికి వృద్ధి ఏర్పడి నపుడు భగవంతుడు తనను తాను అవతారమూర్తిగా సృష్టించుకుంటాడు అని అర్థం చేసుకున్నాం. మరి, అలా అవతరించి భగవానుడు ఏం చేస్తాడు? చెబుతున్నాడు.*

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।
ధర్మ సంస్థాపనార్థాయ సమ్భవామి యుగే యుగే ॥ 8

*పరిత్రాణాయ-సాధూనాం-వినాశాయ-చ-దుష్కృతాం*
*ధర్మ సంస్థాపనార్థాయ-సంభవామి-యుగే-యుగే*

| | | | | | |
|---|---|---|---|---|---|
| సాధూనాం | = | సాధువుల | ధర్మ సంస్థాపనార్థాయ | = | ధర్మమును స్థాపించుటకు |
| పరిత్రాణాయ | = | పరిరక్షణకు | యుగేయుగే | = | ప్రతియుగములో |
| దుష్కృతాం | = | దుర్మార్గుల | సంభవామి | = | పుడుతూ ఉంటాను |
| వినాశాయ చ | = | వినాశానికి | | | |

**సత్పురుషులను రక్షించడానికి, దుష్టులను శిక్షించడానికి, ధర్మాన్ని చక్కగా స్థాపించడానికి ప్రతి యుగంలో నేను పుడుతూ ఉంటాను.**

**వ్యాఖ్య**

పని లేకుండా ప్రపంచాని కెవ్వరూ రారు. ఈ విషయంలో భగవంతుడు కూడా విలక్షణంగా లేడు. సూర్యుడు ఉదయిస్తాడు. తెల్లవారుతుంది. ఆ తరువాత, తాను చేయవలసింది చేసి సూర్యుడు అస్తమిస్తాడు. వానొస్తుంది. భూమి తడుస్తుంది. గుంటలు నిండుతాయి. నదులు పొంగుతాయి. చెట్లు చిగురిస్తాయి. పంటలు పండుతాయి. ప్రయోజనం లేకుండా ఏ పనులు సాగవు. కాకపోతే, ఎవరి పనులు వాళ్ళు చేసుకోవడానికి, ఎవరి బ్రతుకుల్ని వాళ్ళు చక్క బరచుకోవడానికి వస్తారు. కాని, భగవంతుని అవతారం మాత్రం అందరి బ్రతుకుల్ని చక్క చేయడానికి వస్తుంది.

**మర్త్యావతార స్త్విహ మర్త్యశిక్షణమ్**

మానవ సమాజానికి శిక్షణ నిచ్చి రక్షించడానికే నిరాకారుడు నరాకారుడై అవతరిస్తాడు అన్నది

శ్రీమద్భాగవతం. రక్షణ అందరికీ కావాలి. కనుక, శిక్షణ అందరికీ అందాలి. కాకపోతే, శిక్షణా పద్ధతులు భిన్నంగా ఉంటాయి. శిక్షణను అందుకునే వారి ప్రవర్తనల లోని, ప్రవృత్తుల లోని వ్యత్యాసాలే అందుకు కారణము. కొట్టినా, పెట్టినా తల్లి చేతుల వెనుక ప్రేమే ఉంటుంది. అట్లు తినిపించినా, తిట్లు వినిపించినా తల్లి హృదయంలో వాత్సల్యం ఉంటుందే గాని వైషమ్యం ఉండదు.

**లాలనే తాడనే మాతుః న వైషమ్యం యథార్భకే! తద్వదేవ మహేశస్య నియన్తు ర్గుణ దోషయోః**

లాలించినా, దండించినా తల్లికి బిడ్డ విషయంలో ఎలాగైతే వైషమ్యం లేదో, అలాగే సర్వ నియామకు డైన పరమేశ్వరునికి ప్రజల విషయంలో నిర్దయ ఉండదు.

**అవ్యక్తం - వ్యక్తం**

అవ్యక్తంగా అనంతుడైన భగవంతుడు వ్యక్తం కావడమే అవతారము. భగవంతుని అవతారములో అనంతమైన కారుణ్యమే ప్రధానంగా గోచరిస్తుంది. ఒక్క విషయాన్ని అర్థం చేసుకుందాం. మన శరీరంలో భగవంతుడు లేని దెక్కడ? అలాగని అన్ని చోట్ల ధ్యానించ గలమా? హృదయం లోనే ధ్యానిస్తాం. ధ్యానానికి హృదయం ఉపలబ్ధి స్థానం. హృదయంలో ధ్యానం సాగుతుంది. హృదయం లోనే దైవదర్శన మవుతుంది. అంతమాత్రాన పరమేశ్వరుడు దేహంలో హృదయానికే పరిమితం అని భావించ గలమా? అంతే. దేహమంతా నియతి రూపంలో శోభిస్తున్న పరమేశ్వరుని, హృదయంలో ధ్యానించిన వారికి హృదయంలో దర్శన మిస్తాడు. అదే ఆయన కారుణ్యం.

విశ్వంలో ఈశ్వరుడు లేని దెక్కడ? విశ్వమంతా తానే నిండి నిబిడీకృతమై ఉన్నాడు. ***బ్రహ్మ ఏవ ఇదం విశ్వం.*** ఈ విశ్వమంతా బ్రహ్మమే. వివిధ ప్రత్యయ గమ్యంగా రూప శబ్దాదులతో విశ్వం గోచరిస్తూ ఉంటే, దేనికీ దూరం కాకుండా, దేనికీ అంటకుండా అభిన్న నిమిత్త ఉపాదాన కారణమైన భగవంతుడు విశ్వానికి విలక్షణంగా శోభిస్తున్నాడు. అలాంటి దివ్యాత్ముడ్ని కళ్ళు దర్శించ గలవా? దర్శించ లేవు. కనుక, బుద్ధితో చూడాలి. అవ్యక్తు డైన పరమాత్మ జ్ఞానరూపంలో బుద్ధికి అందుతాడు. తానే వ్యక్త మైతే కళ్ళకు కూడా కనిపిస్తాడు. ధర్మ రూపంలో అవ్యక్తంగా శోభించు వాడు, దివ్యదేహధారిగా వ్యక్తమై ప్రకాశించడమే అవతారము.

ఎవరు అవతరించినా, ఏది అవతరించినా వచ్చిన పనిని చక్క పెట్టుకొని వెళ్ళేందుకే నని ఇంతకు ముందే తెలుసుకున్నాం. మరి, భగవంతుడు అవతరించి నపుడు ఏయే కార్యాలు జరుగుతాయి? ఏయే ప్రయోజనాలు సిద్ధిస్తాయి?

**పని ఒక్కటే - ఫలితాలు మూడు**

భగవంతుడు అవతరించడం అనే ఒక్క అద్భుత కార్యానికి మూడు ప్రయోజనాలు దివ్యంగా సిద్ధిస్తాయి. అవి (1) సాధు పరిరక్షణము (2) పాప వినాశము (3) ధర్మ సంస్థాపనము.

అవతారము అందించే ఫలితాలు మూడుగా తెలుస్తున్నా, ఈ మూడింటిలో ఏ ఒక్కటి సిద్ధించినా, మిగిలిన రెండూ సిద్ధించినట్లే. ఈ సత్యాన్ని చివర అర్థం చేసుకుంటాం. ముందుగా ప్రయోజన క్రమాన్ని వంట పట్టించుకుందాం.

**(1) సాధు పరిరక్షణము**

**సాధుః** అంటే మంచివాడు ***(సజ్జనః).*** సన్మార్గములో చరించే వాడు సాధువు, లేదా సజ్జనుడు. అలాంటి వారిని పరిరక్షించడం అవతార ప్రయోజనాలలో మొదటిది. సన్మార్గంలో చరించేవారు సాధువులు కనుక,





అలాంటి సాధువులను పరిరక్షించడమే సాధు పరిరక్షణము ***(సాధూనాం సన్మార్గస్థానాం, పరిత్రాణాయ పరిరక్షణాయ).***

సన్మార్గంలో ప్రవర్తించే వాళ్ళు సాధువులు. అయితే ఏది సన్మార్గము? ఎవరి మార్గము వారికి సన్మార్గము గానే కనిపిస్తుంది. లేకపోతే, ఇన్ని మతాలు ఎలా పుట్టుకొచ్చాయి? సన్మార్గము అంటే ధర్మమార్గము. ఏది ధర్మమార్గము? ఒకొక్క కాలానికి ఒకొక్క ధర్మము, ఒకొక్క దేశానికి ఒకొక్క ధర్మము. ధర్మనిర్ణయం ఇదమిత్థంగా తేలే విషయ మేనా?

ఇదంతా వ్యావహారిక ధర్మము. ఇక్కడ ధర్మము అంటే, న్యాయము లేదా నియతి అని అర్థం చేసుకోవాలి. ఈ సృష్టిలో నియతి ఉంది. అదే ఇక్కడ ధర్మం. ధర్మరూపంలో ఉన్నది దైవమే. ధర్మమార్గంలో ప్రవర్తించడము అంటే దైవమార్గంలో పయనించడ మని అర్థము. నియతిని అనుసరిస్తూ జీవించేవాడు సాధువు ***(న్యాయవర్తీ సాధుః).*** కనుక సాధువులు అంటే సన్యాసులు అని కాదు. ధర్మజీవనం సాగించే వారు అని అర్థము. సన్యాసులు ధర్మజీవనాన్ని సాగిస్తారు. కాని, ధర్మజీవనంలో ప్రయాణం చేసే వాళ్ళందరూ సన్యాసులు కానవసరం లేదు.

మరి, న్యాయవర్తు లైన సాధుజనులు ధర్మమార్గాన చరిస్తూనే ఉంటారు కదా! అలాంటి వారిని పరిరక్షించ వలసిన అవసరం ఏమిటి? వారికి మార్గంలో రక్షణ కరువై ఉండాలి. భద్రత లోపించి ఉండాలి. సాధువుల అభద్రతకు ఎవరు కారణమై ఉంటారు? సాధువులకు అభద్రతను, అవరోధాలను కలిగించేవారు అసాధువులై ఉండాలి. పాపాత్ములై ఉండాలి. సాధువులను పరిరక్షించే పవిత్రకార్యంలో పాపులను నిర్మూలించ వలసిన అవసరం ఉంది కనుక, ఇది అవతార వైభవంలో ప్రాప్తించే రెండవ ప్రయోజనము. దుష్కృతులైన పాపాత్ముల యొక్క ***(పాపకారిణాం)*** వినాశము ***(వినాశాయ)*** అవతారము యొక్క రెండవ కార్యము.

**పాప వినాశము**

పాపకార్యాలు ఆచరించే వాళ్ళను నశింప చేయడ మంటే పాపాన్ని నశింప చేయడమని అర్థము. నశింప బడేది పాపి కాదు. పాపము. సాధు పరిరక్షణము ఎంత అవసరమో, పాపి వినాశము కూడా అంతే అవసరము. ధర్మమార్గంలో అవరోధంగా మారిన పాపులను తొలగించక పోతే, సాధుజీవనము ముందుకు సాగదు. సాధుజీవనం కుంటుపడితే, సమాజం కుదుట పడదు. సమాజ అభ్యుదయం సాధుజీవనంపై ఆధారపడి ఉంది కనుక, సాధుజీవనానికి ఆటంకంగా తయారైన పాపుల్ని ఏరి వేయాలి. తీసి దూరంగా పారేయాలి.

దేహంలో ఒక అవయవం కుళ్ళిపోతే, ఆ దుష్టాంగాన్ని వైద్యులు శస్త్రచికిత్స చేసి తొలగిస్తారు. అలా చేస్తేనే, వ్యక్తి బ్రతుకుతాడు. ఒకవేళ దుష్టాంగాన్ని తొలగించకుండా, అలాగే ఉంచితే దేహమంతా కుళ్ళిపోయే ప్రమాదం, తద్వారా మరణప్రాప్తి కలుగ వచ్చు. కనుకనే, వైద్యుడు దుష్టాంగాన్ని నిర్మూలించినట్లు, నారాయణుడు వైద్యుని పాత్రను పోషించి, సమాజం లోని పాపాన్ని నిర్మూలించి అభ్యుదయాన్ని ఆరోగ్యప్రదంగా ఉంచుతాడు. అట్టి సమాజంలో ధర్మం శోభిస్తుంది. ధర్మజీవనం దివ్యంగా ప్రకాశిస్తుంది.

**ధర్మ సంస్థాపనము**

ధర్మమును చక్కగా స్థాపించడమే ధర్మ సంస్థాపనము ***(ధర్మస్య సమ్యక్ స్థాపనం).*** ధర్మమును స్థాపించడము అంటే ధర్మమును స్థిరీకరింప చేయడము లేదా రక్షించడము అని అర్థము. ధర్మమును రక్షించడము అంటే, ధర్మమును ఆచరించే ధర్మాత్ములను రక్షించడము అని భావము. ధర్మాత్ములను రక్షించడము అంటే, ధర్మాత్ముల ధర్మజీవనాన్ని ఆటంక పరచే అధర్మపరులను శిక్షించడమని అర్థము. అధర్మపరులే పాపులు. వారు ధర్మమును అనుష్ఠించరు. పైగా అధర్మములో చరిస్తారు. వారు అధర్మములో

చరించడమే గాక ధర్మమార్గాన చరించే వారికి అవరోధంగా తయా రవుతారు. కనుకనే ధర్మ సంస్థాపనము అనే పవిత్ర కార్యంలో శిష్ట రక్షణముతో పాటు దుష్టశిక్షణము కూడా జరుగుతుంది. ఇదంతా అవతార కార్యము.

ధర్మరూపంలో ఉన్నది దైవమే కనుక, సర్వధర్మాలు పరమేశ్వరునే ఆశ్రయించుకొని ఉన్నాయి. ధర్మము ధర్మి కన్నా వేరుగా ఉండలేదు. సృష్టి లోని ధర్మాలను వీక్షించి నపుడు మన బుద్ధిలో ధర్మి లేక పరమేశ్వరుడు ప్రకాశిస్తాడు. అలాగే పరమేశ్వరుడు అవతరించి నపుడు, ధర్మియైన ఆ దివ్యాత్ముని ప్రతి కదలికలో ధర్మమే గోచరిస్తుంది.

శ్రీరాముడు అవతరించాడు. ధర్మమును తాను స్వయంగా ఆచరించి చూపాడు ***(ధర్మం కరోతి).*** ఇతరులు ఆచరించడానికి ఆదర్శ మయ్యాడు ***(ధర్మం కారయతి).*** ఇదంతా అవతార కార్యంలో దివ్యంగా సాగే ధర్మ సంస్థాపనము.

**సవరించడమా? సంస్కరించడమా?**

ధర్మ సంస్థాపనము అంటే, ధర్మమును సవరించడము అని కూడా కొందరు భావిస్తారు. ఇది చాలా తప్పు. దేశకాలాదులలో నిరుపయోగంగా మారిన ధర్మాన్ని కాలానుగుణంగా సవరించి, స్థాపించడము ధర్మ సంస్థాపనము అని వారి అభిమతం. ఇలాంటి మహత్తర మైన కార్యమును సామాన్యులు చేయలేరు కనుక, భగవంతుడే స్వయంగా అవతరించి ఆ కార్యాన్ని పూర్తి చేస్తాడని వారి విశ్వాసము.

ఇలాంటి వ్యాఖ్యానాలు శాస్త్ర హృదయం తెలియని వారికి వినసొంపు గానే ఉంటాయి. ఈ విధమైన దోషపూరిత వ్యాఖ్యలు ఎంత అయోమయాన్ని సృష్టిస్తాయో శాస్త్రవిదులకే తెలుసు.

ధర్మాన్ని సవరించడానికి దైవం అవతరించడమే వాస్తవ మైతే, మరి, అవతారమూర్తి సవరించే ధర్మాన్ని సృష్టించిం దెవరు? భగవంతుడే కదా! మరి ధర్మాన్ని సృష్టించిన దైవానికి ***(ధర్మకృత్).*** లేదా ధర్మరూపంలో ఉన్న దైవానికి ధర్మం విషయంలో పూర్ణజ్ఞాన ముందా, లేదా? పూర్ణపురుషుడు, పురుషోత్తముడు ఏర్పరచిన ధర్మానికి కాలదోషం పడుతుందా? పడితేనే కదా సవరించాలి? సవరించడానికి అవతరించిన భగవంతుడు, ధర్మమును సృష్టించిన భగవంతుని కన్నా వేరైన వాడా? వేరైతే వీరిరువురిలో భగవంతు డెవరు? ఒక్కరే అయితే, పూర్ణ జ్ఞాన మున్నవాడు కాలదోషం పట్టే ధర్మాన్ని సృష్టిస్తాడా? ధర్మానికి కాలదోషం పడితే, ధర్మరూపంలో ఉన్న దైవానికి కూడా కాలదోషం పట్టినట్లే కదా? అలాంటి భగవంతుడు ఒకవేళ నేడు అవతరించి ధర్మాన్ని సవరిస్తే, అదే ధర్మము భవిష్యత్తులో నిరుపయోగం కాదని చెప్పగలమా? భవిష్యత్తు అంటే ఏమిటి? తరువాత క్షణము కూడా భవిష్యత్తు క్రిందికే వస్తుంది కదా! ఇలా ఏ క్షణమైనా క్షీణించే ధర్మాన్ని సవరించడానికి భగవంతుడు అవతరించ వలసిన అవసరం ఉందా? కొద్దిగా ఆలోచించ గలిగితే ఈ సవరణవాదులు సంస్కరింప బడుతారు.

సవరింప బడటానికి ధర్మ మనేది రాజ్యాంగము కాదు. పరిమిత జ్ఞానము కలవారు సృష్టించింది కాదు. త్రికాల జ్ఞానము లేనివారు తయారు చేసింది కనుక, రాజ్యాంగము కాలానుగుణంగా అనేక సవరణలతో నూతన రూపాన్ని ధరిస్తూ ఉంటుంది. సర్వజ్ఞుడైన పరమేశ్వరునికి సంబంధించిన జ్ఞానము పూర్ణజ్ఞానము కనుక అది సవరణలకు వీలు కాదు. కనుక ధర్మ సంస్థాపనము అంటే, నిరుపయోగ మైన ధర్మాన్ని రాజ్యాంగాన్ని సవరించినట్లు సవరించడం కాదు. ధర్మాన్ని ఉపయోగించుకోలేని సమాజాన్ని ధర్మాన్ని ఆచరించే లాగా సంస్కరించడమే. కనుక ధర్మసంస్థాపనము అంటే, ప్రజలు ధర్మాన్ని ఆచరించేలా చేయడమే. ఆచరించ వలసింది ధర్మము. ఆచరించ కూడనిది అధర్మము. ఆచరించవలసిన ధర్మాన్ని ఆచరించక పోవడమే గాక,





ఆచరించ కూడని అధర్మాన్ని ఆచరించడం వల్ల సమాజం ధర్మజీవనానికి దూరమౌతుంది. ధర్మానికి దూరమైన సమాజము దగా పడుతుంది. నశించి పోతుంది. ఈ పరిస్థితిని చక్క చేయాలి అంటే సర్వజనులు ధర్మమార్గంలో చరించేలా చూడాలి. ఈ విధమైన మంగళకార్యాన్ని నిర్వర్తించడానికే భగవంతుడు అవసరాన్ని బట్టి రూపం ధరించి అవనిపై అవతరిస్తాడు. అవతారమూర్తి స్ఫూర్తితో అధర్మపరులు కూడా ధర్మమూర్తులై శోభిస్తారు. ఈ పవిత్రమైన కార్యాన్ని నిర్వర్తించడానికే తాను ప్రతి యుగం లోను అవతరిస్తూ ఉంటాను అంటున్నాడు ***(తదర్థం సంభవామి, యుగే యుగే ప్రతియుగమ్).***

**యుగ మంటే కాలం**

ప్రతి యుగం లోను తాను అవతరిస్తూ ఉంటాను అన్నాడు భగవంతుడు. అంటే, అవతార మనేది కేవలం ఆ యుగం లోనే రావాలి అని లేదు. ఏ యుగంలో నైనా రావచ్చు. అంతేకాదు. ప్రతి యుగంలో తప్పకుండా రావాలి అని కూడా లేదు. అవసరాన్ని బట్టే అవతారము.

మనం నిర్మించుకున్న గృహం పాడైతే మనం బాగు చేసుకుంటాము. ఎప్పుడు బాగు చేసుకుంటాము? ఎప్పుడు అవసర మొస్తే అప్పుడు బాగు చేసుకుంటాము. ఇదీ అంతే.

సమాజానికి సరియైన ధర్మబోధలు అందుతున్నంత కాలం ప్రజలు ధర్మాన్ని అనుష్ఠిస్తూనే ఉంటారు. ధర్మాచార్యులు, సాధుపురుషులు సన్మార్గాన్ని నిర్దేశిస్తున్నంత కాలం ధర్మజీవనాన్ని జనులు కొనసాగిస్తూనే ఉంటారు. బోధలు అందక పోయినా, లేదా దుర్బోధలు బోధల రూపంలో వ్యాప్తి చెందినా ప్రమాదం వాటిల్లుతుంది. సమాజం ధర్మం విషయంలో సందిగ్ధంలో పడి పోతుంది. ఇలాగే చాలా కాలం కొనసాగితే సమాజం ధర్మం విషయంలో నిర్వీర్యమై నిస్సార మవుతుంది. ఇదే ధర్మగ్లాని. ఇలా భయంకరంగా, బీభత్సంగా తయారైన సమాజాన్ని మరల ధర్మవృక్ష ఛాయలో నిలిపేందుకు మాధవుడు మానవుడై అవతరించి, అనితర సాధ్యంగా ధర్మ సంస్థాపనము గావిస్తాడు.

***త్రాణం*** అంటే రక్షణము. సాధురక్షణము అనే మొదటి ప్రయోజనములో 'త్రాణాయ' అంటే సరిపోతుంది. కాని, 'పరిత్రాణాయ' అన్నాడు భగవంతుడు. 'పరి' అనే ఉపసర్గతో పలికి ఏ ఒక్కరినో కాకుండా అందరినీ రక్షించడం, అంతటా రక్షణ నెలకొల్పడం జరుగుతుందని సూచించాడు ***(పరితః త్రాణమ్).***

***నాశః*** అంటే నాశము. దుష్ట శిక్షణము అనే రెండవ ప్రయోజనములో 'నాశాయ' అంటే సరిపోతుంది. కాని, భగవంతుడు 'వినాశాయ' అన్నాడు. నాశము అంటే నశించడం అని అర్థము. వినాశము అంటే సమూలంగా, కారణ సహితంగా నశించడము అనే అర్థాన్ని సూచిస్తూ 'వినాశాయ' అన్నాడు.

**స్థాపనము** అంటే స్థాపించడం. ధర్మ సంస్థాపనము అనే మూడవ ప్రయోజనములో 'స్థాపనార్థాయ' అంటే సరిపోతుంది. కాని 'సంస్థాపనార్థాయ' అన్నాడు భగవంతుడు. 'సం' అంటే సమ్యక్ అని అర్థం. అంటే, బాగుగా, చక్కగా అని భావము. అనంతుడు అవతార మెత్తి నపుడు ధర్మం పూర్ణంగా స్థాపింప బడుతుంది అనే అర్థాన్ని సూచిస్తూ 'సంస్థాపనార్థాయ' అన్నాడు.

**ఆఖ్యాయిక**

పూర్వం ఒక రాజు గారికి భగవంతుడు అవతరించడం అనే విషయం అస్సలు నచ్చేది కాదు. భగవంతు డేమిటి, అవతరించడం ఏమిటి? విశ్వంలో ధర్మాన్ని చక్కబెట్టాలి అనుకుంటే, ఆయనే దిగి రావాలా? రాజ్య పరిపాలనలో తనకే ఎందరో సహకరించి తన ఆజ్ఞలను పాటిస్తూ, పరిపాలనా వ్యవహారాలను చక్కబెడు తున్నప్పుడు, ఈ విశ్వ యంత్రాంగంలో పరమేశ్వరుని ఆజ్ఞలను పాటించే వారే లేరా? అని వితండంగా

వాదిస్తూ ఉండేవాడు. ఆయన వాదన ఎవ్వరికీ నచ్చక పోయినా, ప్రభువు కావడం చేత ఎవ్వరూ ప్రతివాదం చేసేవారు కారు.

మంత్రి గారు మంచి భక్తుడు. నైష్ఠికుడు. శాస్త్ర పాండిత్యం కలవాడు. రాజు గారి వైఖరి తనకు నచ్చక పోయినా, తనలో తాను మథన పడేవాడే గాని రాజు గారిని వారించే వాడు కాడు.

సాయంత్రాలలో గంగానదిలో నౌకా విహారం చేయడం రాజుగారికి సరదా. మంత్రి గారిని, కొందరు పండితులను నావలో ఎక్కించుకొని శాస్త్ర చర్చ చేస్తూ విహరించడం అలవాటు.

ఒకరోజు సాయంత్రం అందరూ కలిసి నదిలో నౌకా విహారం చేస్తూ ఉన్నారు. శాస్త్ర చర్చ జరుగుతూ ఉంది. ఇంతలో ఆ నౌక లోనే తమతో పాటు విహరిస్తున్న రాజుగారి ఐదేళ్ళ కుమారుడు పట్టు తప్పి నదిలో పడి పోయాడు.

అయ్యో, అయ్యో! బాబు పడిపోయాడు! అంటూ మంత్రి బిగ్గరగా అరిచాడు. అంతే. వెంటనే రాజుగారు నది లోకి దూకి, మునిగి పోతున్న కుమారుణ్ణి ఎత్తుకొని, ఈదుకుంటూ వచ్చి నావ నెక్కాడు. తీరా చూస్తే, రాజుగారి చేతిలో ఉన్నది పిల్లవాని ప్రతిమ మాత్రమే! పిల్లవాడు కాడు. రాజకుమారుడు మంత్రిగారి వెనుక కూర్చుని కనిపించాడు. విషయం అర్థం గాక, రాజు నివ్వెర పోయాడు.

ప్రభూ! క్షమించండి. మీ బిడ్డ ఇక్కడే మా వద్ద క్షేమంగా ఉన్నాడు. నదిలో పిల్లవాడి బొమ్మను మీరు చూడకుండా పడేసింది మేమే. మీ బిడ్డ నదిలో పడిపోయాడు అనగానే మీరే ఎందుకు నది లోకి దూకారు? నది లోకి దిగి మీ బిడ్డని కాపాడటానికి ఇంత మంది నావలో ఉన్నా, మీరే ఎందుకు రంగం లోకి దిగారు? మమ్మల్ని ఆజ్ఞాపించ వచ్చు కదా! ఆలోచించండి.

మీ బిడ్డపై ఉన్న ప్రేమ చేత ముందు వెనుక చూడకుండా మీరే ఎలా నది లోకి దూకారో, తన బిడ్డ లైన భక్తుల మీద ఉండే ప్రేమ వల్ల భగవంతుడు కూడా తానే స్వయంగా అవతరిస్తాడు అని వినయంగా పలికి మంత్రి తల దించుకున్నాడు. రాజు తన తప్పును తెలుసుకొని పశ్చాత్తాపం చెందాడు. భగవంతుని అవతారానికి హేతువు ప్రేమే అని గ్రహించాడు.

*భగవంతుని అవతార వైభవము, అవతారము సాధించే ప్రయోజనాలు తెలిశాయి. వీటిని తెలియడం వల్ల మన కేమి ప్రయోజనం? చెబుతున్నాడు.*

**జన్మ కర్మ చ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వత: ।**
**త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున ॥** 9

**జన్మ-కర్మ-చ-మే-దివ్యం-ఏవం-యః-వేత్తి-తత్త్వతః**
**త్యక్త్వా-దేహం-పునః-జన్మ-న-ఏతి-మాం-ఏతి సః-అర్జున**

| | | | | | |
|---|---|---|---|---|---|
| అర్జున | = | అర్జునా! | ఏవం | = | ఈ విధముగా |
| యః | = | ఎవడు | తత్త్వతః | = | యథార్థముగా |
| దివ్యం | = | దివ్యమైన | వేత్తి | = | తెలుసుకుంటాడో |
| మే | = | నా యొక్క | సః | = | ఆ పురుషుడు |
| జన్మ | = | జన్మమును | దేహం | = | దేహమును |
| కర్మ చ | = | కర్మమును | త్యక్త్వా | = | విడిచి |





| | | | | | |
|---|---|---|---|---|---|
| పునః | = | తిరిగి | మాం | = | నన్నే |
| జన్మ | = | జన్మమును | ఏతి | = | పొందుతాడు |
| న ఏతి | = | పొందడు | | | |

**అర్జునా! నా జన్మము, నా కర్మము దివ్యములు. ఈ విధంగా నా యదార్థ స్వరూపాన్ని తెలుసుకున్న వాడు తనువును చాలించిన తరువాత తిరిగి పుట్టడు. నన్నే చేరి పోతాడు.**

### వ్యాఖ్య

మానవుడు ఎప్పుడైనా పుట్టిన వాడే. ప్రతి మనిషికి పుట్టుక ఉంది. పుట్టిన వాడు ఎవడైనా మరణించ వలసిందే. ఈ జన్మమృత్యువుల మధ్య మానవుడు సాగించే జీవనమే జీవితము. జీవనము అంటే ఏదో కాదు. కర్మలను ఆచరిస్తూ, కర్మఫలాలను అనుభవిస్తూ, ద్వంద్వాల ఊయలలో ఊగుతూ బ్రతకడమే జీవితము.

మనం జీవిస్తున్నాం. మనతో పాటు మరెందరో జీవిస్తున్నారు. వారందరితో మనకు సంబంధాలు లేవు. కొందరితో మాత్రమే సంబంధా లున్నాయి. ఎవరితో మనకు సంబంధాలున్నాయో, వారిని అర్థం చేసుకుంటూ మనం జీవనయాత్రను సాగిస్తూ ఉంటాము. అలాగే మనతో సంబంధం కలిగియున్న వారు మనల్ని అర్థం చేసుకోవాలని ఆశిస్తూ ఉంటాం. విచిత్ర మేమిటంటే, ఈ ప్రపంచంలో ఎవరూ ఎవరికీ అర్థం కారు. ఎందుకని? అర్థం చేసుకోదగిన వారు కారు కనుక. ఎవరు ఎవరిని అర్థం చేసుకున్నా సాధించేది ఏమీ ఉండదు కనుక.

నన్నెవ్వరూ అర్థం చేసుకోరు అని మనిషి విచారిస్తూ ఉంటాడే గాని, ఎందుకు అర్థం చేసుకోవడం లేదో తాను అర్థం చేసుకోడు. తనను అర్థం చేసుకున్నా ఇతరులకు ఒరిగేది ఏమీ ఉండదని తెలుసుకోలేడు.

క్షణక్షణం మారే మనిషిని, ప్రతిక్షణం మారే మనస్సును అర్థం చేసుకొని సాధించే దేముంటుంది? మార్పును ప్రక్కన పెట్టినా, మనిషి మరొక మనిషిని అర్థం చేసుకొని మాత్రం ఏమి సాధిస్తాడు? ఎవరిని అర్థం చేసుకోవాలని మనిషి ప్రయత్నిస్తున్నాడో, అతడు ఒకవేళ అర్థమైనా, అర్థం చేసుకొనే వాడి కన్నా అన్యమైన వాడుగా అర్థ మవుతాడు. అలాంటి వాణ్ణి అర్థం చేసుకొని మాత్రం నువ్వు ఏమి సాధిస్తావు?

అతని జీవితం వేరు, నీ జీవితం వేరు. ఒకరి పుట్టుక మరొకరి పుట్టుక ఒకటి కాదు. ఆలోచనా విధానం ఒకటి కాదు. జీవనరీతి ఒకే విధంగా ఉండదు. భేదాలలో తల దూర్చి గ్రహించే బోధ ఏముంటుంది? భేదంతో తయారైన బంధం భేదజ్ఞానంతో పోతుందా?

మనిషి ఆవిర్భవించినట్లే భగవంతుడు అవతరిస్తాడు. మనిషి ఆచరించినట్లే భగవంతుడు కర్మలు ఆచరిస్తాడు. మనిషి యొక్క జన్మకర్మల్ని తెలుసుకుని మనం సాధించేది ఏమీ ఉండదు. అలా కాక, భగవంతుని అవతారము యొక్క దివ్యమైన జన్మకర్మల్ని అర్థం చేసుకుంటే, మనం పొందవలసింది అంతా పొందుతాము. అంతేకాదు. సర్వబంధాల నుండి ముక్తులై తరిస్తాము. ఈ సత్యాన్ని బుద్ధికి పట్టిస్తున్నాడు భగవంతుడు. పరమేశ్వరుని అవతారము లోని జన్మకర్మలు దివ్యమైనవి అంటున్నాడు.

**జన్మ వైశిష్ట్యము**

భగవంతుడు అవతరించడము అంటే భగవంతుడు జన్మించడం అని అర్థము. జన్మ అనేది అవతార మూర్తికీ ఉంది. మనకూ ఉంది. జన్మ అంటే పుట్టడం. ఏది పుట్టినా, ఎవరు పుట్టినా పుట్టడము అంటే, అంతవరకు లేనిది అగుపించడము అని అర్థము. లేనిది రావడం పుట్టుక కావచ్చు. అంతమాత్రాన అలా లేకుండా వచ్చింది కారణం లేకుండా వచ్చింది మాత్రం కాదు.

నరుడు పుడుతాడు. కాని, పుట్టుక విషయంలో నరునికి స్వేచ్ఛ లేదు. తాను అభిలషించినట్లు జన్మించలేదు.

అందుచేతనే 'ఇక్కడ పుట్టకుండా ఉంటే బాగుండేది - ఇలా పుట్టకుండా ఉంటే బాగుండేది' అని పుట్టిన తరువాత మనిషి చింతిస్తూ ఉంటాడు.

ప్రతి జీవి పుట్టుకకు కారణం ఉంది. ప్రతి మనిషి పుట్టుక వెనుక ప్రారబ్ధం ఉంది. గతంలో చేసిన కర్మలు ఉన్నాయి. వాటి ఫలాలను అనుభవించడానికి మనిషి పుట్టి తీరాలి. ప్రారబ్ధాధీనమైన దేహము ప్రారబ్ధాన్ని అనుభవించడానికి అనుకూలమైన ప్రదేశం లోనే పుడుతుంది. ప్రారబ్ధాన్ని అనుభవిస్తూ మనిషి మళ్ళీ నూతనంగా కర్మలు చేస్తాడు. వాటి ఫలితాలు ఆగామి రూపంలో ఎదురు చూస్తూ ఉంటాయి కనుక, రాబోయే జన్మలకు ఈ జన్మ లోనే బీజాలు పడి భవిష్యత్తులో జన్మించడం జరుగుతుంది.

భగవంతుని జన్మ మన లాంటిది కాదు. ఆయన అవతరించడం వెనుక ప్రారబ్ధం లేదు. భగవంతుని దేహము ప్రారబ్ధానుభవం కొరకు రాలేదు. కనుకనే, మన లాగా భగవంతునికి గర్భవాసం గాని, గర్భవాస దుఃఖం గాని ఉండవు. ఆయన జన్మ స్వతంత్ర మైంది. స్వేచ్ఛాకృత మైంది. ఎక్కడైనా ఆవిర్భవించ గలడు. ఏ రూపంలో నైనా అగుపించ గలడు. గతంలో ఆచరించిన కర్మల యొక్క ఫలాలను అనుభవించడానికి వచ్చిన శరీరం కాదు ఆయనది. ఆ శరీరం ద్వారా ఆచరింపబడే కర్మలు ఆగామిని సృష్టించి, భవిష్య జ్జన్మలకు కారణం కాలేవు. పుణ్యపాపాలతో ముడిపడ్డ జన్మ కాదది. అందుకే అది అవతారము. లౌకికమైంది కాదు. అలౌకికమైంది. ఈశ్వర సంబంధమైంది. మాయారూప మైంది. లీలాస్వరూప మైంది. కనుకనే తన జన్మ దివ్యమైంది అంటున్నాడు జగన్నాథుడు.

***దివ్*** అనే ధాతువు ప్రకాశించుట అనే అర్థాన్ని సూచిస్తుంది. ***దీవ్యతి*** అంటే ప్రకాశించు చున్నది అని అర్థము. ఈ ప్రకాశం కూడా అలౌకిక మైంది. ఈశ్వర సంబంధ మైంది ***(అప్రాకృతమ్ ఐశ్వరమ్).***

లోకంలో ఏది ప్రకాశించినా, ఎవరు ప్రకాశించినా మరొక దానిపై ఆధారపడి ప్రకాశించడమే జరుగుతుంది. కాని, భగవంతుని ప్రకాశము మరొక దానిపై ఆధారపడింది కాదు. అది స్వప్రకాశము. పూర్ణానంద స్వరూపము. జ్ఞాన స్వరూపము. బ్రహ్మ స్వరూపము. చైతన్య రూపము ***(దీవ్యతి, ద్యోతతే).*** కనుకనే స్వేచ్ఛతో సృష్టిలో చరిస్తుంది ***(క్రీడతి సర్గాదిభిః).*** తనలో తాను రమిస్తుంది. అందుచేతనే, స్వేచ్ఛాకృతమైన ఈశ్వరుని అవతారము దివ్యం అని కీర్తించ బడింది.

ఈ విధంగా ఆవిర్భవించడం మరొకరికి సాధ్యం కాదు. ఈశ్వరునికే సాధ్యం కనుక అది అప్రాకృతం లేదా అలౌకికం. దివ్యలీలా వైభవం. జగదీశ్వరుని జన్మ వైశిష్ట్యం. పుట్టుక లేనివాడు అయినా ***(అజోఽపి సన్)*** పరానుగ్రహార్థం పుట్టినట్లు అగుపించడం, దివ్యమైన కర్మలను ఆవిష్కరించడం ఈశ్వర వైభవం.

**కర్మ వైభవము**

ప్రారబ్ధం లేకుండా అవతరించిన వాడు కనుక స్వకర్మ అంటూ లేనివాడు. దివ్యమైన చైతన్యరూపుడు కనుక తాను అకర్త. పుట్టుక లేనివాడైనా పుట్టినట్లు ఎలా గోచరిస్తున్నాడో, అకర్తే అయినా కర్మలలో చరిస్తూ కనిపిస్తున్నాడు. కనుకనే, అవతారమూర్తి ఆచరించే కర్మలు కేవలం లోక కళ్యాణాన్నే ఆవిష్కరిస్తున్నాయి. ఆయన కర్మలు వాంఛాప్రేరితాలు కావు. ధర్మస్వరూపాలు. దివ్యచలనాలు. సాధుజన రక్షకాలు. దుష్టజన శిక్షకాలు. ధర్మసంస్థాపకాలు. కనుకనే, తన జన్మ లాగే పరిత్రాణాది కర్మలు కూడా దివ్యమైనవి అంటున్నాడు భగవంతుడు ***(జన్మమాయా రూపం, కర్మ చ పరిత్రాణాది, మే మమ, దివ్యమ్ అప్రాకృతమ్ ఐశ్వరమ్).***

ఈ సత్యం అర్థమైతే భగవంతుడు పుట్టకనే ఎలా పుడుతాడో, చేయకనే ఎలా చేస్తాడో సుస్పష్ట మౌతుంది. ఇదే ఈశ్వరజ్ఞానము. బ్రహ్మజ్ఞానము. బ్రహ్మాత్మజ్ఞానము. అంటే, ఆత్మయే బ్రహ్మము అనే అద్భుతమైన





అద్వయజ్ఞానము. ఈ విధంగా ***(ఏవం యథా ఉక్తం)*** ఎవడైతే తెలుసుకుంటాడో ***(యః వేత్తి)*** అతడు బ్రహ్మజ్ఞానంతో శోభిస్తాడు. బ్రహ్మమును తెలుసుకోవడం సాధన అయితే, తానే బ్రహ్మము అని తెలియడం సాధ్యం. అదే సిద్ధి లేదా మోక్షము.

**జ్ఞాన ప్రకాశము**

భగవంతుని జన్మకర్మలు ఎవరికి అర్థమైతే, వారికి భగవంతుడు అంటే ఏమిటో తెలుస్తుంది. భగవంతుని జ్ఞానం కలుగుతుంది. బ్రహ్మజ్ఞానము సిద్ధిస్తుంది. ఏమిటి ఇక్కడ బ్రహ్మజ్ఞాన మంటే? దివ్యమైన బ్రహ్మము ***(దీవ్యతి, ద్యోతతే)*** అందరిలోనూ ఆత్మగా ప్రకాశిస్తూ ఉన్నాడని బోధపడటమే ***(ఆత్మయా ద్యోతతే).*** సర్వులలో శోభించే దివ్యచైతన్యము బ్రహ్మచైతన్యమే అని తెలియటమే. అందరిలో క్రీడించే ఆత్మచైతన్యము బ్రహ్మమే నని గ్రహించటమే ***(సర్వభూతేషు వ్యవహరతి, ఆత్మరూపేణ).*** కనుక దివ్యమైన జన్మకర్మలు గల భగవంతుని తెలుసుకున్న వాడు, తాను ఆత్మగా భగవంతుని కన్నా అన్యమైన వాడు కాడు అని కూడా తెలుసుకుంటాడు. బ్రహ్మమును తెలుసుకున్న వాడు బ్రహ్మమే అవుతున్నాడు ***(బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి).***

బ్రహ్మజ్ఞానము అంటే, బ్రహ్మము ఒక్కటే సత్యము అనే జ్ఞానము. బ్రహ్మము కన్నా అన్యంగా ఏదీ లేదు అనే జ్ఞానము. జీవేశ్వరులకు సంబంధించిన అభేదజ్ఞానము. కనుక బ్రహ్మమును యథాతథంగా ***(తత్త్వతః తత్త్వేన యథావత్)*** ఎవడైతే తెలుసు కుంటున్నాడో వాడు తానే బ్రహ్మము అనే అపరోక్ష జ్ఞానాన్ని పొందుతున్నాడు.

నిరాకారుడు నరాకారుడుగా అవతరించి, నరాకారు డైన జీవుడు నిరాకారుడైన బ్రహ్మమే అనే జ్ఞానాన్ని కలిగించడం జరుగుతూ ఉంది. మాధవుడు మానవుడుగా అవతరించి, మానవుడు మాధవుడే అనే జ్ఞానాన్ని ప్రసాదిస్తున్నాడు.

ఈ సత్యాన్ని గ్రహించిన వాడు భగవంతుడు పుట్టేవాడు కాడని, అలాగే గిట్టేవాడూ కాడని గ్రహిస్తాడు. ఆయన జన్మము మాయా రూపమని అర్థం చేసుకుంటాడు. బంధము కల్పితము అనే నిర్ణయానికి వస్తాడు. బంధమే లేనపుడు మోక్ష మెవరికి? అని ప్రశ్నించుకుంటాడు. మోక్షం లేకపోతే కదా పొందాలి? మోక్షం ఉన్నదే. ఎప్పుడూ ఉన్నదే. ఇదే నిత్యమోక్షం.

భగవంతుని జన్మ ఎలాగైతే మాయారూపమో, తాను భగవంతుని కన్నా అన్యంగా లేడు కనుక తన జన్మ కూడా మాయారూపమే. తన ద్వారా దివ్యమైన కర్మలు ఆవిష్కరింపబడినా పరమేశ్వరుడు ఎలాగైతే అకర్తగా ఉన్నాడో, ఆత్మరూపు డైన తాను కూడా అకర్తే అని గ్రహిస్తాడు. ఈశ్వరుని జన్మకర్మలు తెలిస్తే, తానే ఈశ్వరుడని అర్థ మవుతుంది. ఇదే మోక్షం.

**వచ్చిం దెప్పుడు? పోయే దెవరు?**

కుండలో ఆకాశ ముంది. కుండ లోని ఆకాశానికి ఆలోచనలు కదిలితే, నేను కుండలో ఉన్న ఆకాశాన్ని. కుండలో బంధింపబడిన ఆకాశాన్ని ***(ఘటాకాశోఽహం)*** అని తలపోసు కుంటుంది. అంతేకాదు. ఘటానికి వెలుపల నున్న విశా లాకాశాని కన్నా తాను అన్యంగా ఉన్నట్లు భావించు కుంటుంది. పరిమితమైన తన మనుగడను తలపోసుకొని తపిస్తుంది. పరితపిస్తుంది.

అసలు ఆకాశ మంటే ఏమిటో కుండ లోని ఆకాశానికి అర్థమైతే, ఆకాశము ఎప్పుడూ పరిమితంగా లేదని, ఎక్కడా పరిమితంగా లేదని అర్థం చేసుకుంటుంది. విశాల మైన ఆకాశం అనంతమైన దని బోధ పడినపుడు ఆకాశంలో పరిచ్ఛిన్నత్వం లేదని స్పష్ట మౌతుంది. అలాంటప్పుడు కుండలో ఉన్నా, తాను కుండకు పరిమితంగా లేనని, వాస్తవానికి కుండే తనలో ఉన్నదని తెలుసుకుంటుంది.

విశాల మైన ఆకాశాన్ని యథాతథంగా అర్థం చేసుకోవడం వల్ల ఆకాశం యొక్క అపరిచ్ఛిన్నత్వం అర్థం కావడమే గాక, కుండలో ఉన్నప్పటికి తాను కూడా అనంతమే అనే అద్వితీయ జ్ఞానం ఘటాకాశానికి కలిగినట్లు, అవతారమూర్తి యొక్క దివ్యమైన జన్మకర్మల్ని యథాతథంగా అర్థం చేసుకోవడం వల్ల, అజరామర మైన పరమేశ్వరుని అద్వయస్థితి అర్థం కావడమే గాక, దేహంలో ఉన్నప్పటికీ ***(పిండస్థః అపి)*** తాను ***(ప్రత్యగాత్మా)*** అద్వయాత్మే అనే అద్వైతజ్ఞానం ***(సర్వవ్యాపీ భవతి)*** జీవునికి కలుగుతుంది.

అంతేకాదు. అన్ని కుండల లోని ఆకాశము, అన్ని గదుల లోని ఆకాశము తన లాగే అనంతము అనే జ్ఞానం కలిగిన ఘటాకాశానికి భేదదృష్టి నశిస్తుంది. అలాగే జ్ఞానము కలిగిన జీవుడు సర్వప్రాణులను తన లాగే భావిస్తాడు. సర్వులలో తననే దర్శిస్తాడు ***(ఆత్మైకత్వ దర్శన నిష్ఠః భవతి).*** ఇదంతా అవతారమూర్తి వైభవాన్ని అర్థం చేసుకోవడం వల్ల ప్రాప్తిస్తుంది ***(బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి).***

ఇప్పుడు చెప్పండి. కుండ లోకి ఆకాశం వచ్చిం దెప్పుడు? వచ్చే గనుక ఉంటే, ఆకాశానికి జన్మ ఉందని అంగీకరించవచ్చు. అలాగే, కుండ పగిలి నప్పుడు ఆకాశం కుండ నుండి దూరంగా పోయిందా? పోయే ఉంటే ఆకాశానికి మృత్యువును అంటగట్ట వచ్చు. ఆకాశానికి జన్మ లేదు. ఆకాశానికి మృత్యువు రాదు. ఆకాశం వచ్చిందీ లేదు. పోయేదీ ఉండదు. ఆకాశానికి జన్మమృత్యువులు ఆరోపాలే గాని స్వరూపాలు కావు. అవతారమూర్తికి కూడా అంతే. నీవు అవతారమూర్తి కన్నా వేరుగా లేవు కనుక నీవూ అంతే.

సత్యం అర్థమైన ఘటాకాశానికి ఘటభంగం జరిగిన తరువాత పునర్జన్మ ఉండదు. ఇంతవరకు నేను ఘటాకాశాన్ని అని భావించినదే ఇప్పుడు విశాలాకాశాన్ని పొంది తరిస్తుంది. విశాలాకాశాన్ని పొందడము అంటే, తాను ఎప్పుడూ విశాలాకాశమే అనే జ్ఞానాన్ని పొందడము అని భావము.

అలాగే బ్రహ్మజ్ఞానం కలిగిన వానికి దేహం నశించిన తరువాత పునర్జన్మ ఉండదు ***(త్యక్త్వా దేహం పునః ఉత్పత్తిం న ప్రాప్నోతి).*** ఇంతవరకు తాను జీవుడని, దేహి అని భావించిన వాడు పరమాత్మను పొంది తరిస్తాడు. పరమాత్మను చేరుతాడు ***(మామ్ ఏతి ఆగచ్ఛతి).*** పరమాత్మను పొందడము అంటే, తానే పరమాత్మ అనే జ్ఞానాన్ని పొందడము అని భావము. ఇదే ముక్తి లేదా మోక్షము. ఈ విధంగా అవతారమూర్తి యొక్క వైభవాన్ని అవగతం చేసుకున్న సాధకుడు తానే బ్రహ్మమనే జ్ఞానమును పొంది, సర్వబంధముల నుండి విడిపడు తున్నాడు ***(ముచ్యతే).***

మరొక విషయాన్ని ఇక్కడ జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. దేహానంతరము పరమేశ్వరుని పొందడము అంటే, మరణించిన తరువాత అని కాదు. దేహాత్మభావము పోగానే అని అర్థం. దేహానంతరము అనడం వెనుక ఉద్దేశం మరొక దేహము రాదు అని తెలియ జేయడమే గాని, మరణానంతరమే మోక్షము అని కాదు. జ్ఞానము ఏదైనా బుద్ధికే కలగాలి. బుద్ధి బ్రతికున్న వానిలో ఉంటుందే గాని చచ్చిపడి ఉన్న దేహంలో కాదు. జీవించి ఉన్న వానికి జ్ఞానము కలిగింది అంటే, ఆ క్షణాన్నే అతడు ముక్తు డయ్యాడని అర్థం. అదే జీవన్ముక్తి.

**అహం బ్రహ్మేతి నియతం మోక్షహేతుః మహాత్మనామ్**

'నేనే బ్రహ్మమును' అను భావమే నియమంగా మహాత్ములకు మోక్ష కారణమై ఉంది అని పైంగలోపనిషత్తు నిర్ణయము.





*ఇది మోక్షమార్గం. నేడు ప్రత్యేకంగా రూపొందించింది కాదు. ఈ మార్గంలో చరించి గతంలో ఎందరో తరించారు. తరించాలని అభిలషించే ముముక్షువు లందరూ ఈ మార్గం లోనే పయనించాలి. మరి, పూర్వీకులు ఎలా తరించారు? చెబుతున్నాడు.*

**వీతరాగ భయక్రోధా మన్మయా మా ముపాశ్రితాః ।**
**బహవో జ్ఞాన తపసా పూతా మద్భావ మాగతాః ॥** 10

***వీతరాగ భయక్రోధాః-మన్మయా-మాం-ఉపాశ్రితాః***

***బహవః-జ్ఞానతపసా-పూతాః-మద్భావం-ఆగతాః***

| | | | |
|---|---|---|---|
| వీత రాగభయక్రోధాః | = అనురాగము, భయము, క్రోధమును విడిచిన వారు | బహవః | = అనేకులు |
| మన్మయా | = నా యందే భావన గల వారు | జ్ఞానతపసా | = జ్ఞాన మనెడి తపస్సు చేత |
| మాం | = నన్ను | పూతాః | = పవిత్రులై |
| ఉపాశ్రితాః | = ఆశ్రయించిన వారు | మద్భావం | = నా స్వరూపమును |
| | | ఆగతాః | = పొందిరి |

**నన్ను ఆశ్రయించిన చాలా మంది జ్ఞాన మనే తపస్సు చేత పవిత్రులై నా స్వరూపాన్ని పొంది తరించారు. వారు రాగ భయ క్రోధాదుల్ని తుద ముట్టించారు. వారికి నేనే అంతా.**

**వ్యాఖ్య**

జ్ఞానము కాలానికి పరిమితం కాదు. కాలము జ్ఞానము లోనే ఉంటుంది. జ్ఞానము చేతనే తెలుస్తుంది. భగవంతుడు జ్ఞానస్వరూపుడు. కనుక కాలానికి పరిమితం కాడు ***(కాల అపరిచ్ఛిన్నత్వాత్).*** ఆయన పరిమితుడు కాడు కనుక ఆయన జ్ఞానం కూడా పరిమితం కాదు. ఇప్పుడున్న పరమేశ్వరుడు ఎప్పుడూ ఉన్నవాడే. పూర్వం కూడా ఉన్నవాడే. కనుక ఆయన పురాతనుడు ***(పురా అపి భవతి ఇతి పురాతనః).*** ఈశ్వరుడు, ఈశ్వరజ్ఞానం రెండు కావు కనుక పురాతనుడైన పరమేశ్వరునికి సంబంధించిన జ్ఞానము కూడా పురాతనమే. కనుకనే, తాను ప్రబోధిస్తున్న ఈ జ్ఞానము పురాతన మైనదని ఈ అధ్యాయం ప్రారంభం లోనే ప్రస్ఫుటం చేశాడు ***(యోగః ప్రోక్తః పురాతనః).***

జ్ఞానము పవిత్ర మైంది. జలము ఎవరి దేహాన్నైనా శుద్ధి చేస్తుంది. జ్ఞానము ఎవరి నైనా పవిత్రుల్ని చేస్తుంది. నేడు ఈ మార్గాన్ని అనుసరించేవారు పవిత్రులై తరించునట్లే, గతంలో కూడా ఈ పురాతనమైన జ్ఞానము ఎందరినో పునీతుల్ని చేసింది ***(బహవః జ్ఞానతపసా పూతాః).*** వారు ఎలా తరించారో చెబుతున్నాడు.

మొదట రాగము నుండి, భయము నుండి, క్రోధము నుండి విడిపడ్డారు ***(వీతరాగభయక్రోధాః).*** భగవత్స్వరూపు లయ్యారు. భగవన్మయు లయ్యారు ***(మన్మయాః).*** భగవంతుణ్ణే ఆశ్రయించారు ***(మాం పరమేశ్వరం ఉపాశ్రితాః).*** జ్ఞానమనే తపస్సు చేత పవిత్రు లయ్యారు ***(జ్ఞానమేవ తపః తేన పూతాః).*** భగవత్స్వరూపాన్నే పొందారు ***(మద్భావం ఆగతాః).*** పవిత్రమైన ఈ మార్గాన్ని చక్కగా విశ్లేషించుకొని, మన పూర్వీకుల వలె మనమూ చరించి తరించాలి.

**రాగోదయం**

విషయముల యందలి ఆసక్తియే రాగము. ప్రాపంచిక విషయాలను తదేకంగా చింతించడం చేత లేదా వాటిని అనుభవించుట చేత, విషయాల యందు మనస్సుకు రాగం ఏర్పడుతుంది. అలాంటి రాగము గల

మనస్సుకు విషయాలు కనిపించ గానే ఆసక్తి ఉదయిస్తుంది. వాటిపై ఆశ జనిస్తుంది. రాగము చేత దూషిత మైన చిత్తము పరమేశ్వరుని చింతించుటకు పనికి రాదు. రాగకలుషిత మైన చిత్తాన్ని శుద్ధి చేసుకోవాలి.

విషయసుఖాలు విచిత్రంగా ఉంటాయి. ప్రపంచంలో విషయాలు ఉంటాయే గాని సుఖాలు ఉండవు. విషయాలకు సుఖాలను అంటగట్టి మనిషి అనుభవిస్తూ ఉంటాడు. విషయాలలో సుఖాలు ఉండేట ట్లయితే, ఒకరికి సుఖాన్నిచ్చిన వస్తువు అందరికీ సుఖాన్ని ఇవ్వగలిగి ఉండాలి. రాగమున్న వారికే విషయాలు తాళం వేస్తాయి. పైగా, ఏ విషయ సుఖమైనా పరిమితంగా ఉంటుంది. ఆద్యంతాలలో చిక్కుకొని ఉంటుంది.

ఏ విషయంపై, లేదా వ్యక్తిపై మనకు రాగము ఉంటుందో, దానిని పొందాలి అని మనస్సు ఆశిస్తుంది. ఆశించి నపుడు అది లభించక పోవచ్చు. ఒకవేళ లభిస్తే, దానిని పోకుండా నిలబెట్టుకోవా లని ప్రయత్నిస్తాము. కాని అది జారి పోతుంది. రాగాలు ఇలాగే ఉంటాయి. రాగాలన్నీ ఫలించవు. ఫలించినవి తిరిగి పుష్పించవు. రాగాలు ఫలించక పోవడానికి ఎన్నో కారణాలు ఉంటాయి. ఏది కారణ మైనా అది అవరోధం గానే అగుపిస్తుంది. ప్రతిబంధకం గానే కనిపిస్తుంది. అలాంటి ప్రతిబంధకాలు ఎదురై నపుడు వాటిపై మనస్సు ప్రచండంగా విరుచుకు పడుతుంది. అదే క్రోధము.

**క్రోధ ప్రచండం**

ఆశించింది అందక పోయినా, ఆసక్తితో అందుకున్న దానిని పోగొట్టుకున్నా మనస్సు బాధ పడుతుంది. ఈ బాధే భరించలేని స్థితిలో క్రోధంగా వ్యక్త మవుతుంది. క్రోధము ఒక విధంగా చెప్పాలంటే, కనిపించని సంతాపానికి సంకేతము. మనిషిలో క్రోధం వ్యక్తమైంది అంటే, దాని వెనుక అవ్యక్తంగా ఏదో బాధ కారణమై ఉంది అని అర్థము. కారణం తొలగనిదే కార్యం పోదు. క్రోధము కార్యమే గాని కారణము కాదు. అందుకనే మనిషి క్రోధం నుండి విడిపడ లేడు.

'కోపాన్ని కాస్త తగ్గించుకోండి' అని ఇతరులకు సలహా లివ్వడం తేలికే. అలా సలహా లిచ్చే వ్యక్తి కూడా తన కోపాన్ని తాను తగ్గించుకో లేడు. కోపం అనే దానికి పెరుగుదల తెలుసే గాని తరుగుదల తెలియదు. కళ్ళజోడుమ తీసి ప్రక్కన పెట్టినట్లు కోపాన్ని ప్రక్కన పెట్టలేరు. చొక్కాని తీసి పడేసినట్లు క్రోధాన్ని తీసి పడేయలేరు. అలా పోగొట్టుకో గలిగితే క్రోధం ఎవరిలో నైనా ఎందు కుంటుంది?

ఎవరైనా, ఎప్పుడైనా తాము పట్టుకున్న దానిని పడేయ గలరు గాని, తమను పట్టుకున్న దానిని పడేయ లేరు. క్రోధము మన చేతిలో లేదు. మనం క్రోధం చేతిలో చిక్కుకొని ఉన్నాం. కోపం మనలను విడిచి పెట్టదు. మనం దాని నుండి విడిపడ లేము. క్రోధం విషయంలో ఇదే మన అపజయము. 'ఇక నేను కోప్పడితే అడగండి' అని చెప్పేవాళ్ళు, అడగక పోయినా క్రోధాన్ని ప్రకటించడానికి ఇదే కారణము. క్రోధంపై మనకు పట్టులేదు. క్రోధం మనల్ని పట్టి పీడిస్తూ ఉంది. క్రోధాన్ని సంహరించే శక్తి మనకు లేనపుడు మరొకరి సహాయాన్ని మనం పొందాలి. కాకపోతే, అతడు కూడా క్రోధమూర్తి అయితే, మనకు రోదనే మిగుల్తుంది. క్రోధమే లేనివాడు, క్రోధాన్ని హరించే శక్తి కలవాడే మనకు సహకరించ గలడు. అతడు మనపై దయ చూపితే చాలు. ఆయన దయతో మనకు దమం సిద్ధిస్తుంది. అతడెవరు? ఇంకెవరు, భగవంతుడే! అదలా ఉంచండి. రాగోదయంతో మొదలై, ప్రచండమైన క్రోధంతో వేడెక్కిన చిత్తము ముసిరిన తిమిరాల మధ్య చిక్కుకొని చింతలో కుంచుకు పోతుంది. అదే తిమిరము.

**భయ తిమిరం**

రాగం లేకపోతే బాధ ఉండదు. బాధ లేకపోతే క్రోధం తలెత్తదు. రాగక్రోధాదులు లేదా రాగద్వేషాలు





లేకపోతే భయమెలా ఉంటుంది? రాగద్వేషాలు ఫలించవేమో అనే సందిగ్ధావస్థలో పుట్టేదే భయము. భయానికి రాగద్వేషాలే హేతువులు.

నన్ను చూచి నేను భయపడతానా? నిన్ను చూసుకొని నువ్వు భయపడతావా? నన్ను చూచి నువ్వు భయపడవచ్చు. అలాగే నిన్ను చూచి నేను భయపడవచ్చు. ఎందుకో తెలుసా! నువ్వు నేను కాదు, నేను నువ్వు కాదు కనుక. పులిని చూచి భయ పడతాము. పులి కంటే భయంకర మైన మన చిత్తాన్ని చూచి భయపడము.

ఎప్పుడైనా, ఎక్కడైనా మన కన్నా అన్యమైనదే మనకు భయహేతువు. మనలో కదిలే రాగద్వేషాలు అన్య విషయాల చుట్టే పరిభ్రమిస్తున్నాయి కనుక భయహేతువులై ఉన్నాయి. ఈ రాగభయక్రోధాదులు అంతఃకరణలో తిష్ఠ వేసి చిత్తాన్ని ఛిద్రం చేసి రుద్రభూమిగా మార్చుతున్నాయి. వీటిని మనస్సు నుండి తొలగించు కోవాలి. వీటిని అర్థం చేసుకోవడం లోనే అవి తొలుగుతాయి.

రాగ భయక్రోధాదులలో కూడా నియతి ఉంది. ఆ విధమైన నియతిలో అదృశ్యంగా నియంతే ఉన్నాడు. ఈశ్వరుడే ఉన్నాడు. ఈశ్వరజ్ఞానం కలిగితే, రాగ భయక్రోధాదులు మనస్సు నుండి తొలగి పోతాయి. ఇదంతా భగవత్కృప వల్ల జరుగ వలసిందే కనుక బుద్ధి భగవంతుణ్ణే ఆశ్రయించుకోవాలి ***(మాం ఉపాశ్రితాః).*** భక్తులు భగవన్మయులు కావాలి ***(మన్మయాః).***

రాగ భయక్రోధాదులు అనే ఈ దుష్టత్రయము ప్రాణులకు విషయ పిపాసను కలిగిస్తుంది. కనుకనే వీటిని భూతదాహీయాలు అన్నాడు ఆపస్తంబ ఋషి. రాగ భయక్రోధాదులు కేవలం ఉపలక్షణం అని చెప్పుకోవాలి. అనాత్మ రూపాలన్నీ జ్ఞానానికి ప్రతిబంధకాలే. భూతదాహీయాలే.

***అథ భూత దాహీయాన్ దోషాన్ ఉదాహరిష్యామః! క్రోధో హర్షో రోషో లోభో మోహో దమ్భో ద్రోహో మృషోద్య మత్యాశ పరీవాదా వసూయా కామమన్యూ అనాత్మ్య మయోగః !***

క్రోధము, హర్షము, రోషము, లోభము, మోహము, దంభము, ద్రోహము, అత్యాశ, తిరస్కారము, అసూయ మొదలైన వన్నీ భూతదాహీయాలే (భూతదాహం కలిగించేవి) అని ఆపస్తంబ సూత్రము. ఇవన్నీ త్యజించ దగినవే. అనాత్మరూపాలే. అయోగాలే కనుక అయోగ్యాలే.

రాగ భయక్రోధాదుల చేత చలించిన బుద్ధి ఎప్పుడైతే వాటిని పడేసు కుంటుందో ఆ క్షణమే నిశ్చలమై ప్రశాంతతను పొందుతుంది. అదే స్థితప్రజ్ఞత్వం ***(వీతరాగ భయక్రోధః స్థితధీః ముని రుచ్యతే!*** *భ. గీ. 2 - 56).* ఇలా స్థిరపడిన బుద్ధిలో ప్రపంచం లేదు. పరమాత్మే ఉన్నాడు. కనుక వారు భగవన్మయులు. తన్మయులు. మన్మయులు ***(మన్మయాః)*** అంటూ వారిని తన స్వరూపులు గానే భగవంతుడు పేర్కొంటున్నాడు.

**తన్మయులు**

భగవత్స్వరూపంగా శోభించేవారు తన్మయులు. వారిని తనవారే నంటూ మన్మయులు అంటున్నాడు భగవంతుడు. కేవలం పరమేశ్వరుణ్ణే ఆశ్రయించుకొని జీవిస్తారు ***(మాం ఈశ్వరం ఏవ ఉపాశ్రితాః కేవల జ్ఞాన నిష్ఠాః).*** భగవంతుని ఏకైక శరణ్యమని భావించి, ఆ దివ్యాత్ముణ్ణే ఆశ్రయించుకొని జ్ఞాననిష్ఠలో సాగిపోయే వారు పరిశుద్ధులై పరమాత్మనే పొందుతారు. మరి, వారు ఎలా శుద్ధి పొందుతారు?

**జ్ఞాన తపస్సు**

రాగ భయక్రోధాదుల నుండి విడిపడి, పరమేశ్వరుని ఆశ్రయించుకొని తన్మయులైన భక్తులు జ్ఞానమనే తపస్సు చేత శుద్ధిపడతారు అంటున్నాడు భగవంతుడు.

**తపతీతి తపః. తపః** అంటే తపించడము. ఇక్కడ జ్ఞానమే తపస్సుగా చెప్పబడింది **(జ్ఞానమేవ పరమాత్మ విషయ మేవ తపః).** పరమాత్మ కన్నా అన్యంగా మరొకటి లేదు అనే అభేద జ్ఞానమే ఇక్కడ తపస్సు. ఈ విధమైన జ్ఞానాగ్నిలో రాగ భయక్రోధాదులు తగులబడి పోయాయి. అంతఃకరణము శుద్ధిపడింది. పవిత్ర మైంది. ఈ విధంగా శుద్ధిపడిన వారు ***(పూతాః)*** తన స్వరూపాన్నే పొందుతారు అంటున్నాడు భగవంతుడు **(మద్భావ మాగతాః మద్భావం ఈశ్వరభావం మోక్షం ఆగతాః సమనుప్రాప్తాః).** ఇక్కడ తన స్వరూపము అంటే ఈశ్వర స్వరూపాన్ని, అనగా మోక్షాన్ని పొందుతారు అని భావం.

ఇక్కడ జ్ఞానమే తపస్సు అని చెప్పడం చేత పరమేశ్వర జ్ఞానాన్ని పొందడానికి ఉపకరించే జ్ఞాన సాధనలు కూడా తపస్సు గానే గ్రహింప బడుతాయి. శుద్ధి చేసేదే తపస్సు కనుక, చిత్తశుద్ధికి, చిత్త నైర్మల్యానికి ఉపకరించే సాధన లన్నీ తపోకార్యాలే.

జపార్చనలు, స్వాధ్యాయ సంకీర్తనలు, శ్రవణ మననాదులు, మంత్రోపాసనలు, అహింస బ్రహ్మచర్యాదులు, వివేక విచారాలు అన్నీ తపస్సు క్రిందికే వస్తాయి. శుద్ధికార్యాలు గానే గ్రహింప బడుతాయి. నిగ్రహం కూడా తపస్సే. నిగ్రహ తపస్సు ద్వారా భగవంతుని అనుగ్రహం ప్రాప్తిస్తుంది. బుద్ధి శుద్ధి పడుతుంది. భగవత్కృప లభిస్తుంది.

**మనస శ్చేంద్రియాణాం చ హ్యైకాగ్ర్యం పరమం తపః**

మనస్సుకు, ఇంద్రియాలకు ఏర్పడే ఏకాగ్రతయే ఉత్తమ మైన తపస్సు అని స్మృతివాక్యం. కనుక జ్ఞానార్జనకు ఉపకరించేది తపస్సు. జ్ఞానరూప మైనది. కనుకనే విష్ణుసహస్రనామం భగవంతుని ఉత్కృష్ట మైన గొప్ప తపస్సుగా అభివర్ణించింది **(పరమం యో మహత్తపః).** ఇక్కడ ***తపతి*** అంటే ***ఆజ్ఞాపయతి, ఈష్టే ఇతి తపః.*** సమస్తాన్ని నియమించేవాడు, నియంత్రించేవాడు, పాలించేవాడు అయిన జగత్ప్రభువు మహత్తపః అని స్తుతింప బడ్డాడు. సాధ్యరూపు డైన పరమేశ్వరుడు తపోమయం. ఈశ్వరుని పొందుటకు అనుష్ఠించు సాధన తపోరూపము. పవిత్రం చేసేందుకు తపోరూప సాధన. పవిత్రమై శోభించుటకు జ్ఞానమయ తపస్సు.

*అలాంటప్పుడు పవిత్రమైన ఈ తపస్సును సర్వులకు భగవంతుడు అనుగ్రహించవచ్చు కదా! అందరికీ ఇవ్వకుండా కొందరికే ఎందుకిస్తున్నాడు? భగవంతునికి కూడా ఇష్టాయిష్టా లుంటాయా? రాగద్వేషా లుంటాయా? చెబుతున్నాడు.*

**యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజా మ్యహమ్ ।**
**మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః ॥** **11**

**యే-యథా-మాం-ప్రపద్యంతే-తాన్-తథా-ఏవ-భజామి-అహం**
**మమ-వర్త్మ-అనువర్తంతే-మనుష్యాః-పార్థ-సర్వశః**

| | | | | | |
|---|---|---|---|---|---|
| పార్థ | = అర్జునా! | | తథైవ | = | అట్లే |
| యే | = ఎవరు | | భజామి | = | అనుగ్రహిస్తాను |
| యథా | = ఎట్లు | | మనుష్యాః | = | మనుషులు |
| మాం | = నన్ను | | సర్వశః | = | అన్ని విధాల |
| ప్రపద్యంతే | = భజిస్తారో | | మమ | = | నా యొక్క |
| అహం | = నేను | | వర్త్మ | = | మార్గమును |
| తాన్ | = వాళ్ళను | | అనువర్తంతే | = | అనుసరిస్తారు |





**పార్థా! ఎవరు నన్ను ఎలా సేవిస్తే, నేను వాళ్ళను అలా అనుగ్రహిస్తాను. మానవు లందరూ అన్ని విధాల నా మార్గాన్నే అనుసరిస్తారు.**

**వ్యాఖ్య**

అవగాహనలో స్పష్టత లోపించి నపుడు బుద్ధిలో సంశయాలు తలెత్తుతాయి. అలాగే అవగాహనలో స్పష్టత ఉన్నా, విషయంలో స్పష్టత లోపించి నప్పుడు కూడా సందేహాలు తలెత్తుతాయి. సంశయాలు నిండిన హృదయంలో జ్ఞానము అంకురించదు.

రాగ భయక్రోధాల నుండి విడిపడి, తననే ఆశ్రయించుకొని, తన స్వరూపమునే పొంది, జ్ఞానమనే తపస్సు చేత పవిత్రులైన చాలా మంది గతంలో తరించి పోయారని పదవ శ్లోకంలో ప్రవచించాడు భగవంతుడు.

జ్ఞాన తపస్సు చేత పవిత్రులైన వారే మోక్షాన్ని పొందుతారు అని సుస్పష్టం చేశాడు. అలాంటివారు రాగ క్రోధాదుల నుండి, అనగా రాగద్వేషాల నుండి విడిపడి ఉండాలి అనేది కూడా స్పష్టమైంది. మరి, భగవంతుని యొక్క అవతార వైభవము లోని దివ్యమైన జన్మకర్మలను యథాతథంగా గ్రహించిన వారు కూడా సిద్ధిని పొందుతారని తొమ్మిదవ శ్లోకంలో వివరించాడు కదా! అవతారమూర్తి పరిత్రాణాది కర్మలను నిర్వర్తించి నపుడు సాధురక్షణము, దుష్టశిక్షణము చేయుచున్నాడు కదా! ఇలా చేయడములో వైషమ్యము ఉన్నట్లే కదా! సాధువులపై రాగము, లసాధువులపై ద్వేషము పరమేశ్వరునికి ఉంది కదా! రాగద్వేషా లున్న భగవంతుని పొందడానికి రాగ భయక్రోధాదుల నుండి విడిపడ వలసిన అవసర మేముంది? ఇక్కడ విషయ వైరుధ్యముంది కదా! ఇదొక శంక.

ఇకపోతే, తనను ఆశ్రయించిన వారే ***(మాముపాశ్రితాః)*** మోక్షాన్ని పొందుతారు అనడం చేత, మరొక దేవుని ఆశ్రయించిన వారికి, మరొక మార్గాన్ని అనుసరించే వారికి మోక్షము ప్రాప్తించదు అనే కదా అర్థము? అలాంటప్పుడు ఈ విధమైన భేదభావము కలిగిన వానిలో ఈశ్వరత్వానికి స్థానం ఎక్కడుంది? ఈశ్వరత్వమే ప్రశ్నార్థక మైనపుడు ముముక్షువులు తనను ఆశ్రయించి తరించే దేముంటుంది? ఇది రెండవ శంక.

పై రెండు సంశయాలను నివారిస్తూ పరమేశ్వరుడు అందమైన, అద్భుతమైన విషయాన్ని ప్రస్తుత శ్లోకంలో అందిస్తున్నాడు. మొదటి సంశయాన్ని శ్లోకం లోని పూర్వార్థం లోను, రెండవ సందేహాన్ని శ్లోకం లోని ఉత్తరార్థం లోను పరిహరిస్తున్నాడు.

**యద్భావం తద్భవతి**

ప్రపన్నులు అంటే శరణాగతులు. భక్తులు. భక్తులు భగవంతుని ఆశ్రయించడం వెనుక ఏదో ఒక భావము, ప్రయోజనము ఉంటాయి. ఏదో ఫలాన్ని ఆశించే భక్తులు భగవంతుని ఆశ్రయిస్తారు. ప్రపంచంలో ఎందరో ఉండగా, భగవంతుణ్ణే మాత్రమే ఎందుకు ఆశ్రయిస్తారు? భక్తుల కోర్కెలను తీర్చగలిగే సర్వ శక్తిమత్వము భగవంతునికే ఉంది కనుక. భగవంతుడు ఏ కోరికలను తీరుస్తాడు? ఇక్కడ మళ్ళీ విషయం ముడిపడింది. కోరిక భక్తునిదా? భగవంతునిదా? ఫలానా కోర్కెలు మాత్రమే తీరుస్తాను అని భగవంతుడు అంటే, అది తన కోరికైనా కావాలి. లేదా, అన్యమైన కోరికలను తీర్చే శక్తి తనకు లేకుండా నైనా ఉండాలి. ఈ రెండిటిలో దేనిని అంగీకరించినా ఈశ్వరత్వానికి భంగం వాటిల్లుతుంది. భక్తుల కోర్కెలు తీర్చేవాడు, తీర్చే సామర్థ్యమున్న వాడు పరమేశ్వరు డవుతాడు గాని, తన కోర్కెను భక్తుల ముందు పరచేవాడు, లేదా భక్తుల కోర్కెలను తీర్చే శక్తి లేనివాడు భగవంతుడు కాలేడు. కనుక ఆశ్రితులు ఏది కోరితే దానిని అనుగ్రహించే వాడే భగవంతుడు. పిలిస్తే పలికేందుకు భగవంతుడు సిద్ధంగా ఉన్నాడు. ఎలా పిలవాలి? ***(యథా ప్రకారేణ).***

ఏ ప్రయోజనం కొరకు పిలవాలి? ***(యేన ప్రయోజనేన).*** ఏ ఫలితా న్నాశించి ఆశ్రయించాలి? ***(యత్ఫలార్థితయా).*** ఇవన్నీ భక్తుడు లేదా ప్రపన్నుడు ఆలోచించుకోవాలి. ఆశ్రితులు ఏది అభిలషిస్తే అచ్యుతుడు దానిని అనుగ్రహిస్తాడు ***(యే యథా మాం ప్రపద్యన్తే తాన్ తథైవ అహం భజామి, అనుగృహ్ణామి).***

**ఆర్తి హరణము**

కొందరు బ్రతుకు లోని బాధల్ని భరించలేక కేవలం దుఃఖాన్ని కలిగించే ఆ కష్టాలను పోగొట్టమని పరమేశ్వరుని ప్రార్థిస్తారు. వారి ఆర్తిని తొలగించి భగవంతుడు వారిని అనుగ్రహిస్తాడు. ఇక్కడ మరొక విషయాన్ని కూడా జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. బాధ అనేది కార్యరూపంలో ఉంటుంది. కార్యరూపంలో ఉన్న బాధలు తొలగాలి అంటే, వాటి కారణాలు ఏమిటో అవి కూడా తొలగింప బడాలి. కొన్ని విషయాలలో బాధలు మన అనుభవానికి అందుతాయే గాని, వాటి కారణాలు తెలిసి రావు. కొన్ని విషయాలలో కారణాలు తెలుస్తాయి. కాని, వాస్తవానికి మన బుద్ధికి అర్థమైన కారణాలు అసలు కారణాలు కాకుండా ఉంటాయి. ఈ గందరగోళ పరిస్థితికి కారణ మేమిటో తెలుసా? మన శక్తియుక్తులు, జ్ఞానవిజ్ఞానాలు పరిమితంగా ఉండటమే.

మన శక్తియుక్తులు, బుద్ధి జ్ఞానము పరిమితంగా ఉండొచ్చు. కాని పరమేశ్వరుడు సర్వజ్ఞుడు. కనుక, ఆర్తులు ప్రార్థిస్తే వారి ఆర్తి వెనుక దాగియున్న భావాన్ని అర్థం చేసుకోగలడు. ఆర్తిని నివారించ గలడు. కార్యంతో పాటు కారణాన్ని కూడా తొలగించ గలడు.

శిశువుకు రోదించడమే తెలుసు. రోదనకు కారణం ఆకలి అయితే, తల్లి పాలు పట్టించ గలదు. అలా కాకుండా బిడ్డ ఏడుపుకు వ్యాధి కారణమైతే, అది తల్లికి అర్థం కాదు. వైద్యునికే అర్థ మవుతుంది. అర్థమైన వైద్యుడు బిడ్డ రోదనకు కారణమైన వేదనను కూడా పసిగట్ట గలడు కనుక, కారణరూపంలో ఉన్న వ్యాధిని తొలగించి, కార్యరూపంలో వ్యక్తమయ్యే రోదనను ఆపుతాడు. బిడ్డ ఏడుపు వెనుక ఏముందో అర్థం చేసుకోవడం వల్లనే ఏడుపును నివారించడం వైద్యుడికి సాధ్య పడింది.

అలాగే ఆర్తుడైన భక్తుడు ఆర్తి నివారణార్థం ప్రార్థిస్తాడు. ఆర్తిని, ఆర్తి కారణాన్ని అర్థం చేసుకొనే పరమేశ్వరుడు ఆర్తిని సమూలంగా నివారిస్తాడు.

**యాదృశీ భావనా యత్ర సిద్ధిర్భవతి తాదృశీ**

అనే న్యాయమును అనుసరించి, ఎవడు ఏ భావంతో ఆశ్రయిస్తాడో ఆ భావానికి సంబంధించిన ఫలమే అతనికి సిద్ధిస్తుంది.

**అర్థ దానము**

దుఃఖనివారణకు ఆర్తుడు ప్రార్థించినట్లే, దారిద్ర్య నివారణకు ధనాన్ని ఆశిస్తూ అర్థార్థి ప్రార్థిస్తాడు. ఆర్తిహరణము ద్వారా ఆర్తుని ఆదుకొని అనుగ్రహించినట్లు, అర్థదానము చేత అర్థార్థిని ఆశీర్వదిస్తాడు భగవంతుడు.

కాకపోతే, ఇక్కడ ధర్మసూక్ష్మాన్ని కూడా మనస్సులో పెట్టుకోవాలి. వర్షంలో నిలబడిన వాడు తడవకుండా ఉండలేడు. పరమేశ్వరుని ఆశ్రయించిన వాడు అనుగ్రహాన్ని పొందకుండా ఉండడు.

అర్థార్థి ధనాన్ని ఆశించి భగవంతుని ఆశ్రయిస్తాడు. అంతవరకు బాగుంది. అలాగని, ప్రార్థిస్తూ కూర్చుంటే భగవంతుడు డబ్బు సంచుల్ని తెచ్చి దిండు క్రింద పెట్టి అనుగ్రహిస్తాడా? అలాగే భావిస్తారు చాలా మంది. భగవంతుడు ఫలప్రదాత మాత్రమే అనే సత్యాన్ని విస్మరిస్తారు.





**ఆఖ్యాయిక**

సూపర్ మార్కెట్ లో సరుకుల్ని కొనుగోలు చేసిన ఒక వ్యక్తి రాత్రి ఆలస్యంగా ఇంటికి చేరి, పద్దు సరి చూచుకొని, బుద్ధిగా నిద్ర పోయాడు.

ఆ రాత్రి అతనికి ఒక అందమైన కల వచ్చింది. నగర పొలిమేరలో భగవంతుడు ఒక విచిత్రమైన సూపర్ మార్కెట్ ప్రారంభించినట్లు, ఎవరికి ఏమి కావలసినా, వాటిని ఉచితంగా పంపిణీ చేస్తున్నట్లు కల గన్నాడు.

ఉదయాన్నే నిద్ర లేచాడు. తొందరగా స్నానం చేసి, ఎందుకైనా మంచిది చూచి వద్దామని నగర పొలిమేర చేరాడు. ఆశ్చర్యం! తాను కలలో చూచిన సూపర్ మార్కెట్ అక్కడ కనిపించింది. లోని కెళ్తే, అక్కడ భగవంతుడు ఉన్నాడు. ఎటు చూచినా, రకరకాల పండ్లు ఉన్నాయి. వాటి పైన పదవులు, సంపదలు, సంతానము, విజయము, ఆరోగ్యము, సుఖము, శాంతి, జ్ఞానము, తపస్సు - అని ఇలా పేర్లు వ్రాసి ఉన్నాయి.

భగవంతునికి సాష్టాంగ నమస్కారం చేసి, 'స్వామీ! వీటిలో నాకు కావలసినవి కోరుకోవచ్చా?' అని అడిగాడు కలగన్న వ్యక్తి. 'అందుకే కదా నాయనా, కొట్టు తెరిచింది?' అన్నాడు భగవంతుడు.

'స్వామీ! నాకు ప్రస్తుతానికి సంపదలు, సుఖాలు, ఆరోగ్యము కావాలి స్వామీ! ఇప్పటికి ఇవి చాలు!' అన్నాడు మొహమాట పడుతూ. రేపు మళ్ళీ భార్యతో కలిసి రావచ్చు అని లోలోన దృఢంగా నిర్ణయించు కున్నాడు.

'అలాగే నాయనా!' అని దేవుడు లోని కెళ్ళి, ఏవో కొన్ని విత్తనాలు పొట్లం కట్టి తెచ్చి ఇచ్చాడు. 'ఇదేమిటి స్వామీ, పండ్లు ఇవ్వకుండా విత్తనాలు ఇచ్చారే?' అన్నాడు భక్తుడు.

'నాయనా! ఇక్కడ ఇచ్చేవి విత్తనాలే కాని ఫలాలు కావు. కర్మకు అనుకూలా లన్నీ మేము సమకూర్చుతాము. ఫలాలను శ్రమించి మీరే పండించుకోవాలి' అన్నాడు భగవంతుడు.

అర్థదానాన్ని అపేక్షించే అర్థార్థి కర్మత్యాగం చేసి ఒకచోట కూర్చుంటే భగవంతుడు ధనాన్ని ప్రసాదించడు. కోరేవాడు ధర్మయుతంగా కర్మ చేయాలి. అప్పుడే పరమేశ్వరుడు అనుగ్రహిస్తాడు. మరి, నేను ధర్మయుతంగా కర్మ చేసి ఫలితాన్ని పొందే టప్పుడు, ప్రత్యేకంగా భగవంతుణ్ణి ఆశ్రయించడ మెందుకు? నా ఫలితాన్ని నేను పొందే టప్పుడు పరమేశ్వరుడు అనుగ్రహించే దేముంది? అనే శంక తలెత్తవచ్చు.

కర్మాచరణము జరిగినంత మాత్రాన ఆశించిన ఫలం అందుతుందని చెప్పలేము. చేతికి అందింది నోటిలో పడే లోగా జారి క్రింద పడిపోయే అవకాశాలు కూడా ఉంటాయి. మనం ధర్మయుతంగా కర్మ చేసినా, ఆశించిన ఫలితం రాకపోవడానికి అనేక ప్రతిబంధకాలు ఉంటాయి. అవి తొలగిపోతే ఫలితాలు అందుతాయి. మన ప్రార్థనల యొక్క ఫలితంగా పరమేశ్వరుడు అవరోధాలను తొలగించి అవసరాలను తీర్చుతాడు.

బాగుంది. అలాంటప్పుడు ధనాన్ని అపేక్షించే అర్థార్థి, ధర్మబద్ధం గానే ఎందుకని కర్మాచరణము చేయాలి? అధర్మంగా చరిస్తే ఏమవుతుంది? అవరోధాలు పరమేశ్వరుని కృపతో ఎలాగూ తొలగి పోతాయి కదా! అనే ఆలోచన కూడా దారి తప్పి నడక సాగించే వారికి కలగవచ్చు. ఆలోచనల కేముంది? ఎన్నయినా చెయ్యొచ్చు. అనర్థాలు ప్రాప్తించి నపుడు అర్థమౌతుంది అవి చేయగూడని ఆలోచనలు అని.

దైవ ప్రార్థన ఒక్కటే సరిపోదు. దైవం ధర్మరూపంలో ఉన్నాడనే సత్యం కూడా బుద్ధికి పట్టాలి. ఈ

వాస్తవం అర్థమైన అర్థార్థి భక్తుడు అధర్మ మార్గంలో చరించడు. అర్థం గాని వాడు అవివేకంతో చరించి అప్రతిష్ఠ పాలవుతాడే గాని అనుగ్రహాన్ని పొందలేడు.

ధనాన్ని ఆశించే అర్థార్థి భక్తుడు ధన సంపాదనకు పరులను మోసం చేస్తే, భగవంతుడు ఆశీర్వదించి ధనాన్ని అనుగ్రహిస్తాడా? హత్యలు చేస్తే, చోరత్వానికి పాల్పడితే కరుణిస్తాడా? కరుణించడు. మరి అతని ప్రార్థనకు ఫలమేమిటి? ఉంటుంది. ఉంది. అలా ఆచరించిన అర్థార్థి భక్తుడు కారాగృహంలో విశ్రాంతి తీసుకునేలా ఆశీర్వదించడమే భగవంతుని అనుగ్రహము. ఈ విషయంలో భగవంతునిలో దోషాన్ని చూడగలమా? తెలిసో, తెలియకో నువ్వు ఏది ఆశించావో అదే నీకు లభించింది ***(తం యథా యథా ఉపాసతే తథైవ భవతి).*** దురాశతో ధర్మదూరుడై కర్మాచరణ చేశాడు కనుక కారాగృహానికి కాపురం మారింది. ఇందులో భగవంతుని తప్పు ఏముంది? పైగా, ధర్మరూపుడైన పరమేశ్వరుడు అలాంటి ఫలితాన్ని అనుగ్రహించి ధర్మమూర్తిగా జాజ్వల్యమాన మయ్యాడు.

**జ్ఞాన దానము**

ఆర్తుడు, అర్థార్థి కామనా భక్తులు. కనుక భగవంతుడు వారి కోర్కెలను తీర్చి ఆశీర్వదిస్తాడు. ఈ ఉభయులను విడిచి పెడితే, మిగిలిన ఇద్దరిలో ఒకడు నిష్కామ భక్తుడైన ముముక్షువు. రెండవ వాడు నైష్కర్మ్యమును వాంఛించే జ్ఞాని. వీరిరువురిని కూడా వారి భావనను అనుసరించి భగవంతుడు అనుగ్రహిస్తాడు.

ధర్మార్థ కామాలనే త్రివర్గముల అనిత్య ప్రయోజనాన్ని గుర్తించి, కేవలము మోక్షమే ఏకైక పురుషార్థంగా నిర్ణయించుకొని పరమేశ్వరుని ప్రార్థించే ముముక్షువునకు జ్ఞాన ప్రదానం చేసి పరమేశ్వరుడు అనుగ్రహిస్తాడు.

ముముక్షువైన భక్తునికి మోక్షమే వాంఛనీయమై ఉంటుంది. మోక్షము అనేది జ్ఞానరూపంలో ఉంది. మోక్షాన్ని అభిలషించే ముముక్షువు జ్ఞానాన్ని పొందాలి కనుక, తాను జిజ్ఞాసువుగా మారాలి. జ్ఞానాన్ని శ్రవణం చేయాలి. మరి, జ్ఞానాన్ని భగవంతుడు స్వయంగా బోధిస్తాడా? అలాంటి అపోహ లోనే చాలా మంది ఉన్నారు.

భక్తుడు ముముక్షువు అయితే, అతనికి జ్ఞానం అందాలి కనుక, పరమేశ్వరుడు జ్ఞానాన్ని బోధించడు. ముముక్షువును జిజ్ఞాసువుగా మార్చి జ్ఞానప్రబోధము చేసే సద్గురువును ప్రసాదిస్తాడు. ముముక్షు భక్తుని ఆరాధనకు ఈ విధంగా ఫలితాన్ని అనుగ్రహిస్తాడు.

**మోక్ష ప్రదానము**

మోక్షప్రియులై జ్ఞానమును పొందిన భక్తులకు మోక్షమును ప్రసాదించి అనుగ్రహిస్తాడు. పూర్ణత్వాన్ని ప్రసాదిస్తాడు.

ప్రతి ఒక్కరు ఆశించేది పూర్ణత్వమే కనుక జ్ఞానులకు అనుగ్రహించిన మోక్షాన్ని, భక్తులైన ఆర్తులకు, అర్థార్థులకు, జిజ్ఞాసువులకు కూడా భగవంతుడు అనుగ్రహిస్తే ఏమవుతుంది? అనే ప్రశ్న కొందరికి ఉదయించవచ్చు.

ఒకే వ్యక్తికి ఒకే సమయంలో కామనా భక్తి, అకామనా భక్తి ఉండే అవకాశం ఉంటుందా? మోక్షమే పరమావధిగా కలిగిన అకామనా భక్తిలో ఆర్తినాశము, అర్థవాంఛ లాంటివి ఎలా ఉంటాయి? మోక్షేచ్ఛ, అన్య ఫలేచ్ఛ ఒకే సమయంలో ఉండటం సాధ్యం కాదు ***(న హి ఏకస్య ముముక్షుత్వం ఫలార్థిత్వం చ యుగపత్ సంభవతి).*** కనుక, ఎవరు ఏ ప్రయోజనాన్ని ఆశించి ప్రార్థిస్తారో దానినే భగవంతుడు అనుగ్రహిస్తాడు గాని, ఒకటి కోరితే మరొకటి ప్రసాదించడ మనేది చేయడు. అది శాస్త్ర విరుద్ధము. ధర్మదూరము.





**దర్శనానుభూతి**

భగవంతుడు దయామయుడు అని భక్తునికి తెలుసు. ఎంతటి దయామయుడు? ఆయన దయ ఏపాటిది? ఎలాంటిది? అనేది మాత్రం భక్తుని బుద్ధికి అందదు. అది అపారము. అనంతము. ఎందుకో తెలుసా? ఆయన అనంతుడు. అంతమయ్యే రూపా లన్నిటికి ఆద్యుడు, ఆధారమైన వాడు తానే. గతంలో ఉన్నవి, భవిష్యత్తులో ఉండబోయేవి, వర్తమానంలో కనిపిస్తున్నవి ఏవీ తన కన్నా వేరుగా ఉండలేవు. విషయ ప్రపంచంలో ఒక దానికి మరొకటి కారణం కావచ్చు. కాని, భగవంతుడు కారణా లన్నిటికీ కారణముగా భాసిస్తున్నాడు. కారణము కార్యము కన్నా బాహ్యంగా ఉండలేదు. వేరు పడలేదు. ఇలా చూచి నపుడు వివిధ ప్రత్యయ గమ్యమైన విశ్వంలో అగుపించే రూపా లన్నీ కార్యాలే కనుక, సర్వకారణమైన సర్వేశ్వరుడు ఏ రూపానికీ దూరంగా లేడు. అన్ని రూపాలలో తానే శోభిస్తున్నాడు. ఈ సత్యం అర్థమైతే అన్ని రూపాలూ తానే. అన్ని నామాలు తనవే. అన్ని రూపాలు తనవే అయినప్పుడు సేవించడానికి ఏ రూపాన్నైనా గ్రహించవచ్చు. కీర్తించడానికి ఏ నామాన్నైనా తీసుకోవచ్చు. నామరూపా లేవైనా పరమేశ్వరునికి దూరంగా ఉండలేవు. ఏ రూపాన్ని మనం ఉపాసిస్తే, భగవంతుడు ఆ రూపం లోనే దర్శన మిస్తాడు. అదే ఆయన అపారమైన కరుణ.

భగవంతుడు అనంతు డైనపుడు ఏ రూపంలో నైనా అగుపించ గలడు. భగవంతుడు అలా కాకుండా, ఒకే లోకంలో ఉండి, మనం భక్తి చేసినపుడు మనల్ని ఉద్ధరించడానికి మనం కోరిన రూపంలో వచ్చేట ట్లయితే, అలా రూపాన్ని ధరించడానికి సమయం పడుతుంది. అలా రూపాన్ని ధరించి మన వద్దకు రావడానికి దేశంలో పయనించ వలసి ఉంటుంది. భగవంతుడు దేశంలో పయనించ లేడు. కాలంలో చిక్కి ఆహార్యాన్ని సమకూర్చుకో లేడు. పరమేశ్వరుడు దేశంలో ఉండేవాడు కాడు. దేశానికి ఆధారమైన వాడు. కాలానికి పరిమితుడు కాడు. కాలాతీతమైన వాడు. అందుకే అనంతుడు. అనంతుడు అగుపించడానికి దేశం ప్రతిబంధకం కాదు. కాలం అవరోధం కాదు. కనుక, ఏ రూపంలో భక్తుడు ఆశించినా, ఏ కాలంలో ప్రార్థించినా, ఏ దేశంలో ఆరాధించినా, అప్పుడే, అక్కడే, ఆ రూపం లోనే అగుపించి, అనుగ్రహించి, ఆశీర్వదించ గలడు ***(యథా ప్రపద్యన్తే యే తాన్ తథైవ అనుగృహ్ణామి ఇత్యర్థః).***

కృష్ణభక్తులు శ్రీకృష్ణునే ఆరాధిస్తారు. భగవంతుడు శ్రీకృష్ణుని రూపంలో అగుపిస్తేనే కృష్ణభక్తులు తృప్తి చెందుతారు. మరొక రూపంలో అగుపిస్తే ఆరాధించగల రేమో గాని ఆనందించ లేరు. అందుచేత ఏ రూపంలో అగుపించాలని భక్తులు ఆశిస్తారో ఆ రూపం లోనే భగవంతుడు దర్శన మిస్తాడు.

కృష్ణ భక్తు లందరూ కృష్ణుని దివ్యరూపాన్నే ఆశించినా, అందులో కూడా ఒకరు ఆశించినట్లు మరొకరు ఆశించరు. సూరదాస్‌కు బాలకృష్ణుడే అగుపించాలి. మీరాబాయికి గిరిధర గోపాలుడే కావాలి. మధుసూదన సరస్వతికి వేణుగోపాలుడే కావాలి. భక్తుల ఆంతర్యాన్ని ఎరిగిన వాడు కనుక, వాళ్ళు ఎలా కోరితే భగవంతుడు అలా దర్శన మిస్తాడు ***(యేన ప్రకారేణ).***

కృష్ణ భక్తులకు కృష్ణ దర్శనం కావచ్చు. సూరదాసు, లీలాశుకుడు ఇద్దరూ బాలగోపాలుణ్ణే ఆరాధించారు. వారిరువురికీ శ్రీకృష్ణుడు బాలగోపాలుడు గానే దర్శన మిచ్చాడు. ఇక్కడ మరొక విషయాన్ని జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. ఇరువురికీ బాలకృష్ణుడే అగుపించాడు. మరి, ఇరువురికీ కనిపించిన బాలకృష్ణుని రూపం ఒక్కటేనా? ఏమో, చెప్పలేము! ఒకవేళ చెప్పక తప్పదు అనేట ట్లైతే, కాదనే చెప్పాలి. సూరదాస్ మనస్సులో బాలకృష్ణుడు ఎలా ఉన్నాడో, అలాగే సూరదాసుకు దర్శనమై ఉంటుంది. లీలాశుకుని ఆంతర్యంలో బాలముకుందుడు ఎలా ఉన్నాడో అలాగే లీలాశుకునికి దర్శనమై ఉంటుంది. భగవంతుని దివ్యదర్శనాన్ని పొందిన భక్తులు ఆయన రూపవైభవాన్ని ఒకే విధంగా వర్ణించక పోవడానికి కూడా కారణం అదే.

అందరికీ భగవంతుడు ఒకే విధంగా దర్శన మిస్తే, భగవంతునికి ఒక ప్రత్యేక రూపం ఉంది అని అర్థం. మనకు ఒక ప్రత్యేక రూపం ఉంది కనుక మనం అందరికీ ఒకే విధంగా కనిపిస్తాము. పువ్వును ఎవరు చూచినా పువ్వు గానే కనిపిస్తుంది. ఆవు ఎవరికైనా ఆవు గానే అగుపిస్తుంది. ప్రత్యేకమైన రూపాలు వేరే వేరే రూపాలుగా అగుపించ లేవు. ఆవు పువ్వుగా, పువ్వు ఆవుగా కనిపించడం సాధ్యం కాదు. ప్రత్యేకతలు ఎప్పుడూ ఇలాగే ఉంటాయి.

భగవంతునికి కూడా ఒక ప్రత్యేకమైన రూపం ఉంటే ఆయన ఆ రూపంలో అగుపించగలడే గాని భక్తుడు కోరినట్లుగా ఎలా అగుపిస్తాడు? అయినా ఎందుకు అగుపించాలి? ఒకవేళ భక్తుడు అలా కోరినా నారాయణుడు నరుడికి ఇలా నచ్చ చెప్పవచ్చు. నాయనా! నాకున్న రూపాన్ని నీవు అవలోకించాలి గాని, నువ్వు కోరిన రూపంలో నేను అగుపించాలని భావించడం న్యాయం కాదు అని చెప్పవచ్చు. కాని, భగవంతుడు అలా చెప్పిన సందర్భాలు ఎక్కడా కనిపించవు. ఎందుకని? భగవంతునికి ఒక రూపం లేదు కనుక. ఆయనది ఒక రూపం కాదు కనుక. ఏ రూపమూ కాదు కనుకనే అన్ని రూపాలు తనవి అయ్యాయి. ఈ రూపము తనది అని మనం ఖచ్చితంగా చెప్పలేము. కనుకనే, భక్తులు ఆశించే ఏ రూపాన్నైనా భగవంతుడు ధరించగలడు. భక్తులను తృప్తి పరచ గలడు.

కృష్ణ రూపమే భగవంతునిది అని చెప్పడానికి కూడా వీలు లేదు. భగవంతుడు కృష్ణరూపం లోనే ఉంటాడు అంటే, శివభక్తుల విషయ మేమిటి? రామ భక్తుల సంగతేమిటి? దేవీ భక్తుల మాటేమిటి? కనుక, ఏ రూపమూ లేని భగవంతుడు ఏ రూపాన్నైనా ధరించి భక్తులను అనుగ్రహించ గలడు. ఏ రూపంతో ధ్యానిస్తే ఆ రూపం లోనే దర్శన మిస్తాడు. ఏ రూపానికి నమస్కరించినా ఒక్క భగవంతునికే అందుతుంది. కనుకనే భక్తు లెవరైనా ఆయన మార్గం లోనే ఉన్నారు.

**సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి**

ఏ దేవునికి నమస్కరించినా, ఆ నమస్కారం ఉన్న ఒకే దేవునికి అందుతుంది. అతడు కేశవుడని నువ్వు భావిస్తే కేశవుడే. శివుడని కీర్తిస్తే శివుడే. అంతా అభేదమే. భేదము ఎవరిదైనా అజ్ఞానమే.

***హరి రూపి మహాదేవో లింగరూపి జనార్దనః***
***ఈషాదపి అంతరం నాస్తి భేదకృత్ నరకం వ్రజేత్ ॥***

'శ్రీహరి రూపంలో శివుడు ఉన్నాడు. లింగమూర్తిగా జనార్దనుడు శోభిస్తున్నాడు. అభేద రూపులైన వారిరువురిలో భేదాన్ని సృష్టించేవాడు ఎక్కడికీ పోడు, నరకానికి తప్ప' అన్నది బృహన్నారదీయం.

ఇంతవరకు మనం విశ్లేషించి అర్థం చేసుకున్నది ఏమిటంటే, ఎవరు పరమేశ్వరుని ఏ భావంతో ఆశ్రయిస్తారో భగవంతుడు వారిని అలాగే అనుగ్రహిస్తాడు. మన ప్రార్థన లోని భావానికి అనుగుణంగా భగవంతుడు ఫలితాన్ని అనుగ్రహిస్తున్నాడే గాని, ఫలప్రదానంలో పరమేశ్వరునికి రాగద్వేషాలు లేవు. వైషమ్యాలు ఉండవు. ఆశ్రితులను తృప్తి పరచే కల్పతరువు లాగా భగవంతుడు భక్తులను అనుగ్రహిస్తున్నాడు. ఒక ఆఖ్యాయిక చెప్పుకుందాం.

**ఆఖ్యాయిక**

పూర్వం ఒక బాటసారి గ్రామాంతరము వెళ్తున్నాడు. కాలి నడకన ప్రయాణం చేసే రోజులవి. మధ్యలో ఒక అరణ్యప్రాంతం గుండా వెళ్ళాలి. చాలా దూరం నడిచిన తరువాత, శ్రమ అధికంగా ఉండటం చేత కొంతసేపు ఒక చెట్టు క్రింద విశ్రమించి వెళ్దా మనుకున్నాడు.





ఒక చెట్టు నీడన కూర్చున్నాడు. కొంతసేపు అయ్యే టప్పటికి కాస్త ఊరట లభించింది. విశ్రాంతి వల్ల కాస్త శ్రమ తగ్గింది గాని, ఆకలిదప్పులు పీడిస్తున్నాయి. అయ్యో! కాస్త నీళ్ళు లభిస్తే బాగుణ్ణు. దప్పిక తీర్చుకొని ప్రయాణం మొదలెట్ట వచ్చు అని ఆలోచించ గానే చల్లని మధురోదకం తన ముందే ఒక పాత్రలో కనిపించింది. ఆశ్చర్యమేసింది. ఆ నీటిని పానం చేసి తృప్తి చెందాడు.

సంకల్పించ గానే నీళ్ళు లభించి దప్పిక తీరింది. ఇది నా సంకల్ప బలం కావచ్చు. నీళ్ళు వచ్చినట్లే ఆహారం కూడా లభిస్తే ఆకలి కూడా తీరుతుంది అని సంకల్పించ గానే షడ్రసోపేత మైన ఆహారం తన ముందే వెండిపళ్ళెంలో సిద్ధమైంది. తృప్తిగా భోంచేశాడు. కాసేపు విశ్రమించి, భుక్తాయాసం తీరగానే బయలుదేరా లని సంకల్పించాడు. ఎక్కడ పడుకోవాలి? చాప కూడా లేకపోయె అని భావిస్తూ ఉండగానే అక్కడ ఒక అందమైన పడక మంచము మెత్తని పరుపుతో సిద్ధమైంది. బాటసారి ఆనందానికి అవధులు లేవు. మంచంపై హాయిగా పడుకున్నాడు. నిద్ర రాబోతోంది. వెంటనే అతని మనస్సులో ఒక సంకల్పం మెదిలింది.

అంతా బాగుంది. నా సంకల్ప బలం చేత అన్నీ సమకూరాయి. చాలా ఆనందంగా ఉంది. నిద్రేమో ముంచుకొస్తూ ఉంది. నేనేమో అరణ్యం మధ్యలో ఉన్నాను. ఈ ప్రాంతంలో ఏ క్రూరమృగా లున్నాయో తెలియదు. ఒకవేళ ఇక్కడికి పెద్దపులి వస్తే ఏమౌతుంది అని సంకల్పించ గానే ఎదురుగా ఒక పెద్దపులి ప్రత్యక్షమైంది. దానిని చూచి భయంతో వణకిపోతూ, ఇంకేముంది! ఈ పులి నన్ను చంపి తినేస్తుంది అనుకున్నాడు. వ్యాఘ్రము అనుకున్నంత పని చేసి మరీ పోయింది. ఏం చేద్దాం! తాను ఏ వృక్షము యొక్క నీడలో ఉన్నాడో పాపం ఆ బాటసారికి తెలియకపోయె! అంతా తన సంకల్ప వైభవ మని పొంగి పోయాడే గాని తానొక కల్పతరువు క్రింద ఉన్నాడని గ్రహించలేక పోయాడు. కోరింది కనికరించడమే గాని కల్పవృక్షానికి రాగాదు లుంటాయా? ఏది కోరుకోవాలో కోరేవాడికి తెలియాలి. కల్పతరువుకు దోషాన్ని అంటగడితే ఎలా? భగవంతుడు కూడా భక్తుల విషయంలో అలాగే ప్రవర్తిస్తాడు.

**సురద్రుమో యద్వత్ ఉపాశ్రితార్థదః**

దేవతరువు సంకల్పించిన దానిని సఫలం చేస్తుంది. పరమేశ్వరుడు ఆశ్రితుల ఆశలను తీర్చి అనుగ్రహిస్తూ ఉంటాడు.

ఇంతవరకు శ్లోకం లోని ప్రథమ పాదాన్ని (పూర్వార్థాన్ని) అర్థం చేసుకొని, భగవంతునికి రాగద్వేషాలు ఉండవు అని గ్రహించి మొదటి సంశయాన్ని నివృత్తి చేసుకున్నాం. ఇక, తనను ఆశ్రయించిన వారిని, తన మార్గంలో చరించే వారిని మాత్రమే అనుగ్రహించి అన్య మార్గానుయాయులను భగవంతుడు తృణీకరిస్తాడా? ఇదే వాస్తవమైతే, ఈ విధమైన భేదాలు, వైషమ్యాలు పరమేశ్వరునిలో కూడా ఉంటే, ఆయన ఈశ్వరత్వానికి భంగం వాటిల్లుతుంది కదా! అనే రెండవ శంకను రెండవ పాదము (శ్లోకం యొక్క ఉత్తరార్థంలో) పరిహరిస్తున్నాడు. అందరూ అన్ని విధాలా తననే ఆశ్రయిస్తున్నారు అంటున్నాడు ***(మమ వర్త్మాను వర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః).***

**మార్గాలన్నీ మహిమ వైపే**

ఎవరు ఎవరిని ఆశ్రయించినా అలా ఆశ్రయించడం వెనుక ఫలాశ ఉందా, లేదా? ఉంది. మరి చేసిన కర్మకు ఫలితాన్ని అనుగ్రహించే దెవరు? సర్వేశ్వరుడే. దేవదేవుడే ధర్మరూపంలో ఉండి కర్మఫలాలను ప్రసాదిస్తున్నాడు. పంచభూతాల రూపంలో ఉండి కాపాడేవాడు, ఇంద్రాది అధిష్ఠాన దేవతల రూపాలలో ఉండి కనికరించే వాడు ఒక్కడేనా? లేక అనేకమంది ఉన్నారా?

కర్మఫలాన్ని అనుగ్రహించాలి అంటే సర్వజ్ఞత్వము ఉండాలి కదా! సర్వజ్ఞత్వము అనేది ఏకత్వంలో ప్రాప్తిస్తుందే గాని భిన్నత్వంలో ఎలా సాధ్య మవుతుంది? కనుక కర్మఫల ప్రదాత సర్వేశ్వరుడైన భగవానుడే గాని అన్యులు కాలేరు. అందుచేతనే బ్రహ్మసూత్రాలలో **ఫలమత ఉపపత్తేః** అని చెప్పబడింది.

కర్మఫలము ***(ఫలం)*** ఈశ్వరుని వల్లనే ***(అతః)*** ప్రాప్తిస్తూ ఉంది ***(ఉపపత్తేః)***. ఎవరిని మనం ఆశ్రయించినా, ఏ దేవతను మనం ఉపాసించినా, ఫలితాన్ని అనుగ్రహించే వాడు మాత్రం ఒక్కడే అయి ఉండాలి. అప్పుడే ఫలితాన్ని ప్రసాదించడం సాధ్య మవుతుంది.

**యో దేవానాం నామధా ఏక ఏవ**

అనేక నామరూపాలలో దేవతలు గోచరిస్తున్నా, వారిలో, వారి ద్వారా ప్రకాశించే దేవుడు మాత్రము ఒక్కడే. కనుక ఎవరు ఏయే విధాలుగా నైనా ***(సర్వథాపి)*** అనేక రూపాలలో ***(సర్వావస్థస్య)*** ఈశ్వరుడ నైన నా యొక్క ***(మమ ఈశ్వరస్య)*** మార్గమునే ***(వర్త్మ మార్గమ్)*** అనుసరిస్తూ ఉంటారు ***(అనువర్తనే)***. ఏ వైపు వారు నడక సాగించినా నా వైపుగా వస్తున్న వారే అర్జునా! అంటున్నాడు భగవంతుడు. నన్నే ఆశ్రయించుకొని నా మార్గం లోనే ***(మమ భజన మార్గం)*** అన్ని విధాల ***(సర్వశః సర్వ ప్రకారైః)*** చరిస్తున్నారు అంటున్నాడు.

**తిరిగి తిరిగి పక్షులు తరువు చేరు**
**పారి వచ్చిన జలములే చెరువు నీరు**
**నిన్ను చేరిన వారికే కరువు తీరు**
**నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!**

అని ఒక చైతన్య వెన్నముద్ద.

ఇంద్రాది దేవతల్ని మనం ఉపాసించినా అది పరమేశ్వరునికే చెందుతుంది. ఎందుకని? సర్వ దేవతల రూపంలో పరమేశ్వరుడే ఉన్నాడు కనుక. అందుకనే, **సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి** అని ముందే చెప్పుకున్నాం. సర్వదేవతల రూపముల ద్వారా కూడా ఫలమును ప్రసాదించువాడు తానే. ఈ కారణం చేతనే వేదంలో **ఇంద్రం మిత్రం వరుణ మగ్నే మాహుః** అనే మంత్రవర్ణం ఉంది.

ఫలమును ప్రసాదించు కర్మఫల ప్రదాత ఒక్కడే అయినందున ***(ఫలమత ఉపపత్తేః)***, సర్వదేవతల రూపంలో ఒక్కడే శోభిస్తూ ఫలాలను అనుగ్రహిస్తూ ఉన్నందున ***(యో దేవానాం నామధా ఏక ఏవ)*** ఏ మూర్తిని ఉపాసించినా పరమేశ్వరుని ఉపాసించినట్లే. ఏ దేవత నుండి ఫలమును అందుకున్నా ఈశ్వరానుగ్రహ సిద్ధియే. కనుకనే అర్జునా! సర్వులూ తెలిసో తెలియకో నా మార్గం లోనే చరిస్తున్నారు అంటున్నాడు భగవంతుడు.

ఈ సందర్భంలో మరో విధంగా విషయాన్ని సులభం చేసుకుందాం. ఐశ్వర్య ప్రదాయిని ఎవరు? లక్ష్మీదేవి కదా! నిజమే. మరి లక్ష్మీ భక్తులు లక్ష్మిని ఆరాధించే టప్పుడు ఏ భావనతో లక్ష్మిపూజ చేస్తుంటారో ఆ రూపాన్నే పూజామందిరంలో ఉంచుకోవడం మనం చూస్తూ ఉంటాము.

పైరు చక్కగా పండాలని, తద్వారా ధాన్యం పుష్కలంగా లభించాలని భావించే రైతు ధాన్యలక్ష్మిని ఉపాసిస్తాడు. అతడు ధ్యానించే రూపంలో లక్ష్మీదేవి ధాన్యాన్ని చేతిలో ధరించి ఉంటుంది.

అలాగే ధనాన్ని ఆశించి లక్ష్మీదేవిని ఉపాసించే భక్తుడు ధాన్యలక్ష్మి రూపాన్ని ఉపాసించడు. బిందెతో ధనాన్ని క్రుమ్మరిస్తున్న ధనలక్ష్మి రూపాన్ని ధ్యానిస్తాడు. అలాగే రాజ్యలక్ష్మి, సంతానలక్ష్మి, ఐశ్వర్యలక్ష్మి, గజలక్ష్మి అంటూ అనేక రూపాలను ఆశ్రయించుకొని లక్ష్మీదేవిని అర్చిస్తూ ఉంటారు. ఎవరు ఏ లక్ష్మీదేవి రూపాన్ని





ఆశ్రయించినా, అనుగ్రహించే తల్లి మాత్రం ఒక్కతే గాని అనేకులు కారు కదా! అంతే. పరమేశ్వరుడు కూడా భక్తుల్ని అలాగే అనుగ్రహిస్తూ ఉంటాడు.

*మరి, ఈశ్వరునికి రాగాదులు లేవు. ఆయన అందరినీ సమం గానే అనుగ్రహిస్తాడు. సమస్త ఫలాలు ఆయన నుండే అందుతాయి. అలాంటప్పుడు సర్వులూ సర్వేశ్వరునే ఆశ్రయించవచ్చు కదా! అన్యుల వెంట పడిపోతున్నా రెందుకని? ఈ శంకను కూడా పరిహరిస్తున్నాడు.*

**కాంక్షన్తః కర్మణాం సిద్ధిం యజన్త ఇహ దేవతాః ।**
**క్షిప్రం హి మానుషే లోకే సిద్ధి ర్భవతి కర్మజా ॥** 12

***కాంక్షంతః-కర్మణాం-సిద్ధిం-యజంతే-ఇహ-దేవతాః***
***క్షిప్రం-హి-మానుషే-లోకే-సిద్ధిః-భవతి-కర్మజా***

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఇహ | = | ఈ లోకములో | మానుషే | = | మానవ |
| కర్మణాం | = | కర్మల యొక్క | లోకే | = | లోకములో |
| సిద్ధిం | = | ఫలసిద్ధిని | కర్మజా | = | కర్మ వలన పుట్టిన |
| కాంక్షంతః | = | కోరేవారు | సిద్ధిః | = | ఫలప్రాప్తి |
| దేవతాః | = | ఇంద్రాది దేవతలను | క్షిప్రం | = | శీఘ్రముగ |
| యజంతే | = | సేవిస్తున్నారు | భవతి హి | = | కలుగుతుంది! |

**కర్మ ఫలములను ఆశించే మానవులు దేవతలను పూజిస్తున్నారు. మానవ లోకములో కర్మ ఫలము శీఘ్రంగా కలుగుతుంది కదా!**

**వ్యాఖ్య**

భగవంతుని ఆరాధించాలి అనే భావన అందరికీ స్ఫురించదు. భగవంతుని పొందాలి అని అభిలషించే వారే భగవంతుని ఆరాధిస్తారు. భగవంతునికి సంబంధించిన అవగాహన మనస్సులో స్థిరపడి, పొందదగిన వాడు పరమేశ్వరుడు ఒక్కడే అనే నిశ్చయజ్ఞానం కలిగిన వారే భగవంతుని వైపు తిరుగుతారు. పవిత్రంగా ఆరాధిస్తారు. అలాంటి వారు వాస్తవానికి చాలా అరుదుగా ఉంటారు. ఎక్కువ మంది లోకంలో విషయాభిలాషులు గానే ఉంటారు. విషయ ప్రపంచమే సుఖస్థాన మని, విషయాలే సుఖహేతువు లని భావించి, ఆ వైపు పరుగులు పెడుతూ ఉంటారు.

అందరికీ ఆనందమే కావాలి. అందరూ సంతృప్తినే వాంఛిస్తున్నారు. కాకపోతే, ఎక్కువ మంది భౌతికం గాను, ఇంద్రియ విషయ భోగానుభవం లోను తాత్కాలికంగా తృప్తి చెందుతూ, అనిత్య సుఖాలను అనుభవించడానికి అలవాటుపడి ఆ వైపే పయనిస్తూ ఉంటారు.

నిత్యసుఖము అనేది ఒకటి ఉందని, అది పరమేశ్వరుని పొందడం లోనే సిద్ధిస్తుందని వారికి తెలియదు. తెలిసినా, పొందదగినది అదొక్కటే అన్నంత దృఢంగా తెలియదు. అందుచేత అన్య మార్గాల వెంట పరుగులు తీస్తూ ఉంటారు. దేహాభిమానులై, అహంకార ప్రేరితులై చరించే వారికి, మనోవాంఛలను ఈడేర్చుకొని ఇంద్రియ సుఖాలను అనుభవించుటలో ఆసక్తి గల వారికి మోక్షభావన అంకురించదు. అంకురించినా ఫలించదు. కనుక, నిత్యతృప్తిని ప్రసాదించే మోక్షాన్ని అందరూ ఆశించలేరు. ఆశించిన వారిలో కూడా అందరూ అందుకోలేరు. ఇక్కడే చాలా మంది గాడి తప్పుతూ ఉంటారు. అన్య మార్గాలలో ప్రయాణం సాగిస్తూ ఉంటారు.

## సులభతరం - శీఘ్రఫలం

కళ్ళు చూస్తాయి. చూసేందుకే కళ్ళున్నాయి. కాని, కళ్ళు కొంత వరకే వీక్షించగలవు. నేత్రదృష్టి కొంత మేరకే సాగుతుంది. అంతకు మించి చూడటం సాధ్య పడదు.

అలాగే మనస్సులు కూడా కొంతవరకే ఆలోచించ గలవు. కాకపోతే, కళ్ళు చూడలేని వాటిని సూక్ష్మదర్శిని ద్వారా చూసినట్లు, మనస్సులో అవగాహనను పెంచుకుంటే, ప్రాపంచిక విషయాలను అధిగమించి ఆలోచించ వచ్చు. ఇదే విచార జనిత జ్ఞానము. అలాంటి విచారమును చేయలేని సామాన్యులు తక్షణ ఫలితాలను అధిగమించి చూడలేరు. ఇంద్రియజనిత సుఖాలను దాటి పయనించ లేరు. అల్పసుఖాలు, స్వల్ప విషయాల వెంటే నడక సాగిస్తారు. స్థూల ఫలితాలకే ఆకర్షితు లవుతారు. కర్మవలయంలో చిక్కుకొని పోతారు. తమకు ఏమి కావాలో స్పష్టంగా తెలియని వివేకశూన్యులు శీఘ్ర ఫలితాలను ఆశించి, కర్మల నాచరిస్తూ, ఫలప్రాప్తికి అన్య దేవతలను ఆరాధిస్తూ ఉంటారు ***(కర్మణాం సిద్ధిం కాంక్షన్తః ఇహ దేవతాః యజన్తే).***

విషయాసక్తులు స్థూల శరీరాభిమానులు. కర్మాసక్తే వారిలో ఎక్కువగా ఉంటుంది. కర్మల వల్ల కలిగే ఫలితాలు దేహేంద్రియాలను తృప్తి పరుస్తూ ఉంటాయి. ఇది ప్రత్యక్షానుభవంగా తెలుస్తూ ఉంటుంది. కనుక, తక్షణమే అనుభవానికి అందుతున్న సుఖాన్ని త్యజించి, పరమ పురుషార్థం వైపు దృష్టిని సారించలేక పోతారు.

విషయానురక్తి ఎక్కువగా ఉండటం చేత వీరిలో విచారయుక్తి, వివేకశక్తి బలహీనంగా ఉంటాయి. కామనాసక్తి తీవ్రంగా ఉంటుంది. ఇంద్రియ విషయాలలో రమించి తృప్తి చెందాలనే ఆసక్తి వారిలో ఎక్కువగా ఉంటుంది కనుక, తత్ప్రాప్తికై ఇంద్రియాధిష్ఠాన దేవతలను ఆరాధించి, వారి అనుగ్రహాన్ని పొందే కార్యంలో నిమగ్న మౌతారు.

కామనా భక్తులై విషయానురక్తు లైన వీరిలో మోక్షాపేక్ష ఉండదు. మోక్షాపేక్ష ఉంటేనే జ్ఞానాసక్తితో జిజ్ఞాసువు లవుతారు. మోక్షాపేక్ష లేనివారు జిజ్ఞాసువులు కాలేరు కనుక విషయ పిపాసు లవుతారు. జ్ఞాన విముఖు లవుతారు.

ఎప్పుడైతే విషయానురక్తులై ఉంటారో, కర్మాచరణము నందు కర్తృత్వమును, ఫలానుభవంలో భోక్తృత్వమును కలిగి, రాగద్వేషాలలో తగులుకొని చిత్తశుద్ధికి దూరు లవుతారు. చిత్తశుద్ధి లేనివారు జ్ఞాన మార్గానికి అర్హులు కాలేరు. ఆ విధంగా కూడా వీరు ఈశ్వరారాధనకు దూరు లవుతారు. జ్ఞాననిష్ఠ లేనందున మోక్షాన్ని పొందలేరు.

జ్ఞాన మనే తపస్సు చేత పవిత్రులైన చాలా మంది గతంలో మోక్షాన్ని పొంది తరించారని భగవంతుడు పదవ శ్లోకంలో స్పష్టం చేశాడు. అలా పొందిన వారు రాగ భయక్రోధాదుల నుండి విడిపడ్డా రని కూడా ఆ శ్లోకం లోనే తెలియ జేశాడు. అంటే, మోక్షాన్ని పొందాలి అంటే రాగము లేనివారై ఉండాలి. భయము లేనివారై ఉండాలి. క్రోధాన్ని జయించిన వారై ఉండాలి.

శీఘ్ర ఫలితాలను ఆశించి, ప్రత్యక్షంగా అనుభవానికి అందుతున్న కర్మజనిత ఫలాలను అందుకోవడానికి అన్య దేవతలను ఆరాధించే కామనా భక్తులు నిష్కాములు కారు కనుక వారు రాగయుతులు. కర్మలలో చరించే ఈ విషయాసక్తులు కోరిన దానివి తప్పక పొందుతారని గాని, లేక పొందిన దానిని స్థిరంగా నిలబెట్టుకుంటా రని గాని నమ్మకం లేదు కనుక భయభ్రాంతులకు లోనై ఉంటారు. అంతేకాదు. కర్మజనిత ఫలాలు ఏవైనా పరిమితాలే కనుక అవి సహజంగా గాని, పరుల ప్రవేశంతో గాని వినాశాన్ని పొందుతాయి. అదే జరిగి నపుడు, దానికి





కారణమైన వ్యక్తులపై క్రోధం విజృంభిస్తుంది. ఈ విధంగా కర్మఫలాసక్తు లైన వారు రాగ భయక్రోధాదుల నుండి విడిపడలేరు కనుక వీరు మోక్షప్రియులు కాలేరు. ముక్తిని పొందలేరు.

## కష్టసాధ్యం - సుదూర పయనం

కర్మజనిత ఫలాలు ప్రత్యక్షంగా అగుపించినట్లు జ్ఞానఫలం అగుపించదు. కర్మల వలన కలిగే ఫలాలు దేహేంద్రియాలకు సంబంధించి ఉంటాయి. జ్ఞానము వివేకానికి సంబంధించింది కనుక విచారయుతంగా అంతఃకరణకు సంబంధించి ఉంటుంది. ప్రత్యక్షంగా అనుభవానికి అందదు.

మోక్షకాములై జ్ఞాననిష్ఠలో చరించాలని భావించే పుణ్యాత్ములు ముందుగా చిత్తశుద్ధి కొరకు కర్మలను చాలా కాలం ఆచరించాలి. ఉపాసనల ద్వారా చిత్త నైశ్చల్యాన్ని పొందాలి. ఇలా శుద్ధిని పొందుటకు చాలా కాలం శ్రమించాలి. చిత్తశుద్ధి లేకుండా జ్ఞాననిష్ఠ కుదరదు. జ్ఞాననిష్ఠ లేకపోతే మోక్షం సిద్ధించదు.

కనుక మోక్షార్థులై పరమేశ్వరుని ఆశ్రయించాలంటే సహనశీలురై ఉండాలి. దీర్ఘకాలం సాధనను సాగించే శక్తి కలవారై ఉండాలి. విచిత్ర మేమిటంటే, మనుషులకు ఫలితాలు శీఘ్రంగా రావాలి. భోజనానికి విస్తర ముందు కూర్చున్నా, వడ్డించే లోగా వేడెక్కిపోయే మానవులు దీర్ఘకాలం నిరీక్షించి జ్ఞాన ఫలాలను అందుకోవడానికి సిద్ధపడరు. వెంటవెంటనే శీఘ్రంగా ఫలితాలు అందాలి అంటే, అది కర్మల లోనే సాధ్యం కనుక, అట్టి వారు పరమేశ్వరుని విడిచిపెట్టి విషయసుఖాల వెంట పరుగులు తీస్తారు. మానవలోకంలో కర్మజనిత ఫలాలు శీఘ్రంగా ప్రాప్తిస్తాయి కదా! ***(కర్మజా సిద్ధిః మానుషే లోకే క్షిప్రం భవతి).***

శీఘ్ర ఫలితాలను ఆశించేవారే ఎక్కువ శాతం దారి తప్పి నడక సాగిస్తూ ఉంటారు. వరుసలో నిలబడి, టిక్కెట్టును కొనుగోలు చేసి సినిమా చూడవచ్చు. ఇది పద్ధతి. కాని, తాము ముందుగా లోనికి పోవాలనే ఆశ తోనో, లేకపోతే మరొక రోజు వరకు నిరీక్షించవలసి వస్తుందనే దిగులు తోనో, మనిషి ఎక్కువ ధనాన్ని వెచ్చించి టిక్కెట్టును 'బ్లాక్' లో కొంటాడు. దారి తప్పడానికి శీలసహనాలు అవసరం లేదు. సక్రమమైన దారిలో పయనించాలంటేనే, మనిషికి వివేకంతో కూడిన ఓర్పు, సహనంతో కూడిన నేర్పు ఉండి తీరాలి. జ్ఞాన మార్గంలో చరించాలంటే ఇవి అవసరం. ఇవి లేని వారు శీఘ్రంగా లభించే ప్రత్యక్ష ఫలాలను ఆశించి కర్మ మార్గంలో చరిస్తూ అన్య దేవతారాధనలో తాత్కాలికంగా తృప్తి చెందుతూ ఉంటారు. కాని, నేను తృప్తి లేనివాణ్ణి అనే పారమార్థిక సమస్య నుండి మాత్రం విడిపడ లేరు.

కనుక, విషయాసక్తు లైన మానవులు శీఘ్ర ఫలితాల నాశించి, అన్య దేవతల నారాధిస్తూ, కర్మ మార్గమున చరించి, తాము అనుష్ఠించే యజ్ఞ యాగాదుల వలన సురులకు సంతోషాన్ని కలిగిస్తారేమో గాని, తాము మాత్రం సంతృప్తి చెందలేరు. ఈ కారణం చేతనే, మనకు పశువులు ఉపయోగ పడినట్లు, కర్మ మార్గానుయాయు లైన మానవులు దేవతలకు ఉపయోగపడుతున్నారు అన్నది వేదం ***(యథా పశు రేవం స దేవానామ్).***

క్షేత్రాన్ని దున్ని, శకటాన్ని లాగి, భారాలను మోసి పశువులు మనకు ఎలా ఉపయోగపడు తున్నాయో, అలాగే వివేకము లోపించిన మానవుడు ***(అజ్ఞః)*** యజ్ఞ యాగాదులను ఫలాసక్తితో నిర్వహించి యజింపబడు దేవతలకు హవిస్సులను అర్పిస్తూ, వారికి పశువులా ఉపకరిస్తూ సేవిస్తున్నాడు అని భావం. కారణం ఇక్కడ, అనగా మానవ లోకంలో ***(మానుషే లోకే)*** కర్మఫల సిద్ధి శీఘ్రంగా ప్రాప్తిస్తూ ఉంది అంటున్నాడు.

మానవ లోకంలో అని ప్రత్యేకించి విశేషణంతో పలకడం ఎందుకంటే, కర్మాచరణమునకు అనుగుణ మైన వాతావరణము మానవ లోకములో ఉందే గాని ఇతర లోకాలలో లేదు. కర్మాచరణమునకు కావలసిన

వ్యవస్థ, కర్మవిధానము అన్నీ ఇక్కడే ప్రాప్తిస్తున్నాయి. పైగా ఇవన్నీ సృష్టికర్త యైన పరమేశ్వరుని చేతనే నియమింప బడ్డాయి. సృష్టి లోని క్రమ మంతా సృష్టికర్త కార్యమే కదా!

ఈ సందర్భములో ఒక సందేహం తలెత్తుతుంది. సృష్టిని తయారు చేసింది పరమేశ్వరుడే కదా! అలాంటప్పుడు ఎందుకని కొందరిని జ్ఞానార్థులుగా, మరి కొందరిని ఫలాసక్తి కలిగిన విషయాభిలాషులుగా సృష్టించాడు? అధికార తారతమ్యము ఎలా సమంజసము? అనే ప్రశ్న పుడుతుంది. ఇలాంటి ప్రశ్నలు ఉద్భవించకుండా, విశ్వంలో ధర్మవ్యవస్థ కొనసాగటానికి ఏ విధమైన విధానాన్ని పరమేశ్వరుడు తయారు చేశాడో వివరిస్తున్నాడు.

*కర్మాచరణమునకు అనువైన వర్ణవ్యవస్థ మానవలోకము నందు ఉన్నదే గాని మరొక లోకంలో లేదు. ఈ విధమైన వ్యవస్థను సృష్టించిన పరమేశ్వరునిలో కర్తృత్వము ఉన్నట్లే కదా! కర్త యైన వాడు నిత్యముక్తు డెలా అవుతాడు? ఈ ప్రశ్నలకు సమాధానాన్ని ఇక బోధిస్తున్నాడు.*

**చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః ।**
**తస్య కర్తార మపి మాం వి ద్ధ్యకర్తార మవ్యయమ్ ॥** 13

**చాతుర్వ ర్ణ్యం-మయా-సృష్టం-గుణకర్మ-విభాగశః**
**తస్య-కర్తారం-అపి-మాం-విద్ధి-అకర్తారం-అవ్యయం**

| | | | | | |
|---|---|---|---|---|---|
| మయా | = | నా చేత | కర్తార మపి | = | కర్త నైనా |
| చాతుర్వర్ణ్యం | = | నాలుగు వర్ణాలు | మాం | = | నన్ను |
| గుణకర్మ విభాగశః | = | గుణకర్మల విభజన ననుసరించి | అకర్తారం | = | అకర్తగా |
| సృష్టం | = | సృష్టింప బడింది | అవ్యయం | = | అవ్యయునిగా |
| తస్య | = | దానికి | విద్ధి | = | తెలుసుకో! |

**గుణాలను బట్టి, కర్మలను బట్టి నాలుగు వర్ణాల వారిని నేనే సృష్టించాను. దానికి నేను కర్తనే అయినా, నన్ను అకర్తగా తెలుసుకో. నాశము లేని వాణ్ణిగా గ్రహించు.**

**వ్యాఖ్య**

జీవన వ్యవస్థలో కర్మ ప్రముఖమైంది. కర్మాచరణంలో విధి విధానాలు ప్రధానంగా ఉంటాయి. చేయవలసింది విధి అయితే, చేసే పద్ధతి విధానము. విధి విధానాలను చక్కగా నిర్వర్తించుటే ధర్మము. ధర్మాచరణంలో దైవదర్శన మవుతుంది. దైవము ధర్మరూపంలో ఉండటమే దీనికి కారణము.

ధర్మ జీవనము అనగానే ఏదో ఒక విధమైన కర్మాచరణము అని స్ఫురిస్తుంది. అదే విధి నిర్వహణము. అంటే, ఏదో ఒక దానికి సంబంధించిన కర్మని, ఒక ప్రత్యేకమైన రీతిలో ఆచరించడము అని అర్థము.

ఆచరణము ఏదైనా, దాని నంటి పెట్టుకొని ఆచరించే వాడు ఉంటాడు. ఉండాలి. కర్మ జరిగింది అంటే, కర్త ఉన్నాడు అని అర్థము. కర్త ఎవడైనా కర్తృత్వ భావాన్ని విడిచి ఉండలేడు. నేను చేశాను అనే భావన లేకుండా కర్త ఉండడు. వాస్తవానికి ఈ కర్తృత్వము అనేది, బాగా ఆలోచిస్తే సత్యదూరమైన విషయము.

నేను ఇది చేశాను - అది చేశాను అని అనడం మనిషికి సులభమైన విషయము. వాస్తవం అర్థమైతే, మనం ఏదీ చేసే వాళ్ళము కాము అని అవగత మవుతుంది. మనం ఏది చేసినా, ఫలనిర్ణయం దగ్గరకు వచ్చే సరికి ఏదో అద్భుతమైన శక్తి విశ్వాన్ని నడిపిస్తూ ఉంది అని అర్థ మవుతుంది.





మన జీవితంలో జరిగే సన్నివేశాలను గాని, ప్రకృతిలో సంభవించే సంఘటనలను గాని విశ్లేషించి అర్థం చేసుకుంటే, ఏ సన్నివేశము ప్రత్యేకంగా ఒక సన్నివేశము కాదని, ప్రకృతిలో గోచరించే ఏ ఒక్క సంఘటన కూడా ఒక ప్రత్యేక సంఘటన కాదని బోధ పడుతుంది.

ప్రతి సంఘటన మరొక సంఘటనతో ముడిపడి ఉంటుంది. ప్రతి సన్నివేశంలో ఇతర సన్నివేశాలకు సంబంధించిన అనేక విషయాలు చోటు చేసుకొని ఉంటాయి. అలా చూచి నపుడు ప్రతి సన్నివేశము విశ్వ సంబంధాన్ని కలిగి ఉన్నదే గాని వ్యక్తికి పరిమితంగా లేదు. ఒక చోట ఒక సంఘటన జరిగింది అని గ్రహించడానికి సామాన్య జ్ఞానము చాలు. అది కేవలం సమాచారము. ఆ జరిగిన సంఘటన ఒక్క చోటే జరిగినా, అదే సమయంలో అది అంతటా జరిగింది అవుతూ ఉంది అని గ్రహించడానికి సమాచారాన్ని సేకరించుకొనే సామాన్య జ్ఞానము సరిపోదు. సమష్టితిని అర్థం చేసుకొనే సమ్యక్ జ్ఞానం కావాలి. అలాంటి జ్ఞానమును పొంది, ఆ జ్ఞానదృష్టిలో ప్రతి విషయాన్ని వీక్షించే స్థాయికి మనం ఇంకా ఎదగలేదు.

మనలో ఏ ఒక్కరికీ పూర్ణజ్ఞానం లేదు. ఏ ఒక్కరమూ పూర్ణ శక్తివంతులము కాము. కర్మ రహస్యాలు ఎవ్వరికీ పూర్ణంగా వంట బట్టలేదు. కనుకనే, కర్మల మధ్య మనకు వ్యత్యాసాలు కనిపిస్తాయి. హీనాధికాలు గోచరిస్తాయి. భేదాలు బుద్ధిని చెదర గొడతాయి. వ్యత్యాసాలు వ్యక్తిత్వాలకు ప్రాణం పోస్తాయి. తనను తాను గొప్పగా భావించుకొనే దురదృష్టానికి శ్రీకారం చుట్టడమే గాక, అన్యులను హీనులుగా చిత్రించుకొని కించపరచే దుర్గతికి కూడా దారి తీస్తాయి.

వ్యక్తి విశ్వానికి దూరంగా లేడు. విశ్వంలో ఉన్నదంతా వ్యక్తిలో ఉన్నదే. ఇది అర్థమైతే విశ్వకళ్యాణం జరుగుతుంది. విశ్వం నుండి వ్యక్తి విడిపడితే విచ్ఛిన్నానికి దారి తీస్తుంది. విశ్వంలో వైభోగం ఉందే గాని విభాగం లేదు.

మన దేహాన్నే తీసుకుందాం. దేహం ఆరోగ్యంగా ఉంది అంటే, అనేక కారణాలతో పాటు ఆహార సేవనము ప్రధానంగా తెలుస్తూ ఉంది. మనం భుజించే ఆహారము దేహం లోకి వెళ్తే సరిపోతుందా? జీర్ణక్రియ జరగాలా, లేదా? మనం భుజించిన ఆహారం జీర్ణం కావడానికి మన దేహం లోని అవయవాలన్నీ ఒకేసారి ఎలా పని చేస్తున్నాయో ఆలోచిస్తే పరమాశ్చర్యంగా ఉంటుంది.

ఆహారం జీర్ణాశయాన్ని చేరవచ్చు. కేవలం జీర్ణాశయమే జీర్ణం చేస్తుంది అని ఎవ్వరూ అనుకోరు. జీర్ణక్రియ సాగేటప్పుడు దేహం లోని అవయవాలన్నీ ఆ మహాకార్యంలో నిమగ్నమై ఉంటాయి. అలాగే జీర్ణక్రియ వలన ఏర్పడే ప్రభావ ఫలితాలు కూడా దేహం మొత్తం మీద ఉంటాయి.

జీర్ణక్రియ ప్రారంభం కాగానే దేహంలో ప్రతి జీవకణము ఉద్యుక్త మౌతుంది. ఊపిరితిత్తులు ఊగుతాయి. గుండె కొట్టుకుంటుంది. రక్తము చలిస్తుంది. మధుర రసాన్ని ఉత్పత్తి చేసే గ్రంథులు శ్రమిస్తూ ఉంటాయి. మెదడు కూడా తన వంతు పాత్రను తాను పోషిస్తుంది. సామాన్య జీర్ణక్రియ లోనే ఇంత వ్యవహారము నడుస్తూ ఉంది.

జీర్ణక్రియ అనేది దేహంలో ఒక ప్రత్యేకమైన కార్యంగా తెలుస్తున్నా, వాస్తవానికి అది ప్రత్యేకమైన క్రియగా లేదు. దేహము, దేహాంగములన్నీ ఏకమై సాగిస్తున్న సంపూర్ణ కార్యంగా గోచరిస్తూ ఉంది. ఈ సంపూర్ణ సహకారము కార్యం లోను, ఫలానుభవం లోను కనిపిస్తూ ఉంది. ఒక అంగము తనకంటూ తాను ప్రత్యేకంగా దేహంలో సాగించే కార్యం లేనే లేదు. ఏది చూచినా సహకార దృక్పథంతో సాగే సంపూర్ణ కార్యమే.

దేహంలో సాగుతున్న ఈ వ్యవహారమే దేశం లోనూ ఉంది. వ్యక్తి శరీరంలో గోచరిస్తున్న అద్భుత సహకార జీవనమే విశ్వంలో కూడా దివ్యంగా శోభిస్తూ ఉంది. సృష్టి నిర్మాణము, సృష్టికర్త జ్ఞానము, ధర్మరూప వైభవము సామాన్యుల మైన మనకు అర్థం కావు. వైవిధ్యాలుగా గోచరించే వన్నీ పూర్ణత్వ మనే కడలిలో చలించే కెరటాలనే జ్ఞానం తేలికగా వంటపట్టేది కాదు.

వివిధ జ్ఞానేంద్రియాల ద్వారా వేరువేరుగా అందుతున్న జ్ఞానమును ఒకే మనస్సు ఎలా అర్థం చేసుకుంటూ ఉందో, అలాగే భిన్నత్వంతో గోచరించే ఈ విశ్వంలో అంతా అభిన్నమే అనే సత్యజ్ఞానాన్ని బుద్ధి అందుకోవాలి. అప్పుడే భేదాలన్నీ సమసి పోతాయి.

**జీవ కణాలు ఎన్నో జీవిలో**
**జీవ మొక్కటే ప్రతి జీవిలో**
**దేహములో కణముల సహకారము**
**విశ్వములో అణు వణువున ధర్మము**
**వ్యక్తి లోనే విశ్వము ఉన్నది**
**ధర్మము లోనే దైవము ఉన్నది**
**రామ రామ జయ రాజారామ్**
**రామ రామ జయ సీతారామ్**

అని రామజోగి చిట్కా.

దేహంలో జీర్ణక్రియ నడిచే టప్పుడు దేహావయవా లన్నీ ఎలా సహకారంతో స్పందించాయో, అలాగే మానవ సమాజంలో మహోన్నతమైన ఈ సహకార జీవనము ప్రతిఫలించాలి. ఇది జరిగితేనే సమాజంలో అభ్యుదయ కాంతులు ప్రకాశిస్తాయి. అలా జరగ నపుడు సమస్యలు, సంఘర్షణలు, సమరాలు సముత్పన్న మవుతాయి.

సమాజం లోని వ్యక్తు లందరూ ఒక దేహం లోని అంగాల వలె జీవించాలి. ఉంచుకోవడం మరచి పంచుకోవడం నేర్చుకోవాలి. విడిపడే వికృతికి స్వస్తి పలికి ముడిపడి జీవించే ప్రకృతిని అలవరచుకోవాలి.

జ్ఞానాన్ని పంచుకోవాలి. భావాలు పంచుకోవాలి. భాగ్యాలు పంచుకోవాలి. శక్తిని పంచుకోవాలి. యుక్తిని పంచుకోవాలి. ఇలా జీవించే శోభన జీవన విధానాన్ని సృష్ట్యారంభము నందే పరమేశ్వరుడు ఆవిష్కరించాడు. మానవాళికి వరంగా అందించాడు. అదొక అద్భుతమైన వ్యవస్థ. అదే చాతుర్వర్ణ్య వ్యవస్థ. ఈ అద్భుతమైన అఖండ వ్యవస్థను అర్థం చేసుకొని బ్రతికే జీవనకళ మానవాళిలో కొరవడ గానే, వర్ణవ్యవస్థ స్థానే దారుణమైన కులవ్యవస్థ దుర్భేద్యంగా నిలిచింది. మానవ సమాజాన్ని అస్తవ్యస్తంగా మార్చేసింది.

పరమేశ్వరుడు జనులను సృష్టించి వర్ణ వ్యవస్థను సృష్టిస్తే, జనులు వర్ణవ్యవస్థను జీర్ణం చేసుకోలేక, కుల వ్యవస్థను సృష్టించుకొని సమాజంలో విభజనమును తయారు చేశారు. వెలుగును ఆర్పుకొని తిమిరంలో తిరగడం అలవరచు కున్నారు.

భగవంతుడు నాలుగు వర్ణాల వారిని తానే సృష్టించినట్లు చెబుతున్నాడు ***(చాతుర్వర్ణ్యం మయా ఈశ్వరేణ సృష్టమ్).*** దేనిని అనుసరించి ఈ వర్ణ విభాగం జరిగింది? అనే సంశయం కలుగవచ్చు. గుణములను అనుసరించి, కర్మలను అనుసరించి విభజించడం జరిగింది అంటున్నాడు ***(గుణ విభాగశః కర్మ విభాగశః).*** ఈ విధమైన చాతుర్వర్ణ్య వ్యవస్థకు తానే కర్తగా తెలుస్తున్నా, వాస్తవానికి అవ్యయుడైన తనను అకర్తగా గ్రహించ





మంటున్నాడు. ముందుగా, చాతుర్వర్ణ్య వ్యవస్థను ఎలా సృజించాడో అర్థం చేసుకుందాం. ఆ తరువాత సృష్టికి కర్తయైన తాను ఎలా అకర్తగా ఉన్నాడో చర్చించుకుందాం.

## నలుగురిలో నారాయణుడు

విశ్వము పరమేశ్వరుని చేత సృష్టింప బడింది. సృష్టిలో అనేక లోకా లున్నాయి. వాటిలో మానవ లోకము ఒకటి. సురలోకంలో ఐరావతం ఉన్నట్లు, మానవ లోకంలో వృషభం ఉంది. దేవ లోకంలో కోరింది పొందటానికి కల్పవృక్షము ఉంటే, మానవ లోకంలో తాను ఆశించిన దానిని పొందుటకు అనుగుణంగా కర్మాచరణము ఉంది. కర్మాచరణము సాగటానికి ఆధారంగా ధర్మం ఉంది. ధర్మబద్ధంగా కర్మాచరణము సాగటానికి పరమేశ్వరుడు సృష్టించిన విధానమే చాతుర్వర్ణ్య వ్యవస్థ. చాతుర్వర్ణ్యం అంటే నాలుగు వర్ణాలు అని అర్థం. ***(చత్వారః ఏవ వర్ణాః చాతుర్వ ర్ణ్యమ్).*** ఈ చాతుర్వర్ణ్య వ్యవస్థ మానవ లోకంలో ఉందే గాని మరొక లోకంలో లేదు. మానవ లోకం కర్మక్షేత్రం కావడమే దీనికి ప్రధాన కారణము.

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనే నాలుగు వర్ణముల వారిని పరమేశ్వరుడు సృష్టించాడు. ఈ వర్ణ విభజనము ఎలా జరిగింది? అని ప్రశ్నించుకుంటే, దానికి సమాధానం కూడా తానే చెబుతున్నాడు. వారి వారి గుణాలను బట్టి, వారు వారు ఆచరించే కర్మలను దృష్టిలో ఉంచుకొని వర్ణ విభజన చేశాడట భగవంతుడు. అంటే వర్ణవిభజన అనే విషయంలో గుణకర్మలే ప్రధాన మని తెలుస్తూ ఉంది. ఈ విషయాన్ని కొద్దిగా చర్చించుకొని ఆ తరువాత శ్లోక వైభవాన్ని చూద్దాం.

గుణము అనేది అంతఃకరణమునకు సంబంధించింది. కర్మ అనేది కార్యకరణ సంఘాతము ద్వారా ఆచరింప బడేది. కర్మ ఏదైనా, దానిని ఆచరించడానికి ముందు ఆ కర్మకు సంబంధించిన జ్ఞానము సంకల్ప రూపంలో మనస్సులో ఉంటుంది. అంతేకాదు. కర్మఫలము కూడా ఊహించబడి ఉంటుంది. ఈ విధంగా ఊహలు నడిచే చిత్తము గుణ ప్రధానంగా ఉంటుంది. గుణ ప్రధానమైన భావాలే బాహ్యంలో కర్మలుగా ఆచరింప బడుతాయి. అలా ఆచరింప బడిన కర్మలకు కాలంలో ఫలాలు అందుతాయి.

***యత్క్రతు ర్భవతి తత్కర్మ కురుతే***
***యత్కర్మ కురుతే త దభిసంపద్యతే॥***

బుద్ధిలో ఏ సంకల్పము నిశ్చయమైతే, దానినే మనిషి ఆచరిస్తాడు. ఏ కర్మను ఆచరిస్తాడో దానికి సంబంధించిన ఫలితాన్నే పొందుతాడు.

భారతీయ జీవనంలో కర్మలనే నదులన్నీ జ్ఞానమనే సాగరంలో విలీన మయ్యేందుకే ఉన్నాయి. ఈ సత్యాన్ని మున్ముందు చెప్పబోతాడు *(4 - 33).* కేవలం చిత్తశుద్ధి కొరకే ఆచరింపబడే కర్మలన్నీ మోక్షం వైపే దృష్టిని సారిస్తాయి. కనుక, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు గుణానుసారం విభిన్నమైన కర్మలను ఆచరిస్తూ ఉన్నట్లు కనిపించినా, ఆయా కర్మల ద్వారా నలుగురూ ఆశించే అంతిమ ఫలం నారాయణుడే. మోక్షమే. ఈ సత్యాన్ని మూడవ అధ్యాయం లోనే స్పష్టం చేశాడు కూడా. అర్జునా! మానవు లందరూ అన్ని విధాల నా మార్గాన్నే అనుసరిస్తున్నారు *(3 - 23)* అని భగవంతుడు సుస్పష్టం చేశాడు.

అందరూ ఒకే గమ్యం వైపు సాగుతున్నారు. ఎందుకని? అందరూ ఒక చోట నుండే ఆవిర్భవించారు కనుక. నాలుగు వర్ణాలుగా తెలుస్తున్నా, ఆ నాలుగు వర్ణాల వారు ఒక్క పరమేశ్వరుని నుండే ఉద్భవించారు. పుట్టక ముందు పరమేశ్వరుని లోనే ఉన్నారు. మరి అక్కడ కూడా వర్ణాలు ఉన్నాయా? నాలుగు వర్ణాలను నేనే సృజించాను అంటున్నాడు కనుక, వర్ణాలు సృష్టిలో వచ్చాయే గాని, సృష్టికి ముందు పరమేశ్వరునిలో లేవు

అని అర్థము. ఇదే వాస్తవ మైతే, పుట్టినవి లేకనే పుట్టాయి అని అర్థము. లేనివి ఎలా పుడుతాయి? ఉండే ఉండాలి. ఉన్నవే అయితే అవి మళ్ళీ పుట్టే దేముంటుంది? ఉన్నవి కనుకనే పుట్టాయి. కాకపోతే, నాలుగు వర్ణాలుగా లేవు. సృష్టికి ముందు భగవంతుడు ఒక్కడే ఉన్నాడు కనుక **(సృష్టేః ప్రాక్ సదేవ ఆసీత్)** ఒకే వర్ణం ఉండింది. గుణాతీతంగా, కర్మాతీతంగా శోభిస్తూ ఉండింది. సృష్టి జరిగిన తరువాత సృష్టిలో అన్ని రూపాలు ఒక్క నారాయణుడే కనుక, ఆ పూర్ణ రూప నిర్గుణ వర్ణమే చాతుర్వర్ణ్యంగా ఆవిర్భవించింది.

**ఏక వర్ణం ఇదం పూర్ణం విశ్వమాసీత్ యుధిష్ఠిర**
**కర్మ క్రియా విశేషేణ చాతుర్వర్ణ్యం ప్రతిష్ఠితమ్ ॥**

మొదట ఈ విశ్వము ఒకే వర్ణంగా ఉండింది. ఆ తరువాత, కర్మ క్రియా విశేషం చేత నాలుగు వర్ణాలుగా విభజింప బడింది అని వ్యాసప్రోక్తం. కనుక సృష్టికి ముందు ఒకే భగవంతుడు ఉండటం చేత ఒకే వర్ణం ఉండింది. ఏకమైన నారాయణుడే సృష్టిలో అనేక రూపాలుగా శోభించినట్లు, పూర్ణమైన నిర్గుణ వర్ణమే గుణ సహితమై నాలుగు వర్ణాలుగా గోచరించింది. విశ్వం లోని నామరూపాలన్నీ నారాయణుని వైభవాలే. చాతుర్వర్ణ్యములు కూడా అంతే. వర్ణాలు నాలుగైనా, ఆ నలుగురిలో ఉన్నది నారాయణుడే. విశ్వం లోని రూపాలన్నీ నారాయణునివే కనుక రూపాల మధ్య భేదము గౌణమే గాని వాస్తవము కాదు. అలాగే గుణకర్మ విశేషం చేత నాలుగు వర్ణాల వారి కర్మాచరణములో, జీవన విధానములో భేదము కనిపించినా స్వరూపతః అభేదమే దివ్యంగా అందరిలో ప్రకాశిస్తూ ఉంది. ధర్మనిర్వహణ కొరకు విశాల దృక్పథంతో పరమేశ్వరుని చేత సృష్టింప బడిన వర్ణవ్యవస్థ భేదాలకు, వాదాలకు విలక్షణ మైంది. అతీతమైంది. ఈ మాత్రం అవగాహన బుద్ధిలో నిలిస్తే, చాతుర్వర్ణ్య వ్యవస్థను అర్థం చేసుకోవడం కష్టమేమీ కాదు.

**వర్ణ విభాగము**

చాతుర్వర్ణ్యం అంటే నాలుగు వర్ణాలు అని తెలుసుకున్నాం. అవే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణాలు. సుస్థిరమైన ధర్మయుత సమాజానికి కావలసిన బుద్ధిబలము, పాలనావ్యవస్థ, ఆర్థిక సుస్థిరత, మానవశక్తి - ఈ మొత్తము వర్ణవ్యవస్థలో దివ్యంగా భాసిస్తూ ఉంది. గుణంతో జనం - జనంలో విభజనం ఈ వర్ణవ్యవస్థలో కనిపిస్తుంది.

గుణాలు అంటే సత్త్వరజ స్తమోగుణాలు ***(గుణాః సత్త్వరజ స్తమాంసి).*** ఈ మూడు గుణాలు నాలుగు వర్ణాల వారి లోనూ ఉంటాయి.

బ్రాహ్మణునిలో సత్త్వగుణము ప్రధానంగా ఉంటుంది. శమదమాదులు అతని నుండి వ్యక్తమయ్యే కర్మలు.

క్షత్రియునిలో సత్త్వగుణము అప్రధానంగా ఉంటుంది. రజోగుణము ప్రధానంగా ఉంటుంది. శౌర్యము, తేజము కర్మలుగా అతని నుండి వ్యక్త మవుతాయి.

రజోగుణము ప్రధానం గాను, తమస్సు అప్రధానం గాను ఉన్న వైశ్యుని నుండి వ్యవసాయము, వాణిజ్యము మొదలైన కర్మలు వ్యక్త మవుతాయి.

రజస్సు అప్రధానంగా ఉండి తమస్సు ప్రధానంగా ఉన్న శూద్రుని నుండి శుశ్రూష (సేవ) అనే కర్మ వ్యక్త మవుతుంది. ఈ విధంగా సత్త్వాది గుణములు, శమాది కర్మల విభజనము చేత చాతుర్వర్ణ్య వ్యవస్థ ఏర్పడింది.





త్రిగుణములు ప్రతి వ్యక్తి లోను ఉంటాయి. సత్త్వగుణము ప్రధానంగా ఉన్నవారిలో జ్ఞానము ప్రకాశిస్తూ ఉంటుంది. రజోగుణము ప్రధానంగా ఉండేవారిలో కర్మాచరణము ఎక్కువగా కనిపిస్తూ ఉంటుంది. తమోగుణము ప్రధానంగా గల వారిలో సోమరితనము, నిద్ర ఎక్కువగా చోటు చేసుకుంటాయి. ఈ మూడు గుణాల సమ్మేళనం లోని ప్రాధాన్యతను బట్టి వర్ణ విభాగము ఏర్పడింది. ఆయా వర్ణాల వారు గుణప్రేరితులై, తత్సంబంధిత కార్యాలను ఆచరిస్తూ ఉంటారు.

| వర్ణము | గుణము | కర్మ |
|---|---|---|
| (1) బ్రాహ్మణులు : | సత్త్వ రజస్తమోగుణాలు క్రమ ప్రాధాన్యం కలిగి ఉంటాయి. అంటే, సత్త్వగుణము ప్రధానం గాను, రజోగుణము అప్రధానం గాను, తమోగుణము మరీ అముఖ్యం గాను ఉంటాయి. | స్వభావజనిత శమదమాది సాత్త్విక కర్మలు, వివేక విచారాలు, ధ్యాన తపస్సులు, సహనశీలాదులు బ్రాహ్మణుని కర్మలు. |
| (2) క్షత్రియులు : | రజస్సత్త్వ తమో గుణాలు క్రమ ప్రాధాన్యం కలిగి ఉంటాయి. అంటే, రజోగుణము ప్రధానం గాను, సత్త్వగుణం అప్రధానం గాను, తమోగుణము మరీ అముఖ్యం గాను ఉంటాయి. | శౌర్యతేజములు, ధైర్యసాహసములు, రాజ్యపాలన మొదలైనవి క్షత్రియుని కర్మలు. |
| (3) వైశ్యులు : | రజ స్తమో స్సత్త్వములు క్రమ ప్రాధాన్యంలో ఉంటాయి. అంటే, రజోగుణం ప్రధానం గాను, తమోగుణం అప్రధానం గాను, సత్త్వగుణం మరీ అముఖ్యం గాను ఉంటాయి. | వ్యవసాయము, వ్యాపారము, గో సంరక్షణము వైశ్యుని కర్మలు. |
| (4) శూద్రులు : | తమో రజ స్సత్త్వ గుణములు క్రమ ప్రాధాన్యంలో ఉంటాయి. అంటే, తమో గుణము ప్రధానం గాను, రజో గుణము అప్రధానం గాను, సత్త్వగుణం మరీ అముఖ్యం గాను ఉంటాయి. | పరిచర్యాది సేవారూప కర్మలు. |

గుణకర్మలను అనుసరించి ఏర్పడిన ఈ చాతుర్వర్ణ్య వ్యవస్థ ప్రతి సమాజం లోను ఉంటుంది. అన్ని దేశాల లోను అగుపిస్తుంది. అప్పుడే సమాజాభ్యుదయం వెల్లి విరుస్తుంది.

ప్రతి సమాజంలో ఔన్నత్యాన్ని ఆవిష్కరించే మేధావి వర్గం ఉండాలి. ఉండి తీరాలి. వారినే మన దేశంలో బ్రాహ్మణులు అంటున్నాం. అలాగే శౌర్య పరాక్రమాలు కలిగి, శాంతిభద్రతలను కాపాడుతూ, శాసన వ్యవస్థను నియంత్రిస్తూ ప్రజలను రక్షించే వారు చాలా అవసరం. వారినే క్షత్రియులు అన్నది భారతీయ సమాజం. పాడిపంటలను, గోసంపదను, వాణిజ్యాన్ని ధర్మబద్ధంగా సాగించి సమాజంలో ఆర్థిక సంక్షోభాన్ని లేకుండా చేసేవారు కూడా ఉండాలి. వారినే వైశ్యులు అన్నాం. కరచరణాదుల ద్వారా శ్రమించి, సమాజ అభ్యుదయానికి బాటలు వేసే శ్రామిక వర్గాన్ని శూద్రులు అన్నాము. ఇదే చాతుర్వర్ణ్య వ్యవస్థ. ఈ విధమైన పేరుతో పిలవక పోయినా, ఈ వ్యవస్థ మాత్రం ప్రతి దేశం లోను ఉంది. దీని వల్లనే సమాజ కళ్యాణం జరుగుతుంది.

ఇంకా కాస్త లోతుగా చూస్తే, ప్రతి వ్యక్తి జీవితం లోను, జీవనం లోను గుణకర్మలు కదుల్తూ కనిపిస్తాయి. ప్రతి వ్యక్తి బాల్య, యౌవన, వార్ధక్యాది దశలలో పయనిస్తూ జీవితాన్ని సాగిస్తూ ఉంటాడు. శిశువుగా ఉండేటప్పుడు ఏ జ్ఞానం లేకుండా బ్రతుకుతూ ఉంటాడు. అది తమోగుణ ప్రధానమైన జీవనదశ.

వ్యక్తి పెరుగుతూ ఉంటే బాధ్యతలను అర్థం చేసుకుంటూ, ధర్మ మార్గంలో కర్మాచరణము చేస్తూ ఉంటాడు. అది రజోగుణ ప్రధానమైన దశ.

వయస్సు పెరిగే కొద్ది విజ్ఞానము విస్తరించి, బుద్ధి వికసించి, జీవిత లక్ష్యాన్ని గుర్తించి, జ్ఞానయుతంగా జీవించడం ప్రారంభిస్తాడు. ఇది సత్త్వగుణ ప్రధానమైన దశ. బాల్య యౌవన వార్ధక్యాది దశలలో క్రమంగా జీవి తన మనుగడను సాగించినట్లు, తమోగుణ ప్రధానులైన వారు, రజోగుణ ప్రధానులు గాను, రజోగుణ ప్రధానులైన వారు సత్త్వగుణ ప్రధానులు గాను ప్రగతిని సాధించి, ఆ తరువాత జ్ఞాననిష్ఠాపరులై పరమేశ్వరుని పొంది తరించాలి. గుణవిభాగము విశదమైతే, వ్యక్తులలో దోష నివారణము జరిగి తీరుతుంది.

ఇకపోతే, ప్రతి మనిషి మనస్సు త్రిగుణ మిళితమై ఉంటుంది కనుక, చాతుర్వర్ణ్య వ్యవస్థ గుణప్రధాన మైనందున, ఈ నాలుగు వర్ణాల లోని గుణ వికారములను, కర్మ విన్యాసాలను పరిశీలించి చూస్తే, అవి ప్రతి వ్యక్తి లోనూ కనిపిస్తాయి. ప్రతి వ్యక్తి జీవన విధానం లోనూ ఈ నాలుగు వర్ణాలు, ఆయా గుణ కర్మలు ప్రస్ఫుటంగా గోచరిస్తాయి.

ఎప్పుడూ చేయలేక పోయినా, ఎప్పుడో ఒకప్పుడు, ఏదో ఒక కాలంలో ప్రతి మనిషి చక్కని ఆలోచనా విధానాన్ని, విచార దృక్పథాన్ని కలిగి ఉంటాడు. ఆ దశలో, ఆ స్థితిలో ఆ వ్యక్తి బ్రాహ్మణుడే.

నిత్యము అనేక కర్మలను ఆచరించే మానవుడు అనేక సన్నివేశాలలో, సమయాలలో నియంత్రించే స్థాయిలో ఉంటాడు. అలాంటి చోట అతడెవరో కాడు. క్షత్రియుడే.

అలాగే, వృత్తి వ్యాపార వ్యవహారాదుల యందు చక్కని కుశలత్వము కలిగి, ఆదాయ వనరులను విస్తృత పరచుకొనే దశలో ఆ వ్యక్తి ఎవరో కాడు. వైశ్యుడే.

ఇకపోతే, గృహకృత్యాలు, అలాగే స్నానాదులు మొదలైన కార్యక్రమాలను వీక్షించి నపుడు పరిచర్య రూపంలో గోచరించే ఆ కర్మల్ని ఆచరించే వ్యక్తి శూద్రుడుగా తెలుస్తాడు.

కనుక నాలుగు వర్ణాలు సృష్టిలో ఉన్నాయి. ఈ నాలుగు వర్ణాల వారి గుణకర్మలను పరిశీలించి అర్థం చేసుకు న్నప్పుడు, ప్రతి వ్యక్తిలో మూడు గుణాలతో పాటు నాలుగు వర్ణాల వారు కూడా ఉన్నట్లు బోధ పడుతుంది. తత్సంబంధిత కర్మలు కూడా కనిపిస్తాయి. ఈ విధంగా అంతటా అల్లుకు పోయిన అందమైన వ్యవస్థ కనుకనే ఈ వర్ణ వ్యవస్థను పరమేశ్వరుడు సృజించవలసి వచ్చింది ***(మయా గుణకర్మ విభాగశః చాతుర్వర్ణ్యం సృష్టం).***

మరి, పరమేశ్వరుడే ఈ చాతుర్వర్ణ్యమును సృష్టించి నపుడు, దానిని అలా సృష్టించాలి అనే భావన ఉండాలి కదా! ముందు ఆలోచన కదిలితేనే గదా ఆచరణ సాధ్య పడుతుంది. కర్మను ఆచరించడంలో ఫలం అంతర్భూతమే కదా! కర్మఫలంతో సంబంధం ఉన్నప్పుడు తాను కర్త అవుతాడు కదా! కర్మఫలంతో సంబంధం ఉంటే, పరమేశ్వరుడు కూడా బద్ధు డవుతాడే గాని, నిత్యముక్తు డెలా అవుతాడు? ఈ ప్రశ్నను పరిహరిస్తూ, శ్లోకం యొక్క ఉత్తరార్థంలో ఈ చాతుర్వర్ణ్యానికి తాను కర్తనే అయినా, వాస్తవానికి తాను అకర్తే నని తెలుపు తున్నాడు ***(తస్య కర్మణః కర్తారం అపి సన్తం మాం పరమార్థతః విద్ధి అకర్తారమ్).*** తాను కర్తే అయితే నిత్యుడు కాలేడు కనుక అకర్త యైన తాను అవ్యయుడు అని కూడా చెబుతున్నాడు ***(అతః ఏవ అవ్యయమ్ మాం విద్ధి).***





## చేసినా చేయని వాడే

చాతుర్వర్ణ్యములు తన సృష్టియే నని పరమేశ్వరుడు చెప్పడం చేత, ఈ విధమైన కర్మకు ఈశ్వరుడే కర్తయని భావిస్తారు. అది సత్యం కాదు. కర్మ ఎవరు చేసినా దాని వెనుక ఫలాసక్తి ఉండాలి. పరమేశ్వరుడు ఏ ఫలాన్ని ఆశించి కర్మ చేయాలి? దేనిని ఆశించినా, తనకు లేని దానినే ఆశించాలి. భగవంతునికి లేని దేముంటుంది? ఏది లేదని ఆశించి భగవంతుడు కర్మ నిర్వహించాలి? కనుక ఏ విషయం లోను భగవంతుడు కర్త కాలేడు. ఆయన ఎప్పుడూ అకర్తే.

మరి, నాలుగు వర్ణాలను తానే సృష్టించినట్లు చెబుతున్నాడు కదా! అలాంటప్పుడు ఆయన కర్త ఎలా కాకుండా పోతాడు? అనేది శంక.

భగవంతుడు అద్వయుడు. రెండు తెలియని వాడు. అఖండమైన వాడు. అనంతుడు. అనంతుడైన వానిలో కర్మాచరణము జరిగే అవకాశము లేదు. కనుక, ఆయన నిష్క్రియుడు. అకర్త. ఏ విధమైన వికల్పము, చలనము లేని అద్వయాత్మ ***(వికల్పో న హి వస్తు).***

వివిధ ప్రత్యయ గమ్యమైన విశ్వము ద్వైతరూపము. మాయాస్వరూపము. మాయ, మాయ చేత కల్పింప బడిన ఈ విశ్వమునకు పరమేశ్వరుడు విలక్షణుడు. జగత్తుకు మాయ ఆధారము. కాని జగత్తుకు ఆధారమైన మాయ పరమేశ్వరుని ఆశ్రయించుకొని ఉంది. మాయను తన అధీనంలో ఉంచుకున్న పరమేశ్వరుడు మాయను ఉపాధిగా కలిగి ఉన్నాడు. ఉపాధిగా మాయ ఉంది అంటే, మాయను ఉపాధిగా కలిగిన ఈశ్వరుడు ఉన్నాడని భావము. మాయ యొక్క మనుగడకు ఈశ్వరుడు ఆధారము. కాని, మాయ లేకపోయినా ఈశ్వరుడు ఉంటాడు.

జగత్తు మాయాకార్యం అని అర్థం చేసుకున్నాం. మాయ చేసిన కార్యాన్ని మాయకు ఆశ్రయమైన ఈశ్వరునిలో ఆరోపించడం చేత ***(మాయా సంవ్యవహారేణ)*** ఈశ్వరుడు కర్తగా తెలుస్తున్నాడు. వ్యవహార దృష్టిలో కర్తగా తెలుస్తున్నా, మాయా కార్యమైన జగత్తు, జగత్కారణమైన మాయ రెండూ లేని స్థితిలో పరమేశ్వరుడు స్వరూప వైభవముతో దివ్యంగా, అద్వయుడై ప్రకాశిస్తున్నాడు. ఈ పరమార్థ స్థితి నుండి చూచి నపుడు, మాయాకార్య మైన జగత్తే లేనిది కావడం చేత, పరమేశ్వరుడు అకర్తగా అర్థ మవుతాడు.

కనుక, వ్యవహార దృష్టిలో కర్తగా తెలిసిన పరమేశ్వరుడు, పరమార్థ దృష్టిలో అకర్తగా శోభిస్తున్నాడు. ఏదీ చేయని అకర్త యైన పరమేశ్వరుడు, మాయా దృష్టి కోణం నుండి చూసినపుడు చేసిన వాడుగా, కర్తగా తెలుస్తున్నాడు. నిష్క్రియ రూపుడైన పరమేశ్వరుని కోణం నుండి చూసి నపుడు చేసినా చేయని వాడుగా శోభిస్తున్నాడు.

కత్తిపీట ముందు కూర్చుని కూరగాయలు తరిగేవాడు ఆదమరచి ఒక దశలో చేతిని కోసుకుంటాడు. ఈ దశలో కత్తిపీటను, 'నా చేతిని ఇలా కోసిం దెవరు?' అని ప్రశ్నిస్తే, కత్తిపీట ఏం చెబుతుంది? 'నేనే' అంటుంది. 'మరి, నా చేతిని ఎందుకని ఇలా కోసావు?' అని మళ్ళీ అడిగితే, 'నీ చేతిని నేను కోయలేదు' అంటుంది.

కత్తిపీట ఒకసారి తానే కర్త అని చెబుతూ ఉంది. మరొకసారి తాను అకర్త అంటూ ఉంది. దీనిని ఎలా అర్థం చేసుకోవాలి? చేతిని గాయ పరచింది కత్తిపీటే గాని మరొకటి కాదు. అలా చూచి నపుడు గాయ పరచినది కత్తిపీటే కనుక అది కర్త అవుతుంది. కాని, అలా కోయాలని కత్తిపీట ప్రయత్నించిందా? పరధ్యానంలో కూరగాయలు కోసేవాడు ఆదమరచి అవస్థల పాలయ్యాడు. జాగ్రత్తగా కోసి ఉంటే ఈ దురవస్థ ప్రాప్తించేది

కాదు. కత్తిపీటలో కర్తృత్వ భావన లేదు కనుక అది కర్త కాదు అకర్తే. కత్తిపీట వల్ల నీకు ఏమి జరిగింది అని చూచినపుడు, కత్తిపీట కర్తగా కనిపిస్తూ ఉంది.

అలాగే వర్ణవ్యవస్థను సృష్టిలో పరమేశ్వరుడే ఏర్పరచినాడు అన్నప్పుడు ఆయనే కర్తగా అర్థ మవుతాడు. ప్రపంచ స్థాయి నుండి చూచి నపుడు పరమేశ్వరుడు కర్తగాను, అసంగుడు, నిష్క్రియుడు అయిన పరమేశ్వరుని స్థాయి నుండి చూచి నపుడు అకర్త గాను భాసిస్తున్నాడు.

ఇలా చూచినపుడు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులను అలా సృష్టించడంలో పరమేశ్వరునికి వైషమ్యం ఉంది కనుక, ఆయన ఈశ్వరత్వమునకు భంగం వాటిల్లినట్లు భావించడం సరియైనది కాదు. ఎవరు ఏ వర్ణంలో జన్మించినా, దానికి కారణము గుణభేదము, కర్మభేదమే గాని ఈశ్వరునిలో భేదదృష్టి ఉండి కాదు. ఈశ్వరుడు కర్మఫల ప్రదాతయే గాని గుణదోషాలకు, జన్మకర్మలకు సంబంధించిన వాడు కాదు.

**అంతా అవ్యయమే**

కర్తగా కనిపించినా, అకర్తగా ప్రకాశించడం చేత పరమేశ్వరుడు వ్యయం లేనివాడు. వ్యయం తెలియని వాడు. అందుచేత అవ్యయుడు ***(అతః అవ్యయమ్. అసంసారిణం).***

కర్మాచరణములో ఫలాసక్తి ఉంటుంది. ఫలాసక్తి ఉన్నప్పుడు కర్మాచరణములో శ్రమ ఉంటుంది. కర్మ చేయడంలో కర్త శక్తిని వ్యయం చేస్తాడు. కర్మ చేస్తూ, అలా చేయడంలో శక్తిని పోగొట్టుకుంటూ, ఒక దశలో అన్నీ అనుకూలిస్తే ఫలాన్ని అందుకుంటాడు. శ్రమించనిదే ఫలం సిద్ధించదు. శ్రమలో ఎప్పుడైనా, ఎక్కడైనా వ్యయమే ఉంటుంది. కనుక, కర్మాచరణములో కాలం వెళ్ళబుచ్చే మనం శక్తిని వ్యయం చేసుకుంటూ ఒక దశలో మనమే వ్యయమై పోతున్నాం.

పరమేశ్వరుడు మన లాగా ఖర్చయి పోయే కర్త కాదు. అవ్యయకర్త. కారణం, ఆయన కర్మలలో ఫలాసక్తి లేదు. కర్తృత్వ భావన లేదు. కనుక తాను నశింపు నెరుగడు ***(అవ్యయమ్).*** వ్యయ మయ్యేది ఏదైనా కాలానికి కట్టుబడి ఉంటుంది. అదే సంసారం. అవ్యయ మైనది కాలంలో చిక్కదు. కాలానికి లొంగుడు పడదు. కాలాతీతంగా ఉంటుంది. కనుక అది అసంసారం. పరమేశ్వరుడు అవ్యయుడు కనుక అసంసారి ***(అసంసారిణం).*** అవ్యయుడైన పరమేశ్వరుడు రూపాన్ని ధరించి జన్మించినా, నిష్క్రియుడైన భగవంతుడు కర్మలలో ప్రవర్తించినా, జగత్తు లోని ప్రాణులను కార్యోన్ముఖులను చేయుట కొరకే గాని, అనంతుడైన పరమేశ్వరునికి కర్మబంధము ఉంటుందా? అని ప్రశ్నించింది పోతన భాగవతము.

**మ॥ జననం బెందును లేని ఈశ్వరుఁడు దా జన్మించుటెల్ల న్వరో**
**ధినిరాసార్థము వీత కర్ముఁడగున ద్దేవుండు కర్మప్రవ**
**ర్తనుఁడౌటెల్లఁ జరాచర ప్రకటభూత శ్రేణులం గర్మ వ**
**ర్తనులం జేయఁదలచి కాకకలవే దైత్యారికిం గర్మముల్ ॥**

*కనుక పరమేశ్వరుని యందు కర్మలు లేవు. ఆయన కర్తగా తెలుస్తున్నా, స్వరూపతః అకర్తే. కర్మలలో భగవంతుడు ఉన్నా, ఆయన నుండి కర్మలు కదిలినా కర్మలు ఆ దివ్యాత్మని అంటలేవు. ఎందువలన? చెబుతున్నాడు.*





న మాం కర్మాణి లిమ్పన్తి న మే కర్మఫలే స్పృహా ।
ఇతి మాం యోఽభిజానాతి కర్మభి ర్న స బధ్యతే ॥ 14

*న-మాం-కర్మాణి-లింపంతి-న-మే-కర్మఫలే-స్పృహా*

*ఇతి-మాం-యః-అభిజానాతి-కర్మభిః-న-సః-బధ్యతే*

| | | | | | |
|---|---|---|---|---|---|
| కర్మాణి | = కర్మలు | | ఇతి | = | ఈ విధంగా |
| మాం | = నన్ను | | మాం | = | నన్ను |
| న లింపంతి | = అంటవు | | యః | = | ఎవడు |
| మే | = నాకు | | అభిజానాతి | = | తెలుసుకుంటాడో |
| కర్మఫలే | = కర్మఫల మందు | | సః | = | వాడు |
| స్పృహా | = కోరిక | | కర్మభిః | = | కర్మల చేత |
| న | = లేదు | | న బధ్యతే | = | బద్ధుడు కాదు |

**నన్ను కర్మలు అంటవు. నాకు కర్మ ఫలముపై ఆశ లేదు. ఇలా నన్ను తెలుసుకున్న వాణ్ణి కర్మలు బంధించ లేవు.**

**వ్యాఖ్య**

మనిషి పీల్చే గాలి మహిలో ఉన్నదే. ఉన్నదానినే పీలుస్తున్నాం. పీల్చిన దానినే తిరిగి బయటికి విడుస్తున్నాం. ఈ లోగా అది నా శ్వాస అంటున్నాం. పీల్చక ముందు ఆ గాలి నాది కాదు. విడిచిన తరువాత నాదిగా ఉండదు. మధ్యలో అది నాది ఎప్పుడైంది? ఏదైనా ఈ ప్రపంచంలో 'అది'గా ఉందే గాని 'నాది' గా లేదు. 'అది' తెలిస్తే 'నాది' ఉండదు. 'నాది' అన్నప్పుడు 'అది' తెలిసిరాదు.

చెట్టులో పండిన పండు నేను రసపూర్ణంగా ఉన్నాను అనుకోవచ్చు. కాని ఆ పండు లోని రసం చెట్టు యొక్క సారమే అనే సత్యం పండుకు అర్థం కావాలి. అది అర్థమైతే పండు లోని రసం చెట్టు యొక్క సారంగా ఉంటుంది. అది అర్థం కానపుడు రసం పండుకు సంబంధించిందిగా ఉండి, 'నాది - నా రసం' అనిపిస్తుంది.

ఏ చిన్న కెరటం శబ్దం చేసినా వాస్తవానికి అది కడలి యొక్క శబ్దమే. అది అర్థమైతే కెరటం కడలిగా శోభిస్తుంది. అర్థం కానపుడు తాను వేరు - కడలి వేరు అనుకుంటుంది. తన ద్వారా ఏర్పడిన సవ్వడి మరొక కెరటం యొక్క సవ్వడి కన్నా భిన్నమని భావిస్తుంది. పూర్ణత్వం నుండి విడిపోయి పరిమితంగా బ్రతుకుతుంది. ఇదే బంధం.

అలకు అస్తిత్వం ప్రత్యేకంగా లేదు. అబ్ధి నుండి అల ఎప్పుడూ వేరు కాదు. వేరుగా లేదు. ఇది అర్థమైతే, ప్రత్యేక అస్తిత్వం లేని అలకు ప్రత్యేకంగా కర్మ లేదు. ఈ సత్యం అర్థం కాకపోవడం చేత కర్మలు మనల్ని భయపెడు తున్నాయి. కర్మలు బంధిస్తాయి అనే భావన మనలో దృఢంగా నాటుకు పోయింది. ఈ భావనే భయహేతు వైంది.

కర్మ బంధిస్తుంది. కనుక, నేను కర్మను ఆచరించను. ఆచరించ లేను. నాకు కర్మ విముక్తి కావాలి అని ఆలోచిస్తూ ఉంటాం. ఈ ఆలోచనను గీత అంగీకరించదు. కర్మ మనిషిని బంధించదు, బంధించలేదు అనేది గీతా హృదయం.

కర్మ బంధిస్తుందా? ఎవరి కర్మ బంధిస్తుంది? ఎవరి కర్మ ఎవరిని బంధిస్తుంది? నా కర్మ నిన్ను బంధిస్తుందా? నీ కర్మ నన్ను బంధిస్తుందా? ఎవరిదైనా కర్మ కర్మే కదా! కర్మ బంధించే దైతే ఎవరి కర్మ ఎవరినైనా బంధించవచ్చు. మా ఇంట్లో మూట కట్టుకోవడానికి మీ ఇంటి లోని త్రాడు ఉపయోగ పడటం

లేదా? బంధించే లక్షణము ఉన్నప్పుడు ఎవరిదైనా బంధిస్తుంది. ఎవరినైనా బంధిస్తుంది. అలాగని, ఈ తర్కాన్ని ఉపయోగించి ఒకరి కర్మలు మరొకరికి బంధహేతువులు అని చెప్పగలమా?

అదెలా సాధ్యం? నా కర్మ నన్ను బంధిస్తుంది. అతని కర్మ అతణ్ణి బంధిస్తుంది. ఆమె కర్మ ఆమెను బంధిస్తుంది. ఒకరి కర్మ మరొకరిని ఎలా బంధిస్తుంది? సరే. అలాగే అనుకుందాం. ఇంతకీ అర్థమైంది ఏమిటి? కర్మ నన్ను బంధించదు. 'నా కర్మ' నన్ను బంధిస్తుంది. అంతేనా?

ఇదే వాస్తవమైతే, బంధము లేనే లేదు. ఎందుకని? విశ్వంలో కర్మ లున్నాయే గాని 'నా కర్మలు' లేవు. నా కర్మలు లేవు కనుక నీ కర్మలు కూడా లేవు. ఆమె కర్మలు కూడా లేవు. ఎవరి కర్మలు కూడా ప్రత్యేకంగా లేవు.

కడలిలో కెరటా లున్నాయే గాని, ఏ కెరటమూ ప్రత్యేకంగా లేదు. ప్రపంచంలో ఒకే గాలి సంచరిస్తోంది. నేను పీల్చినంత మాత్రాన అది నా గాలిగా లేదు. నేను పీల్చే గాలి విశ్వానికి సంబంధించిందే. నేను తయారు చేసి పీల్చడం లేదు. కనుక గాలి ఉంది. నా గాలి లేదు. కెరటా లున్నాయి. నా కెరటం లేదు. అలాగే కర్మ లున్నాయి. నా కర్మలు లేవు.

ఇప్పుడు చెప్పండి. కర్మ బంధిస్తుందా? లేక నా కర్మ నన్ను బంధిస్తుందా? కర్మలు బంధించవు. బంధించలేవు. నా కర్మలే నన్ను బంధిస్తాయి. ఇదే వాస్తవ మైతే, నా కర్మలంటూ ప్రత్యేకంగా లేవు అని అర్థమైంది కనుక, బంధము కూడా లేనిదే అని తేలిపోయింది. ఇంతవరకు భారంగా ఉన్న కర్మ తేలికగా మారిపోయింది. ఈ అవగాహనలో అద్భుతమైన కార్యాలు కూడా అహంకారాన్ని సృష్టించ లేవు. ఈ విధమైన అవగాహన లోపించి నపుడు ప్రతి కర్మ వికృత రూపాన్ని ధరించి, బుద్ధిని విసిగిస్తూ ఉంటుంది. బ్రతుకును విడ్డూరంగా మార్చేస్తూ పోతుంది.

**బంధాలు - అందాలు**

కర్మలు బంధహేతువులే అయితే, ఎవరు ఏ కర్మ చేసినా, ఆ కర్మ చేత వారు బద్ధులై పోవాలి. స్వల్ప కర్మను ఆచరిస్తే బంధము స్వల్పంగా ఉంటే, బృహత్కర్మను ఆచరించిన వారికి బంధము భయంకరంగా ఉండాలి.

కర్మ ఎవరు చేసినా కర్మే. చీమ కర్మ చీమది. బ్రహ్మ కర్మ బ్రహ్మది. చీమ చిన్నది కనుక, దాని కర్మ కూడా చిన్నదే. కర్మ చిన్నది కనుక బంధము కూడా చిన్నదే. అలాగే బ్రహ్మ చాలా పెద్దవాడు. పెద్దవాడు చేసే కర్మ పెద్దది గానే ఉంటుంది. కర్మ బంధహేతు వైతే, బ్రహ్మ కూడా విశాలమైన సృష్టి కార్యాన్ని చేశాడు కనుక, అతని బంధము కూడా అనంతంగా ఉండాలి. అలా ఉందా? లేదు. బంధము అనంతంగా ఉంటే, దుఃఖం కూడా అనంతంగా ఉండాలి. భగవంతునిలో దుఃఖం ఉంటుందా? దుఃఖం ఉండేవాడు భగవంతుడు అవుతాడా? పరమేశ్వరుని అనంతానంద స్వరూపుడుగా కీర్తిస్తామే గాని, అనంత శోకమూర్తిగా ఎవ్వరూ స్తుతించ లేదు.

కర్మ బంధహేతువు అయితే, సృష్టికార్యము వలన భగవంతునికి కూడా బంధం ఏర్పడాలి. కాని భగవంతునిలో అందా లున్నాయే గాని బంధాలు లేవు. బంధాలు అందాలను చెడుపుతాయి. బంధాలు లేవు కనుక సృష్టిలో అందాలు చెడవు. చెడిపోవు.

'అనంతుడైన ఆదిదేవుని నుండి ఆదిలో ఆవిర్భవించింది నేనే. నేను ఆకాశాన్ని. నాకు బంధం లేదు. అనంతానికి సంకేతమైన నీలివర్ణము నాలో ఎప్పుడూ మాసిపోదు. నన్ను ఏదీ బంధించ లేదు. నాకు ఆద్యంతాలు లేవు. కర్మ లన్నీ నా లోనే ఆవిష్కరింప బడుతాయి. కాని, నన్ను అంటుకోలేవు. నేను లేని చోట కర్మలు ఉండవు. నేనుంటేనే కర్మలు. నా లోనే కర్మలు చలిస్తాయి. కాని, కర్మసంగం నాకు లేదు. ఏ కర్మ కూడా





నాది కాదు. నాది కాదు కనుక కర్మ నన్ను బంధించదు. అసంగుడైన పరమేశ్వరుని విభూతిగా శోభిస్తున్నాను కనుక నాకు కూడా కర్మలతో సంగత్వము లేదు. కర్మసంగము లేదు కనుక ఫలసంగము కూడా లేదు. నా కర్మ - నా కర్మఫలము అనేవి లేవు కనుక, నాలో కర్మ లున్నాయే గాని, నా కర్మలుగా లేవు. నా కర్మలుగా లేవు కనుక, నాకు కర్మఫల స్పృహ కూడా లేదు. కనుక బంధము లేదు. బంధము లేదు కనుక నాలో అంతా అందమే. ఆనందమే'. ఇదే అంతులేని ఆకాశం లోని అనంతానందము.

అనంతాకాశం లాగే అఖండ తేజో విరాజమానంతో ఆదిత్యుడు అగుపిస్తున్నాడు. కంటికి కనిపించకుండా మనస్సును ఉల్లాస పరుస్తూ వాయువు చలిస్తూ ఉంది. వినూత్నంగా మెరుస్తూ రాత్రిపూట ఆకాశంలో తారాపందిరి శోభిస్తోంది. చల్లని వెన్నెలను చిలికిస్తూ చంద్రుడు కనువిందు చేస్తున్నాడు.

పొద్దు పూచే సరికి పిల్లగాలి తాకిడికి చిరునవ్వులను చిందిస్తూ విరబూసిన పువ్వులు దివ్వెలుగా వెలుగు తున్నాయి. దూకే జలపాతాలు, పారే నదుల సవ్వడులు, కురిసే వానలు, మెరిసే మబ్బులు, ఎగిరే గువ్వలు, తిరిగే ఋతువులు, ఊగే తరువులు, పొదుగులో పాలు, పాలలో దాగిన మీగడలు, ఎండమావులు, నిండు బావులు, మ్రోగే కంచు, రాలే మంచు - అన్నిటినీ కళ్ళ ముందు ఆరబోసి, కళ్ళకు కనిపించక, ఆలోచనలకు అగుపించక, విశ్వవనాన్ని పెంచిన తోటమాలి ఎవరు? కనిపెట్టుకొని కాపాడే వనమాలి ఎవరు?

ఇంకెవరు? అతడే సృష్టికర్త. విశ్వకర్త. అసమాన స్రష్ట. అద్భుత ద్రష్ట. మనస్సు లేకనే విశ్వాన్ని నిర్మించిన విశ్వకర్మ ***(విశ్వకర్మా విమనాః).*** విశ్వ నిర్మాణ కార్యాన్ని నిర్వహించినా ఇసుమంతైనా కర్తృత్వము లేని కమనీయ వైభవమూర్తి. విచిత్ర నిర్మాణ శక్తి కలవాడు అయినందున పరమేశ్వరుడు విశ్వకర్మ అయ్యాడు ***(విచిత్ర నిర్మాణ శక్తిమత్త్వాత్ వా విశ్వకర్మా).*** కర్మ కౌశలమే గాని కర్తృత్వబుద్ధి లేనివాడు.

**కర్మ ఉంది - కర్త లేడు**

అసమానంగా, అనితర సాధ్యంగా సృష్టి కార్యాన్ని నిర్వహించిన కర్త పరమేశ్వరుడు. సృష్టికి కర్త ఉన్నాడు. కాని సృష్టికర్తలో కర్త లేడు.

కర్మ ఎవడు చేస్తాడో అతడు కర్త. కర్తకు కర్మ విలువ తెలుసు. కర్మకు లభించే ఫల మేమిటో తెలుసు. ఫలాసక్తి తోనే కర్త కర్మను ఆచరిస్తాడు. కర్మఫలము నందు కర్తకు ఆసక్తి ఉండటం చేత, కర్తను కర్మ అంటుకొని ఉంటుంది. కర్మఫలాసక్తి లేనపుడు కర్మలు ఆచరించినా అవి కర్తను అంటవు.

పరమేశ్వరుడు పూర్ణ పురుషుడు. పురుషోత్తముడు. సృష్టి కార్యము నందు ఫలాసక్తి లేనివాడు. తాను పొందవలసినది మరొకటి లేనందున, తనకు కర్మఫల స్పృహ లేదు. ఫలాసక్తి లేకుండా సృష్టి కార్యాన్ని నిర్వహిస్తున్నాడు కనుక తనను కర్మలు అంటవు ***(తదభావాత్ న మాం కర్మాణి లిమ్పన్తి).***

జగత్తు మాయ యొక్క కార్యము. కార్యరూప జగత్తుకు కారణమైన మాయను పరమేశ్వరుడు ఉపాధిగా గ్రహించి తన అధీనంలో ఉంచుకొని ఉన్నాడు. తాను స్వరూపతః అసంగుడు. కర్తృత్వ భోక్తృత్వాది ధర్మములు లేనివాడు. కర్తృత్వ బుద్ధి లేదు కనుక కర్మలు తనను అంటవు. కర్మఫలాల యందు స్పృహ లేనివాడు కనుక భోక్తృత్వ బుద్ధి కూడా లేనివాడు. అందుచేత పరమేశ్వరుడు కర్మకు కారణంగా తెలుస్తున్నా వాస్తవానికి కర్మలకు అంటకుండా ఉన్నాడు. కర్మబద్ధుడు కాడు.

నిజమే. విశ్వకర్మగా వెలుగొందు తున్నా పరమేశ్వరుని కర్మలు అంటవు. ఆయనకు కర్మఫలాసక్తి లేదు కనుక కర్మలు ఆయనను బంధించవు. మంచిదే. ఇదంతా భగవంతుని వైభవము. అది తెలియడం వల్ల మన కేమి ప్రయోజనము? ఎవరికో ఏదో ఉందని తెలుసుకోవడం వల్ల, ఆ తెలుసుకొనే వాడికి ఒరిగే దేమిటి? అనేది శంక. దానిని పరిహరిస్తున్నాడు.

### స్వామి కార్యము - స్వకార్యము

కర్మఫలాల యందు స్పృహ లేనందున కర్మలు ఈశ్వరుని అంటవు. ఈ విధంగా ఎవడైతే పరమేశ్వరుని తెలుసుకుంటాడో అతడు కూడా కర్మల చేత అంటబడడు అంటున్నాడు.

ఇక్కడ **జానాతి** అనడానికి బదులు **అభిజానాతి** అనడమే విశేషము. ఎవడు నన్ను తెలుసుకుంటాడో **(అభిజానాతి)** అంటే, ఎవడు నన్ను తన ఆత్మగా గుర్తిస్తాడో **(మాం ఆత్మత్వేన అభిజానాతి)** అతడు కూడా కర్మల చేత బంధింప బడడు అని అర్థము. ఆత్మజ్ఞానం కలవాడు కర్మలు ఆచరించినా, కర్మఫల స్పృహ లేనందున కర్మలకు అంటక పోవడమే గాక, తాను ఆచరించిన కర్మలు ఉత్తర జన్మహేతువులు కావు, నూతన దేహాలను పుట్టించవు అని అర్థము. జన్మ విచ్ఛేదనము జరుగుతూ ఉంది. పునర్జన్మ లేదు. అంటే, జన్మరాహిత్యము జరిగింది అని అర్థము. అదే బంధరాహిత్యము. నేనే పరమాత్మను అనే జ్ఞానం కలగటం చేత కర్మబంధము నుండి విడిపడి మోక్షాన్ని పొందుతున్నాడు అని అర్థము.

**తదేవాహం సదానందం బ్రహ్మైవాహం సనాతనమ్**

'సదానంద స్వరూపము, సనాతనము అయిన బ్రహ్మమును నేనే. నేను అదే అయి ఉన్నాను' అని పరమాత్మను తన ఆత్మగా తెలుసుకున్న ఆత్మవిదుని అనుభూతిని తేజోబిందూపనిషత్తు ప్రవచించింది.

*ఈ విధంగా పరమాత్మను తమ ఆత్మగా గ్రహించిన వారు గతంలో ఎందరో ఉన్నారు. వారందరూ ఈ మార్గాన చరించిన వారే. ఈ మార్గము సాంప్రదాయకంగా అందినదే గాని నూతనంగా సృష్టింప బడింది కాదు. కనుక కర్మఫల స్పృహ లేకుండా కర్మాచరణము సాగించాలే గాని, కర్మలను త్యజించ కూడదు అనే విషయాన్ని వివరిస్తున్నాడు.*

**ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వై రపి ముముక్షుభిః ।**
**కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్ ॥** 15

**ఏవం-జ్ఞాత్వా-కృతం-కర్మ-పూర్వైః-అపి-ముముక్షుభిః**
**కురు-కర్మ-ఏవ-తస్మాత్-త్వం-పూర్వైః-పూర్వతరం-కృతం**

| | | | |
|---|---|---|---|
| ఏవం | = ఈ విధంగా | త్వం | = నీవు |
| జ్ఞాత్వా | = తెలిసికొని | పూర్వైః | = పూర్వుల చేత |
| పూర్వైః | = పూర్వీకులైన | కృతం | = చేయబడిన |
| ముముక్షుభిః అపి | = ముముక్షువుల చేత సయితము | పూర్వతరం | = మిక్కిలి ప్రాచీనమైన |
| కర్మ | = కర్మ | కర్మ ఏవ | = కర్మనే |
| కృతం | = చేయబడింది | కురు | = ఆచరించు |
| తస్మాత్ | = అందుచేత | | |

**ఈ విధంగా తెలిసికొని, పూర్వము ఎందరో ముముక్షువులు కర్మల్ని ఆచరించారు. కాబట్టి నువ్వు కూడా వాళ్ళ లాగే పురాతన మైన కర్మనే ఆచరించు.**

**వ్యాఖ్య**

కర్మ ఫలాసక్తి లేని కారణంగా పరమేశ్వరుడు సృష్ట్యాది కర్మలను ఆచరించినా ఆ కర్మలు ఆయనను అంటలేక పోయాయి. ఈ విషయాన్ని గ్రహించిన వారు తాము కూడా ఫలాశను విడిచి, కర్మల నాచరించి, కర్మలు తమను అంటని కారణంగా బంధాల నుండి విడిపడి ముక్తు లవుతారు.





భగవంతుడు వాస్తవానికి కర్త కాడు. కర్మఫలము నందు ఆయనకు ఆసక్తి లేదు అని ఈ విధంగా **(ఏవం)** తెలుసుకొని **(జ్ఞాత్వా)** పూర్వీకుల చేత **(పూర్వైః)**, మోక్షాపేక్ష గల వారి చేత కూడా **(ముముక్షుభిః అపి)** కర్మ ఆచరింప బడింది **(కర్మకృతం)**.

### చేసి చూశారు

భగవంతుణ్ణి తెలుసుకోవడము అంటే, ఆయనను అకర్తగా, అభోక్తగా అర్థం చేసుకోవడము అని భావము. పరమాత్మ అకర్త, అభోక్త అని అర్థం చేసుకోవడము అంటే, ఆత్మను అకర్తగా, అభోక్తగా గుర్తించడము అని అర్థము. జీవాత్మ పరమాత్మలకు అభేదమే స్వరూపము కనుక, పరమాత్మను తెలుసుకోవడము అంటే, ఆత్మను అర్థం చేసుకోవడమే అవుతుంది. పరమాత్మ జ్ఞానము, ఆత్మజ్ఞానము అని రెండుగా లేవు. కనుక పరమాత్మ జ్ఞానమును పొందడములో సర్వజ్ఞానము సిద్ధిస్తుంది.

పరమాత్మ అనంతుడు కావడం చేత, పరమాత్మను తెలుసుకొనే వాడు పరమాత్మను అనంతుడుగా తెలుసుకోలేడు. ఎందుచేత నంటే, భగవంతుని యొక్క అనంత చైతన్యంలో తెలుసుకొనే తాను కూడా చేరిపోయాడు కనుక. తెలుసుకొనే వాడు పరమేశ్వరుని కన్నా వేరుగా ఉంటే కదా తెలుసుకుంటాడు? కనుక, అనంతుడైన భగవంతుని అర్థం చేసుకోవడము అంటే, భగవంతుని కన్నా తాను అన్యంగా లేడు అని అర్థం చేసుకోవడమే. ఇదే జ్ఞానము. బ్రహ్మాత్మజ్ఞానము. ఆత్మయే బ్రహ్మము అనే జ్ఞానము. ఇదే మోక్షము. దీనిని వాంఛించే వాడు ముముక్షువు. దానిని గ్రహించిన వాడు ముక్తుడు. ముక్తుడు అంటే బంధము నుండి విడిపడిన వాడు. నేను కర్తను - నేను భోక్తను అనే భావన నుండి విడిపడి, నేను అకర్తను - అభోక్తను అనే జ్ఞానంలో స్థిరపడిన వాడు.

బంధము భావనలో ఉందే గాని భౌతికంగా లేదు. బంధము భావనా ప్రధాన మైనపుడు, బంధము నుండి విడి పడటానికి కర్మలను విడిచిపెట్ట నవసరం లేదు. చేయడము కర్మ అయితే, విడిచి పెట్టడం కూడా కర్మే. కర్మను మానడంలో కర్మ చేయకుండా ఉండటం జరుగుతుందే గాని నైష్కర్మ్యం సిద్ధించడం లేదు. నైష్కర్మ్యం అంటే కర్మలను త్యజించడము కాదు. ఆత్మ అకర్త యని గుర్తించడం. ఈ విధమైన నైష్కర్మ్యం సిద్ధించిన వారు కర్మలు చేసినా చేయని వారే. ఈ అవగాహన లేనివారు చేయకుండా కూర్చోవచ్చు. అంతమాత్రాన అకర్తలు కాలేరు. కర్తృత్వ భోక్తృత్వ భావనలకు దూరులై కర్మాచరణము చేయడమే ఉత్కృష్ట మని గ్రహించిన వారు కనుక మన పూర్వీకులైన ముక్తులు కర్మల నాచరించారు. అలాగే ముముక్షువులూ కర్మల నాచరించారు **(పూర్వైః ముముక్షుభిః అపి)**.

ముముక్షువులు ఆత్మజ్ఞానం లేనివారు. ముక్త పురుషులు ఆత్మజ్ఞానులు. అలాంటప్పుడు ఉభయులూ ఎలా కర్మ లాచరించారు? అనే సందేహం కలుగవచ్చు.

ఆత్మజ్ఞానం లేని ముముక్షువులు ఆత్మజ్ఞానాన్ని పొందటానికి అనువైన అంతఃకరణశుద్ధి కొరకు కర్మలను ఆచరించారు **(అనాత్మజ్ఞః ఆత్మ శుద్ధ్యర్థం)**. ఆత్మజ్ఞానం కలిగిన ఆత్మవిదులు లోక సంగ్రహార్థం కర్మాచరణం చేశారు **(తత్త్వవిత్ చేత్ లోక సంగ్రహార్థం)**. కనుక అర్జునా! నువ్వు కూడా కర్మనే ఆచరించు **(తస్మాత్ కురు కర్మైవ త్వం)**. వివేకము గలవాడు ఇలాగే చేస్తాడు.

### చూసి చెయ్యొచ్చు

ఈ విధంగా మన పూర్వీకులు అలేప వాదాన్ని ఆశ్రయించుకొని కర్మలను ఆచరించారు. నువ్వు కూడా వారి మార్గాన్నే అనుసరించు అని అర్జునునికి బోధిస్తున్నాడు శ్రీకృష్ణుడు.

అలేప వాదము అంటే అంటని విషయము అని అర్థము. **లేపః** అంటే పూత. గోడకు సున్నము లేదా రంగును వేయడము పూత అంటారు. అంటే, అవి గోడకు అంటుకు పోతాయి. ఇదే లేపము. అలేపము అంటే అంటదు అని అర్థము. కర్మలు చేస్తూ కూడా వాటి చేత అంట బడకుండా ఉండటము అలేపము. ఇదే అలేపవాదము. ఈ విధమైన నిష్కామ కర్మాచరణము ఈనాటిది కాదు. సాంప్రదాయకంగా అందుతున్నదే ***(పూర్వతరం న అధునాతనం).*** ఆచరణలో ఉన్నదే ***(కృతమ్ అనుష్ఠితమ్).*** మన పూర్వీకులైన జనకాదుల చేత ఆచరింప బడినదే ***(పూర్వైః జనకాదిభిః కృతమ్).*** దీనినే వివేకంతో అందరూ ఆచరించాలి అని భగవానుని ఆదేశము.

***వివేకీ సర్వదా ముక్తో కుర్వతో నాస్తి కర్తృతా***
***అలేప వాదం ఆశ్రిత్య శ్రీకృష్ణ జనకౌ యథా ॥***

వివేకవంతుడు కర్తృత్వ బుద్ధి లేకుండా కర్మలను ఆచరిస్తాడు కనుక, బంధము నుండి అన్ని విధాల విడిపడే ఉంటాడు. అలేపవాదాన్ని ఆశ్రయించుకొని ఉండటం చేత జనకుడు, శ్రీకృష్ణుడు సమస్త కర్మలను ఆచరిస్తున్నా ఎలా అంటకుండా జీవించారో అలాగే జీవిస్తాడు అని గీతారహస్యంలో చెప్పబడింది.

మన పూర్వీకులు ఆచరించి ఫలాన్ని అందుకున్నారు. వారిని చూచి మనం కూడా ఆచరించి ఫలాలను అందుకోవచ్చు. కనుక కర్మనే ఆచరించు అని అర్జునుని ఆదేశించాడు అచ్యుతుడు.

ఇక్కడ కర్మ అంటే కర్తృత్వ బుద్ధి లేని కర్మ అని అర్థము. ఈ సందర్భంలో కర్మనే ఆచరించమని **(కర్మైవ)** 'ఏవ' శబ్దమును ప్రయోగించుటలో కర్మను త్యజించడం గాని, కర్మసన్యాసం కాని ఆచరణీయము కాదు అని నొక్కి వక్కాణించడమే ప్రధాన సూచనగా ఉంది ***(న తూష్ణీం ఆసనం, న సంన్యాసః కర్తవ్యః).***

*కృష్ణా! కర్మాచరణము తప్పక చేయవలసిందే అయితే, నువ్వు చెబుతున్నావు కనుక నేను చేస్తాను కదా! పూర్వీకులు చేశారు, పురాతనమైంది అని విశేషా లన్నీ ఎందుకు చెప్పినట్లు? అనే శంక అర్జునునిలో కలిగే అవకాశం ఉందని ఊహించి, దానిని కూడా నివృత్తి చేస్తున్నాడు.*

**కిం కర్మ కి మకర్మేతి కవయోఽ ప్యత్ర మోహితాః ।**
**తత్తే కర్మ ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽ శుభాత్ ॥** 16

***కిం-కర్మ-కిం-అకర్మ-ఇతి-కవయః-అపి-అత్ర-మోహితాః***
***తత్-తే-కర్మ-ప్రవక్ష్యామి-యత్-జ్ఞాత్వా-మోక్ష్యసే-అశుభాత్***

| | | | | | |
|---|---|---|---|---|---|
| కర్మ | = | కర్మ | యత్ | = | దేనిని |
| కిం | = | ఎట్టిది | జ్ఞాత్వా | = | తెలిసికొని |
| అకర్మ | = | అకర్మ | అశుభాత్ | = | అశుభము నుండి |
| కిం | = | ఎట్టిది | మోక్ష్యసే | = | ముక్తుడవు కాగలవో |
| ఇతి | = | ఇట్లని | తత్ | = | అట్టి |
| అత్ర | = | ఈ విషయమున | కర్మ | = | కర్మను |
| కవయః అపి | = | బుద్ధిమంతులు కూడా | తే | = | నీ కొరకు |
| మోహితాః | = | మోహింప బడ్డారు | ప్రవక్ష్యామి | = | చెబుతాను |

**ఏది కర్మ? ఏది అకర్మ? ఈ విషయంలో జ్ఞానులు కూడా మోహితు లయ్యారు. ఏది తెలుసుకుంటే అశుభం నుండి విడిపడతావో ఆ కర్మ తత్త్వాన్ని నీకు చక్కగా తెలుపుతాను.**





**వ్యాఖ్య**

జ్ఞాన ప్రధానమైన ఈ నాల్గవ అధ్యాయంలో నాలుగు విషయాలు ప్రధానంగా ప్రస్తావించబడ్డాయి అని అధ్యాయ ప్రారంభం లోనే చెప్పుకున్నాం. ఆ నాల్గింటిలో పరమేశ్వరుని అవతార విశేషము లోని జన్మ వైభవాన్ని విశ్లేషించుకొని అర్థం చేసుకున్నాం. ఇక రెండవ అంశము, అవతరించిన పరమాత్మలో గోచరించే కర్మ వైభవాన్ని ఈ శ్లోకం నుండి చూడబోతాము.

***కర్మణా బధ్యతే జన్తుః.*** కర్మలు బంధహేతువులు. అదే సత్యమైతే జనకాదులు సైతం కర్మలను ఎందుకు ఆచరించారు? కర్మాచరణమును కొనసాగించమని శ్రీకృష్ణుడు అర్జునునికి ఎందుకు ఉపదేశించాడు? కనుక కర్మల విషయంలో ఏ కర్మలు బంధహేతువులు, ఏవి కావు అనేది సుస్పష్టం కావాలి.

***కర్తృత్వా ద్యహంకార సంకల్పో బంధః.*** నేను చేసేవాణ్ణి - నేను అనుభవించేవాణ్ణి అనే కర్తృత్వ భోక్తృత్వ బుద్ధి లోని అహంకార భావనే బంధము అని నిరాలంబోపనిషత్తు ప్రవచించింది. ఇప్పటికే ఈ విషయాన్ని మనం సుదీర్ఘంగా చర్చించుకున్నాం. అంతేకాదు, కర్మఫల స్పృహ లేకుండా కర్మలను ఆచరించడం చేత పరమేశ్వరుడు కర్మలకు అంటనివాడై శోభిస్తున్నాడు అని కూడా తెలుసుకున్నాం. ఈ విధంగా పరమేశ్వరుని కర్మ వైభవాన్ని అర్థం చేసుకొని, తదనుగుణంగా జీవించేవాడు కూడా కర్మల చేత అంటబడడు అని గ్రహించాము. ఈ విషయాన్ని శ్రుతి కూడా నిర్ధారణ చేస్తూ ఉంది.

***తం విదిత్వా న లిప్యతే కర్మణా పాపకేన.*** పరమేశ్వరుని తెలుసుకొని కర్మాచరణములో ఉన్న విద్వాంసునికి ఏ పాప కర్మ కూడా అంటదు అని శ్రుతి ప్రబోధము. కనుక విద్వాంసుడు ఆచరించే కర్మ బంధహేతువు కాదు అని అర్థము. అంటే, అవిద్వాంసుడు ఆచరించే కర్మ బంధహేతువు అని ప్రత్యేకంగా చెప్ప నవసరం లేదు. అవిద్వాంసుని విషయంలో బంధహేతువైన కర్మ విద్వాంసుని విషయంలో అకర్మగా గోచరిస్తూ కర్తను అంటడం లేదు. కనుక, కర్మల విషయంలో అవగాహన సుస్పష్టంగా ఉండాలి అని అర్థమవుతూ ఉంది. ఈ కారణం చేతనే, మన పూర్వీకులు ఈ విషయాన్ని స్పష్టంగా తెలుసుకొని ***(జ్ఞాత్వా)*** ఆచరించారు అని సంప్రదాయాన్ని స్పృశించాడు గీతాచార్యుడు.

విషయాన్ని చక్కగా గ్రహించి ఆచరించిన వారు ***(జనకాదయః)*** సఫలీకృతులై మోక్ష మార్గంలో ఆనందంగా పయనిస్తే, మరో వైపు శాస్త్ర జ్ఞానము ఉన్నవారు కూడా సుస్పష్ట మైన అవగాహన లేని కారణంగా మోక్ష మార్గంలో చరించడానికి బదులు మోహంలో కూరుకు పోయారు. కనుక కర్మ అకర్మల విషయాన్ని సంశయరహితంగా గ్రహించాలి. ఈ విషయాన్నే ప్రస్తుత శ్లోకంలో చర్చిస్తున్నాడు భగవంతుడు.

### ఏది కర్మ? ఏది అకర్మ?

***చలనాత్మకం కర్మ.*** చలనరూప మైనది కర్మ. చలించకుండా ఉంటే అకర్మ అన్నారు కొందరు. శ్రుతి స్మృతుల చేత ప్రతిపాదింప బడింది కర్మ. వాటికి భిన్నమైనది అకర్మ అన్నారు మరి కొందరు. శ్రౌత స్మార్తము లన్నీ కర్మలని, వాటిని త్యజించుట అకర్మ యని మరి కొందరు అభిప్రాయపడ్డారు. ఇంతకీ ఏది కర్మ? ఏది అకర్మ? ***(కిం కర్మ కించ అకర్మ ఇతి).***

శాస్త్రాలు అనేకం. వాటిని ప్రబోధించే వారు అనేకులు. కొన్ని చోట్ల విషయ భేదము తెలుస్తూ ఉంటే, మరి కొన్ని చోట్ల బుద్ధి భేదం చేత ఒకటి మరొకటిగా తెలిసే ప్రమాదం కూడా ఉంటుంది. అలాంటి పరిస్థితులలో కర్మ అకర్మ గాను, అకర్మ కర్మ గాను తెలిసే ప్రమాదం లేకపోలేదు. అందుచేతనే శాస్త్ర పరిజ్ఞానము గల మేధావులు కూడా కర్మాకర్మ తత్త్వ నిర్ణయంలో దారి తప్పుతూ ఉంటారు. మోహానికి గురి అవుతూ ఉంటారు.

***పతితాః శాస్త్ర జాలేషు ప్రజ్ఞయా తేన మోహితాః.*** చాలా మంది ప్రజ్ఞావంతులు కూడా శాస్త్ర మనే వలలో చిక్కుకొని మోహితు లవుతూ ఉంటారు అన్నది యోగశిఖోపనిషత్తు. కనుక ఏది కర్మ? ఏది అకర్మ? అనే విషయంలో మేధావులు కూడా మోహానికి గురి అవుతూ ఉంటారు అంటున్నాడు గీతాచార్యుడు ***(కవయః మేధావినః అపి, అత్ర అస్మిన్ కర్మాది విషయే మోహితాః మోహం గతాః).*** కనుకనే, ఆప్తవాక్యం అవసరమని భావించి, కర్మాకర్మల తత్త్వాన్ని ప్రవచిస్తున్నాడు.

ఈ సందర్భంలో ఒక్క విషయం మనకు స్పష్ట మవుతూ ఉంది. కర్మాకర్మల తత్త్వ నిర్ణయంలో శాస్త్రదూరులు ఎలాగూ అర్థం చేసుకోలేరు. శాస్త్ర పాండిత్యము గల మేధావులు కూడా ఇది అదిగా, అది ఇదిగా భావించి మోహితులయ్యే అవకాశం ఉంది అనేది రూఢిగా తెలుస్తోంది. బుద్ధిలో స్పష్టత లేనపుడు దగ్గర దూరము అనే భేదము లేకుండా మోహితులయ్యే అవకాశం ఉంది.

మనం రైలులో ప్రయాణం చేసేటప్పుడు రైలు ముందుకు దూసుకుపోతూ ఉంటుంది. కాని మనం కిటికీ గుండా బయటికి చూస్తే దారి ప్రక్కన కనిపించే చెట్లు పరుగు లెత్తుతున్నట్లు కనిపిస్తాయి. కదిలే బండి కదలనట్లు, కదలని చెట్లు కదులు తున్నట్లు తెలుస్తుంది. అంటే కర్మ అకర్మగా, అకర్మ కర్మగా అర్థ మవుతుంది. ఇదే మోహము. ఈ మోహము నుండి విడిపడాలి అంటే కర్మాకర్మల తత్త్వము స్పష్టంగా అర్థం కావాలి. అందుచేతనే పరమేశ్వరుడు వాటిని గురించి విపులీకరిస్తున్నాడు ***(తత్తే కర్మ ప్రవక్ష్యామి). తత్తే కర్మ*** అన్నచోట పదమును ఛేదించి కర్మ అని, అకర్మ అని అర్థం చేసుకోవాలి. ***(అహం కర్మ అకర్మచ ప్రవక్ష్యామి).*** నేను కర్మను, అకర్మను రెండిటిని నీకు బోధిస్తాను అని భావము. అలా బోధించడం వల్ల ఏది కర్మ? ఏది అకర్మ? అనే విషయంలో సంశయాలు తొలగిపోయి స్పష్టత ఏర్పడుతుంది. నిజమే. అలా తెలుసుకోవడం వల్ల ప్రయోజన మేమిటి? అశుభం తొలగి పోతుంది. శుభం కలుగుతుంది.

**స్పష్టి ర్భవతు**

కర్మాకర్మల విషయాన్ని క్షుణ్ణంగా గ్రహించడం చేత ***(యద్ జ్ఞాత్వా విదిత్వా)*** అశుభం నుండి విడిపడతావు అంటున్నాడు ***(మోక్ష్యసే అశుభాత్ సంసారాత్).*** కర్మాకర్మల వివేకము కలిగింది అంటే ఆత్మానాత్మ వివేకము కలిగింది అని అర్థము. ఆత్మానాత్మ జ్ఞానము కలిగితే, అనాత్మ విషయము దూరమై, ఆత్మ విషయము హృదయస్థ మవుతుంది.

కర్మాకర్మల విషయం స్పష్టంగా తెలియక పోవడం చేత మనం కర్మవలయంలో చిక్కుకొని పోయాం. కర్మ వలయమే సంసారము. జననమరణ రూప సంసారము. సంసారము దుఃఖమయము. కనుక అది అశుభము. ఈ కర్మాకర్మ తత్త్వము తెలియడం చేత, ఈత తెలిసిన వాడు ఎలాగైతే నీటిలో మునిగిపోడో, కర్మ తత్త్వం తెలిసిన వాడు కూడా సంసార బంధంలో చిక్కడు. పైగా దాని నుండి విడి పడతాడు.

అందుచేతనే పరమేశ్వరుడు శుభకరుడు. ఆయన జ్ఞానము శుభకరము. జ్ఞానము శుభకరము కనుక అజ్ఞానము అశుభము. అశుభము నుండి విడిపడటము అంటే అజ్ఞానము నుండి విడిపడటము అని భావము. జ్ఞానమై శోభించడము అని అర్థము.

*కర్మల విషయాన్ని సులభంగా తీసుకోకూడదు. అది చాలా గహనమైన విషయము. దానినే ప్రస్తావిస్తున్నాడు భగవంతుడు.*

**కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః ।**
**అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః ॥** 17





*కర్మణః-హి-అపి-బోద్ధవ్యం-బోద్ధవ్యం-చ-వికర్మణః*
*అకర్మణః-చ-బోద్ధవ్యం-గహనా-కర్మణః-గతిః*

| | | | | | |
|---|---|---|---|---|---|
| కర్మణః అపి | = | కర్మ యొక్క (తత్త్వము) | బోద్ధవ్యం | = | తెలిసికొన దగినది |
| బోద్ధవ్యం | = | తెలిసికొన దగినది | కర్మణః | = | కర్మ యొక్క |
| వికర్మణః చ | = | వికర్మ యొక్క (తత్త్వము) | గతిః | = | తత్త్వము |
| బోద్ధవ్యం | = | తెలిసికొన దగినది | గహనాహి | = | తెలియశక్యము కానిది కదా |
| అకర్మణః చ | = | అకర్మ యొక్క (తత్త్వము) | | | |

**చేయ వలసిన కర్మను గూర్చి తెలుసుకోవాలి. చేయకూడని కర్మను గూర్చి తెలుసుకోవాలి. కర్మ రహిత స్థితిని గూర్చి తెలుసుకోవాలి. కర్మల యొక్క తత్త్వము చాలా అగాధము కదా!**

**వ్యాఖ్య**

కర్మ విషయానికి ఇంత చర్చ ఎందుకు? దేహేంద్రియాలతో ఆచరించేది కర్మ అయితే, అలా ఆచరించకుండా ఊరకుండుట అకర్మ అనేది తెలిసిందే కదా! ***(లోక ప్రసిద్ధమ్).*** ఇక్కడ ప్రత్యేకం గాను, విశేషం గాను తెలియదగింది ఏముంది? ***(కిం తత్ర బోద్ధవ్యం ఇతి)*** అనుకుంటారు. అలా భావించడం సరి కాదు అని తెలియ చేయడానికే ఈ కర్మాకర్మ వికర్మ మర్మాన్ని భగవానుడు విశ్లేషిస్తున్నాడు.

ఈ శ్లోకంలో మూడు విధాలుగా కర్మ తత్త్వము చెప్పబడింది. (1) కర్మ. అంటే చేయదగినది. (2)వికర్మ. అంటే, చేయకూడనిది లేదా నిందిత మైనది. (3) అకర్మ అంటే కర్మ యొక్క అభావము. దేని వలన కర్మ సంభవించదో అది అకర్మ. ఈ మూడు విషయాలు తెలియదగినవి ***(బోద్ధవ్యం).*** ఎందుచేత తెలియ దగినవి? ***(కస్మాత్).*** అదే చెబుతున్నాడు ***(ఉచ్యతే).*** కర్మ యొక్క తత్త్వము సులభంగా గ్రహించేది కాదు. దుర్విజ్ఞేయము. కనుక కర్మ, అకర్మ, వికర్మల తత్త్వము వేరు వేరుగా ఉంది. కర్మ యొక్క ***(కర్మణః)*** తత్త్వము ***(గతిః)*** తెలియ శక్యము కానిది ***(గహనా)*** అంటున్నాడు. కర్మ, అకర్మ, వికర్మ అనే మూడు వాక్యాలకు కూడా తత్త్వము ఉంది ***(అస్తి)*** అనేది అధ్యాహారము.

అధ్యాహారము అంటే లేని పదములు కొన్నిటిని వాక్య నిర్మాణము కొరకు తెచ్చుకొనుట. ఇక్కడ కర్మాకర్మ వికర్మలకు ***అస్తి*** అనేది అధ్యాహారము ***(అస్తి ఇతి త్రిష్వపి అధ్యాహారః).*** ఈ మూడింటికి ***కర్మణః*** అనేది ఉపలక్షణం. కనుక కర్మ విషయంలో తెలియ దగింది ఉంది. వికర్మ విషయంలో తెలియ దగింది ఉంది. అకర్మ విషయం లోను తెలియ దగింది ఉంది అనేది అధ్యాహారం వల్ల స్పష్టమైంది. ఈ విధంగా కర్మ తత్త్వమును గ్రహించడం అశక్యంగా ఉంది కనుకనే పరమేశ్వరుడు వివరంగా విశ్లేషిస్తున్నాడు.

**కర్మ తత్త్వము**

ఏది కర్తవ్యమో దానిని ఆచరించడం కర్మ. ఇంతకీ ఏది కర్తవ్యము? శాస్త్ర విహితమైన కర్మయే చేయదగింది. కనుక అదియే తెలియ దగింది. ఈ విషయాన్ని మూడవ అధ్యాయం కర్మయోగంలో కూడా భగవంతుడు విశదం చేశాడు. శాస్త్రాల చేత నియమింప బడిన కర్మనే ఆచరించాలి అని ప్రబోధించాడు ***(నియతం కురు కర్మత్వం - 3 - 8).*** ఇక్కడ కర్మ యొక్క తత్త్వమును లేదా స్వభావమును తెలియడము అంటే, కర్మతో ముడిపడి ఉన్న అనేక విషయాలను తెలుసుకోవడం అని అర్థము. అలా తెలిసి నప్పుడే కదా విహిత కర్మాచరణము సాధ్య పడుతుంది! తెలియకుండా ఆచరించడం ఎలా సాధ్యం? కనుక తెలుసుకొనే చేయాలి. ఎలాగూ తెలియ వలసింది ఉంది ***(తత్త్వమ్ అస్తి).***

శాస్త్రోక్త కర్మే అయినా ఆచరించడానికి యత్నించే సరికి అనేక అంశాలు ముందుకొచ్చి కలగాపులగం అవుతాయి. కర్తను కలవర పెడతాయి. శాస్త్ర విహిత కర్మే అయినా అనుసరించే వారిలో, ఆచరించే వారిలో భేదము ఉండటం చేత కర్మ తత్త్వమును చక్కగా గ్రహించాలి.

దేశకాలాదులలో భేదం వలన గాని, అధికారి భేదం వల్ల గాని, ఆశ్రమాది భేదం వల్ల గాని, యుగ భేదం వల్ల గాని, వయోవస్థల భేదం వల్ల గాని కర్మ నాచరించే విధానము సంకోచ వ్యాకోచములతో కనిపిస్తూ ఉంటుంది. అందరూ ఒకే విధంగా ఆచరించడం సాధ్యం కాదు. వృద్ధులు, బాలురు ఒకే విధంగా ఆచరించడం సాధ్యమా? అందుచేత చేయదగిన కర్మమే అయినా, ఎవరెవరు ఎలా చేయాలో కూడా చక్కగా గ్రహింపవలసి ఉంది. అప్పుడే కర్మాచరణము విధిపూర్వకంగా సాగుతుంది.

**వికర్మ తత్త్వము**

శాస్త్ర విహిత కర్మ కాకుండా దానికి విరుద్ధంగా, విపరీతంగా ఆచరింపబడేది వికర్మ. అదే ప్రతిషిద్ధ కర్మ లేదా నిషిద్ధ కర్మ, లేదా నిందిత కర్మ. అవిధి పూర్వకంగా ఆచరింపబడే నిషిద్ధ కర్మ అనే వికర్మను గూర్చి కూడా చక్కగా తెలుసుకోవాలి. నిందిత కర్మ ఆచరించ కూడనిది అయినపుడు దానిని ఎందుకు తెలుసుకోవాలి? చేయగూడనిది తెలిసి నపుడే దానిని చేయకుండా ఉండటం జరుగుతుంది. ఇది నిషిద్ధం అని తెలియ నపుడు పిల్లవాడు నిప్పును ముట్టుకున్నట్లు నిందిత కర్మను ఆచరించే ప్రమాదం ఏర్పడవచ్చు. కనుక వికర్మను కూడా చక్కగా తెలుసుకోవాలి.

**అకర్మ తత్త్వము**

అకర్మ అంటే కర్మ లేనిది ***(తూష్ణీం భావః).*** కర్మ కానిది. ఏమీ చేయకుండా ఊరక కూర్చోవడం అకర్మ. దీనిని కూడా స్పష్టంగా తెలుసుకోవాలి. ఒక విధంగా ఇది కర్మ సన్యాసము. అదే అయితే, విశ్లేషించి మరీ అర్థం చేసుకోవాలి.

సన్యాసము అన్నప్పుడు త్యజించడం అవుతూ ఉంది. దేనిని త్యజించడం అనే ప్రశ్న ఉదయించి నపుడు కర్మను సన్యసించడము అన్నట్లయితే అది కర్మ సన్యాసము. ఇంతవరకు మనం అర్థం చేసుకున్న పూర్వ శ్లోకాలలో కర్తృత్వ బుద్ధి లేకుండా కర్మలు చేయడం కూడా అకర్మ క్రిందికే వస్తుంది అని గ్రహించాము. ఇంతకీ అకర్మ అంటే కర్మత్యాగమా? లేక కర్తృత్వ భావన లేకుండా, కర్మఫల స్పృహ లేకుండా కర్మను ఆచరించడమా? కర్తృత్వ బుద్ధి లేకుండా కర్మను ఆచరించడమే అకర్మ అని నిర్ణయిస్తే, కర్మ చేయకుండా ఉండటమే అకర్మ అనే మొదటి అర్థం వ్యర్థమౌతుంది. ఇదంతా తెలియదగిందే ***(బోద్ధవ్యం).***

కనుక అకర్మ అవేది కర్మ త్యాగమా? కామ్య కర్మ త్యాగమా? కర్మఫల త్యాగమా? నిషిద్ధ కర్మ త్యాగమా? సర్వకర్మ సన్యాసమా? అకర్మ యొక్క వాస్తవ తత్త్వ మేమిటో అది కూడా తెలియాలి.

**గహనమే గాని గర్హణము కాదు**

ఈ విధంగా కర్మాకర్మ వికర్మల తత్త్వము తెలియ శక్యము కానిదే అయినా, విడిచిపెట్ట దగింది కాదు. వాటి స్వరూప స్వభావాలను శాస్త్రము చేత, గురుదేవుని బోధ వల్ల లక్షణయుతంగా, సహేతుకంగా, నిగూఢ స్వరూపంతో సహా గమనించవలసి ఉంది. అందుచేతనే పరమేశ్వరుడు జటిలమైన ఈ కర్మతత్త్వాన్ని సంశయరహితంగా, సశాస్త్రీయంగా బోధించడానికి ఉపక్రమించాడు.

*కర్మాకర్మ వికర్మల విషయం తెలియదగింది* ***(బోద్ధవ్యం)*** *అని చెప్పిన భగవంతుడు ఈ కర్మాకర్మల*





*విషయంలో మేధావులు కూడా కలతపడుతూ ఉంటారని, కర్మాకర్మల విషయాన్ని తత్త్వతః గ్రహించిన వాడు మాత్రమే సంసారము నుండి విడిపడి మోక్షాన్ని పొందుతాడు అని గడచిన రెండు శ్లోకాలలో సుస్పష్టం చేశాడు. ఈ కర్మాకర్మల తత్త్వాన్ని చెబుతానని ప్రతిజ్ఞ చేశాడు. దానినే ప్రారంభిస్తున్నాడు.*

**కర్మ ణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః ।**
**స బుద్ధిమా న్మనుష్యేషు స యుక్తః కృత్స్న కర్మకృత్ ॥** 18

*కర్మణి-అకర్మ-యః-పశ్యేత్-అకర్మణి-చ-కర్మ-యః*
*సః-బుద్ధిమాన్-మనుష్యేషు-సః-యుక్తః-కృత్స్నకర్మకృత్*

| | | | | | |
|---|---|---|---|---|---|
| యః | = | ఎవడు | పశ్యేత్ | = | చూచునో |
| కర్మణి | = | కర్మ యందు | సః | = | వాడు |
| అకర్మ | = | అకర్మను | మనుష్యేషు | = | మనుష్యులలో |
| యః | = | ఎవడు | కృత్స్నకర్మకృత్ | = | సర్వ కర్మలను చేసిన వాడు |
| అకర్మణి చ | = | అకర్మ యందు | యుక్తః | = | యోగి |
| కర్మ | = | కర్మను | బుద్ధిమాన్ | = | బుద్ధిమంతుడు |

**కర్మలో అకర్మను చూచేవాడు, అకర్మలో కర్మను దర్శించే వాడు మానవులలో బుద్ధిమంతుడు. అతడే యోగి. అతడు సమస్త కర్మల్ని ఆచరించిన వాడే అవుతున్నాడు.**

**వ్యాఖ్య**

గహనమైన ఈ కర్మాకర్మల విషయంలో మేధావులు సైతం తికమక పడుతున్నారు కనుక, ఏ కర్మాకర్మల స్వభావాన్ని తెలుసుకోవడం వల్ల బంధము నుండి విడిపడి మోక్షమును పొందడం జరుగుతుందో, దానిని బోధిస్తున్నాను అని పదహారవ శ్లోకంలో చెప్పిన భగవానుడు, కర్మను గూర్చి, వికర్మను గూర్చి, అకర్మను గూర్చి కూడా మనిషి తెలుసుకోవాలి. కాని, అట్టి కర్మ తత్త్వమును తెలుసుకోవడం కష్టమని పదిహేడవ శ్లోకంలో చెప్పడం జరిగింది. ఇక్కడే విషయం సందేహాస్పదంగా కనపడుతోంది.

**కర్మణా బధ్యతే జన్తుః విద్యయా చ విముచ్యతే**

కర్మ చేతనే మనిషి బంధింప బడుతున్నాడు. జ్ఞానము చేతనే బంధము నుండి విముక్త దవుతున్నాడు అని ఉపనిషత్ ప్రవచించింది. తాను ఆత్మయే గాని మరొకటి కాదు. ఆత్మయైన తానే బ్రహ్మము అనే బ్రహ్మాత్మజ్ఞానమే మోక్షసాధనమై ఉంది. అలాంటప్పుడు కర్మాకర్మల స్వభావమును గ్రహించడం వల్ల మోక్ష ప్రాప్తి కలుగుతుంది అని చెప్పడం సత్య దూరమైన విషయంగా కనిపిస్తూ ఉంది ***(తత్తే కర్మ ప్రవక్ష్యామి యద్జ్ఞాత్వా మోక్ష్యసే అశుభాత్).***

మోక్ష సాధనము జ్ఞానము అనే విషయంలో రెండవ ఆలోచన లేదు. కర్మ విషయాన్ని ఈ సందర్భంలో భగవానుడు ప్రస్తావించిన విధానంలో కూడా ఏ విధమైన వైరుధ్యము లేదు.

ప్రవృత్తి నివృత్తు లనే కర్మాకర్మములు కర్తృతంత్రములు. అంటే కర్తను ఆశ్రయించుకొని ఉంటాయి. ప్రతి మనిషి తనను తాను కర్తగా చూస్తున్నాడే గాని ఆత్మగా చూడటం లేదు. ఆత్మ కర్త కాదు. ఆత్మకు కర్తృత్వం లేదు. నిష్క్రియమైన ఆత్మలో కర్మ లేదు. దేహేంద్రియ మనోబుద్ధుల సంఘాతమే కర్మకు కారణము. ఈ సత్యమును గ్రహించిన వాడు తనను తాను కర్తగా భావించడు. సత్యజ్ఞానము లేకపోవడము చేత

దేహేంద్రియాదుల ద్వారా ఆచరింపబడే కర్మలను తన యందు ఆరోపించుకొని ***అహం కర్తా*** 'నేనే కర్తను - నేను కర్మలు చేస్తున్నాను' అని భావిస్తున్నాడు. అలా భావించడమే గాక కర్మలలో ఉద్యమించి, కర్తృత్వ భోక్తృత్వ భావనలతో పుణ్య పాపాలను తయారు చేసుకుంటున్నాడు. అంతే కాదు, ఈ పుణ్యాపాప ఫలాలను అనుభవించడానికి మళ్ళీ మళ్ళీ జన్మ లెత్తుతున్నాడు. ఇదే జన్మ బంధము. కర్మ బంధము.

ఆత్మజ్ఞానము వలనే మోక్షము ప్రాప్తిస్తుంది. కాని, కర్మపంకంలో కూరుకుపోయి, పాపపుణ్యాలలో అల్లాడుతున్న బుద్ధి ఆత్మజ్ఞానాన్ని అందుకోలేదు. అందుచేత పుణ్యాపాపాలను నిర్మూలించుకొనిన విద్వాంసునికే ముక్తి అని కూడా ఉపనిషత్ ప్రబోధించింది ***(తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ).*** కనుక మోక్షాన్ని అభిలషించే ముముక్షువు జన్మహేతువు లైన కర్మాకర్మల నుండి విడిపడాలి. అలా విడిపడాలి అంటే, వాటి స్వభావ స్వరూపాలను కూడా యదార్థంగా తెలుసుకోవాలి. కనుకనే అశుభం నుండి విడిపడటానికి కర్మతత్త్వమును తెలుసుకొని తీరాలి అన్నాడు గీతాచార్యుడు.

నీవు ఆత్మవు. అకర్తవు. కానీ, నిన్ను నీవు కర్తగా భావించు కుంటున్నావు. ఇది సత్యజ్ఞానం కాదు. విపరీత జ్ఞానము. విపరీత జ్ఞానంతో బంధ విముక్తిని సాధించ లేవు ***(న చ విపరీత జ్ఞానాత్ అశుభాత్ మోక్షణం స్యాత్!).***

కర్మాకర్మల విషయంలో జీవులు విపరీత జ్ఞానంతో వ్యవహరిస్తున్నారు. ఆత్మ యందు కర్మ లేదు. కాని ఆత్మ యందు కర్మను చూస్తున్నారు. అలాగే, ఎక్కడైతే కర్మ జరుగుతూ ఉందో అక్కడ అకర్మను చూస్తున్నారు. ఈ ప్రమాదం నుండి తప్పించడమే ప్రధాన విషయంగా ప్రస్తుత శ్లోకం శోభిస్తూ ఉంది. ఇది చాలా భావగర్భిత మైన శ్లోకం. చాలా లోతైనది. అందుకే దీనిని కూట శ్లోకం అంటారు. **కూటః** అంటే సంక్లిష్ట మైనది అని అర్థం.

**కర్మాకర్మములు**

***క్రియతే ఇతి కర్మ.*** చేయబడే ప్రతి పని కర్మ అవుతుంది. చేయడం కర్మ అయితే, చేయకుండా ఉండటం అకర్మ అవేది సాధారణంగా అర్థమయ్యే విషయం. ఇక్కడ కర్మ అంటే, విహిత కర్మ, ప్రతిషిద్ధ కర్మ రెండూ అవి అర్థము. సత్యము, అహింస, బ్రహ్మచర్యము, దానధర్మాదు లన్నీ విహిత కర్మలైతే, సురాపాన మాంసభక్షణాది కర్మలు నిషిద్ధ లేక ప్రతిషిద్ధ కర్మలు. ఈ రెండూ కలిపి కర్మ అనబడుతాయి. కనుక వికర్మ అనే నిషిద్ధ కర్మ కూడా కర్మలో చేరి పోయింది. విహిత ప్రతిషిద్ధ కర్మలు కర్మ కాగా, చేయకుండా ఉండటం అకర్మ క్రిందికి వస్తుంది. ఇలా చూచి నపుడు కర్మాకర్మలే ఉన్నాయి. వీటి విషయం లోనే మేధావులు సైతం కలత చెందుతున్నారు, తికమక పడుతున్నారు కనుక వాటిని వివరిస్తున్నాడు పరమేశ్వరుడు.

కర్మ వికర్మ రెండూ కర్మే అని అర్థం చేసుకున్నాం. మరో అడుగు ముందుకు వేస్తే, అకర్మ అని మనం దేనినైతే అంటున్నామో అది కూడా కర్మ క్రిందికే వస్తుంది. ఇలా చూచి నపుడు కర్మ, వికర్మ, అకర్మ మూడూ కర్మ గానే అర్థ మవుతాయి. అందుకే నేమో కర్మల గతి అనకుండా కర్మగతి చాలా నిగూఢమైంది అని గడచిన శ్లోకం లోనే సూచించాడు భగవంతుడు ***(గహనా కర్మణః గతిః).*** కర్మాకర్మల్ని ముందుగా సోదాహరణంగా అర్థం చేసుకుందాం.

ఒక వ్యక్తి కాళ్ళు ఆడిస్తూ కూర్చుని ఉంటాడు. అలా కాళ్ళు ఆడించడాన్ని ఏమంటాము? కర్మ అంటాము. అదే వ్యక్తి కాళ్ళు మడిచి, లేదా ముడిచి కూర్చున్నా డనుకోండి! అదేమిటి? ఏమీ చెయ్యకుండా కూర్చున్నాడు కనుక, అది అకర్మ అంటాము. ఇది వాస్తవమా? కాదు. కాళ్ళు ఆడించడం కర్మ అయినప్పుడు, కాళ్ళను ముడిచి కదలకుండా కూర్చోవడం కూడా కర్మే. ఏమీ చెయ్యకుండా మనిషి ఎంతో కాలం కూర్చోలేడు.





కనుక ప్రయత్నంతో అలా కూర్చోవడం కూడా కర్మే. ఏమీ చెయ్యకుండా కూర్చోవడమే గనుక అకర్మ అయితే, ఎంత కాలమైనా అలాగే మనిషి కూర్చోగలగాలి. కాని, అది సాధ్యపడేది కాదు. కారణం ఏమిటో తెలుసా? ఏమీ చేయకుండా కూర్చోవడం కూడా కర్మే.

మాట్లాడటం కర్మ అయితే, మాట్లాడకుండా ఉండటం కూడా కర్మే గాని అకర్మ కాదు. అతిగా ఒక వ్యక్తి వాగుతూ ఉంటే, నీ వాగుడు కాస్త ఆపవయ్యా! అంటాము. అంటే, అతడు మాట్లాడటం అనే కర్మను ఆపి, మాట్లాడకుండా ఉండట మనే కర్మకి సిద్ధపడాలి అని అర్థం. అలా మాట్లాడకుండా ఉండటానికి చేసే ప్రయత్నం కర్మే గాని అకర్మ కాదు.

అలాగే తినడం కర్మ అయితే, తినడం అనే కర్మను మానడం కూడా కర్మే. విందులో పాల్గొనడము, నిరాహార దీక్షలో కూర్చోవడము రెండూ కర్మ క్రిందికే వస్తాయి. ఫలితాన్ని ఆశించి దీక్షలో కూర్చున్నప్పుడు, దీక్ష కర్మ కాకపోతే, కర్మ ఫలితం ఎలా అందుతుంది?

భోజనం చెయ్యడం కర్మ. భోజనం మాని కూర్చోవడం కూడా కర్మే. అందుచేతనే, భోజనం చేయను అని భీష్మించుకొని కూర్చున్న వ్యక్తిని, లేవండి - కొద్దిగా భోంచేయండి అని ఒత్తిడి చేస్తూ ఉంటాము. భోం చేయండి అని ప్రేరేపించడం వెనుక భోంచేయకుండా ఉండే కర్మను ఆపమని అర్థం. కనుక, బాహ్యానికి భోంచేయడం కర్మ, భోజనం మానేయడం అకర్మ అనిపిస్తూ ఉంటుంది. వాస్తవానికి చెయ్యడం, మానడం రెండూ కర్మ క్రిందికే వస్తాయి. రెండూ కర్మలే కనుక, రెంటికీ ఫలితా లుంటాయి. తినిన కర్మకు ఆయాసం వస్తే, తినని కర్మకు నీరసం ఫలంగా అందుతుంది.

కర్మ చేయడం - కర్మ చేయక పోవడం అనేవి రెండూ కర్మ క్రిందికే వస్తాయి. నేను కర్మ చేస్తున్నాను. నేను కర్మ చేయకుండా ఉన్నాను అని మనిషి అంటూ ఉంటాడు. కర్మ చేయని సమయం మనిషికి ఒకటుందా? చెయ్యకుండా ఉండటం కూడా కర్మే. ఎందుకో తెలుసా? కర్మ లోను, అకర్మగా అగుపించే కర్మ లోను రెండిటి లోనూ కర్త ఉన్నాడు. కర్మ లోను, అకర్మ లోను 'అహం' భావన ఉంది. ప్రవృత్తి నివృత్తులు రెండూ 'అహం' వృత్తిపై ఆధారపడి ఉన్నాయి.

నేను చేస్తున్నాను అని పలికేది కర్త అయితే, నేను చెయ్యకుండా ఉన్నాను అని పలికే దెవరు? కర్త కాదా? కర్త లేకపోతే కర్మ ఎలా సాధ్యం? 'నేను ఏమీ చెయ్యకుండా ఉన్నాను' ***(అహం న కించిత్ కర్మ కరోమి)*** అనే కర్మ జరిగే టప్పుడు, కర్తపై ఆధారపడి యున్న ఆ కర్మ అకర్మ ఎలా అవుతుంది? అకర్మ అంటే కర్మ లేకుండా ఉండాలి ***(కర్మ అభావత్వాత్ అకర్మణః).*** కర్మ లేదు అంటే కర్త లేడు అని అర్థము. మరి, అకర్మ ఎవరిపై ఆధారపడి ఉంది? అకర్మ కూడా కర్మే కనుక కర్త పైన ఆధారపడి ఉంది. కనుక కర్మ, అకర్మ, రెండూ కర్త పైనే ఆధారపడి ఉన్నాయి. బాగుంది. ఇంతకీ, కర్త ఎవరు? కర్మ ఎవరిని అశ్రయించుకొని ఉంది?

**ఆశ్రయం - ఆరోపం**

కర్మ చేసేవాడు కర్త. ఆత్మలో కర్మ లేదు కనుక, ఆత్మ కర్త కాదు. అకర్త. కర్మలు చేయడం, మానడం అనేది బుద్ధి వృత్తులకు సంబంధించిందే గాని ఆత్మకు సంబంధించింది కాదు. కాని, దేహాదుల యందు జరిగే కర్మలను ఆత్మ యందు ఆరోపించుకొని తనలో కర్మను చూస్తూ, నేను కర్తను అని మనిషి భ్రమిస్తుంటాడు. ఆత్మలో కర్మ లేదు. కర్మ జరుగు తున్నట్లు భావింప బడుతున్న ఆత్మ యందు అకర్మను దర్శించడమే యథార్థ జ్ఞానం. దేహాదుల యందు కర్మలు జరుగు తున్నాయి. ఆ విషయాన్ని ఎవరూ

నిరాకరించడం లేదు. ఆత్మే నేనని తెలిసిన ఆత్మజ్ఞునకు దేహాదులతో సంబంధం లేనందున, వాటి యందు జరిగే కర్మలు తనకు అకర్మ గానే గోచరిస్తాయి.

దేహేంద్రియాదులలో జరిగే కర్మలను ఏ వికారములు లేని ఆత్మ యందు ఎలాగైతే ఆరోపించడం జరిగిందో, అలాగే దేహాదులు కర్మలను విరమించిన అకర్మ స్థితి కూడా కర్మే నని తెలియని అవివేకంలో, దేహేంద్రియాదుల లోని అకర్మను కూడా ఆత్మ యందు ఆరోపించడం జరుగుతూ ఉంది. ఈ విధంగా ఆత్మ యందు కర్మలు లేవని గ్రహించి, ఆత్మ యందు ఆరోపించ బడిన కర్మ యందు అకర్మను ఎవడు దర్శిస్తాడో ***(కర్మణి అకర్మ యః పశ్యేత్).*** అలాగే దేహేంద్రియాదుల వ్యవహారము ఆగిన స్థితిలో, ఆ అకర్మ దేహాదులకు సంబంధించిందే గాని ఆత్మ యైన తనకు సంబంధించింది కాదని తెలిసి, దేహేంద్రియాదుల విరామస్థితి యందు, అవగా అకర్మగా గోచరించే స్థితి యందు కర్మను ఎవడు దర్శిస్తాడో ***(అకర్మణి చ కర్మయః)*** అతడే జ్ఞాని ***(బుద్ధిమాన్).***

మరి, ఈ విధంగా కర్మ అకర్మగా, అకర్మ కర్మగా గోచరించడం అనేది ఉంటుందా? అనే శంకను నివారిస్తూ, ఆచార్యుల వారు నదిలో సాగిపోయే నావను సోదాహరణంగా భాష్యంలో అభివర్ణించారు.

***నౌస్థస్య నావి గచ్ఛన్త్యాం తటస్థేషు నగేషు ప్రతికూల గతి దర్శనాత్, దూరేషు చక్షుషా అసన్నికృష్టేషు గచ్ఛత్సు గత్యభావ దర్శనాత్, ఏవం ఇహాపి అకర్మణి కర్మ దర్శనం కర్మణి చ అకర్మ దర్శనం, విపరీత దర్శనం.***

నదీ ప్రవాహంలో, నావ మీద ప్రయాణం చేసే వారికి, ఒడ్డున చలనం లేకుండా నిలబడియున్న చెట్లు ఎదురుగా వస్తున్నట్లు కనిపిస్తాయి. అలాగే దూరంగా మనుషులు నడుస్తూ ఉన్నా, కంటికి చాలా దూరంలో ఉండటం చేత వారు కదలిక లేకుండా ఉన్నట్లు గోచరిస్తుంది. అదే విధంగా ఇక్కడ కూడా, అకర్మ యందు కర్మ దర్శనము, కర్మ యందు అకర్మ దర్శనము జరుగుతూ ఉంటుంది. ఇది విపరీత దర్శనమే గాని సత్యదర్శనం కాదు.

చెట్టు ముందుకు నడచి వస్తున్నట్లు కనిపించినా, తత్త్వమును పరిశీలించిన తరువాత, నది ఒడ్డున నిలబడి యున్న చెట్టులో నడుచుట అనే కర్మ లేదని గ్రహించినట్లు, ఆత్మ యొక్క స్వరూప స్థితిని అర్థం చేసుకున్న తరువాత, దేహేంద్రియాదులలో నడిచే కర్మ అకర్త యైన ఆత్మ యందు లేదని గ్రహించడం జరుగుతుంది. ***కర్మణి అకర్మ యః పశ్యేత్*** అనే శ్లోక పాదానికి ఇదే అర్థము.

అలాగే, దూరంగా బాటసారులు నడచి వెళ్తూ ఉంటే, దూర దోషం చేత వాళ్ళు నడవకుండా నిలబడి ఉన్నట్లే కనిపించినా, వాస్తవాన్ని పరిశీలిస్తే వాళ్ళు నడచి పోయేది తెలిసినట్లు, దేహేంద్రియాదులు ఏమీ చేయకుండా ఉపరమించి యున్న అకర్మ స్థితిని ఆత్మ యందు ఆరోపించకుండా, అకర్మగా తెలుస్తున్నది నిజానికి కర్మయే నని గ్రహించడం జరుగుతూ ఉంది. ***అకర్మణి చ కర్మ యః*** అనే శ్లోకం లోని ద్వితీయ పాదానికి ఇది అర్థం.

**కర్మాకర్మల సంబంధము**

కర్మ యందు అకర్మను దర్శించువాడు, అలాగే అకర్మ యందు కర్మను దర్శించువాడు మనుషులలో బుద్ధిమంతుడు అంటున్నాడు భగవంతుడు. స్థూలంగా చూచే వారికి కర్మలో అకర్మను, అకర్మలో కర్మను చూడటం అనేది వింత గాను విడ్డూరం గాను, విరుద్ధం గాను కనపడుతుంది. ఎందుకంటే, కర్మ అకర్మ కాదు, అలాగే అకర్మ కర్మ కాదు. అలాంటప్పుడు కర్మలో అకర్మను, అకర్మలో కర్మను ద్రష్ట ఎలా చూస్తాడు? అనేది శంక ***(న హి కర్మ అకర్మ స్యాత్ అకర్మ వా కర్మ? తత్ర విరుద్ధం కథం పశ్యేత్ ద్రష్టా?).***





కర్మాకర్మలను మానవులు విపరీతంగా గ్రహిస్తున్నారు అనే విషయాన్ని నీటిలో నావ దృష్టాంతం ద్వారా అర్థం చేసుకున్నాం. కనుక కర్మలో అకర్మను, అకర్మలో కర్మను చూచే అవకాశం ఉందని మనకు అర్థమైంది. కాకపోతే, కర్మాకర్మలకు ఆధార ఆధేయ సంబంధము ఉందా? కర్మాకర్మలకు ఆధార ఆధేయ సంబంధం కుదరదు. కానీ, ఇక్కడ, ప్రస్తుత శ్లోకారంభంలో ***కర్మణి*** అనే పదం సప్తమీ విభక్తిలో ఉంది.

కర్మము నందు అకర్మమును చూడటము అన్నప్పుడు, 'అందు' అనే సప్తమీ ప్రయోగం వల్ల కర్మ ఆధారమై అకర్మ ఆధేయము అవుతుంది. ఆధారంగా కర్మ ఉండే టప్పుడు ఇక అకర్మ ఎలా ఉంటుంది? అకర్మ లేనపుడు కర్మ ఆధార మెలా అవుతుంది? అలాంటప్పుడు కర్మము నందు అకర్మమును చూచేది ఎలా? కుదరదు. ***న చ అత్ర కర్మాధికరణమ్ అకర్మ అస్తి.***

ఇకపోతే, కర్మకు అకర్మ ఆధారము కావాలి. అప్పుడే అకర్మము నందు కర్మను దర్శించడం జరుగుతుంది. అకర్మ అంటే, కర్మ యొక్క అభావం కదా! ***(కర్మ అభావత్వాత్ అకర్మణః).*** అభావం అంటే లేనిదే కదా! కర్మ లేకపోవడమే అకర్మ. అలాంటప్పుడు లేని అకర్మ ఉన్న కర్మకు ఆధార మెలా అవుతుంది? కాలేదు ***(నాపి అకర్మాధికరణం కర్మ అస్తి).***

కర్మము నందు అకర్మను చూడటము, అకర్మము నందు కర్మను చూడటం అని చెప్పడం చేత, ***కర్మణి - అకర్మణి*** అనే పదములు సప్తమీ విభక్తిలో ఉన్నట్లు నిర్ధారింప బడ్డాయి. అంటే, కర్మలో అకర్మ, అకర్మలో కర్మ కుండలో రేగుబండ్లు ఉన్నట్లు ఉన్నాయి అని స్ఫురిస్తోంది ***(కుణ్డే బదరాణి ఇవ).*** కాని, అది సాధ్యం కాదని ఇప్పటికే అర్థం చేసుకున్నాం. ఉన్నదాని యందు లేనిది ఉండలేదు. అలాగే లేని దాని యందు ఉన్నది కూడా ఉండదు. 'అందు' అనే సప్తమికి ఆధారము అనేదే అర్థం కనుక, ఈ ఆధారము ఏ విధమైన ఆధారమో ముందుగా అర్థం చేసుకోవాలి.

ఆధారము మూడు విధాలుగా ఉంటుంది. (1) ఔపశ్లేషికాధారం (2) అభివ్యాపకాధారం (3) వైషయికాధారం. ఈ మూడు ఆధారాలలో ప్రస్తుతం మనం అధ్యయనం చేస్తున్న ***కర్మణి*** అనే సప్తమికి ఏది సమన్వయమో గ్రహించాలి.

మొదటిది ఔపశ్లేషికం. ఔపశ్లేషికం అంటే దగ్గర సంబంధం కలిగి ఉండటం. 'ఉపశ్లేష' అంటే ఒక దానిని మరొకటి తాకి ఉండటం లేదా చేరి ఉండటం. ఇదే సంబంధం. ఒక దేశంలో, ఒక కాలంలో కలిసి ఉండటం 'ఉపశ్లేష'. అలాంటి ఆధారము ఏదో అదే ఔపశ్లేషికాధారం.

***కటే ఆస్తే.*** చాప మీద కూర్చున్నాడు అనే వాక్యంలో ***కటః***, అంటే చాప అనేది ఆధారం. ఇది ఔపశ్లేషికాధారం. చాప మీద కూర్చున్నాడు - మంచం పైన పడుకున్నాడు అన్నప్పుడు చాప మీద కూర్చున్న వాడు ఎప్పుడూ చాప మీదే ఉండడు. మంచముపై పడుకున్న వాడు ఎప్పుడూ మంచం పైనే పడుకొని ఉండడు. ఒక కాలంలో, ఒక చోట అలా కనిపిస్తాడు. ఆ కనిపించిన సమయంలో చాప అతనికి ఆధారమే. దానిని ఎవరూ కాదనరు. కాకపోతే, మరొక కాలంలో, మరొక ప్రదేశంలో ఆధారం కాని చాప ఔపశ్లేషికాధారం అవుతుంది.

ఇక రెండవది అభివ్యాపకాధారం. అంతటా వ్యాపించి ఉండటము అభివ్యాప్తి. అదే అభివ్యాపకాధారం. ఉదాహరణకి ***తిలేషు తైలమ్.*** తిలలలో తైలం ఉంది అన్నప్పుడు నువ్వులలో నూనె అంతటా వ్యాపించి ఉంది అని అర్థం. అదే అభివ్యాపకాధారం.

ఇక మూడవది వైషయికాధారం. ఆకారము, జ్ఞానము ఒకటై ఉండగా, మరొకటి విషయముగా కలిగి

ఉండటము. అన్యాకార మైన జ్ఞానము అన్యావలంబనంగా అగుట. కర్మను అకర్మ యందు, అకర్మను కర్మ యందు చూడటము అనేది విరుద్ధము. కర్మ లేనిదే అయినా మూఢదృష్టి గల లోకానికి కర్మ కలదిగా కనిపిస్తుంది ***(అకర్మ ఏవ పరమార్థత: సత్ కర్మవత్ అవభాసతే మూఢదృష్టేః లోకస్య తథా కర్మైవ అకర్మవత్).*** బ్రహ్మము నిష్క్రియమే అయినా జ్ఞానం లేని వారికి కర్మ సహితంగా కనపడుతుంది. ఇది విపరీత జ్ఞానం వల్ల ఏర్పడే విపరీత దర్శనం. అందుచేత మానవులు కర్మాకర్మలను విపరీతంగా గ్రహిస్తున్నారు. ఈ విపరీత జ్ఞానాన్ని నివృత్తి చేయడం కొరకే ***కర్మణి అకర్మ యః పశ్యేత్*** అనే విషయాన్ని భగవంతుడు విషయ సప్తమిని గ్రహించి చెబుతున్నాడు. అంతేగాని, కర్మ యందు అకర్మ, అకర్మ యందు కర్మ ఎలా సాధ్య పడుతుంది? కనుక ఇక్కడ ఆధార ఆధేయ పంబంధం ఏదైతే కనిపిస్తూ ఉందో అది వైషయి కాధారం. అంటే, ఎండమావులలో జలం లాగా, ముత్తెపు చిప్పలో వెండి లాగా లౌకికులకు విపరీత జ్ఞానం వల్ల అకర్మ విషయంలో కర్మ, కర్మ విషయంలో అకర్మ గోచరిస్తూ ఉంది అని అర్థం ***(అతః విపరీత గృహీతే ఏవ కర్మాకర్మణీ లౌకికైః యథా మృగతృష్ణి కాయామ్ ఉదకం, శుక్తికాయాం వా రజతమ్).***

## కర్మలో అకర్మ దర్శనం

ఆత్మ ***నిష్కళమ్ నిష్క్రియమ్,*** అంటే అవయవాలు లేనిది, క్రియారహిత మైనది అని ఉపనిషత్ నిర్ణయం. కనుక ఆత్మలో కర్మ లేదు. దేహం విరామ మెరుగదు. దేహేంద్రియాదులలో కర్మ ఆగదు. ఆత్మలో కర్మ సాగదు.

కాని, క్రియారహితమై అకర్మగా ఉన్న ఆత్మ యందు కర్మ దృష్టి నాటుకొని పోయింది. దేహాదులను ఆశ్రయంగా కలిగి ఉన్న కర్మ, ఆత్మ యందు ఆరోపించ బడింది. ఈ విధమైన విపరీత జ్ఞానంలో ఏది కర్మో, ఏది అకర్మో అర్థం కాకపోవడం చేత మేధావులు సైతం మోహానికి గురి అవుతున్నారు అన్నాడు భగవంతుడు ***(కిం కర్మ, కిం అకర్మ కవయోపి అత్ర మోహితాః).***

***క్రియతే ఇతి కర్మ.*** చేయబడేది కర్మ. చేసే దెవరు? కర్త. కర్త లేకపోతే కర్మ లేదు. కర్మ కర్తను ఆశ్రయించుకొని ఉంది. కాని, కర్మాధికారం మాత్రం కర్తకే ఉంది. ఏ కర్మ చేయాలి? అనేది కర్త యొక్క నిర్ణయంపై ఆధారపడి ఉంటుంది. ఆ విధమైన కర్మ స్వేచ్ఛ కర్తకే ఉంది. కర్మకు లేదు. కర్మ కర్తను ఎన్నుకో లేదు.

కర్మను ఎన్నుకొని కర్త కర్మాచరణం సాగిస్తాడు. మరి, కర్మ దేని కొరకు? కర్మ కర్మ కొరకు కాదు. కర్మ అనేది శ్రమతో కూడుకొని ఉంటుంది. శ్రమను ఎవ్వరూ వరించరు. శ్రమకు ఫలితం ఉండటం చేతనే, కర్మలో ఉన్నది శ్రమే అయినా, మనిషి శ్రమతో కర్మాచరణం చేస్తాడు.

నేను ఈ కర్మ చేశాను అంటే, ఆ ఫలాన్ని ఆశిస్తున్నాను అని అర్థం. ఎవరు కర్మను ఆచరిస్తే వారినే ఫలం వరిస్తుంది. కనుక కర్మాచరణంలో ఎవడు కర్తగా తెలుస్తున్నాడో, అతడే ఫలానుభవంలో భోక్తగా ఉన్నాడు. కర్త ఎవడో అతడే భోక్త **(కర్తా ఏవ భోక్తా భవతి).** భోక్త కర్త కన్నా భిన్నమైన వాడు కాడు. కాకపోతే చేసేవాడుగా అతడు కర్త, అనుభవించే వాడుగా అతడు భోక్త. కర్తగా ఉన్నప్పుడు భోక్త లేకపోయినా, భోక్తగా ఉన్నప్పుడు కర్త లేకపోయినా, కర్త, భోక్త ఇరువురూ ఒక్కరే అని తెలిసి పోయింది కనుక, ఆ ఒక్కరు ఎవరు? ఈ కర్త, భోక్త ఎవరిపై ఆధారపడి ఉన్నారు?

నేను చేస్తున్నాను. నేను అనుభవిస్తున్నాను అని ప్రతి ఒక్కరు చెబుతున్నారు కనుక, కర్త, భోక్త 'నేను' అనే వృత్తిపై ఆధారపడి ఉన్నారు. ఈ నేనే అహం. అదే ఆత్మ.





నేను ఆత్మనే. ఈ విషయంలో సంశయం లేదు. మరి, ఆత్మనైన నేను కర్తనా, అకర్తనా? ఒకసారి నేను చేస్తున్నాను అంటాను. అప్పుడు ఆత్మను కర్త అనుకోవాలా? మరొకసారి నేను ఏమీ చేయడం లేదు అంటాను. అలాంటప్పుడు ఆత్మను అకర్త అనుకోవాలా? ఇంతకీ ఆత్మ కర్తా లేక అకర్తా? కర్తలో కర్మాచరణం ప్రధానంగా ఉండటం చేత, కర్మ లేకుండా ఉండే అకర్త కర్త ఎలా అవుతాడు? అలాగే కర్త అకర్త ఎలా అవుతాడు?

ఆత్మ కన్నా విలక్షణంగా ఏ కర్మ కూడా లేదు. కాని, ఆత్మలో కర్మ ఉండే అవకాశం లేదు. కర్మలో వికారం ఉంటుంది. కర్మలో ఉండే వికారము కర్తపై తన ప్రభావాన్ని చూపుతుంది కనుక ఆత్మే కనుక కర్త అయినట్లైతే, ఫలానుభవానికై కర్మను ఆచరించే ఆత్మ వికారానికి లోనయ్యే ప్రమాదం ఉంది. ఆత్మ నిర్వికారము కనుక ఆత్మలో ఏ విధమైన వికారమూ ఉండే అవకాశం లేదు. ఆత్మలో ఏ విధమైన కర్మ లేకపోయినా, దేహేంద్రియాదుల యందు సాగే కర్మలను ఆత్మ యందు ఆరోపించడం జరుగుతూ ఉంది. అలాంటి చోట మేఘాలు కదులుతూ ఉంటే, చంద్రుడు చలిస్తున్నట్లు ఎలా అనిపిస్తూ ఉంటుందో, అలాగే దేహేంద్రియాది సంఘాతము యొక్క కర్మలను ఆత్మ యందు ఆరోపించడము జరుగుతూ ఉంటుంది.

'అహం' వృత్తియే కర్త. 'అహం' వృత్తి 'అహం' స్వరూపమైన ఆత్మ కన్నా వేరుగా ఉండలేదు కనుక, 'అహం' వృత్తి కూడా ఆత్మే. కాని, ఆత్మ 'అహం' వృత్తి కాదు. 'అహం' వృత్తి ఉంది అంటే ఆత్మ ఉంది అని అర్థం. 'అహం' వృత్తి లేకపోయినా ఆత్మ ఉంటుంది.

కర్త ఉన్నప్పుడు అకర్త యైన ఆత్మ ఉంది. కర్త లేకపోయినా అకర్త యైన ఆత్మ ఉంటుంది. ఇప్పుడు అర్థమైందా? కర్త కూడా ఆత్మే. కాని, ఆత్మ కర్త కాదు. ఆత్మ ఎప్పుడూ అకర్త గానే ఉంది. ఇంతకీ నే నెవరు ***(కోఽ హం?).*** నేను ఆత్మను. మరి కర్త ఎవరు? నేనే. అకర్త అయిన ఆత్మ ఎవరు? నేనే ***(అహమేవ).*** ఈ రెండూ నాకు తెలుసా? తెలియదు. కర్తగా నేను నాకు తెలుసు. అలాగే భోక్తగా కూడా తెలుసు. కాని, అకర్త యైన ఆత్మగా నేను నాకు తెలియదు. కర్త నేనే అని తెలియడంలో దోషం లేదు. కాని, నేను కర్తను అని అనుకుంటే మాత్రం సంసారం తయారైనట్లే.

తనను తాను అకర్త యైన ఆత్మగా తెలుసుకున్న వాడు, దేహేంద్రియాదులలో కర్మలు జరుగుతూ ఉండినా, వాటిని అకర్మ గానే వీక్షిస్తాడు. అందుచేత, కర్మల యందు అకర్మను దర్శిస్తాడు ***(అకర్తారం స పశ్యతి).*** తనను తాను అకర్తగా వీక్షిస్తాడు. ఇదే యదార్థ దర్శనం. జ్ఞానదృష్టి. ఈ విధమైన జ్ఞానదృష్టి గల వానిని బుద్ధిమంతునిగా భగవానుడు అభివర్ణించాడు.

## అకర్మలో కర్మ దర్శనం

నేను చేస్తున్నాను అనేది కర్మ అయినపుడు, నేను చేయడం లేదు అనేది అకర్మ అనుకుంటారు. చేయడం కర్మ, చేయకుండా ఊరకుండుట అకర్మ అని భావిస్తూ ఉంటారు. నేను చేస్తున్నాను అనేది ఎలాగైతే కర్మ అయిందో, నేను చేయడం లేదు అనేది కూడా కర్మే గాని అకర్మ కాదు.

కర్మ అనేది కర్తపై ఆధారపడి ఉంది కనుక కర్మాకర్మలు రెండిటిలో కర్త ఉండటం చేత రెండూ కర్మలు గానే తెలుస్తున్నాయి. కర్త ఉన్నంత వరకు కర్మ చేయక పోయినా చేసినట్లే. అకర్మ అని మనం భావిస్తున్నది కూడా వాస్తవానికి కర్మే. నేను చూస్తున్నాను అనేది కర్మ. ఎందుకని? కర్త ఉన్నాడు కనుక. అదే వ్యక్తి కళ్ళు మూసుకొని నేను చూడటం లేదు అని అన్నంత మాత్రాన అది అకర్మ కాదు. చూడటము ఎలాగైతే కర్మ అయిందో, చూడక పోవటము కూడా కర్మే అవుతుంది. నేను చూస్తున్నాను అన్నప్పుడు కర్తగా

చూస్తున్నాడు. కళ్ళు మూసుకొని నేను చూడటం లేదు అన్నప్పుడు అలా చూడకుండా ఉండటము అనే కర్మను చేస్తూనే ఉన్నాడు. బాహ్య దృశ్యాలను చూడటము అనే కర్మ లేకపోయినా, ప్రయత్నంతో కనురెప్పలను మూయడము అనే కర్మను చేస్తూనే ఉన్నాడు. అలాంటి పట్టుదల ఏదో అది కూడా కర్మే. మానసకర్మ. ఈ విధమైన మానసకర్మ లేకపోతే, కళ్ళను మూసి ఉంచడము అనే భౌతిక కర్మ జరగదు.

కర్మ చేసే కర్తకు చేయాలి అనే వృత్తి ఉండాలి. అలాగే ఏమీ చేయకుండా ఉండటానికి కూడా, అలా చేయకుండా ఉండాలి అనే సంకల్పం ఉండి తీరాలి. ఏ సంకల్పమైనా కర్తకు సంబంధించిందే. సంకల్పాలు సాగించే కర్త ఉండేటప్పుడు అకర్మ ఎక్కడుంది?

కాకపోతే, దేహేంద్రియాలలో కర్మ వ్యాపారము ఆగినపుడు, 'నేను ఏమీ చేయడం లేదు - సుఖంగా ఉన్నాను' అని మనిషి భావిస్తాడు. దేహేంద్రియాలతో తాదాత్మ్యం చెందటం వలన, వాటి యందు ఆగిన కర్మ వ్యాపారమును తన యందు ఆరోపించుకొని, ఎలాగైతే గుఱ్ఱమును ఎక్కినవాడు గుఱ్ఱము నిలబడి నపుడు తాను నిలబడినట్లు భావిస్తున్నాడో, అలాగే ఇంద్రియ వ్యాపారాలు విరమించిన ఆ స్థితిని మనిషి అకర్మగా చూస్తున్నాడు. ఇది దోషము. ఇదే మూఢ దృష్టి. వాస్తవానికి ఏమీ చేయకుండా ఉండటము అనే అకర్మలో ఉన్నది కర్మే అనేది శ్రుతి, స్మృతి, న్యాయ, అనుభవ ప్రసిద్ధము.

ఈ సత్యమును దర్శించక పోతే, నిష్క్రియత్వ శాంత్యాది ధర్మాలు ఎలా బ్రహ్మ లక్షణములో, అలాగే దేహేంద్రియాదులు ఏమీ చేయక ఉపరమించుటలో గోచరించే క్రియారహిత శాంత్యాదులు బ్రహ్మ లక్షణములే అని భావించే ప్రమాదము, తద్వారా స్వరూప భ్రమ ఏర్పడే అవకాశము లేకపోలేదు. అది జరగకూడదు అనే ఉద్దేశ్యంతో, అకర్మ కూడా కర్మే అనే విషయాన్ని నిర్ధారణ చేస్తున్నాడు ***(అకర్మణి చ కర్మ యః . . . పశ్యేత్).***

కనుక, కర్మ మరియు అకర్మగా కనిపిస్తున్న విరామస్థితి, ఈ రెండూ కర్మలే. రెండూ కర్తృతంత్రాలే. కర్త అధీనంలో ఉన్నవే. రెండూ దృశ్యాలే. రెండూ ఉపాధికి సంబంధించినవే. రెండూ అనాత్మయే. ఈ విధంగా కర్మ యందు అకర్మను, అకర్మ యందు కర్మను దర్శించే వాడు మనుషులలో బుద్ధిమంతుడు ***(ఏవం కర్మాకర్మ విభాగజ్ఞః సః బుద్ధిమాన్ పండితః మనుష్యేషు).*** అతడే పండితుడు.

**యచ్ఛబ్ద ద్వయ ప్రయోగము**

కర్మము నందు అకర్మమును ఎవడు ***(యః)*** చూస్తున్నాడో, అలాగే అకర్మము నందు కర్మమును ఎవడు ***(యః)*** చూస్తున్నాడో అతడే మనుషులలో పండితుడు అని శ్లోకము యొక్క పూర్వార్థాన్ని అర్థం చేసుకున్నాం. ఈ రెండు చోట్ల కూడా కర్తను అనగా చూచేవాణ్ణి రెండు యచ్ఛబ్దములతో ప్రస్తావించడం జరిగింది. ఈ విషయంలో కూడా శంక తలెత్తుతుంది.

కర్మ యందు అకర్మను, అకర్మ యందు కర్మను దర్శించడం ఒకే వ్యక్తికి సంభవం కాదు అనేది పూర్వపక్షము. అవి పరస్పర విరుద్ధంగా ఉండటం చేత, అవి రెండును ఒకే వ్యక్తిని ఆశ్రయించుకొని ఉండలేవు. కనుక, ఇవి భిన్న పురుషులకు సంబంధించినవి. కనుకనే శ్లోక పాదములో యచ్ఛబ్ద ప్రయోగము రెండు సార్లు చేయడం జరిగింది అని పూర్వపక్షము.

అది కాదు అని సిద్ధాంతము. హేతువు ఏమిటంటే, పండితునికి కర్మాకర్మములు రెండూ అనిత్యాలే. విద్వాంసునికి దేహేంద్రియాదులు మిథ్యయే అగుట చేత, వాటి కర్మము నందు, అకర్మము నందు కూడా మిథ్యాత్వ దర్శనమే ఉంటుంది. అప్పుడే కర్మాకర్మముల నుండి విడిపడి విముక్తు డవుతాడు. ఈ రెండిటిని మిథ్యగా గ్రహించడం వల్లనే అశుభము నుండి విడిపడు తున్నాడు ***(యద్ జ్ఞాత్వా మోక్ష్యసే అశుభాత్).*** కనుక





ఈ రెండును ఏక పురుషాశ్రయంబులే గాని భిన్న పురుషులకు సంబంధించినవి కావు. యచ్ఛబ్ద ద్వయ ప్రయోగము బోధనా సౌలభ్యము కొరకే గాని, ద్వైత దర్శనానికి కాదు. ఈ విషయాన్ని శ్లోకమే నిరూపిస్తూ ఉంది. యచ్ఛబ్దాన్ని రెండు సార్లు ప్రయోగించినా, అలా కర్మలో అకర్మను, అకర్మలో కర్మను దర్శించు వానిని స బుద్ధిమాన్ అతడే పండితుడు అని ఒక్క వ్యక్తినే చెప్పుట చేత, ఇలా కర్మాకర్మ విభాగజ్ఞ స్వరూపుడు ఒక్కడే అని స్పష్టమౌతూ ఉంది. అద్వైత భావమే ప్రయోజనంగా తెలుస్తూ ఉంది.

**ఆత్మవిదుడు అకర్తే**

నేను అకర్తను అని తెలుసుకొనిన ఆత్మవిదుడు కర్మాకర్మలలో కర్తృత్వము లేని ఆత్మనే దర్శిస్తాడు. అందుచేతనే అతడు బుద్ధిమంతుడు. అంటే జ్ఞానవంతుడు. ఆత్మజ్ఞానవంతుడు. కర్మాకర్మలు పరస్పరం అధ్యస్తమై ఉన్నా, నిష్క్రియ మైన నిర్మలాత్మనే ఎవడు దర్శించుచున్నాడో వాడే జ్ఞాని. విపరీత భావము లేకుండా విలక్షణ మైన ఆత్మదృష్టి కలవాడు.

ఆత్మలో కర్మ లేదు. ఆత్మ కర్త కాదు. అకర్త. ఆత్మే తానని తెలుసుకొనిన బుద్ధిమంతుడు తనను అకర్తగా తెలుసుకుంటాడు. అకర్త అయినవాడు కర్త ఎలా అవుతాడు? కర్త కాని వాడు కర్మ నెలా చేస్తాడు? తాను చేయడానికి కర్మే లేనివాడు అకర్త. మరి, తాను చేయవలసిన కర్మ లన్నీ ఏమౌతాయి? చేసేందుకు కర్మలు లేవు అంటే, కర్మ లన్నీ సంపూర్ణంగా చేయబడ్డాయి అని అర్థము. ఆత్మవిదుని సర్వకర్మలు క్షయ మయ్యాయని అర్థము.

ఆత్మజ్ఞానము కలుగక పూర్వము తాను కర్త అనే భావంతో ఉండినాడు. తనను కర్తగా భావించడము అంటే తనను భోక్తగా కూడా భావించడమే. నేను చేస్తున్నాను అనే అహంకారము కర్త అయితే, నేను అనుభవిస్తున్నాను అనే అహంకారము భోక్తగా రాణించడం జరిగింది. ఈ విధమైన అహంకారము గలవాడు మూర్ఖుడు. విపరీత జ్ఞానంతో తనను తాను కర్తగా, భోక్తగా భావించిన వాడు. సత్యజ్ఞానము లేనివాడు.

**కర్తృత్వా ద్యహంకార భావనారూఢో మూఢః**

కర్తృత్వ భోక్తృత్వాది అహంకారము గలవాడు మూఢుడు అన్నది ఉపనిషత్తు. అతడే తనను తాను కర్తగా ఊహించు కున్నాడు. సత్యజ్ఞానము కలిగిన తరువాత తాను ఆత్మే నని గ్రహించాడు. అహంకారము ఆత్మలో విలీనమై పోయింది. అహంకారము ఎప్పుడైతే లేదో కర్త మిగలడు. అకర్తే ఉంటాడు. అకర్తకు చేయదగిన కర్మలు ఏముంటాయి? ఉంటే, అతను అకర్త ఎలా అవుతాడు? అకర్త చేయదగిన కర్మలు లేవు. ఒకవేళ గతంలో ఉంటే, అలా ఉన్న వన్నీ చేసినవే అయిపోయాయి. స్వప్నద్రష్ట చేసిన అప్పు లన్నీ మేల్కొన గానే చెల్లిపోతాయి. ఇక్కడ కూడా అంతే. అందుచేతనే అకర్త యైన ఆత్మవిదుని **కృత్స్న కర్మకృత్** అని పిలిచాడు భగవంతుడు.

**కృత్స్న** అంటే సమస్తమైన అని అర్థము. **కృత్స్న కర్మకృత్** అంటే చేయవలసిన సమస్తమైన కర్మలను చేసినవాడు అని అర్థము. కర్మవలయము నుండి సంపూర్ణంగా బయటపడిన వాడు అని భావము. ముక్త పురుషుడు అని నిర్ణయము.

మరి, ముక్తపురుషుడు కర్మను ఆచరించడా? అన్ని కర్మలు చేసిన వాడయ్యాడు కనుక, చేయవలసిన కర్మలు తనకంటూ ఏవీ లేవు కనుక, అకర్త యైన తాను సదా అకర్మలో ఉండాలి కనుక, ఏ కర్మ లేకుండా బండ లాగా పడి ఉంటాడా? అనే శంక కూడా ఈ సందర్భంలో కలిగే అవకాశం లేకపోలేదు.

అకర్త అంటే కర్మ చేయకుండా ఉండేవాడు కాదు. నేను కర్మ చేయను అని భీష్మించుకొని కూర్చోవడం అకర్మ అవుతుంది. అకర్మ కూడా కర్మ క్రిందికే వస్తుందని అర్థం చేసుకున్నాం *(అకర్మణి చ కర్మయః)*. తాను కర్త అని భావించిన వాడే నేను కర్మ చేయను అంటాడు. కాని, ఇక్కడ ఆత్మవిదుడైన అకర్త కర్మ యందు అకర్మను, అకర్మము నందు కర్మను దర్శించిన వాడు.

కనుక అకర్త విషయంలో అకర్మ అంటే, కర్మాభావము కాదు. కర్మ లేకపోవడము కాదు. కర్మ చేయక పోవడమూ కాదు. కర్మలు సాగుతున్నా ఆ కర్మల నుండి విడిపడియున్న స్వరూపమే తాను అనే జ్ఞానము కలిగి ఉండటము. ఆత్మ అసంగము కనుక, జ్ఞానవంతుడు సదా అసంగుడే. కర్మలలో ఉన్నా అంటని వాడే.

**యథా పుష్కర పలాశ ఆపో న శ్లిష్యన్తే**

తామరాకుపై పడినా, నీరు తామరాకును ఎలా అంటుకోలేదో, అలాగే తాను అకర్త అని తెలిసిన బుద్ధిమంతునికి, యోగయుక్తునికి, కృత్స్నకర్మకృతునికి ఏ కర్మలూ అంటవు. సమస్తమైన కర్మల మధ్య ఉన్నను తనను అకర్తగా దర్శించడమే జరుగుతుంది. కర్మాకర్మల మధ్య ఆత్మ అసంగంగా కనిపిస్తూ ఉంటుంది. అనుభూతిగా నిలుస్తుంది.

వృక్షము చలిస్తూ ఉండినా, చుట్టూ ఉన్న ఆకాశము ఎలా చలన రహితంగా ఉందో, కర్మలు జరుగుతూ ఉండినా ఆత్మను నిష్క్రియంగా దర్శించే అద్వయానంద అమృతానుభూతి అది.

**నా కృతేన కృతేనార్థో న శ్రుతి స్మృతి విభ్రమైః**
**నిర్మంథర ఇవాంబోధిః స తిష్ఠతి యథాస్థితః**

శ్రుతి స్మృతులలో నిర్దేశింపబడిన కర్మలను సైతం చేసినా, చేయకపోయినా వాటి ఫలితాల చేత అంటబడని వాడు, విస్తరంగమై, నిశ్చలమైన సాగరము వలె స్థిరమైన జ్ఞానము గల ఆత్మజ్ఞాని తన స్వరూప వైభవము నందే శోభిస్తూ ఉంటాడు అన్నది ఉపనిషత్తు.

*ఆత్మజ్ఞాని యైన పండితుని వైభవమును తరువాత శ్లోకంలో కూడా వర్ణిస్తున్నాడు.*

**యస్య సర్వే సమారమ్భాః కామసంకల్ప వర్జితాః ।**
**జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణం తమాహుః పణ్డితం బుధాః ॥** 19

**యస్య-సర్వే-సమారంభాః-కామసంకల్ప వర్జితాః**
**జ్ఞానాగ్ని దగ్ధకర్మాణం-తం-ఆహుః-పండితం-బుధాః**

| | | | |
|---|---|---|---|
| యస్య | = ఎవని యొక్క | దగ్ధకర్మాణం | = దహింప బడిన కర్మలు గల |
| సర్వే | = సమస్తము లైన | తం | = వానిని |
| సమారంభాః | = కార్యాదులు | పండితం | = పండితునిగ |
| కామసంకల్ప వర్జితాః | = కామవాంఛలు లేకుండా ఉంటాయో | బుధాః | = జ్ఞానులు |
| జ్ఞానాగ్ని | = జ్ఞాన మనెడి అగ్ని చేత | ఆహుః | = చెబుతారు |

**కామ సంకల్పాల చేత ఎవరి కర్మలు కదలవో అతడే పండితుడు. జ్ఞాన మనే అగ్ని చేత ఎవరి కర్మలు దహింప బడ్డాయో అతడే పండితుడు. ఇది పెద్దల మాట.**

**వ్యాఖ్య**

కర్మ యందు అకర్మను ఎవ్వడు దర్శిస్తాడో అతడే పరమార్థమును దర్శించిన జ్ఞానవంతుడని, అతడు





చేయవలసిన సమస్తమైన కర్మలను చేసినవాడే అగుచున్నాడని గడచిన శ్లోకంలో భగవంతుడు ప్రవచించాడు. అలాంటి వాడు తాను ఆచరించే కర్మలను ఎలా అంటుకోకుండా ఆచరిస్తాడో, కర్మఫల స్పృహ లేకుండా కర్మలను ఎలా నిర్వర్తిస్తాడో, చేస్తూ చేయని వాడుగా కర్మలో అకర్మ దర్శనం ఎలా చేస్తాడో, పాపము అంటకుండా ఎలా ప్రవర్తిస్తాడో, సంసార బంధాల నుండి ఎలా విడిపడి ఉంటాడో సమగ్రంగా వివరించే ప్రయత్నములో ప్రస్తుత శ్లోకము నుండి వరుసగా ఐదు శ్లోకాలు చెబుతున్నాడు. అందమైన ఈ ఐదు శ్లోకాలను శ్లోక పంచకము అంటారు. జ్ఞాని జీవన వైభవాన్ని వర్ణించే, వివరించే ఈ శ్లోక పంచకము అమూల్యమైన పంచరత్న హారంగా శోభిస్తోంది.

కర్మలో అకర్మను దర్శించిన పరమార్థ దర్శి చేయవలసిన కర్మలన్నీ చేసినవాడే అయినప్పుడు ***(కృత్స్న కర్మకృత్)*** మళ్ళీ కర్మలు చేయడ మేమిటి? ఎందుకు చేయాలి? అనే ప్రశ్న ఉదయిస్తుంది. దానికి సమాధానంగా నేనొక ప్రశ్న వేస్తాను. జ్ఞాని అయినంత మాత్రాన కర్మలను ఎందుకని చేయకూడదు? ఈ ప్రశ్నకు జవాబు వస్తే పై ప్రశ్నలకు కూడా సమాధానం వచ్చినట్లే.

**యద్వృద్ధి కురుతే జన్తుః తత్తత్ కామస్య చేష్టితమ్**

ఎవరు ఏ కార్యాన్ని చేపట్టినా దాని వెనుక కామమే కారణమై ఉంటుంది. కామ ప్రేరితులైన మానవులు ఫలార్థులై కర్మలను ఆచరిస్తారు. కామము కదలడానికి ముందు ఆ కామానికి సంబంధించిన ఆలోచనలు మనస్సులో నడుస్తాయి. ఆ ఆలోచనల ఫలితంగా ఏది వాంఛనీయంగా అగుపిస్తుందో దాని విషయంలో కామం కదుల్తుంది. కనుక కార్యారంభానికి కామ సంకల్పాలే ప్రధాన కారణాలుగా తెలుస్తున్నాయి. మరి, సర్వకర్మలను చేసిన వాడుగా శోభిస్తున్న పూర్ణజ్ఞానిలో ఏ కొరత ఉందని సంకల్పాలు కదిలాయి? ఏ ఫలాన్ని ఆశించి కోరిక ఉద్భవించింది? కోరికలు ఒక వైపు అసంతృప్తిని ప్రదర్శిస్తూ ఉంటే, అలాంటి కోరికలు గల జ్ఞాని ***సర్వకర్మకృత్*** ఎలా అయ్యాడు? ఇది చిక్కుముడి.

బాగుంది. కామ సంకల్పాలచే ప్రేరితుడై కర్మలను ఆచరించడం వల్లనే కదా ఈ సంశయాలు తలెత్తు తున్నాయి? అవును. మరొక విషయాన్ని కూడా స్పష్టం చేసుకుందాం. ప్రస్తుతం మనం లేవనెత్తిన ఈ దోష దర్శనానికి కారణం జ్ఞాని కర్మ చేయడమా? లేక, కామసంకల్ప ప్రేరితుడై కర్మ చేయడమా? ఈ రెండిటిలో ఏది కారణము? కామసంకల్ప యుతుడై కర్మ చేయడమే అనుమానాలకు హేతువైంది కదూ! అలాంటప్పుడు కామ సంకల్పాలు లేకుండా కర్మ చేయడం దోషం కాదు కదా? అలా చేయడం వల్ల జ్ఞాని వైభవానికి లోపం రాదు కదా? అవును. ఏ లోపమూ రాదు. అయితే, కృత్స్నకర్మ కృతుడైన జ్ఞాని ఆచరించే కర్మలలో కామ సంకల్పాలు శూన్యం. దానినే పరమేశ్వరుడు విశ్లేషిస్తున్నాడు.

ఎవని యొక్క ***(యస్య)*** సమస్తమైన కర్మలు ***(సర్వే సమారంభాః)*** కామ సంకల్పాల నుండి విడిపడి ఉన్నాయో ***(కామసంకల్ప వర్జితాః)***, జ్ఞానమనే అగ్ని చేత ఎవరి కర్మలు తగులబడి పోయాయో ***(జ్ఞానాగ్నే దగ్ధ కర్మాణం)***, అతనిని ***(తం)*** పండితునిగా లేదా ఆత్మజ్ఞానిగా ***(పండితం)*** బ్రహ్మావిదులు ***(బుధాః)*** చెబుతున్నారు ***(ఆహుః)***.

***యస్య***, ఎవని యొక్క అనడంలో కర్మలో అకర్మను దర్శించిన వాని యొక్క అని అర్థము. ***సమారంభాః*** అంటే కర్మలు అని అర్థము. ***సమారభ్యన్తే ఇతి సమారంభాః*** ఆరంభ మవుతాయి కనుక కర్మలు సమారంభాలు. ఆరంభించబడే ప్రతి కర్మకు ముందు కామ సంకల్పాలు ఉంటాయని తెలుసుకున్నాం. కాని, జ్ఞాని ద్వారా ఆరంభింపబడే కర్మలలో కామ సంకల్పాలు ఉండవు. అందువల్లనే అవి బంధహేతువులు కావు.

## సంకల్పాల సందడి - ఆశల అంగడి

### జ్ఞానిలో అగుపించవు

నేను 'అది పొందాలి' అనేది కోరిక. ఆ కోరిక ఫలించడానికి నేను 'ఇది చేయాలి' అనేది సంకల్పం. కోరికకు ముందు, వెనుక కూడా సంకల్పాలు సందడి చేస్తూ ఉంటాయి. నేను అది పొందాలి అనే కోరిక కదలడానికి, దానికి ముందుగా, ఆ నిర్ణయానికి రావడానికి హేతువుగా ఎన్నో సంకల్పాలు నడుస్తాయి. అలాగే, కోరిక నిర్ణయమైన తరువాత, దానిని ఎలా పొందాలి అనే ఆచరణకు సంబంధించి కూడా అనేక సంకల్పాలు కదుల్తాయి.

కనుక సంకల్ప సందడిలో ఫలాకాంక్షతో ఆశల అంగడి తెరవడం జరుగుతుంది. కోరికల కొట్టులో సాగే కర్మ వ్యాపారమంతా ఫలాపేక్ష తోనే ఉంటుంది. ఈ విధమైన కర్మవ్యాపారంలో కర్త ఉన్నాడు. ఫలానుభవంలో అతడే భోక్తగా కనిపిస్తున్నాడు. కనుక కర్మాచరణంలో ప్రతి ఒక్కరిలో కర్తృత్వాభిమానం ఉంటుంది. అందుచేత కర్మఫలాలు వాసనలను తయారు చేసి నూతన కార్యాలకు బీజా లవుతూ ఉంటాయి.

కాని, జ్ఞాని విషయం వేరు. జ్ఞాని ఆచరించే కార్యాలలో సంకల్ప సందడి ఉండదు. కోరికల అంగడి అగుపించదు. అవి అంకురీ భావము లేని కర్మలు. దేనినో పొందడానికి చేస్తున్నాను అనేది ఉండదు. జ్ఞానికి సర్వమూ సిద్ధించే ఉంది. ఇది చేసి అది పొందుతాను అని జ్ఞాని అనుకోడు. అతడు అన్నీ చేసినవాడే అయి ఉన్నాడు. అలాంటివాడు ఆచరించే కర్మలలో వాస్తవానికి అకర్మే ఉంది. జ్ఞాని అదే దర్శిస్తాడు ***(కర్మణి అకర్మ పశ్యేత్)***. ఇదే జ్ఞానం. కర్మలలో అకర్మ దర్శనమే జ్ఞానం ***(కర్మాదౌ అకర్మాది దర్శనం జ్ఞానం)***. అదే అగ్ని ***(తదేవ అగ్నిః)***. అట్టి జ్ఞానము అనే అగ్ని చేత ఏ దివ్యాత్ముని పుణ్యపాపాలు తగలబడి పోయాయో ***(తేన జ్ఞానాగ్నినా దగ్ధాని శుభాశుభ లక్షణాని కర్మాణి యస్య)*** అతనిని పండితుడు అని బ్రహ్మవేత్తలు చెబుతారు.

### చితి మంట కాదు - చిత్తములో మంట

కర్తృత్వాభిమానము లేకుండా, కర్మఫలాపేక్ష నుండి విడిపడి, తాను అకర్త అనే ఆత్మవైభవంలో స్థిరపడి కర్మలను ఆచరించేవాడు కర్మలలో అకర్మనే చూస్తాడు. ఎందుకని? అక్కడ కర్మలు లేవు కనుక. కర్మలు ఎందుకని లేవు? కర్త లేడు కనుక. కర్త లేనపుడు కర్మలు ఎలా ఉంటాయి? మరి కర్మలు ఏమయ్యాయి? కాలిపోయాయి. జ్ఞానమనే అగ్నికి ఆహుతై దగ్ధమై పోయాయి. నేను చేస్తున్నాను అనే కర్త ఎప్పుడైతే చిత్తములో లేకుండా పోయాడో, కర్మ లన్నీ కూడా అక్కడే, చిత్తము లోనే కాలి పోయాయి.

### ఆఖ్యాయిక

సద్గురు దర్శనానికి ఆశ్రమానికి వచ్చిన ఒక శిష్యుడు దోసిలిలో ఫలాలను నింపుకొని వినయంగా గురువును సమీపించాడు. అతణ్ణి చూడగానే గురువు, 'క్రింద పడేయ్!' అన్నాడు. ఏం పడేయాలి? ఏమున్నాయి పడేయటానికి చేతిలో పండ్లు తప్ప! వెంటనే తెలివి గల ఆ శిష్యుడు తన ఎడమచేతి లోని పండ్లను పడేశాడు. వామహస్తం అయోగ్య మని గురుదేవుని భావన కావచ్చు అనుకున్నాడు.

'పడేయ మని చెప్పాను కదా!' అని మళ్ళీ అన్నాడు ఆచార్యుడు. తన కుడిచేతి లోని పండ్లను కూడా క్రింద పడేశాడు శిష్యుడు.

గురువు ఎందుకలా అంటున్నాడో శిష్యుడికి అర్థం కాలేదు. ఈ లోగా, 'ఎన్నిసార్లు చెప్పాలి పడేయ మని? పడేయ్!' అని మళ్ళీ అన్నాడు గురువు.





'గురుదేవా! అదే అర్థం కావడం లేదు. పండ్లు చేత పట్టుకొని తమ దర్శనానికి వచ్చాను. తమరు పడేయ మంటే పడేశాను. మళ్ళీ పడేయ మంటున్నారు. ఇక నా వద్ద ఏముంది పడేయడానికి?' అన్నాడు శిష్యుడు వినయంగా.

'నేను పడేయ మన్నానే గాని, పండ్లు పడేయ మన్నానా? చూడు! నేను పడేయ మన్నది పండ్లను తెచ్చిన వాణ్ణి, పండ్లను కాదు.

నేను పండ్లను గురువుకు సమర్పించుకుంటాను అని వచ్చావు. పండ్లను సమర్పిస్తున్నావు. ఆ **నేను** మాత్రం నీ దగ్గరే ఉంచుకున్నావు. **నేను** అనే అహంకారాన్ని త్యాగం చెయ్యకుండా ఏది సమర్పించి మాత్రం ఏమి ఉపయోగం?' అన్నాడు గురువు.

చేతుల్లో ఉన్న వాటిని ఎవరైనా సమర్పించ గలరు. కాని, చిత్తంలో ఉన్న అహంకారాన్ని సమర్పించిన వారే నిజమైన త్యాగులు.

కర్త ఉంటే కర్మలు సాగుతాయి. ఫలాలను రాల్చుతాయి. మళ్ళీ మళ్ళీ అంకురిస్తాయి. పుష్పిస్తాయి. ఫలిస్తాయి. కర్త లేని దశలో కర్మలు కాలిపోయాయి కనుక అవి తిరిగి మొలక లెత్తవు. బీజాలను క్షేత్రంలో నాటితే మొలక లెత్తుతాయి. కాల్చిన విత్తనాలను చల్లితే మొలక లెత్తుతాయా? జ్ఞాని హృదయంలో కర్మ బీజాలు మొలక లెత్తవు.

కనుక, జ్ఞాని ద్వారా ఆచరింపబడే కర్మలు కర్మలు గాని కర్మలు. అలాంటి కర్మలలో జ్ఞాని సంచరించవచ్చు. లేదా విరమించవచ్చు. సంచరిస్తే, దేనిని ఆశించి సంచరించావు? అని ప్రశ్నించడానికి లేదు. ఎందుకని? అతని కర్మలు కామసంకల్ప వర్జితాలు కనుక. ఒకవేళ కర్మల నుండి విరమిస్తే ఎందుకని విరమించావు? అని అడగటానికి వీలు లేదు. ఎందుకని? అంకురీ భావము లేని జ్ఞాని కర్మలు దగ్ధ బీజాలు కాబట్టి.

కర్మ చేసినా జ్ఞాని చేయనివాడే. అలాంటి వాడు కర్మను ఆచరిస్తే, కర్మ ప్రవృత్తిలో ఉద్యమిస్తే అది లోకానికి శుభం ***(ప్రవృత్తేన చేత్ లోక సంగ్రహార్థం)***. ఒకవేళ కర్మ నుండి విరమిస్తే, నివృత్తిలో నిష్క్రమిస్తే, అది కేవలం జీవన మాత్రార్థం ***(నివృత్తేన చేత్ జీవన మాత్రార్థం, జీవన యాత్రార్థం)***.

ఇక్కడ మరొక విషయాన్ని కూడా జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. జ్ఞాని ప్రవృత్తిలో చరిస్తే, దాని వల్ల లోకానికి మేలు జరుగవచ్చు. లోకోద్ధారణము జరుగవచ్చు. కాని, లోకాన్ని ఉద్ధరించాలి అనే భావము జ్ఞానిలో ఉండదు. లోకాన్ని ఉద్ధరించాలి అంటే లోకంలో లోపం ఉందని అర్థము. జ్ఞాని దృష్టికి లోపాలు అగుపించవు. పాపాలు కనిపించవు. ఆయన జ్ఞానదృష్టిలో లోకం ఉద్ధరింపబడే ఉంది.

నేను లోకాన్ని ఉద్ధరిస్తాను అనే వ్యక్తిలో జ్ఞానం ఏపాటిదో అంచనా వేసుకోవాలి. నువ్వు ఈ రోజు ఉన్నావు. నువ్వు లేక ముందు, ఈ ప్రపంచానికి నువ్వు రాక ముందు, ఈ లోకాన్ని ఎవరు ఉద్ధరించారు? ఇదంతా లేనిపోని కర్తృత్వాభిమానము. అది ఉంది అంటే, కర్త ఉన్నట్లే. కర్త కర్మను కర్మగా చేస్తాడు. కర్మగా చూస్తాడు. అంతేగాని కర్మలో అకర్మను దర్శించలేడు. అది జ్ఞానికే సాధ్యం. కర్మల నాచరించడంలో అజ్ఞానికి జ్ఞానికి ఇక్కడే తేడా.

అజ్ఞాని ఉధృతంగా కర్మలలో ఊరేగినంత మాత్రాన లోక సంగ్రహం జరగదు. అలాగే సర్వకర్మలను త్యజించి కూర్చున్నంత మాత్రాన అతడు ఆత్మజ్ఞాని కాడు. కర్మ చేసినా, కర్మ విడిచినా రెండిటిలో అజ్ఞాని కర్తగా ఊగిసలాడుతూనే ఉన్నాడు. కర్మను విడిచినంత మాత్రాన అజ్ఞాని ఎలా అకర్త కాడో, కర్మను ఆచరించినా జ్ఞాని అకర్త కాకపోడు. ఈ సత్యాన్ని అష్టావక్ర గీతలో జనకునికి అష్టావక్ర మహర్షి బోధిస్తాడు.

**నివృత్తి రపి మూఢస్య ప్రవృత్తి రుపజాయతే**
**ప్రవృత్తి రపి ధీరస్య నివృత్తి ఫలభాగినీ ॥**

మూఢుడు ఏ కర్మ చేయకుండా నివృత్తిలో ఉన్నా ననుకున్నా, నిజానికి అతడు ప్రవృత్తిలో ఉన్నవాడే. కర్తగా కర్మ చేస్తున్నవాడే. జ్ఞాని కర్మలలో కదులుతున్నా, వాస్తవానికి అకర్మలో ఉన్నవాడే. మూఢుడు కర్తరూపం లోనే ఉన్నాడు కనుక చేసినా కర్తే, చేయకపోయినా కర్తే. జ్ఞాని అకర్తగా శోభిస్తూ ఉండటం చేత, అతడు కర్మ చేసినా, చేయక పోయినా స్వరూపత: అకర్తే. అందుకే అతనిని బ్రహ్మవిదులు పండితుడు అని ప్రశంసించారు.

**పండిత దర్శనం**

పండా అంటే బుద్ధి. పండిత: అంటే బుద్ధిమాన్ అని అమరకోశము. కర్మలో అకర్మను దర్శించే జ్ఞానిని మనుష్యులలో బుద్ధిమంతుడుగా గడచిన శ్లోకం లోనే గీతాచార్యుడు అభివర్ణించాడు. బుద్ధిమంతుడు అంటే ఆత్మజ్ఞాని అని అక్కడ చెప్పుకున్నాం. అతడినే బుధజనులు పండితుడు అని శ్లాఘిస్తున్నారు.

ఇక్కడ పండితుడు అంటే, లోకంలో పండితుడుగా చెలామణి అయ్యే గ్రంథ కీటకం కాదు. నెత్తి కెత్తుకున్న మాటల మూటల్ని దయ్యం ఆవహించిన వానిలా ఊగిపోతూ పది మందిలో దించుకొనే వాడు అసలే కాదు.

కామ సంకల్పాలను కాల్చేసిన వాడు పండితుడు. జ్ఞానాగ్ని చేత కర్మలను దగ్ధం చేసినవాడు పండితుడు. ఆత్మజ్ఞానంతో అకర్తగా కర్మలలో కదిలేవాడు పండితుడు.

*ఆత్మ ఒక్కటే. ఆత్మజ్ఞానమూ ఒక్కటే. కాని ఆత్మజ్ఞానులు అనేక విధాలుగా అగుపిస్తూ ఉంటారు. అంతమాత్రం చేత జ్ఞానము అనేక విధాలుగా ఉండదు. మనకు కనిపించే ఆ విలక్షణత్వము ప్రారబ్ధాధీనంగా ఉంటుంది. అదే బోధిస్తున్నాడు.*

**త్యక్త్వా కర్మఫలాసఙ్గం నిత్యతృప్తో నిరాశ్రయ: ।**
**కర్మ ణ్యభిప్రవృ త్తోఽపి నైవ కించి త్కరోతి స: ॥** 20

**త్యక్త్వా-కర్మఫలాసంగం-నిత్యతృప్త:-నిరాశ్రయ:**
**కర్మణి-అభిప్రవృత్త:-అపి-న-ఏవ-కించిత్-కరోతి-స:**

| | | | |
|---|---|---|---|
| నిత్యతృప్త: | = నిత్యతృప్తుడు | అభిప్రవృత్త: అపి | = సంచరించుచున్న వాడైనను |
| నిరాశ్రయ: | = ఆశ్రయము లేనివాడు | స: | = వాడు |
| కర్మఫలాసంగం | = కర్మఫలము నందలి ఆసక్తిని | కించిత్ | = కొంచెమైనను |
| త్యక్త్వా | = విడిచి | న కరోతి ఏవ | = చేయుటయే లేదు |
| కర్మణి | = కర్మ యందు | | |

**కర్మఫలము నందు ఆసక్తి లేనివాడు, నిత్యతృప్తుడు, నిరాశ్రయుడు అయిన పురుషుడు కర్మలను చేస్తూ ఉండినా, వాస్తవానికి కొంచెము కూడా చేయని వాడే.**

**వ్యాఖ్య**

ఎవరు దేనిని పొందా లనుకున్నా దానికి సంబంధించిన సాధనము అనే కర్మను ఆచరించాలి. ఈ విధమైన కర్మను ఆచరించడానికి దానిని పొందాలి అనే కోరికే ఆధారం కనుక, కర్మకు కామము ఆశ్రయంగా ఉంటుంది.





కర్మము నందు అకర్మను దర్శించిన ఆత్మజ్ఞాని, జ్ఞానమనే అగ్ని చేత సర్వ కర్మములను దగ్ధం చేసినవాడు కావడం చేత, ***(జ్ఞానాగ్ని దగ్ధ కర్మత్వాత్)*** కర్మ లేనివాడే అయ్యాడు. కర్మ లేనివాడు అంటే కర్మకు ఆశ్రయమైన కామము లేనివాడు. కర్మ ప్రవృత్తికి కామమే ఆశ్రయము కనుక, కామ శూన్యుడైన ఆత్మజ్ఞానికి కర్మల యందు అభినివేశం ఉండదు. కర్మ ప్రవృత్తి సంభవించదు.

ఏది సాధించాలో అది మనస్సులో లేనపుడు దానిని సాధించాలనే అభినివేశం వ్యక్తికి ఎలా ఉంటుంది? తాను పొందవలసింది అంటూ ఏదీ లేకపోవడం చేత జ్ఞానికి కర్మల యందు ఆసక్తి ఉండదు. ఒక ఫలితాన్ని పొందాలి అనే కోరిక ఉన్నప్పుడే, ఆ ఫలితాన్ని పొందడానికి ఆచరించ వలసిన కర్మ, ఆ కర్మకు సంబంధించిన సంకల్పాలు కదులుతాయి. ఫలాశ లేనపుడు, కర్మ విషయంలో ఆసక్తి ఎలా ఉంటుంది? కర్మ యందు ఆసక్తి లేనపుడు కర్తృత్వము ఉండదు. కర్తృత్వమే లేనపుడు కర్మలలో అభిమానం లేకపోవడం చేత కర్తృత్వాభిమానము కనిపించదు. కర్తృత్వమే లేనపుడు భోక్తృత్వము ఎలా ఉంటుంది? భోగాభిలాష లేకపోవడం చేతనే కర్మాసక్తి లేకపోయింది కనుక, కర్మాసక్తి లేని వానిలో భోగాపేక్ష ఉండే అవకాశం లేదు. ఈ విధంగా అకర్మను కర్మలలో దర్శించిన బ్రహ్మవేత్త కర్మల యందు, ఫలము నందు ఆసక్తిని విడిచిపెట్టిన వాడు అవుతున్నాడు ***(త్యక్త్వా కర్మసు అభిమానం, ఫలాసంగం చ).*** అలాంటి వాడు అసంతృప్తికి లోనయ్యే అవకాశం ఉందా?

**నిత్యతృప్తుడు**

దేనినైనా ఆశించి, అలా ఆశించిన దానిని పొందలే నపుడు మనిషి అసంతృప్తికి లోనవుతాడు. అసంతృప్తి ఉన్నప్పుడు దానిని తొలగించుకొని తృప్తిని పొందడానికి ఏదో ఒక ప్రయత్నాన్ని కొనసాగిస్తాడు. ఆత్మవిదుడు విషయాభిలాష లేనివాడు. కనుక విషయాల యందు గాని, వాటిని పొందుటకు ఉపకరించే కర్మాది సాధనల యందు గాని అపేక్ష లేనివాడు. ఎందుకని? అతడు అన్నీ పొందినవాడే కనుక. అన్నీ ఎలా పొందుతాడు? అన్నీ చేసేశాడు కనుక ***(కృత్స్న కర్మకృత్).*** పొందవలసింది ఏదీ లేనివాడుగా శోభిస్తున్న బ్రహ్మవిదునిలో అసంతృప్తి ఎలా ఉంటుంది? ఉండదు. మరేముంటుంది? తృప్తి ఉంటుంది. ఎప్పుడు ఉంటుంది? ఎప్పుడూ ఉంటుంది. తాను ఆత్మయే అనే జ్ఞానం ఎప్పుడూ ఉంది కనుక, తృప్తి కూడా ఎప్పుడూ ఉంటుంది. ఆత్మవిదుని తృప్తి దేశకాలాదులకు పరిమితంగా ఉండదు. ఉండలేదు. అందుచేత ఆత్మజ్ఞాని నిత్యతృప్తుడు. నిత్యతృప్తుడైన వాడు పొందవలసింది అంటూ ఏమీ ఉండదు. కనుక కర్మల యందు అభినివేశము లేనివాడు. ఫలము నందు ఆసక్తి లేనివాడు. భోగ్య వస్తువుల యందు కాంక్ష లేనివాడు కనుక నిత్యతృప్తుడు ***(నిత్యతృప్త: నిరాకాంక్ష: విషయేషు).***

విషయ భోగాలలో రమించే వారికి కూడా తృప్తి కలుగవచ్చు. స్వల్పమో, అల్పమో ఏదో కొద్ది తృప్తి కలుగవచ్చు. కాని, అలాంటి తృప్తి మతాబుల కాంతి లాగా మరుక్షణమే అదృశ్య మవుతుంది. విషయాలే నిత్యం కానపుడు వాటి వల్ల కలిగే తృప్తి ఎలా నిత్య మౌతుంది? అలాగని అనిత్యమైన తృప్తితో మనిషికి ఆనందం ఎలా సంభవిస్తుంది?

నిత్యవస్తువు లోనే నిత్యతృప్తి ఉంటుంది అని తెలుసుకున్నవాడు జ్ఞాని. అలాంటి నిత్యవస్తువు ఆత్మే గాని అన్యము కాదని అర్థమైనవాడు. ఆత్మ తానే కనుక తన తృప్తికి మరొక దానిపై ఆధారపడ నవసరం లేదని క్షుణ్ణంగా గ్రహించినవాడు. ఈ కారణం చేత తనకు మరొక ఆధారం, ఆశ్రయం లేనివాడైన నిత్యతృప్తుడు నిరాశ్రయుడై ఉన్నాడు.

**నిరాశ్రయుడు**

బ్రహ్మవేత్త కర్మసంగము, ఫలసంగము లేనివాడు కావడం చేత నిష్కాముడు. నిష్కాముడు కనుక నిత్యతృప్తుడు. నిత్యతృప్తుడైన వాడు మరొక దానిపై ఆధారపడి ఉండేవాడు కాడు కనుక నిరాశ్రయుడు. అంటే ఆశ్రయ రహితుడు.

ప్రపంచంలో ఒక్కొక్కరికి ఒక్కొక్క ఆశ్రయస్థానం ఉంటుంది. ధన సంపాదనపై ఆసక్తి కలవాడు దానికి సాధనము ఏదో దానిని ఆశ్రయించుకొని ఉంటాడు. ఎవరికి ఏది కావాలి అనేది అలా ఉంచితే, ఏది కావాలనుకున్నా, అలా కావాలి అనుకొనే కోరిక ఉండి తీరాలి. కనుక సాధన ఫలాలు ఏవైనా, వాటన్నిటికీ కామమే ఆశ్రయంగా ఉంటుంది. ఏ కోరికను ఆశ్రయించి ఏ పురుషార్థాన్ని సాధించాలని ప్రయత్నిస్తాడో ఆ కామన ఆ వ్యక్తికి ఆశ్రయంగా ఉంటుంది ***(ఆశ్రయః నామ యత్ ఆశ్రిత్య పురుషార్థం సాధయిష్యతి).*** దేనిని ఆశ్రయించుకొని ఒక పురుషార్థాన్ని సాధించుకోవాలని ప్రయత్నిస్తాడో, అది అతనికి ఆశ్రయం అవుతుంది. కాని, ఆత్మవిదుడు పొందవలసిన పురుషార్థమే లేనివాడై నందున అతడు ఆశ్రయ రహితుడు. నిరాశ్రయుడు ***(నిరాశ్రయః ఆశ్రయ రహితః).***

ఆత్మజ్ఞాని పూర్ణానంద స్వరూపుడు. ఆయన ఆనందం పెరిగేది కాదు. తరిగేదీ కాదు. కనుక నిత్యతృప్తుడు. కర్మఫలం వల్ల జ్ఞానికి ప్రయోజనం లేదు. కనుక కర్మలలో అభిమానం లేనివాడు. ఫలము నందు ఆసక్తి లేని వాడు. ఫలసంగం లేనివాడు కనుక మరొక దానిపై ఆధార పడని వాడు. ఆశ్రయ రహితుడు. ఇదంతా బాగుంది. మరి, కర్మల యందు అకర్మను దర్శించిన ఆత్మజ్ఞాని, జ్ఞానోత్ప త్త్యనంతరం కర్మలు చేస్తాడా, చేయడా? కర్మల యందు అభిమానం లేకపోవచ్చు. కర్మాచరణం ఉందా, లేదా?

***చలనాత్మకం కర్మ.*** ఎక్కడ ఏది చలించినా కర్మే. జ్ఞానికి కూడా దేహం ఉంది. దేహానికి కూడా ఆకలిదప్పులున్నాయి. వాటిని తీర్చుకోవడం కూడా కర్మే. జ్ఞాని లోక సంగ్రహార్థం కళ్యాణ కార్యాలు చేయవచ్చు. అవన్నీ కర్మలే కదా? అవును. మరి, కర్మలంటూ జరిగిన తరువాత ఫలాలు సృష్టి నియమానుసారం అందాలి కదా! అవును అందాలి. జ్ఞాని కర్మఫలాల చేత బద్ధుడైనట్లే కదా! కాడు. కానేకాడు. ఎందుకని? జ్ఞాని ద్వారా కర్మలు జరుగవచ్చు. కాని, జ్ఞానిలో కర్మలు లేవు. జ్ఞాని కర్మలు చేసినా చేయనివాడే. అందుచేత, అతడు కర్మాచరణంలో ఉన్నా, కర్మలు చేయనివాడే. కర్మల చేత అంటబడని వాడే ***(కర్మణి అభిప్రవృత్తః అపి నిష్క్రియాత్మ దర్శన సంపన్నత్వాత్ నైవ కించిత్ కరోతి సః).***

**జ్ఞానం లోనే గమనము**

ఆత్మజ్ఞాని సర్వస్వతంత్రుడు. కర్మ అవసరం లేనివాడు. ఫలాసక్తి కూడా తెలియని వాడు ***(త్యక్త్వా కర్మ ఫలాసంగం).*** అతడు కర్మను చేసినా, చేయక పోయినా అతని పూర్ణత్వానికి భంగం రాదు. ఏదో చేయడం వల్ల తన ఆనందం పెరిగేది కాదు. ఏదో చేయక పోవడం వల్ల తన ఆనందం తరిగేదీ కాదు. అలాంటి జ్ఞాని కర్మను చేసినా, చేయనివాడే. ఎందుకని? తాను కర్తగా లేడు కనుక. కర్మలలో అకర్మనే దర్శిస్తున్నాడు కనుక. లోకదృష్టిలో తాను కర్మాచరణము చేస్తున్నట్లు అగుపించినా, వాస్తవానికి అతడు కర్మ చేయని వాడే. ఆయన కర్మలన్నీ అకర్మాది దర్శనం అనే జ్ఞానం చేత దగ్ధమై పోయాయి.

ఇక్కడ ఒక సంశయం కలుగుతుంది. జ్ఞానము కలుగక ముందు అనాదిగా ఆచరించిన సంచిత కర్మలన్నీ మేలుకున్న వానికి స్వప్నగత విషయాల వలె లేనివే అవుతున్నాయి అనేది అర్థం చేసుకోగలం. అలాగే జ్ఞానోత్ప త్త్యనంతరం కర్తృత్వ భోక్తృత్వాల నుండి విడిపడి ఉన్నాడు కనుక, భవిష్యత్తులో రాబోయే ఆగామి





ఆవహించక పోవచ్చు. కాని, ప్రస్తుతం జ్ఞాని ద్వారా ఆచరింప బడేవి కూడా కర్మలే కదా! కర్మలు ఉన్నప్పుడు ఫలితాలు ఉన్నాయి కదా! వాటి నుండి జ్ఞాని ఎలా తప్పించు కుంటాడు? అలాగే, ప్రస్తుతం జ్ఞాని వసిస్తున్న దేహము ప్రారబ్ధాధీనం అయినప్పుడు, ప్రారబ్ధ ఫలాలను అనుభవించ కుండా ఎలా వినిర్ముక్తు డవుతాడు? కర్మసంగం, ఫలసంగం లేకుండా ఆచరిస్తున్నాడు కనుక ప్రస్తుతం ఆచరిస్తున్న కర్మలు బంధించక పోవచ్చు. వాటిలో కర్త లేడు అనే వాస్తవాన్ని కూడా అర్థం చేసుకోవచ్చు. మరి ప్రారబ్ధ ఫలాన్ని అనుభవించే భోక్త ఉన్నాడు కదా! భోక్త రూపంలో ఉన్నది కర్తే కదా! కర్త ఉన్నప్పుడు కర్మ ఉన్నట్లే కదా! కర్మ చేస్తున్నట్లే కదా! ఒక వైపు చేస్తూ, మరొక వైపు చేయనివాడు అని చెప్పడం చెల్లుతుందా?

**ప్రారబ్ధం ఉంది - ప్రభావం లేదు**

జ్ఞానోత్పత్తికి ముందు జ్ఞాని ఎలాగైతే కర్మలను ఆచరించాడో, జ్ఞానోత్ప త్త్యనంతరం కూడా అలాగే కర్మలను ఆచరిస్తూ ఉండటం చూచి, జ్ఞానిని కర్తగా లోకం అనుకోవచ్చు. పూర్వము కర్మలు ఆచరించినట్లే జ్ఞానోత్పత్తి జరిగిన తరువాత కూడా జ్ఞాని కర్మలు ఆచరిస్తూ ఉండినా, పూర్వం ఉన్న అభినివేశం జ్ఞానస్థితిలో ఉండదు. పూర్వం ప్రయోజనాన్ని ఆశించి కర్మను ఆచరించడం చేత కర్తగా తాను ఉండి కర్మాచరణం సాగించాడు. జ్ఞానదశలో కర్మ ఫలాసక్తి లేనివా డైనందున కర్తగా లేడు. కర్త కాని వాడు భోక్త కూడా కాడు.

ఇకపోతే, ప్రారబ్ధానికి సంబంధించిన ఫలానుభవం విషయాన్ని కాస్త జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. కర్మల యందు అకర్మను దర్శించే ఆత్మజ్ఞాని అకర్తగా శోభిస్తున్నందున, ఫలాల విషయంలో అభోక్తగా ఉన్నాడు.

జ్ఞాన ప్రభావం చేత సంచితము దహింప బడినా, కర్మఫలాసంగం లేకపోవడం చేత ఆగామికి అనుత్పత్తి ప్రాప్తించినా, ఉపాధి కొనసాగుతూ ఉంది కనుక, ప్రారబ్ధానుభవం జ్ఞానికి కూడా తప్పదు అని చాలా మంది అభిప్రాయ పడతారు. ఇది చాలా సున్నితమైన అంశము.

ప్రారబ్ధము ఉపాధికి సంబంధించింది కావచ్చు. అంతమాత్రాన జ్ఞానికి ప్రారబ్ధానుభవం ఉందని ఎలా చెప్పగలం? లోకదృష్టిలో జ్ఞానికి ప్రారబ్ధానుభవం ఉన్నట్లు గోచరించినా, జ్ఞాని దృష్టిలో తనకు ఉపాధి ఉంది అనే స్పృహ కూడా లేని కారణం చేత, ఉపాధి యొక్క ప్రారబ్ధం ఉపాధికి సంక్రమిస్తూ ఉండినా, దాని ప్రభావం జ్ఞాని మీద ఉండదు. భోక్తగా జ్ఞాని ఉండడు. భోక్తగా లేడు కనుక కర్తగా కూడా లేడు. కర్త లేని స్థితిలో ఉపాధి ద్వారా ఆచరింపబడే కర్మలకు జ్ఞాని ఎలా కర్త కాడో, ఉపాధి ద్వారా అనుభవింపబడే విషయాలలో కూడా తాను భోక్తగా లేడు. ఇంద్రియాలు ఇంద్రియ విషయాలలో చరిస్తున్నాయి, అలాగే రమిస్తున్నాయి కాని, తనకేమీ సంబంధం లేదు అనే స్థితిలో జ్ఞాని ఉంటాడు కనుక, సమస్తమైన కర్మలు ఉపాధి ద్వారా జరుగుతూ ఉండినా, జ్ఞాని వాటికి అంటకుండా ఉంటాడు. కర్మలలో అతడు చరిస్తున్నట్లు మనకు గోచరిస్తూ ఉన్నా, వాస్తవానికి అతడు చేయనివాడే. నిష్క్రియమైన ఆత్మ తానే అనే దర్శన సంపదే, ఆత్మదర్శన సంపన్నత్వమే ఈ వైభవానికి కారణము ***(కర్మణి అభిప్రవృత్తః అపి నిష్క్రియాత్మ దర్శన సంపన్నత్వాత్ నైవకించిత్ కరోతి సః).***

***అకర్తాహం అభోక్తాహం అవికారోఽ హ మవ్యయః***
***శుద్ధ బుద్ధ స్వరూపోఽ హం కేవలోఽ హం సదాశివః ॥***

నేను అకర్తను. అభోక్తను. వికార రహితుణ్ణి. అవినాశిని. కేవలం జ్ఞానస్వరూపుణ్ణి. సదాశివుణ్ణి. ఇదే ఆత్మజ్ఞానిలో భాసించే అద్వైతానుభూతి అని అధ్యాత్మోపనిషత్తు ప్రవచించింది.

*ప్రారబ్ధాధీన మైన దేహము ద్వారా జ్ఞాని కర్మలను ఆచరిస్తూ ఉండినా, అట్టి కర్మ యొక్క ప్రభావం చేత జ్ఞానికి ఏ పాపము అంటదు అనే విషయాన్ని విస్పష్టం చేస్తున్నాడు.*

**నిరాశీ ర్యతచిత్తాత్మా త్యక్త సర్వపరిగ్రహః ।**
**శారీరం కేవలం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్ ॥** 21

***నిరాశీః-యతచిత్తాత్మా-త్యక్త సర్వ పరిగ్రహః***

***శారీరం-కేవలం-కర్మ-కుర్వన్-న-ఆప్నోతి-కిల్బిషం***

| | | | |
|---|---|---|---|
| నిరాశీః | = ఆశ లేనివాడు | కేవలం | = మాత్రమే |
| యతచిత్తాత్మా | = అంతఃకరణను దేహమును జయించిన వాడు | కుర్వన్ | = చేస్తూ |
| త్యక్తసర్వపరిగ్రహః | = సకల పరిగ్రహములను విడిచిన వాడు | కిల్బిషం | = పాపమును |
| శారీరం | = శరీరమునకు సంబంధించిన | న ఆప్నోతి | = పొందడు |
| కర్మ | = కర్మను | | |

**ఆశ లేని వాడు, మనస్సును, దేహమును నిగ్రహించిన వాడు, సకల భోగ సామగ్రిని త్యజించిన వాడు అయిన యోగి దేహము కొరకు కర్మలు చేసినా పాపమును పొందడు.**

**వ్యాఖ్య**

మనం వసించేది విషయ ప్రపంచం. విషయాలు బాహ్యంలో ఉంటాయి. వాటికి సంబంధించిన కామనలు, లేదా వాసనలు వ్యక్తుల మనస్సులలో ఉంటాయి. విషయాలు మనస్సు లోని వాసనలను చలింప చేసినా, లేదా వాసనలు విషయాల వెంట బడినా వ్యక్తి భోగాసక్తుడై చరిస్తాడు. ఈ విషయంలో జ్ఞాని విలక్షణంగా శోభిస్తాడు.

భోగ్య విషయాలపై లేదా వస్తువులపై జ్ఞానికి ఆసక్తి ఉండదు. కారణం, వాటిలో సుఖం లేదు అని తనకు తెలుసు. అలాగే, భోగ్య విషయాలను అనుభవించాలని ప్రేరేపించే ఇంద్రియ ప్రలోభాలకు జ్ఞాని లొంగడు. ఇంద్రియ ఆవేశాలు ఆనంద మూలాలు కావని, అనర్థ హేతువులని జ్ఞానికి తెలుసు. అందుచేత విషయాల ప్రభావం జ్ఞానిపై ఉండదు. చిత్తం లోని విషయ వాసనలు నిశ్శేషంగా నిర్మూలింప బడ్డాయి కనుక, జ్ఞాని ఆశ లేనివాడై అలరారుతాడు ***(నిరాశీః).***

**నిరాశి**

మనస్సులో ఆశలన్నీ అడు గంటిన వాడు నిరాశి. ***నిర్గతః ఆశిషః యస్మాత్ సః నిరాశీః*** ఎవరి నుండి ఆశలన్నీ దూరమై పోయాయో అతడు నిరాశి. సమూలంగా కోరికలు నశించినవాడు. అతడే నిరాశి.

సుఖపడటానికి ఇవి కావాలి - అవి కావాలి అని జను లందరూ ఆరాట పడుతూ ఉంటే, నిత్యతృప్తుడైన జ్ఞాని తానే ఆనందస్వరూప మని గ్రహించి సుఖపడటానికి ఏవీ అవసరం లేదు అనే జ్ఞానంతో అలరారుతూ ఉంటాడు. అందుకే అతడు నిరాశి. ఆశ లేని వానిని విషయాలు ఎలా ఆకర్షిస్తాయి? అందుచేత జ్ఞాని యత చిత్తాత్ముడు.

**యతచిత్తాత్ముడు**

చిత్తము అంటే అంతఃకరణము. ఆత్మా అంటే కార్యకరణ సంఘాతము. కార్యము అంటే దేహము, కరణము అంటే ఇంద్రియ సముదాయము. అంతఃకరణము, దేహేంద్రియాలు రెండూ ఎవరి చేత నిగ్రహింపబడుతాయో ***(యతౌ సంయతౌ యేన సః యత చిత్తాత్మా)*** అతడే యతచిత్తాత్ముడు. యతములు అంటే నిగ్రహింపబడినవి అని అర్థము.

బాహ్య విషయాలు చిత్తము లోని వాసనలను ఆధారం చేసుకొని, అయస్కాంతము ఇనుపముక్కను





ఆకర్షించినట్లు, ఇంద్రియ మనస్సులను బాహ్యానికి ఈడుస్తాయి. అలా ఆకర్షింపబడిన ఇంద్రియ మనస్సులు విషయాల వైపు పరుగు లెత్తి అలసి పోతాయి. అశక్తతకు లోనవుతాయి. చివరికి సాధించిం దేమిటి అని ప్రశ్నించుకుంటే, అంతా నిస్సారంగా కనిపిస్తుంది.

కర్మల యందు అకర్మను దర్శించే జ్ఞాని నిత్యతృప్తుడు, నిరాశ్రయుడై ఉన్నాడని అర్థం చేసుకున్నాం కనుక, అతడు దేనిపై ఆధార పడడు. తాను తృప్తి చెందే ఉన్నాడు కనుక, తృప్తి కొరకు విషయ ప్రపంచం వైపు పరుగు లెత్తడు. ఏదీ తనను కదిలించ లేదు. ఏది వచ్చినా స్వాగతమే. అంతా సమం గానే గోచరిస్తుంది. వాస్తవం చెప్పాలంటే, ఎక్కడ మనకు జ్ఞాని కనిపించినా అక్కడ జ్ఞాని లేడు. జ్ఞానమే ఉంది. జ్ఞానంలో ఏమి లేదని ప్రయత్నాలు సాగించాలి? అన్ని ప్రయత్నాలు ఆగిన స్థితియే జ్ఞానము. ఈ జ్ఞాన వైభవంలో దేహేంద్రియ మనస్సులు అదుపు తప్పి అల్లాడవు. స్థిరంగా ఉంటాయి. స్థిమితంగా ఉంటాయి. అందుచేత నిరాశిగా గోచరిస్తున్న జ్ఞాని యతచిత్తాత్ముడు. తనలో తాను ఆనందించే వాడు. కనుక అన్నిటిని విడిచి పెట్టినవాడు. ఇంతవరకు పట్టుకొని పెట్టుకున్న సర్వ పరిగ్రహాలను త్యజించిన వాడు. అందుచేత జ్ఞాని సర్వపరిగ్రహ వర్జితుడు ***(త్యక్త సర్వ పరిగ్రహః).***

**సర్వపరిగ్రహ వర్జితుడు**

భోగ్య వస్తువుల యందు, భోగ ఉపకరణముల యందు సంగ్రహబుద్ధిని కలిగి ఉండుట పరిగ్రహము. వస్తువుల యందలి భోగాసక్తి చేత వాటి యందు మమత్వ భావన గాఢంగా కలిగి ఉండటము పరిగ్రహము. అవన్నీ తనవి కావాలని, తనవిగా ఉండాలని, అన్యుల నుండి ప్రియంతో పుచ్చుకొని ఉంచుకోవడము పరిగ్రహము. దీనిని త్యజించిన వాడు పరిగ్రహ త్యక్తుడు. ఈ విషయంలో తారతమ్యాలు లేకుండా సమస్తమును విడిచిపెట్టిన వాడు కనుక, జ్ఞాని సర్వపరిగ్రహ వర్జితుడు.

మనవి కాని వాటిని మన నుండి ఎవ్వరూ దూరం చేయలేరు. మనం దాచుకున్న వాటినే ఎవ్వరైనా దోచుకో గలరు. దాచే గుణమే దోపిడికి దారులు తెరుస్తుంది. ***మమేతి బధ్యతే జన్తుః*** మమత్వమే బంధము అన్నది శాస్త్రం.

అయ్యా! ఆలయానికి వెళ్దాము రండి అంటే, ఇంట్లో ఎవ్వరూ లేరండి అంటాడు. ఇలా భగవంతుని దర్శనాన్ని అడ్డుకొనేది, మహాత్ముల ప్రవచనాలకు వెళ్ళకుండా ఆపేది, ప్రతి క్షణం బిక్కుబిక్కు మంటూ కుక్కల్ని, కాపలా వాళ్ళను నమ్ముకొని జీవించే పరిస్థితికి దారి తీసేది పరిగ్రహ బుద్ధే కదూ? ఇది తెలిసిన వివేకవంతుడు సంగ్రహ బుద్ధిని త్యజిస్తాడు. మమత్వాన్ని దూరం చేసుకుంటాడు. దేహాన్ని నిలుపుకోవడానికి సరిపోతే చాలు అనుకుంటాడు. సర్వపరిగ్రహ త్యక్తుడై చరిస్తాడు.

**దేహ యాత్రార్థ వ్యాపారము**

జ్ఞాని నిరాశి కనుక కర్మలలో అధికోత్సాహాన్ని చూపడు. సర్వపరిగ్రహ వర్జితుడు కావడం చేత, దేని అవసరము లేనివాడై ప్రశాంతంగా చరిస్తుంటాడు. దేహేంద్రియ మనస్సులు నిగ్రహింప బడిన వాడు కావడం చేత ఆ మహాత్ముని శాంతికి భంగం వాటిల్లదు. అలాంటివాడు ఆచరించే కర్మలు కేవలం శరీర యాత్రార్థమై ఉంటాయి. దేహాన్ని నిలుపుకోవడానికి మాత్రమే కర్మ నాచరించే వాడు కనుక అట్టి కర్మ చేత ఏ విధమైన పాపాన్ని పొందడు. అది కూడా 'నేను చేస్తున్నాను' అనే కర్తృత్వ బుద్ధి లేకుండా, అహంకార వర్జితుడై ఆచరిస్తున్నాడు అని తెలుపడానికే ***కేవలం*** అనే పదాన్ని ప్రయోగించడం జరిగింది ***(కేవల శబ్ద ప్రయోగాత్ 'అహంకరోమి' ఇతి అభిమానవర్జితః).***

## యతి జీవనము

శరీర స్థితి మాత్ర ప్రయోజనమైన కర్మను ఆచరించే వాడు సన్యాసి. సన్యసించిన యతి పురుషుడు తాను అకర్త అనే భావంతో కర్మల యందు అకర్మను చూస్తాడు కనుక, అతడు కర్మ చేసినా, కర్మ చేత అంటబడడు. కాని, ఈ శ్లోకంలో అతడు కిల్బిషమును అనగా పాపాన్ని పొందడు అనడం జరిగింది. ఇలా చెప్పడం వల్ల **అప్రాప్త ప్రతిషేధమ్** అనే దోషం రావచ్చు. అప్రాప్తము అంటే ప్రాప్తించనిది. ప్రతిషేధము అంటే నిషేధించడము అని అర్థము. లేని దానిని తొలగించే ప్రయత్నము అప్రాప్త ప్రతిషేధము. కేవలం దేహ రక్షణార్థమై కర్మను ఆచరించే సన్యాసి ఏ విధమైన పాపమును పొందడు అనడమే ప్రశ్నార్థక మవుతూ ఉంది.

సన్యాసులు రెండు విధాలుగా తెలుస్తారు. ఒకడు జ్ఞానం కలిగిన సన్యాసి. అతడు విద్వత్ సన్యాసి. రెండవ వాడు జ్ఞానార్జనకై సన్యసించేవాడు. అతడు వివిదిషా సన్యాసి. పొందవలసిన దానిని పొందిన వాడు మొదటి వాడు కాగా, పొందుటకు ప్రయత్నించే వాడు రెండవ వాడు. వీరిరువురూ పాపానికి దూరులు. అలాంటప్పుడు కర్మ చేసినా పాపాన్ని పొందడు అని చెప్పడం లేని దానిని, లేదా రాని దానిని తొలగించే వాక్యం గానే కనిపిస్తూ ఉంది కనుక, ఇది అప్రాప్త ప్రతిషేధము క్రిందికి వస్తుంది కదా! అనేది శంక.

అలాంటి దోషానికి అవకాశం లేదు. కర్మ యందు అకర్మను దర్శించే జ్ఞానంతో చరిస్తూ ఉన్నా, దేహ సంరక్షణార్థం కర్మను ఆచరించక తప్పదు! సన్యాసి దేహ సంరక్షణకు ఏ కర్మ నాచరిస్తాడు? భిక్షాటనే కదా! ఇరువురు సన్యాసులకూ భిక్షాటనమే ప్రాణరక్షణ హేతువుగా చెప్ప బడింది. ఈ విధమైన భిక్షాటనలో పాపం సంభవించే అవకాశాన్ని నిరాకరించ లేము.

***అభిశస్త పతిత వర్జమ్*** అని శ్రుతి వాక్యము. భిక్షాటన చేసే వారు అభిశస్తులను, పతితులను విడిచిపెట్టి భిక్షను గ్రహించాలి అనేది శాస్త్రవిధి. అభిశస్తుడు అంటే 'పాపము చేసిన వాడు' అనే వాదమును పొందిన వాడు. కనుక అభిశస్తుని నుండి, పతితుని నుండి భిక్షను గ్రహించ కూడదు అనేది శాస్త్ర నిర్ణయ మైనపుడు, దేశ సంచారము చేసే సన్యాసికి ఎవడు అభిశస్తుడో, ఎవడు పతితుడో ఎలా తెలుస్తుంది? అలాంటప్పుడు భిక్షను గ్రహించడం చేత పాపం సంభవించ వచ్చు కదా! కాని, అలాంటి పాపము కూడా యతులకు సంభవించదు అని తెలుపడానికే శరీరాన్ని నిలుపుకోవడానికి కర్మను ఆచరించినా పాపమును పొందడు అని చెప్పడం జరిగింది ***(కుర్వన్ న ఆప్నోతి కిల్బిషమ్)***.

జ్ఞానియైన సన్యాసి కర్మలో అకర్మను చూస్తూ శరీరమాత్ర ప్రయోజనంగా కర్మను ఆచరిస్తున్నందున, కర్మ చేస్తూ ఉండినా కర్త తాను అనే భావన లేనందున, కర్మ చేసినా ఏ కొంచెము చేయని వాడే నని గడచిన శ్లోకం లోనే చూశాము కనుక, ***(న ఏవ కించిత్ కరోతి సః)*** అతడు కర్మల వల్ల ఏ పాపాన్ని పొందడు ***(న ప్రాప్నోతి కిల్బిషమ్)***.

మరి జ్ఞానసాధనలో ఉండే వివిదిషా సన్యాసి విషయం ఏమిటి? అతనికి కూడా కర్మ వల్ల పాపం అంటదు. జ్ఞానం కొరకు సన్యసించిన యతి పురుషుడు, జ్ఞానసాధనే ప్రధానంగా జీవించాలి. అన్యమైన కర్మలను ఆచరించ కూడదు ***(సన్న్యస్య శ్రవణం కుర్యాత్ న అన్యత్ కుర్యాత్ యతిః క్వచిత్)***. కనుక, సర్వకర్మలను పరిత్యజించి, కేవలం దేహస్థితి మాత్ర ప్రయోజనంగా భిక్షాటన చేస్తూ జీవిస్తాడు కనుక, దేహాభిమాన రహితు డైన సాధక సన్యాసి కూడా పాపాన్ని పొందడు ***(కర్మ కుర్వన్ న ఆప్నోతి కిల్బిషమ్)***. అంతేకాదు. భిక్షాటనలో లభించిన దాని యందు రుచులకు ప్రాధాన్యం ఉండదు కనుక ఔషధంలా గ్రహిస్తాడు ***(ఔషధవత్ అశన మాచరేత్)***.





## శ్రుతి మించిన రాగము

యతి జీవన శకటము దారి తప్పకూడదు. సమస్తమును త్యజించి, జ్ఞానసాధనే ప్రధానంగా భావించి జీవించే సన్యాసి శ్రవణ మనన నిదిధ్యాసల యందే మనస్సును లగ్నం చేయాలి. రెండవ పని చేయకూడదు అని శాస్త్ర నిర్ణయము.

ఈ విషయంలో మంచిచెడుల ప్రస్తావన అర్థరహితము. సేవలు, సాంకేతిక ప్రయోజనాలు, కళలు, వైద్యము, మితిమీరిన శరీర వ్యాయామాలు - దేహారోగ్య చర్చలు, ఇవన్నీ సన్యాసికి నిషేధాలు.

ఆహారం విషయంలో యతి పురుషుడు ఎలా ఉంటాడని తెలుసుకున్నామో, శరీరారోగ్యం విషయంలో కూడా అలాగే ఉండాలి. అంతేగాని ***శరీర మాద్యం ఖలు ధర్మ సాధనమ్*** అంటూ గంటల తరబడి యోగాసనాలు, ప్రాణాయామాలతో ప్రొద్దు పోగొట్టుకోవడం సన్యాసికి శ్రుతి సమ్మతం కాదు. అలా చరించడము కూడా దేహాభిమానం క్రిందికే వస్తుంది. ఈ విధమైన ఆసక్తి యతి జీవనానికి ప్రతిబంధకము. దేహం విషయంలో ఇది రాగము. శ్రుతి సమ్మతం కాని విషయం. ఇలా శ్రుతి మించి రాగాన పడేవాడు సన్యాసి కాడు. ఈ విషయాన్ని యథాతథంగా గ్రహించ గలిగితే యతి జీవన వైభవము అర్థ మవుతుంది. ఇది చాలా సున్నిత మైన సూక్ష్మమైన అంశము. అర్థం కాని వారు అపార్థం చేసుకొనే ప్రమాదమూ లేక పోలేదు.

లలిత కళలు ఆనంద సంధాయకాలు కదా! అని ఒకరు, ఔషధాలను పంచి రోగార్తులను ఆదుకోవడం తప్పు అవుతుందా! అని మరొకరు, దేహారోగ్యాన్ని కాపాడే ఆసన ప్రాణాయామాది విద్యలు తెలియని వారికి వితరణ చేసే శిబిరాలను సన్యాసులు నడిపితే నష్ట మేమిటి? అని ఇంకొకరు, జ్ఞానం గల యతి పురుషుడు వ్యాపార రహస్యాలను బోధించి సమాజాన్ని వాణిజ్య పరంగా ప్రగతి పథంలో నడపడం దోష మెలా అవుతుంది? అని వేరొకరు వాదించవచ్చు. వీరందరికి అర్థం కావలసింది ఒక్కటే. ఈ పనులు చేయడం దోషం కాదు. ఇవే కాదు. విద్యాలయాలు, వైద్యశాలలు కూడా నడుపుకో వచ్చు. ఇవన్నీ సత్కార్యాలే. కాకపోతే, నాదొక సూటి ప్రశ్న. ఈ పనులు చేయడానికి సన్యసించడ మెందుకు? సన్యాసానికి ఈ కార్యాలకు సంబంధ మేమిటి? ఈ ప్రశ్నలకు సమాధానం దొరికితే సన్యాసి శ్రుతి మించి రాగాన పడడు. ఒకవేళ అతడు పడినా, అలా పడటాన్ని సమాజం హర్షించదు.

*జ్ఞానసాగరంలో ఓలలాడే యతి పురుషునిలో యాచన, చింతన లేని జీవనము దివ్యంగా శోభిస్తుంది. అదే చెబుతున్నాడు భగవంతుడు.*

**యదృచ్ఛాలాభసంతుష్టో ద్వన్ద్వాతీతో విమత్సరః ।**
**సమః సిద్ధావసిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే ॥** 22

***యదృచ్ఛాలాభసంతుష్టః-ద్వంద్వాతీతః-విమత్సరః***
***సమః-సిద్ధౌ-అసిద్ధౌ-చ-కృత్వా-అపి-న-నిబధ్యతే***

| | | | | | |
|---|---|---|---|---|---|
| యదృచ్ఛాలాభసంతుష్టః | = | అయాచితముగా లభించిన దానితో తృప్తి చెందువాడు | అసిద్ధౌ చ | = | సిద్ధించని విషయము లందు |
| ద్వంద్వాతీతః | = | ద్వంద్వాతీతుడు | సమః | = | సమబుద్ధి గలవాడు |
| విమత్సరః | = | మాత్సర్యము లేని వాడు | కృత్వా అపి | = | కర్మలు చేసినా |
| సిద్ధౌ | = | సిద్ధించిన విషయము లందు | న నిబధ్యతే | = | బంధింప బడదు |

**కోరకుండా ప్రాప్తించిన దానితో సంతృప్తి చెందువాడు, ద్వంద్వాలను దాటిన వాడు, మాత్సర్యము లేని వాడు, విషయము సిద్ధించినా, సిద్ధించక పోయినా సమదృష్టి కలవాడు కర్మయోగి. అతడు కర్మ లాచరించినా వాటిచే బద్ధుడు కాడు.**

**వ్యాఖ్య**

సమస్త మైన విషయముల యందు, వస్తువుల యందు సంగ్రహ బుద్ధిని విడిచిన జ్ఞానిని సర్వపరిగ్రహ వర్జితుడుగా అర్థం చేసుకున్నాం. మరి, శరీరయాత్ర కొనసాగటానికి ఆహారాన్ని గ్రహించాలి కదా! అది సంగ్రహం క్రిందికి రాదా? రాదు. శరీర స్థితి హేతువైన అన్నమును గ్రహించుటకు అనుమతించడం జరిగింది. ఇలా గ్రహించడం బంధహేతువు కాదు. అన్న పరిగ్రహము చేత జ్ఞాని బద్ధుడు కాడు. ఆ విషయాన్నే భగవానుడు చర్చిస్తున్నాడు.

**అరచేతిలో అదృష్టం**

యతి పురుషుడు యదృచ్ఛాలాభ సంతుష్టుడు. ఆశించకుండా ప్రాప్తించిన లాభము యదృచ్ఛా లాభము ***(అప్రార్థిత ఉపనతః లాభః యదృచ్ఛాలాభః).*** దాని చేత తృప్తి చెందిన వాడు ***(తేన సంతుష్టః)*** యదృచ్ఛాలాభ సంతుష్టుడు. కొరత లేని వాడు. వెలితి తెలియని వాడు. ఒక్క మాటలో చెప్పాలంటే, 'చాలు' అనే బుద్ధి వృత్తి కలవాడు. ***(సంజాత అలం ప్రత్యయః).***

సర్వ పరిగ్రహాలను త్యజించిన యతి పురుషుడు, దేహ స్థితిమాత్ర ప్రయోజనంగా అన్నమును పరిగ్రహించే టప్పుడు అనుసరించే పద్ధతిని తెలుపు తున్నాడు.

ఏ నదీ తీరాల లోనో, నిర్జన ప్రదేశాలలోనో అంతర్ముఖుడై జీవించే యతికి శరీరాన్ని నిలుపుకోవడానికి ఆహారం అవసరం కనుక, తాను ఉండే చోటికి ఆహారం వచ్చే అవకాశం లేదు కాబట్టి యతి పురుషుడు జనులు నివసించే గ్రామాలకు వస్తాడు ***(యతయో భిక్షార్థం గ్రామం ప్రవిశన్తి).***

నిరాశి, నిరాశ్రయుడైన యతి భిక్షాటనం కొరకు గ్రామానికి అరుదెంచి నపుడు, అతడిని దర్శించిన పుణ్యాత్ములు తమకు తాముగా ఆహారాన్ని తీసుకొని వచ్చి అతనికి అర్పించ వచ్చు. అలాంటి ఆహారము అయాచితం. అంటే, కోరకుండా లభించింది. అరచేతిలో అగుపించిన అదృష్టం ***(అయాచితం).***

ఒకవేళ అలా లభించ నపుడు, తానే బయలుదేరి ఐదు లేదా ఏడు ఇళ్ళకు వెళ్ళి సంపాదించిన భిక్షాన్నం **అసంక్లప్తం.** అంటే సంకల్పం లేకుండా సంపాదించింది. సంకల్పము లేకుండా అంటే, ఆ ఇంటికి పోవాలి, ఈ యింటికి పోవాలి అనే భేదం చూడకుండా భిక్షాటన చేయడం. అంతే కాదు. ఈ మోతాదులో భిక్షాన్నం ప్రాప్తించాలి అని గాని, ఇలాంటి రుచులతో ఉండాలి అని గాని సంకల్పం చేయకుండా గ్రహించడం.

భిక్షాటన కొరకు తాను ప్రయత్నించక పూర్వమే జనులు తనను సమీపించి సమర్పించేది మొదటిది ***(ఉపపన్నం యదృచ్ఛయా).*** దీనినే అజగర వృత్తి అంటారు. అజగరము అంటే కొండచిలువ. కొండపాము ఆహారానికి ప్రయత్నించక, తనను సమీపించిన ప్రాణులను భక్షించి తృప్తి చెందుతుంది. అంటే, అప్రయత్నంగా లభించిన దానితో తృప్తి చెందుతుంది. అలాగే యతి పురుషుడు భిక్షాటనకు వెళ్ళకుండా, తనను సమీపించిన వారు సమర్పించిన దానితో తృప్తి చెందటము అజగర వృత్తి అనిపించు కుంటుంది. అలా లభించడం అవిచ్ఛా ప్రారబ్ధం కావచ్చు. లేదా పరేచ్ఛా ప్రారబ్ధం కావచ్చు.

ఈ విధమైన అజగర వృత్తి ద్వారా ఆహారం ప్రాప్తించ నపుడు, తానే బయలుదేరి, ముందస్తు ఊహలు,





ఆశలు ఏవీ లేకుండా, తుమ్మెద పువ్వులపై వ్రాలి మకరందమును గ్రహించునట్లు, ఐదు లేక ఏడు ఇళ్ళకు వెళ్ళి ప్రాప్తించిన దానితో తృప్తి చెందటము మధుకర వృత్తి. మధుకరః అంటే తుమ్మెద. ఈ విధమైన భిక్షాటనకు మధుకర వృత్తి అనే పేరు వచ్చింది.

ఏ పువ్వులో ఏ తేనె ఉంటుందో తెలియక పోయినా ప్రాప్తించిన మధువుతో మధుకరము తృప్తి చెందుతుంది. యతి పురుషుడు కూడా అయాచితంగా లభించిన దానితో తృప్తి చెందుతాడు. గంజి మెతుకు లైనా, పరమాన్న భోజనాలైనా అతడు సమంగానే ఉంటాడు. సమంగా ఉంటేనే సన్యాసము. విషమం ఏదైనా సంసారమే. ద్వంద్వమే సంసారము. ద్వంద్వాలలో చిక్కనివాడు సాధువు. అందుకే ఆయన ద్వంద్వాతీతుడు.

**ద్వంద్వాతీతుడు**

శీతోష్ణాలు, హర్షవిషాదాలు, మానావమానాలు, జయాపజయాలను ద్వంద్వాలు అంటారు. బ్రతుకు లోని అందాన్ని, ఆనందాన్ని చెదరగొట్టేవి ఈ ద్వంద్వాలే. ఈ విధమైన ద్వంద్వాల చేత కలత చెందని వాడు ద్వంద్వాతీతుడు. అంటే, ద్వంద్వాలు లేని వాడు కాడు. ద్వంద్వాలు తెలియని వాడు కాడు. ద్వంద్వాలు ఒక వైపు పీడిస్తున్నా, మనస్సులో కలత చెందని వాడు. అవిషణ్ణ మనస్కుడు ***(ద్వన్ద్వైః శీతోష్ణాదిభిః హన్యమానః అపి అవిషణ్ణ చిత్తః ద్వంద్వాతీతః ఉచ్యతే).***

జీవితంలో ద్వంద్వాలు అనివార్యాలు కావచ్చునేమో గాని అసంభవాలు కావు. కాస్త లోతుగా ఆలోచిస్తే, ద్వంద్వాలు ఎప్పుడూ కలిసే ఉంటాయి. పగలు వేడిగా ఉంటే రాత్రి చల్లగా ఉంటుంది. ఈ రెండూ కలిస్తేనే ఒక రోజు.

నష్టాలు తెలియని లాభాలు ఉండవు. అలాగే దుఃఖాలు తెలియని సుఖాలు ఉండవు. ఆశించింది కలిస్తే సుఖం. కలిసింది విడిపోతే దుఃఖం. ఏది జయమని మనం భావిస్తామో, దానిని కాస్త లోతుగా ఆలోచించ గలిగితే అది అపజయ మని తెలుతుంది. వెలుగులు ఉన్నచోటే నీడలు ఉంటాయి. ఒక సమయంలో నవ్విన నోళ్ళే మరో సమయంలో ఏడుపులతో గోలపెడుతూ ఉంటాయి.

ఈ ద్వంద్వాలను అనుభవిస్తూ అలమటించే వాడు భోక్త. భోక్త ఎవడో కాడు. కర్తే భోక్త. ఇక్కడ కర్మల యందు అకర్మను దర్శిస్తున్న యతివరేణ్యుడు కర్తగా లేడు కనుక, భోక్త గానూ లేడు. అందుచేత జ్ఞాని ద్వంద్వాల నుండి విడిపడి ఆనందంతో శోభిస్తున్నాడు.

ద్వంద్వాలను అధిగమించిన మహాత్ముని బుద్ధిలో హెచ్చుతగ్గులు ఉంటాయా? ఇష్టాయిష్టాలు ఉంటాయా? ఎవరు ఇష్టులు? ఎవరు అయిష్టులు? తనకు ఎవరూ అయిష్టులు కారు. ఏదీ అయిష్టం కాదు. వైరబుద్ధి సమూలంగా నశించి ఉండటం చేత మాత్సర్యం తెలియని ఆ మహాత్ముడు విమత్సరుడు.

**విమత్సరుడు**

జ్ఞాని విమత్సరుడు. ఏ విధమైన మత్సరము లేనివాడు. ఇతరులలోని అభివృద్ధిని చూచి సహించలేని గుణము మత్సరము. అలాంటి మత్సరము నుండి విడిపడిన వాడు విమత్సరుడు ***(విగత మత్సరః నిర్వైర బుద్ధిః).*** ఇతరుల విషయంలో ఏ విధమైన వైరబుద్ధి లేనివాడు.

మత్సరము అనేది అసూయ. ఇతరుల లోని వైభవాన్ని చూచి, ఆ వైభవము మనకు ఉంటే బాగుండును అనుకు న్నపుడు అసూయ బుద్ధిలో కదులుతుంది. ఇతరులకు ఉన్న వన్నీ మనకు ఉన్నాయా? ఇతరులకు ఉన్నవన్నీ మనకు లేనంత మాత్రాన అసూయ జనించదు. అవి మనకు కావాలి అని భావించి నపుడే ఓర్వలేని తనము పుడుతుంది. కాని, ఈ విధమైన కోరిక లేనివాడు కాబట్టే జ్ఞానిని 'నిరాశి'గా గడచిన శ్లోకంలో తెలుసుకున్నాం.

మళ్ళీ ప్రత్యేకంగా 'మాత్సర్య' మనే గుణాన్ని ప్రస్తావించడం ఎందుకు? అని సామాన్యులకు కూడా అనిపిస్తుంది.

మాత్సర్యం అనే గుణం నుండి విడిపడి యున్నవాడు అని ప్రత్యేకంగా ఈ సందర్భంలో ప్రస్తావించడం వెనుక గీతాచార్యుని భావన వేరు. జ్ఞానానికి అవరోధంగా ఉన్న కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలు అనే అరిషడ్వర్గాలలో మాత్సర్యము ఒకటి. మాత్సర్యము నుండి విడిపడిన వాడు అంటే అరిషడ్వర్గాల నుండి విడిపడిన వాడు అని అర్థము. మాత్సర్యము అనేది కామక్రోధాదులకు ఉపలక్షణ మని గ్రహించాలి.

ఏకము, అద్వితీయము అయిన ఆత్మజ్ఞానమును కలిగి, ***సర్వమిదం అహం చ బ్రహ్మైవ*** - తనతో పాటు ఈ సమస్త విశ్వమును బ్రహ్మమే అని భావించు యతి ఎవరిపై మాత్సర్యాన్ని పెంచుకుంటాడు? సర్వము బ్రహ్మమయ మని దర్శించే వ్యక్తికి వైరులు ఎవరుంటారు? ఈ సత్యాన్ని ఆవిష్కరించ డానికే జ్ఞానిని విమత్సరుడు అనడం జరిగింది. అద్వైత జ్ఞానం వల్ల జ్ఞానికి ప్రాప్తించిన సమస్థితిలో భేదాలు గోచరించవు.

**ఫలితాల ప్రభావం లేదు**

శరీరాన్ని నిలుపుకోవడానికి అయాచితంగా అన్నాదులు లభించినా ***(సిద్ధౌ)***, లభించక పోయినా ***(అసిద్ధౌ)*** వాటి ప్రభావం జ్ఞానిపై ఉండదు. ప్రాప్తించిన దానికి జ్ఞాని పొంగిపోడు. ప్రాప్తించని దానికి క్రుంగిపోడు. సిద్ధించినా, సిద్ధించక పోయినా సమంగా ఉంటాడు. కర్మల యందు అకర్మను దర్శించడమే ఈ జీవన వైభవానికి కారణము. గుణాలు గుణాలలో ప్రవర్తిస్తున్నాయే గాని నే నేమీ చేయడం లేదు అనే అకర్తృత్వ బుద్ధితో జ్ఞాని శోభిస్తూ ఉంటాడు కనుక అతడు భిక్షాటనాది కర్మలను చేసినా చేయని వాడే ***(కృత్వాపి న నిబధ్యతే)***. ఎందుకని? అతనిలో బంధానికి కారణమైన కర్మ, అట్టి కర్మకు హేతువైన అవిద్య కూడా జ్ఞాన మనే అగ్ని చేత దగ్ధ మైనట్లు, పందొమ్మిదవ శ్లోకం లోనే అర్థం చేసుకున్నాం. కనుక ఏ కర్మ కూడా జ్ఞానిని బంధించదు ***(బంధహేతోః కర్మణః సహేతుకస్య జ్ఞానాగ్నినా దగ్ధత్వాత్ ఇతి)***.

*జ్ఞానం ఉత్పన్నం కాక ముందు ప్రారంభించిన కర్మను జ్ఞానోత్ప త్త్యనంతరం త్యజించినా, లేదా కొనసాగించినా, దాని చేత జ్ఞానికి కర్మ దోషము అంటదు. ఈ విషయాన్ని విస్పష్టం చేస్తున్నాడు.*

**గత సఙ్గస్య ముక్తస్య జ్ఞానావస్థిత చేతసః ।**
**యజ్ఞా యాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే ॥** 23

*గతసంగస్య-ముక్తస్య-జ్ఞానావస్థిత చేతసః*
*యజ్ఞాయ-ఆచరతః-కర్మ-సమగ్రం-ప్రవిలీయతే*

| | | | |
|---|---|---|---|
| గతసంగస్య | = ఆసక్తి లేని వాడు | ఆచరతః | = ఆచరించు వాని |
| ముక్తస్య | = జీవన్ముక్తుడు | కర్మ | = కర్మము |
| జ్ఞానావస్థిత చేతసః | = జ్ఞానము నందు నిలిచిన చిత్తము గలవాడు | సమగ్రం | = సంపూర్ణముగ |
| యజ్ఞాయ | = యజ్ఞము కొరకు | ప్రవిలీయతే | = నశించిపోవు చున్నది |

**దేని యందును ఆసక్తి లేని వాడు, బంధము నుండి విడిపడిన వాడు, మనస్సును జ్ఞానము నందు నిలిపిన వాడు, కేవలం యజ్ఞార్థమే కర్మలను ఆచరించు వాడు అయిన మానవుని సర్వ కర్మలు సంపూర్ణంగా విలీన మౌతున్నాయి.**





**వ్యాఖ్య**

కర్మల యందు అకర్మను దర్శించిన జ్ఞాని ఈ విధమైన జ్ఞానమును పొందటానికి పూర్వము ఏ కర్మం నైతే ఆచరించాడో, వాటి యొక్క నిష్ప్రయోజనాన్ని గుర్తించిన వాడు కావడం చేత, ఆయా కర్మలను త్యజించి, కేవలం దేహ స్థితి మాత్ర ప్రయోజన మైన చేష్టనే కొనసాగిస్తాడు. ఆత్మ కర్త కాదు. ఆత్మలో కర్మ లేదు. ఆత్మ పొందదగిన ప్రయోజనము లేదని స్పష్టంగా గ్రహించడమే కర్మ త్యాగానికి కారణము.

అలా కాకుండా, జ్ఞానము కలగటానికి పూర్వము ప్రారంభించిన కర్మను ఏ కారణం చేతనో విడిచి పెట్టలేక జ్ఞానానంతరము కూడా కొనసాగించిననూ అతడు చూచే వారికి కర్తగా అగుపించినా, అతని దృష్టిలో మాత్రము తాను అకర్తే. ఈ విషయాన్ని ఇరవయ్యవ శ్లోకంలో స్పష్టం చేయడం జరిగింది. శ్లోక పంచకాన్ని సమాప్తం చేస్తూ, మరల జ్ఞాని వైభవాన్ని ప్రస్తావిస్తున్నాడు. ఏ విధమైన కర్మను అతడు ఆచరించినా, అతడు ఆచరించిన కర్మ, దాని ఫలంతో సహ జ్ఞానంలో విలీన మౌతుంది అని చెబుతున్నాడు. కర్మసంగము లేకుండా, అజ్ఞానము నుండి విడిపడి, జ్ఞానము నందు బుద్ధి స్థిరపడి ఉండటమే దీనికి కారణము అంటున్నాడు.

**గతసంగుడు**

కర్మల యందు అకర్మను దర్శించే జ్ఞాని కర్తృత్వాభిమాన రహితుడు కావడం చేత, దేని తోను సంబంధము, సంగత్వము లేనివాడై గతసంగుడు అవుతాడు. సంగము అంటే కోరిక లేదా ఆసక్తి అని అర్థము. అది పోయినవాడు కావడం చేత జ్ఞాని గతసంగుడు.

**సజ్జతే పుమాన్ అనేన కర్మసు ఇతి సంగః కామః**

దేని చేత మానవుడు కర్మలలో చిక్కుకుంటున్నాడో అదే ఇక్కడ సంగము. *సంగః* అంటే, కామము లేదా ఆసక్తి. ఇట్టి కామాన్ని అన్ని విషయాల లోను పోగొట్టుకున్న వాడు గతసంగుడు ***(నివృత్త ఆసక్తేః)***. అతడు కర్మలను ఆచరించినా, లేదా త్యజించినా ఫల కామన లేనివాడు కావడం చేత కర్మలలో చిక్కుకోడు. కర్మ లేపము లేనందున అతడు బద్ధుడు కాడు. బద్ధుడు కాడు కనుక ముక్తుడు.

**ముక్త పురుషుడు**

ముక్తుడు అంటే విడిపడిన వాడు. దేని నుండి ముక్తుడు అని ప్రశ్నిస్తే, ధర్మ అధర్మాది బంధాల నుండి ముక్తుడు అంటున్నాడు ***(ముక్తస్య నివృత్త ధర్మాది బంధనస్య)***. ఇక్కడ ధర్మాధర్మాలు అంటే, చేయదగిన, చేయకూడని కర్మలు అని అర్థము. అలాంటి కర్మాచరణము వలన పాపపుణ్యాలు సంక్రమిస్తాయి. పాపపుణ్యాలు కల్పించే కర్మలలో రాగద్వేషాలే ప్రధాన పాత్రను పోషిస్తాయి. కనుక జ్ఞాని పాపపుణ్యాలకు అతీతుడు. అతడు పుణ్యకర్మ నుండి, పాపకర్మ నుండి ముక్తుడు. కారణ మేమిటో తెలుసా! జ్ఞాని కర్త కాడు. కనుక, ధర్మ, అధర్మాది కర్మల నుండి విముక్తుడు. కర్మల యందు అకర్మను దర్శించే ఆత్మజ్ఞానంలో అతని బుద్ధి స్థిరపడి ఉండటమే కారణము.

**జ్ఞానావస్థిత చేతసుడు**

జ్ఞానము నందే స్థిరముగా నిలిచిన చిత్తము కలవాడు జ్ఞానావస్థిత చేతసుడు. జ్ఞానము నందే బుద్ధి పాదుకొని ఉంది అంటే, జ్ఞాతృ- జ్ఞాన- జ్ఞేయముల యందు సంశయము లేకుండా, అద్వయ జ్ఞాన స్వరూపంగా ఉంది అని అర్థము. అందుచేతనే అతడు ముక్తుడు. ముక్తుడు కనుకనే గతసంగుడు. అలాంటి ముక్త పురుషుడు కర్మల ద్వారా పొందేది ఏముంటుంది? కర్మలు, కర్మ ఫలాలు అతనికి నిష్ప్రయోజనం కనుక, జ్ఞానోత్ప త్త్యనంతరం అతడు కర్మలను త్యజించినా, లేదా యజ్ఞ నిమిత్తము ఆచరించినా, ఆ కర్మలు, ఫలితాలతో సహా ఆ ముక్త పురుషుని జ్ఞానంలో విలీన మవుతాయి.

### జ్ఞానయజ్ఞంలో కర్మ సమిధలు

జ్ఞానము కలుగక పూర్వము ఆరంభించిన యజ్ఞకర్మను జ్ఞానానంతరము కొనసాగించినా ఆ కర్మ గాని, దాని ప్రభావం గాని జ్ఞానిపై ఉండదు. యజ్ఞకర్మ కన్నా అన్యమైన కర్మలు బంధిస్తాయి గాని, యజ్ఞకర్మ బంధించదు కనుక, సంగము లేకుండా కర్మలను ఆచరించమని భగవంతుడు కర్మయోగం లోనే అర్జునునికి బోధించాడు *(3 - 9)*.

ఈ సందర్భంలో యజ్ఞము కొరకు జ్ఞాని కర్మను ఆచరిస్తున్నాడు ***(యజ్ఞాయ)***. యజ్ఞము కొరకు కర్మను ఆచరించడము అంటే, జ్ఞానోత్పత్తికి పూర్వం ప్రారంభించ బడిన యజ్ఞమును సంపూర్తి చేయడం కొరకు అని అర్థము ***(యజ్ఞ నిర్వృత్త్యర్థమ్ ఆచరతః కర్మ)***.

ఇక్కడ కాస్త జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. యజ్ఞ శబ్దము కర్మ సూచితంగా వాడబడింది. యజ్ఞమును ఆచరించే వాడు స్వర్గాది ఫలాలను ఆశించి అయినా చేయాలి. లేదా, అంతఃకరణ శుద్ధి కొరకు ఈశ్వర ప్రీత్యర్థంగా నైనా చేయాలి. మరో విధంగా యజ్ఞాచరణము ఎలా సాధ్యం? కాని, ఈ రెండు యజ్ఞ భావనలు జ్ఞానికి అన్వయించవు. పైగా అప్రస్తుతం గానూ కనిపిస్తాయి.

కర్మల యందు అకర్మను దర్శించే ఆత్మజ్ఞాని స్వర్గాది ఫలాలను ఆశించి యజ్ఞమును నిర్వహిస్తాడా? పోనీ అంతఃకరణ శుద్ధ్యర్థం ఈశ్వర ప్రియంగా యజ్ఞము నాచరిస్తాడా? అంతఃకరణ శుద్ధి ఉండబట్టే కదా ఆత్మజ్ఞానముమ పొంది అకర్త అయ్యాడు! మళ్ళీ చిత్తశుద్ధికి యజ్ఞాచరణము చేయడ మేమిటి? కనుక స్వర్గాది ఫలార్థం కాని, ఈశ్వర ప్రీత్యర్థం కాని యుక్తము కాదు. ఆత్మవిదునికి ఈశ్వర ప్రీత్యర్థం అనే సంకల్పము ఉదయించడానికే అవకాశము లేదు ***(ఆత్మవిదః అస్య ఈశ్వర ప్రీత్యర్థక సంకల్ప అసంభవాత్*** - భాష్యార్క ప్రదీపిక). కమక గతంలో ఆచరించి విడిచిన ఏ కర్మను తిరిగి ఆచరించినా, కర్త లేనందున ముక్తుడు కర్మ చేత గావి, వాటి ఫలాల చేత గాని లిప్తుడు కాడు.

జ్ఞానం ఉత్పన్నం కాక ముందు ***(ప్రాక్)*** ఆరంభమై కొనసాగుతున్న కర్మను పూర్తి చేయడమే ఇక్కడ కేంద్ర విషయం. దానివే యజ్ఞ నిర్వృత్త్యర్థమ్ అన్నారు భాష్యంలో ఆచార్యులు. ప్రారబ్ధ యజ్ఞము సమాప్తి అగుటకు ఆచరించే కర్మ అని భాష్యార్క ప్రకాశిక కూడా నిర్ణయించింది ***(ప్రారబ్ధ యజ్ఞస్య సమాప్త్యర్థమ్ ఆచరతః, యజ్ఞం నిర్వర్త యతః ఇత్యర్థః)***.

ఆత్మజ్ఞానం కలిగింది అంటే, తాను అకర్త అనే స్పృహ జ్ఞానిలో స్థిరపడి ఉంటుంది. కనుకనే జ్ఞానిని జ్ఞానావస్థిత చేతసుడు అనడం జరిగింది. అకర్తగా జ్ఞాని ఉండే టప్పుడు అకర్త యైన తనకు కర్మలతో గాని, కర్మఫలాలతో గాని సంగము ఉండే అవకాశము లేదు. అలాంటి మహాత్ముని ద్వారా కర్మలు జరిగే టప్పుడు లోకదృష్టిలో అతడు కర్తగా ఉన్నా, తన దృష్టిలో తాను అకర్తే. సర్వకర్మ వినిర్ముక్తుడే. కనుక, జ్ఞానోత్పత్త్యనంతరం జ్ఞాని చేత ఆచరింప బడిన కర్మలు, వాటి ఫలాలతో సహ తన స్వరూప జ్ఞానంలో లయించి పోతున్నాయి ***(కర్మ సమగ్రం ప్రవిలీయతే)***.

కర్మ సమగ్రం లయించి పోతుంది అంటున్నాడు. అగ్రం అంటే ఫలం అని అర్థం. ***సమగ్రం ప్రవిలీయతే*** అంటే ఫలంతో సహ కర్మ నశిస్తుంది అని అర్థం ***(సమగ్రం సహ అగ్రేణ ఫలేన వర్తతే ఇతి సమగ్రం కర్మ, తత్ సమగ్రం ప్రవిలీయతే వినశ్యతి ఇత్యర్థః)***. ఇక్కడ ***లీయతే*** అనకుండా ***విలీయతే*** అని కూడా చెప్పకుండా, రెండు ఉపసర్గలను ముందుంచి ***ప్రవిలీయతే*** అని చెప్పడంలో సంపూర్ణంగా నశించి పోతుంది అని నొక్కి వక్కాణించడమే ప్రధాన విషయంగా ఉంది.





*జ్ఞాని ఆచరించిన కర్మలు ఫలసహితంగా జ్ఞానాగ్నిలో విలీనమై పోయాయి అంటే, జ్ఞాని ఆచరించి నప్పుడు కూడా అవి జ్ఞానమయం గానే ఉన్నాయి. కర్మలు గానే కనిపించినా అకర్మలు గానే శోభించాయి. జ్ఞాని ద్వారా జరిగే కర్మ లన్నీ యజ్ఞ స్వరూపాలే. ఆ కర్మలలో సర్వమూ బ్రహ్మమే. ఈ విషయాన్నే స్పష్టం చేస్తున్నాడు.*

బ్రహ్మార్పణం బ్రహ్మ హవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్ ।
బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మకర్మ సమాధినా ॥ 24

***బ్రహ్మ-అర్పణం-బ్రహ్మ-హవిః-బ్రహ్మగ్నౌ-బ్రహ్మణా-హుతం***
***బ్రహ్మ-ఏవ-తేన-గంతవ్యం-బ్రహ్మకర్మ సమాధినా***

| | | | |
|---|---|---|---|
| అర్పణం | =హోమసాధనములు | హుతం | = హోమం చేయబడినది |
| బ్రహ్మ | =బ్రహ్మమే | బ్రహ్మకర్మ సమాధినా | = బ్రహ్మకర్మ సమాధి నిష్ఠుడయిన |
| హవిః | =హవిస్సు | తేన | = అతని చేత |
| బ్రహ్మ | =బ్రహ్మమే | గంతవ్యం | = పొందదగిన ఫలము |
| బ్రహ్మాగ్నౌ | =బ్రహ్మ మనెడి అగ్ని యందు | బ్రహ్మైవ | = బ్రహ్మమే |
| బ్రహ్మణా | =బ్రహ్మస్వరూపుని చేత | | |

**అర్పణము బ్రహ్మము. హవిస్సు బ్రహ్మము. బ్రహ్మ మనే అగ్నిలో బ్రహ్మరూపు డైన యజమాని చేసే హోమము బ్రహ్మమే. సర్వమూ బ్రహ్మమే అనే భావనతో హోమము చేయువాడు పొందే ఫలము కూడా బ్రహ్మమే.**

**వ్యాఖ్య**

ఫలాన్ని ఆశించి మనిషి కర్మను ఆచరిస్తాడు. కర్మ పరిమిత మైంది. దేశకాలాదుల చట్రంలో బిగించబడి ఉంటుంది. కర్మను ఆచరించిన తరువాత భూమిలో నాటిన విత్తనము కనిపించ నట్లు, కాలంలో కర్మ కూడా కనిపించదు. అంత మాత్రాన కర్మ నశించి పోయింది అనలేము. భూమిలో ఒక కాలంలో నాటిన విత్తనము మరొక కాలంలో మొక్కగా కనిపించి నట్లు, ఒక కాలంలో మనిషి ఆచరించిన కర్మ యొక్క ఫలం కూడా మరొక కాలంలో మనిషి చేతికి అందుతుంది.

నాటిన విత్తనం మొల కెత్తక పోవచ్చు. కాని, చేసిన కర్మ ఫలమును అందించక పోదు. కర్మను ఆచరించిన కర్త ఆ కర్మకు సంబంధించిన ఫలమును అనుభవించుటకు భోక్త కావలసిందే. కర్మఫలమును అనుభవించ వలసిందే. అనుభవించనిదే కర్మ నశించదు అనేది శాస్త్రోక్తం. కర్మ విషయంలో సత్య విషయం.

**నా భుక్తం క్షీయతే కర్మ కల్పకోటి శతై రపి**

వందలాది కోట్ల జన్మలు ఎత్తినా, చేసిన కర్మల యొక్క ఫలము అనుభవించనిదే నశించదు. ఇది శాస్త్ర ప్రతిపాదిత విషయము. సర్వజనామోదము. అలాంటప్పుడు జ్ఞాని ఆచరించిన కర్మ, తాను అందించ వలసిన ఫలమును ఇవ్వకపోగా, ఫలముతో సహ కర్మ కూడా విలీనమై పోతుంది అని ఇరవై మూడవ శ్లోకంలో చూశాం. అదెలా జరుగుతుంది? ఎందువలన జరుగుతుంది? అనే శంకలను పరిహరిస్తూ ప్రస్తుత శ్లోకాన్ని వినిపిస్తున్నాడు.

### కర్మయే బ్రహ్మ

కర్మకు కారణము అజ్ఞానము. అజ్ఞానము యొక్క కార్యము కర్మ. కర్మల యందు అకర్మను దర్శించే

జ్ఞాని బ్రహ్మాత్మ జ్ఞాన సంపన్నుడు కావడం చేత, అతని కర్మకు అజ్ఞానము కారణము కాదు. అలాగే బ్రహ్మజ్ఞాని ఆచరించే కార్యము కర్మ కాలేదు. ఈ కారణం చేత కర్మకు కారణమైన అజ్ఞానము, కార్యంగా కనిపించే కర్మ, ఈ రెండూ జ్ఞానోత్ప త్త్యనంతరం బ్రహ్మము నందే విలీనమై పోతున్నాయి. బ్రహ్మము నందే అర్పింపబడి బ్రహ్మ స్వరూప మౌతున్నాయి. ఈ సత్యమును యజ్ఞ కార్యమును దృష్టాంతంగా స్వీకరించి బోధిస్తున్నాడు భగవంతుడు. గీతను ప్రవచిస్తున్న ద్వాపర యుగాంతము నందు యజ్ఞ యాగాది కర్మలు విశేషంగా నిర్వహింప బడుతూ ఉన్నందున, దృష్టాంతము అనేది సర్వజన విదితంగా ఉండటము సముచితం కనుక హోమవిధిని వివరిస్తూ, జ్ఞాని ఆచరించే కర్మలు ఎలా బ్రహ్మ స్వరూపాలో తెలియ జేస్తున్నాడు. అంతమాత్రాన, యజ్ఞకార్యాలే బ్రహ్మ స్వరూపాలు అని భావించ కూడదు. ఆత్మజ్ఞానిలో కర్మ జ్ఞాన స్వరూపంగా భాసించడం చేత, ఆ దివ్యాత్ముని నుండి కదిలే ప్రతి కార్యము బ్రహ్మ స్వరూపమే అవుతూ ఉంది అని గ్రహించాలి. ముందుగా, యజ్ఞకర్మ ఎలా బ్రహ్మ స్వరూపాన్ని పొందుతూ ఉందో తెలుసుకుందాం.

**బ్రహ్మార్పణం** - అర్పణము అంటే అర్పించేది అని అర్థము. యజ్ఞ నిర్వహణలో దేని చేత హవిస్సును అగ్నిలో అర్పిస్తారో, ఆ హోమ సాధనమును (చమసము) అర్పణము అంటారు. హోమసాధనమైన అట్టి అర్పణమును బ్రహ్మవిదుడు బ్రహ్మము గానే దర్శిస్తాడు. అదే బ్రహ్మార్పణం ***(అర్పణం బ్రహ్మ ఏవ పశ్యతి).*** అంటే, ఆ యజ్ఞ సాధనం కూడా ఆత్మ కన్నా అన్యంగా లేదు అని భావిస్తాడు. ముత్తెపు చిప్ప యందు వెండి లేదని చూచినట్లు చూస్తాడు అని అర్థం ***(యథా శుక్తికాయాం రజతా భావం పశ్యతి).***

వివేకం లోపించిన వ్యక్తికి రజతంగా, అంటే వెండిగా కనిపించింది. వివేక దృష్టి గల వానికి శుక్తిగా, అంటే ముత్తెపు చిప్పగా తెలిసింది. యజ్ఞ సాధనము లైన చమసాదులు అజ్ఞాన చక్షువుకు హోమసాధనాలుగా తెలుస్తూ ఉంటే, జ్ఞానచక్షువు గల బ్రహ్మవిదునికి బ్రహ్మము గానే గోచరిస్తున్నాయి.

ఇక్కడ **బ్రహ్మార్పణం** అనే చోట బ్రహ్మ, అర్పణం అనే రెండు పదాలు ఉన్నాయి. సామాన్యులకు బ్రహ్మము వేరుగా, అర్పించే హోమ సాధనము వేరుగా తెలుస్తూ ఉంటుంది. బ్రహ్మవిదునికి హోమ సాధనము కూడా బ్రహ్మము గానే కనిపిస్తుంది.

ఈ విషయాన్ని కొందరు విపరీతంగా అర్థం చేసుకుంటారు. వినడానికి వారి అవగాహన కూడా సొంపు గానే ఉంటుంది. కాని, అది చాలా సత్యదూర మైన విషయము.

**బ్రహ్మార్పణం** అనే దానికి ***యత్ బ్రహ్మ తత్ అర్పణం*** అని అర్థం చెప్పారు. అంటే, ఏది బ్రహ్మమో అది హోమ సాధనము అని అర్థము. బ్రహ్మమే కారక రూపంలో ఉండి కర్మ చేయిస్తూ ఉంది అని వారి భావము. అలా చెప్పి నపుడు అర్పణాదుల రూపంలో బ్రహ్మము ఉందని అర్థము. అప్పుడు హోమ సాధనం హోమసాధనం గానే కనిపిస్తుంది. అర్పణ బుద్ధి తొలగదు. బ్రహ్మ బుద్ధి నిలవదు.

కనుక బ్రహ్మము, అర్పణము అనే రెండు పదాల అర్థాన్ని గ్రహించిన తరువాత, అర్పణము బ్రహ్మమే అని అర్థం చేసుకోవాలి. అంతేగాని బ్రహ్మము అర్పణము అని కాదు. అర్పణము బ్రహ్మము అయింది కనుక హవిస్సు బ్రహ్మమే, అగ్ని బ్రహ్మమే, హోమము చేసేవాడు బ్రహ్మమే - అన్నీ బ్రహ్మ స్వరూపంగా అర్థ మవుతాయి.

అర్పణము బ్రహ్మమే. కాని, బ్రహ్మము అర్పణము కాదు. బ్రహ్మము అర్పణ మైతే, హవిస్సు ఎవరు? బ్రహ్మమే నంటారా? అలాగైతే, అర్పణము హవిస్సు కావాలి. హవిస్సు అర్పణం కావాలి. హోమాగ్ని హోత కావాలి. హోత హోమాగ్ని కావాలి. అలా అవుతాయా? కానపుడు అన్నీ బ్రహ్మ స్వరూపా లెలా అవుతాయి?





కనుక, అర్పణము బ్రహ్మము. అంతేగాని బ్రహ్మము అర్పణము కాదు. అర్పణం బ్రహ్మము కనుక హవిస్సు బ్రహ్మమే. హోమాగ్ని, హోత - ఇలా సర్వమూ బ్రహ్మమే.

***శుక్తికాయాం రజత అభావం*** అన్నచోట ఏది రజతమో అది శుక్తియే అనే కదా అర్థం? దీనినే శాస్త్రం ***బాధాయాం సామానాధికరణ్యం*** అంటుంది. ఏది వెండిగా కనిపిస్తూ ఉందో అది ముత్తెపు చిప్పయే. అంతేగాని ముత్తెపు చిప్ప వెండి అని అర్థం కాదు. అలాగే ఇక్కడ ఏది అర్పణమో అది బ్రహ్మమే. కాని బ్రహ్మము అర్పణం కాదు. ఆత్మ కన్నా అన్యంగా ఏదీ లేదు అని గ్రహించడమే జ్ఞానం. ఆత్మయే బ్రహ్మము. బ్రహ్మము జ్ఞానస్వరూపము. కనుక, అంతా జ్ఞానమే. బ్రహ్మవిదునిలో అంతా జ్ఞానమయమే. అన్నీ జ్ఞానస్వరూపాలే. అందుచేత బ్రహ్మవిదుడు ఆచరించే కర్మ ఏదైనా జ్ఞానహేతువుగా అకర్మే అయి ఉంది కనుక, బ్రహ్మవిదుని కర్మలు బంధహేతువులు కావు. కర్మ ఏదైనా బంధహేతువే కదా! నిజమే. కాని, బంధహేతువు కాకుండా కర్మ ఉంది అంటే, అట్టి కర్మ వాస్తవానికి అకర్మ గానే ఉంటుంది. అదే కర్మలలో అకర్మ దర్శనం. ***కర్మ జ్ఞాన హేతుత్వేన బంధకత్వ అభావాత్ అకర్మ ఏవ!*** అని శ్రీధర వ్యాఖ్య.

అర్పణము ఎలా బ్రహ్మమో అలాగే లోకము దేనిని హవిస్సుగా ***(హవిః)*** భావిస్తూ ఉందో, అది కూడా బ్రహ్మవిదునకు బ్రహ్మము గానే దర్శన మిస్తూ ఉంది. అన్నము, ఘృతము మొదలైన హోమ ద్రవ్యములు బ్రహ్మ స్వరూపం గానే కనిపిస్తాయి. అనిపిస్తాయి.

**బ్రహ్మాగ్నౌ** అనేది సమస్త పదం. దేని యందు హోమము చేయబడుతూ ఉందో అట్టి అగ్ని కూడా బ్రహ్మమే ***(అగ్నిః అపి బ్రహ్మ ఏవ యత్ర హూయతే).*** అలాగే బ్రహ్మము అయిన కర్త చేత ***(బ్రహ్మణా)*** చేయబడిన హవనక్రియ ***(హుతం)*** కూడా బ్రహ్మమే. కర్త చేత పొందబడే ఫలము ఏదైతే ఉందో అది కూడా బ్రహ్మమే ***(తేన గంతవ్యం బ్రహ్మ ఏవ).*** ఈ విధంగా కర్మ అంతా బ్రహ్మమే అయింది. ఇలాంటి బ్రహ్మ కర్మము నందు స్థిరమైన బుద్ధిని కలిగి ఉండటమే ***బ్రహ్మకర్మ సమాధి.*** ఈ విధంగా యజ్ఞ రూపమైన వైదిక కర్మ బ్రహ్మవిదునికి జ్ఞాన ప్రధానంగా ఉందే గాని కర్మ ప్రధానంగా లేదు. సర్వత్ర బ్రహ్మ దర్శనం జరగడం చేత, కర్మ అకర్మగా మారిపోతూ ఉంది. కర్త అకర్తగా శోభిస్తున్నాడు. ఏ కర్మను ఆచరించినా బ్రహ్మవిదునకు బ్రహ్మము పరోక్షం కాదు.

ఏ వస్తువును చూచినా, ఆ వస్తువుకు సంబంధించిన జ్ఞానము బుద్ధిలో పుడుతుంది. బుద్ధి లోని జ్ఞానము చైతన్యము కన్నా అన్యంగా ఉండలేదు. బుద్ధి వృత్తియే జ్ఞాత. జ్ఞాత జ్ఞేయమును జ్ఞానము ద్వారా తెలుసుకుంటున్నాడు. ఈ జ్ఞాతృ - జ్ఞాన - జ్ఞేయ భేదము చైతన్యము నాశ్రయించుకొని ఉంది. కాని, చైతన్యము నందు జ్ఞాతృ - జ్ఞాన - జ్ఞేయ భేదము లేదు. ఈ విధమైన చైతన్యము తానే అని తెలిసిన ఆత్మవిదుడు జ్ఞేయ - జ్ఞాన - జ్ఞాతలను ఆత్మ కన్నా అన్యంగా చూడలేడు. కనుక బ్రహ్మవిదునికి తెలిసే దంతా బ్రహ్మమే. బ్రహ్మవిదుని ద్వారా జరిగే దంతా బ్రహ్మక్రియే. స్వప్నగత దృశ్యా లన్నీ స్వప్న ద్రష్ట కన్నా ఎలా అన్యంగా లేవో, దృశ్యా లన్నీ ద్రష్ట రూపం గానే భాసిస్తున్నాయో, అలాగే విశ్వంలో తెలియబడే దంతా ఆత్మవిదుని కన్నా అన్యంగా లేదు. ఇదే ఆత్మ దర్శనం. ఆత్మయే బ్రహ్మము కనుక ఆత్మ దర్శనము అంటే బ్రహ్మ దర్శనము అని అర్థము. అదే బ్రహ్మాత్మ దర్శనము. ఆత్మయే బ్రహ్మము అనే అద్వైతానుభూతి. ఈ వైభవములో కర్మ అకర్మ గానే శోభిస్తూ ఉంది.

**బ్రహ్మార్పణం** అనే ఈ శ్లోకం చాలా ప్రశస్త మైనది. పవిత్ర మైనది. భోజన సమయము నందు, అలాగే శ్రాద్ధ కర్మలను ఆచరించే సందర్భాల లోను అన్నదోష నివారణార్థం ఈ శ్లోకాన్ని పఠించడం కూడా లోకాచారంలో ఉంది.

కేవలము శరీర స్థితి ప్రయోజనార్థం గ్రహించే ఆహారమును బ్రహ్మవిదుడు బ్రహ్మము గానే వీక్షిస్తాడు ***(అన్నం బ్రహ్మేతి).*** భుజించే తాను బ్రహ్మ స్వరూపుడే అయినందున తన యందు రగిలే జఠరాగ్ని కూడా బ్రహ్మమే ***(అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః - 15 - 14).*** జఠరాగ్ని అనే హోమాగ్ని యందు ఆహారము అనే హవిస్సును సమర్పించడము జరుగుతూ ఉంది. జఠరాగ్ని శాంతించుట చేత బ్రహ్మకర్మ సమాధి అనుభూతిగా అలరారుతోంది. అలాంటి బ్రహ్మవిదుడు ఆహారము భుజించినా భుజించని వాడే. భోజన క్రియ లోకదృష్టిలో అగుపిస్తున్నా ఆత్మవిదుని స్థాయిలో అది అకర్మయే.

*జ్ఞానమే మోక్షానికి ఏకైక సాధనం కనుక, జ్ఞాన యజ్ఞమును స్తుతించుటకు అన్యము లైనవి, జ్ఞానార్జనకు ఉపయుక్త మైన అంతఃకరణ శుద్ధిని ప్రసాదించు ఇతర యజ్ఞాలను కూడా ప్రతిపాదిస్తున్నాడు.*

**దైవ మే వాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే ।**
**బ్రహ్మాగ్నా వపరే యజ్ఞం యజ్ఞే నై వోపజుహ్వతి ॥ 25**

**దైవం-ఏవ-అపరే-యజ్ఞం-యోగినః-పర్యుపాసతే**
**బ్రహ్మాగ్నౌ-అపరే-యజ్ఞం-యజ్ఞేన-ఏవ-ఉపజుహ్వతి**

| | | | |
|---|---|---|---|
| అపరే | = కొందరు | అపరే | = మరి కొందరు |
| యోగినః | = యోగులు | బ్రహ్మాగ్నౌ | = బ్రహ్మమను అగ్ని యందు |
| దైవం | = దేవతాసంబంధమైన | యజ్ఞం | = యజ్ఞమును |
| యజ్ఞం ఏవ | = యజ్ఞమునే | యజ్ఞేన ఏవ | = యజ్ఞము చేతనే |
| పర్యుపాసతే | = ఉపాసించుచున్నారు | ఉపజుహ్వతి | = హోమము చేయుచున్నారు |

**కొందరు యోగులు దేవతలను ఉపాసించే యజ్ఞమును చేస్తున్నారు. మరి కొందరు ఆత్మైక భావనచే బ్రహ్మ మనే అగ్ని యందు హోమము చేస్తున్నారు.**

**వ్యాఖ్య**

పరమ ప్రశస్తమైన ఈ జ్ఞానయోగము అనే నాల్గవ అధ్యాయం ప్రధానంగా నాలుగు విషయాలను ప్రస్తావించి ప్రముఖంగా చర్చించింది అని ఈ అధ్యాయ ప్రవేశం లోనే చెప్పుకున్నాం. అందులో మొదటిది అయిన అవతార వైభవము పదహైదవ శ్లోకం వద్ద ముగిస్తే, రెండవది అయిన కర్మ వైభవము ఇరవై నాల్గవ శ్లోకంతో ముగిసింది. ప్రస్తుత శ్లోకం నుండి ముప్పై రెండవ శ్లోకం వరకు యజ్ఞ వైభవము సాగుతుంది. అక్కడ నుండి చివరి వరకు, అంటే నలభై రెండవ శ్లోకం వరకు జ్ఞాన వైభవము శోభిస్తుంది. కనుక ప్రస్తుతం యజ్ఞ ప్రకరణం ఆరంభమవుతూ ఉంది.

**బ్రహ్మార్పణం** అనే పూర్వ శ్లోకంలో బ్రహ్మ జ్ఞానమును యజ్ఞరూపంగా ప్రతిపాదించి, అట్టి జ్ఞానయజ్ఞమే మోక్షసాధన మని నిర్ధారణ చేయడం జరిగింది. అభేద దర్శనం ప్రధానమైన ఈ జ్ఞాన యజ్ఞమునే బ్రహ్మయజ్ఞము అంటారు. ఈ బ్రహ్మయజ్ఞము అనే జ్ఞానయోగమును స్తుతిస్తూ, సర్వోత్కృష్ట మైన ఈ జ్ఞానయజ్ఞ స్థితిని అందుకొనుటకు సర్వులూ అర్హులు కారు కనుక, అట్టివారు అర్హతను సంపాదించటానికి అనువైన అనేక దైవ యజ్ఞాలను కూడా ఉదహరించడానికి శ్రీకారం చుడుతూ, దైవ, బ్రహ్మయజ్ఞాలను ప్రస్తుత శ్లోకంలో ప్రతిపాదిస్తూ ఇక్కడ నుండి జ్ఞానయజ్ఞమునకు కావలసిన అంతఃకరణ శుద్ధిని, అంతఃకరణ నైశ్చల్యమును ప్రసాదించే వివిధములైన దైవ యజ్ఞాలను గూర్చి బోధిస్తున్నారు.





**దైవ యజ్ఞము**

ఏ యజ్ఞము చేత దేవతలు ఆరాధింప బడతారో అది దైవయజ్ఞం. ఈ యజ్ఞాన్ని ఆచరించే వారు కర్మయోగులు ***(తమేవ యజ్ఞం యోగినః కర్మిణః పర్యుపాసతే).*** ఇంద్ర, అగ్ని, సూర్య, వరుణాది దేవతలను ఆరాధించే వారు. ఈ విధమైన దేవతారాధన సాగించే వారు కర్మయోగులు. వీరు ఆచరించేవి కామ్యకర్మలు కావు. వీరికి ఫలాసక్తి లేదు. ఇహ, పరలోక సౌఖ్యాలను ఆశించి, భోగాసక్తితో దైవయజ్ఞాలను వీరు నిర్వర్తించరు. కనుకనే, ఫలాసక్తితో దేవతారాధన చేసే కర్మల నుండి వీరిని వేరు చేసి చూపడానికి యోగులు ***(యోగినః)*** అని చెప్పడం జరిగింది. వీరు దేవతలకు సంబంధించిన యజ్ఞమునే సేవిస్తున్నారు ***(దైవం యజ్ఞం ఏవ పర్యుపాసతే).*** ఇక్కడ **ఏవ** శబ్దము వలన వీరు ఇంద్రాది దేవతలను ఫలాసక్తి లేకుండా ఆరాధిస్తున్నారే గాని, వారి యందు బ్రహ్మభావనతో లేరు. వీరి కన్నా అన్యముగా బ్రహ్మవేత్తలు ***(అపరే)*** బ్రహ్మయజ్ఞమును చేస్తున్నారు అని సూచింప బడుతూ ఉంది.

**బ్రహ్మయజ్ఞము**

మోక్షమును కాంక్షించే యతులు ఆచరించేది బ్రహ్మయజ్ఞము. ఈ విధమైన హోమానికి బ్రహ్మమే అగ్ని. సత్యం, జ్ఞానం, అనంతం అని ఏ బ్రహ్మమును ఉపనిషత్తులు నిర్దేశించాయో, ఆ బ్రహ్మమే అగ్ని. అట్టి బ్రహ్మాగ్ని యందు ***(బ్రహ్మాగ్నౌ)*** యజ్ఞమును ***(యజ్ఞం)*** యజ్ఞము చేతనే ***(యజ్ఞేనైవ)*** హోమం చేస్తున్నారు ***(ఉపజుహ్వతి).***

బ్రహ్మాగ్నిలో సమర్పించ బడేది 'యజ్ఞము' అంటున్నాడు. ఇక్కడ 'యజ్ఞ' శబ్దార్థము ఆత్మను సూచిస్తుంది. ఆత్మ యొక్క పర్యాయపదముల యందు 'యజ్ఞ' శబ్దము ఉండుట చేత 'యజ్ఞ' శబ్దమునకు ఆత్మ అని కూడా అర్థమును యాస్కాచార్యులు నిర్ణయించి ఉన్నారు ***(యజ్ఞ శబ్ద వాచ్యః ఆత్మా).*** కనుక, సత్యజ్ఞానానంద స్వరూపమైన బ్రహ్మ మనే అగ్ని యందు ***(తత్ పదము)*** జీవుడు అనబడే ప్రత్యగాత్మను ***(త్వం పదము)*** హోమం చేయడం జరుగుతూ ఉంది. ప్రత్యగాత్మను జ్ఞానంలో పరమాత్మ అనే యజ్ఞములో హోమం చేయడమే బ్రహ్మయజ్ఞము.

**సోపాధికం జీవం నిరుపాధిక ఆత్మరూపేణ జుహ్వతి**

సోపాధికమైన జీవుని నిరుపాధిక మగు బ్రహ్మములో హోమము చేయడమే ఇక్కడ బ్రహ్మ యజ్ఞము అని నీలకంఠ వ్యాఖ్య. బ్రహ్మ యజ్ఞమును చేసే వారు జ్ఞానయోగులు. జ్ఞానయజ్ఞము ద్వారా జీవరూపమును బ్రహ్మము నందు ఆహుతి చేస్తారు అని అర్థము. జీవబ్రహ్మల యొక్క అభేద దర్శనమే జ్ఞానయజ్ఞము ద్వారా సిద్ధిస్తూ ఉంది. ఇది జ్ఞానయజ్ఞ ప్రసాదము. యజ్ఞఫలము.

జీవబ్రహ్మల మధ్య ఏ భేదము లేకపోయినా, మహాకాశము నందు ఘటాకాశము వలె ఉపాధి భేదము చేత జీవుడు, బ్రహ్మము అని పలకడం జరుగుతూ ఉంది. ఉపాధి భేదము అంతరించ గానే ఘటాకాశము మహాకాశము గానే తెలుస్తూ ఉంది. ఘటాకాశమునకు, మహాకాశమునకు అభేదమును దర్శించాలి అంటే, ఘటాకాశమును మహాకాశము నందు ఉపాధి రహితంగా దర్శించడం జరగాలి. అదే విధంగా జ్ఞాతృ - జ్ఞేయ - జ్ఞాన భేదమును అఖండాత్మ జ్ఞానములో విలీనం చేయడమే ఇక్కడ జ్ఞానయజ్ఞ విధి. అదే బ్రహ్మజ్ఞానము.

అగ్నిలో పడిన వస్తువు అగ్ని రూపాన్నే పొంది శోభించునట్లు, బ్రహ్మాగ్ని యందు ఆహుతి చేయబడిన జీవత్వము బ్రహ్మత్వమునే పొందుతూ ఉంది. ఇదే మోక్షానికి ఏకైక సాధనమైన జ్ఞానమార్గము. కనుకనే, జ్ఞానయజ్ఞము దైవాది యజ్ఞముల కంటే సర్వోత్కృష్టము అని చెప్పబడింది. కాని అట్టి జ్ఞానయజ్ఞమునకు

అర్హతను పొందుటకు కావలసిన అంతఃకరణ శుద్ధిని తయారు చేసుకొనుటకు దైవాది యజ్ఞములు చెప్పబడుతున్నాయి.

*అంతఃకరణ శుద్ధిని, అంతఃకరణ నైశ్చల్యమును పొందుటకు, ఇక్కడ నుండి కొన్ని యజ్ఞములను భగవానుడు చెబుతున్నాడు. ఇప్పుడు చెప్పబోయే యజ్ఞము లన్నీ సాధన రూపమైనవే గాని, కర్మకాండకు సంబంధించినవి కావు. ముందుగా సంయమ యజ్ఞాన్ని గురించి చెబుతున్నాడు.*

**శ్రోత్రాదీ నీన్ద్రియా ణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి ।**
**శబ్దాదీ న్విషయా నన్య ఇన్ద్రియాగ్నిషు జుహ్వతి ॥** 26

***శ్రోత్రాదీని-ఇంద్రియాణి-అన్యే-సంయమాగ్నిషు-జుహ్వతి***
***శబ్దాదీన్-విషయాన్-అన్యే-ఇంద్రియాగ్నిషు-జుహ్వతి***

| | | | |
|---|---|---|---|
| అన్యే | = కొందరు | అన్యే | = మరి కొందరు |
| శ్రోత్రాదీని | = శ్రోత్రము మొదలైన | శబ్దాదీన్ | = శబ్దము మొదలైన |
| ఇంద్రియాణి | = ఇంద్రియములను | విషయాన్ | = విషయములను |
| సంయమాగ్నిషు | = సంయమ మనెడి అగ్ని యందు | ఇంద్రియాగ్నిషు | = ఇంద్రియము లనెడి అగ్ని యందు |
| జుహ్వతి | = హోమము చేస్తున్నారు | జుహ్వతి | = హోమము చేస్తున్నారు |

**కొందరు చెవి మొదలైన ఇంద్రియాలను నిగ్రహ మనే అగ్ని యందు హోమం చేస్తున్నారు. మరి కొందరు శబ్దాదులనే హవిస్సును ఇంద్రియాలనే అగ్నిలో హోమం చేస్తున్నారు.**

**వ్యాఖ్య**

మోక్ష సాధనము లైన సమస్త వైదిక కర్మలను యజ్ఞములుగా తెలుపుతూ, వాటిని ముఖ్యము, గౌణము అవి రెండు రకాల యజ్ఞాలుగా విభజించి జ్ఞాన ప్రధాన మైన బ్రహ్మ యజ్ఞమును ముఖ్యసాధన గాను, చిత్తశుద్ధిని కలిగించి బ్రహ్మజ్ఞానమునకు సిద్ధపరచే అన్య యజ్ఞములను గౌణము గాను బోధించడం జరిగింది. మోక్ష సాధనంగా జ్ఞానయజ్ఞము ముఖ్యంగా భాసిస్తూ ఉంటే, జ్ఞానసాధనాలుగా దైవాది యజ్ఞములు గౌణంగా తెలుస్తున్నాయి. సాధకులు వారి వారి అర్హతలను, అధికారమును అనుసరించి అంతఃకరణ శుద్ధి నిమిత్తం ఆచరించ వలసిన దైవాది యజ్ఞములను వివరిస్తున్నాడు. అందు మొదటిది సంయమ యజ్ఞము.

**సంయమ యజ్ఞము**

దేని యందు హోమము చేయ బడుతుందో అది యజ్ఞము అనిపించు కుంటుంది. ఇది సంయమ యజ్ఞము. సంయమము అంటే నిగ్రహము అని అర్థము. సంయమ యజ్ఞములో నిగ్రహము అనే అగ్నుల యందు ఇంద్రియాలను ఆహుతులుగా సమర్పిస్తూ హోమం చేయడం జరుగుతూ ఉంది.

ఇక్కడ ఆహుతులుగా ఇంద్రియాలను చెప్పి నప్పుడు, శ్రోత్రాది జ్ఞానేంద్రియములు, వాగాది కర్మేంద్రియములు అని కూడా అర్థము. ఇంద్రియాలను సంయమాగ్నుల యందు సమర్పించడము అంటే, చెవి మొదలైన జ్ఞానేంద్రియాలను శబ్దాది విషయాల నుండి వెనుకకు మరలించి వాటి వాటి స్థానముల యందు నిగ్రహించడము అని అర్థము. ఇదే ఇంద్రియనిగ్రహము. దీనినే ప్రత్యాహారము అని కూడా అంటారు. ధ్యానానికి కావలసిన ధారణ ఈ ప్రత్యాహారము వల్లనే ప్రాప్తిస్తుంది. కనుక, జ్ఞానయోగానికి సాధన రూపమైన ఇంద్రియ నిగ్రహము కూడా యజ్ఞముగా చెప్పబడింది. ఇక్కడ శ్రోత్రాది ఇంద్రియాలను సంయమము అనే అగ్నుల యందు హోమం చేయడం జరుగుతుంది.





మరి, సంయమము అంటే నిగ్రహము అని అర్థం చేసుకున్నాం. సంయమము ఏకమై ఉండగా, అగ్నులు అని బహువచనం ఎందుకు వాడినట్లు? సంయమాగ్ని అనకుండా సంయమాగ్నులు అని ఎందుకు చెప్పారు? అనే శంక కలుగుతుంది. ఇంద్రియాలు అనేకంగా ఉండటం చేత, ఒక్కొక్క ఇంద్రియాన్ని ఒక్కొక్క విధంగా నిగ్రహించడము జరుగుతూ ఉండటం చేత సంయమాగ్ని అని ఏకవచన ప్రయోగం చేయకుండా, సంయమాగ్నులు అని బహువచన ప్రయోగం చేయడం జరిగింది ***(ప్రతీంద్రియం సంయమః భిద్యతే ఇతి బహువచనమ్).***

మోక్ష సాధనమైన జ్ఞానమును పొందడానికి మనస్సు నిగ్రహింపబడి ఉండాలి. మనో నిగ్రహమునే శమము అంటారు. ఇంద్రియాలను నిగ్రహించకుండా మనస్సును నిగ్రహించడం సాధ్యపడదు. ఇంద్రియ నిగ్రహమును దమము అంటారు. అందుచేత, ముందుగా ఇంద్రియాలను వశ పరచుకోవాలి అని భగవంతుడు కర్మయోగంలో చెప్పే ఉన్నాడు ***(తస్మాత్త్వ మిన్ద్రియాణ్యాదౌ నియమ్య - 3 - 41).*** ఇదే సంయమ యజ్ఞము. ఇంద్రియాలను నిగ్రహము అనే అగ్ని యందు హోమం చేయడము.

ఇంద్రియాలను నిగ్రహించడము అంటే ఇంద్రియ వ్యాపారాలను అరికట్టడము అని అర్థము. ఇదొక నిరోధావస్థ. ఇలాంటి నిరోధమును అభ్యసించే వారు సంయమశీలురు. సంయమ యజ్ఞమును అనుష్ఠించేవారు.

**విషయ త్యాగము**

ఇంద్రియాలను ఆహుతులుగా గ్రహించి నిగ్రహమనే అగ్ని యందు హోమం చేయడం సంయమ యజ్ఞమైతే, ఇంద్రియ విషయాలను హవిస్సులుగా గ్రహించి ఇంద్రియాలనే అగ్నుల యందు హోమం చేయడం విషయత్యాగ యజ్ఞము. ఇది మరొక యజ్ఞము. ఇది కూడా మోక్షసాధనకు ఉపకరించేదే కనుక యజ్ఞం అనబడుతోంది. కాకపోతే, ఇది సాధన క్రిందకి వస్తుందా? అనేది సంశయం.

ఇంద్రియ విషయాలు అంటే శబ్దాదులు. ఇంద్రియాలు అంటే శ్రోత్రాదులు. శబ్దాదులను శ్రోత్రాదులలో పడవేయటం అనేది అనుక్షణం జరిగే జీవన ప్రక్రియ కదా! ఇందులో ప్రయత్నంతో సాగించే సాధన ఏముంది?

చెవి దేహంలో ఉంది. శబ్దం బయట ఉంది. బాహ్యం లోని శబ్దాలు అప్రయత్నంగా చెవిలో పడిపోతాయి కదా! మనకు ఎదురుగా ఒక కొండ ఉంది. మన వద్ద కళ్ళున్నాయి. మనం చూడగానే కొండ రూపం కంటిలో పడుతుంది కదా! అలాగే వాసనలు, రుచులు, స్పర్శలు కూడా. సహజంగా, అప్రయత్నంగా శబ్దాదులు శ్రోత్రాది ఇంద్రియాలలో వచ్చి పడేటప్పుడు, వీటి విషయంలో మనం చేసే సాధన ఏముంది? సాధన కానపుడు దీనిని యజ్ఞం అని ఎలా పిలుస్తారు?

విషయాలు ఇంద్రియాలను చేరినంత మాత్రాన మనకు భోగాసక్తి ఏర్పడదు. ఇంద్రియాలను చేరిన విషయాలు అక్కడ నుండి మనస్సును కదిలించాలి. మనస్సు ఇంద్రియాలతో మిళితమై నపుడే భోగానుభవం కలుగుతుంది.

ఇంద్రియ విషయాలు సహజం గానే ఇంద్రియాలలో పడతాయి. అలా పడిన విషయాలను మనస్సు వైపుకు పోనివ్వకుండా ఇంద్రియాల లోనే ఆపడం లేదా హోమం చేయడం విషయత్యాగ యజ్ఞము అనిపించు కుంటుంది. ఇదే ఇక్కడ త్యాగ యజ్ఞాన్ని అర్థం చేసుకోవడంలో ప్రధానమైన విషయము.

బాగుంది. కాని, సంయమ యజ్ఞములో ఇంద్రియాలను హవిస్సులుగా సమర్పించి నపుడు, విషయాలను కూడా సమర్పించినట్లే అయింది కదా? అలాంటప్పుడు, సంయమ యజ్ఞము కన్నా వేరుగా విషయత్యాగ యజ్ఞం ప్రత్యేకంగా ఎక్కడుంది?

ఇది సూక్ష్మమైన విషయము. విషయ విభజనము జాగ్రత్తగా జరగాలి. ఇంద్రియాలను సంయమాగ్నిలో హోమం చేసి నపుడు ఇంద్రియ విషయాలను కూడా సమర్పించడమే జరిగింది. కాకపోతే, విషయాలను సంయమాగ్నిలో సంపూర్ణంగా సమర్పిస్తాం. కాని, ఏ విషయాలను సమర్పించాలి, ఏ విషయాలను సమర్పించ కూడదు అనే వివేకాన్ని ఉపయోగించి, విరుద్ధ మైన విషయాలను నిరాకరించి, అవిరుద్ధ మైన విషయాలను గ్రహించడమే విషయత్యాగ యజ్ఞంలో హోమం అనబడుతుంది ***(ఇంద్రియాదిభిః అవిరుద్ధ విషయ గ్రహణం హోమం మన్యన్తే! - శ్రీ శంకర భాష్యము).*** విషయం స్పష్ట మైందని భావిస్తాను. సంయమ యజ్ఞ నిర్వహణకు అధికారులు కానివారు విషయత్యాగ యజ్ఞాన్ని ఆచరిస్తారు అని ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు.

**యుక్తా యుక్తములు**

విషయాలు హవిస్సులై ఇంద్రియాలు అనే అగ్నులలో పడతాయి. వాటిని ఎంతవరకు అనుభవించాలి? పరిగ్రహించ వలసినవి ఏవి? పరిహరించ వలసినవి ఏవి? అనే విచక్షణ విషయత్యాగ యజ్ఞంలో ప్రధాన పాత్ర వహిస్తుంది.

అంతేకాదు. విషయాలను భోగించే సమయాలలో కూడా ఆసక్తి లేకుండా భోగించడం జరుగుతుంది కనుక, శబ్దాది విషయాలను ఇంద్రియాగ్నుల యందు సాధకులు ప్రవిలాపనం చేస్తున్నారు.

అందమైన వస్తువును కన్ను చూస్తుంది. చూసింది కావాలని మనస్సుకు అనిపిస్తుంది. ఇక్కడ ఆసక్తి ప్రధానంగా ఉంది. కాని, సాధకుడైన ముముక్షువుకు అంతఃకరణ శుద్ధియే ప్రధానం కనుక భోగాసక్తి ఉండదు. అందంగా ఉన్నంత మాత్రాన దానిని అందుకోవాలనే అభిలాష ఉండదు. ఆసక్తుల స్థానంలో అవసరాలు అందల మెక్కుతాయి.

ఆహారం రుచికరంగా ఉండొచ్చు. కాని విషయత్యాగ యజ్ఞాన్ని అనుష్ఠించే సాధకుడు ఎంత ఆహారం అవసరమో అంతే గ్రహిస్తాడు. ఇలా ఇంద్రియాల ప్రకోపాన్ని అరికట్టడం జరుగుతుంది.

సంయమ యజ్ఞము శమ మయితే, విషయత్యాగ యజ్ఞాన్ని దమం అని చెప్పుకోవచ్చు. సంయమ యజ్ఞము సాధ్యము కావపుడు, విషయత్యాగ యజ్ఞము ద్వారా సంయమశీలురు కావచ్చు. యుక్తాయుక్తములను వివేచనం చేస్తూ, విషయాలను అవిరుద్ధంగా అనుభవించడము కూడా యజ్ఞమే అవుతుంది. ఇక్కడ అనుభవ విషయాలు ఆహుతు లౌతూ ఉండగా, ఇంద్రియాలు అగ్నులుగా ప్రజ్వలిస్తున్నాయి.

*ఇప్పుడు ఆత్మసంయమము అనే యజ్ఞాన్ని వివరిస్తున్నాడు.*

**సర్వా ణీంద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే ।**
**ఆత్మసంయమ యోగాగ్నౌ జుహ్వతి జ్ఞాన దీపితే ॥** 27

***సర్వాణి-ఇంద్రియకర్మాణి-ప్రాణకర్మాణి-చ-అపరే***
***ఆత్మ సంయమ యోగాగ్నౌ-జుహ్వతి-జ్ఞానదీపితే***

| | | | |
|---|---|---|---|
| అపరే | = మరి కొందరు | జ్ఞానదీపితే | =జ్ఞానము చేత వెలిగింప బడిన |
| సర్వాణి | = సమస్తములైన | ఆత్మ సంయమ యోగాగ్నౌ | =ఆత్మసంయమయోగ మనెడి అగ్ని యందు |
| ఇంద్రియకర్మాణి | = ఇంద్రియ చేష్టలను | | |
| ప్రాణకర్మాణి చ | = ప్రాణచేష్టలను | జుహ్వతి | =హోమము చేస్తున్నారు |





**మరి కొందరు సమస్తము లైన ఇంద్రియ వ్యాపారాలను, ప్రాణ చేష్టల నన్నిటినీ జ్ఞాన దీప్తమైన మనోనిగ్రహ మనే యోగాగ్ని యందు హోమము చేస్తున్నారు.**

**వ్యాఖ్య**

**ఆత్మసంయమ యజ్ఞము**

మనస్సును నిలపడమే ప్రధానమైన ఈ ఆత్మసంయమ యోగము ధ్యానరూప మైనది. ఈ యోగమును అనుష్ఠించే వారు ధ్యానయోగులు. ధ్యాననిష్ఠాపరులు. వీరు సమస్తము లైన ఇంద్రియ కర్మలను ***(ఇంద్రియ కర్మాణి),*** అలాగే ప్రాణకర్మలను ***(ప్రాణ కర్మాణి),*** జ్ఞానము చేత దీప్తిమంత మైన ***(జ్ఞానదీపితే)*** ఆత్మసంయమ యోగాగ్నిలో ***(ఆత్మసంయమ యోగాగ్నౌ)*** హోమం చేస్తున్నారు ***(జుహ్వతి).***

ఇది యోగాగ్ని. ధ్యాన యోగాగ్ని. ఆత్మసంయమము అంటే మనస్సును ఆత్మ యందు నిలపడము అని అర్థము. అదే యోగాగ్ని ***(స ఏవ యోగాగ్నిః).*** ఈ విధమైన ఆత్మసంయమ యోగాగ్ని యందు సర్వేంద్రియ వ్యాపారాలను, సర్వ ప్రాణ క్రియలను హోమం చేస్తున్నారు. అంటే, ఈ విధమైన ధ్యానయోగంలో ఇంద్రియ నిరోధము, ప్రాణ నిరోధము ప్రధానంగా తెలుస్తున్నాయి.

ఇంద్రియ నిరోధములో బాహ్యేంద్రియ నిగ్రహము, అంతరేంద్రియ నిగ్రహము రెండూ జరుగు తున్నాయి. బాహ్యేంద్రియములు అంటే ఐదు జ్ఞానేంద్రియములు, అయిదు కర్మేంద్రియములు కలిసి దశేంద్రియములు. అంతరేంద్రియములు అంటే అంతఃకరణమునకు సంబంధించిన మనోబుద్ధులు. ఈ ద్వాదశేంద్రియ కర్మలను ధ్యానములో నిలపడమే హోమం చేయడము. అంటే, బాహ్యంలో చరించకుండా అంతర్ముఖం చేయడము అని అర్థము.

శ్రోత్రాది ఇంద్రియాలు జ్ఞానేంద్రియాలు. అంటే చెవి, ముక్కు, కళ్ళు, నాలుక, చర్మము అనేవి శ్రోత్రాది జ్ఞానేంద్రియాలు. అలాగే వినడము, వాసన చూడటము, దర్శించడము, రుచి చూడటము, స్పృశించడము అనేవి జ్ఞానేంద్రియ కార్యాలు.

అలాగే వాగాది కర్మేంద్రియాలు. అంటే, వాక్కు, హస్తము, పాదము, గుహ్యేంద్రియము, గుదేంద్రియము అనేవి వాగాది కర్మేంద్రియాలు. అలాగే, మాట్లాడటము, వస్తుగ్రహణము, గమనము, విషయానందము, విసర్జనము అనేవి కర్మేంద్రియ కార్యాలు.

ఐదు జ్ఞానేంద్రియాలు, వాటి కర్మలు, ఐదు కర్మేంద్రియాలు, వాటి కార్యాలు వెరశి దశేంద్రియ కార్యాలు ***(దశేంద్రియ కర్మాణి).*** ఇక మనస్సు, బుద్ధి అనేవి అంతరేంద్రియాలు. అవి సాగించే ఆలోచన నిర్ణయాది కార్యాలు అంతరేంద్రియ కార్యాలు. ఈ మొత్తము, బాహ్యేంద్రియ అంతరేంద్రియ సర్వ కర్మలను ***(సర్వాణి ద్వాదశేంద్రియ కర్మాణి)*** ఆత్మ యందు నియమించడము ధ్యానంలో జరుగుతూ ఉంది.

అంతే కాదు. ఇంద్రియ నిగ్రహముతో పాటు ప్రాణ నిరోధము కూడా జరుగుతుంది. ప్రాణ మనస్సులు పరస్ప రాధీనాలై ఉంటాయి. అలాగే, పరస్పర నిరోధాలు గానూ తెలుస్తాయి. మనస్సును నియమిస్తే ప్రాణ నిరోధనం జరుగుతుంది. అలాగే ప్రాణ నిరోధంలో మనస్సు నియమింప బడుతుంది. కనుక ద్వాదశేంద్రియా లను, వాటి కర్మలతో సహ ప్రాణ కర్మలను కూడా అంతర్ముఖం చేయడం ధ్యానంలో జరుగుతుంది ***(ప్రాణ కర్మాణి).*** ప్రాణ, అపాన, వ్యాన, సమాన, ఉదాన వాయువులే శరీరం లోని ప్రాణ వాయువులు. అలాగే పాణి పాదాలను ముడవడం, చాచడం మొదలుకొని సర్వ ప్రాణక్రియలను కూడా ధ్యాన సమయంలో నియమించడం జరుగుతుంది.

ఈ విధంగా సర్వేంద్రియాలు - వాటి కార్యాలను, సర్వ ప్రాణాలు - వాటి కర్మలను కలిపి ఆత్మ సంయమము అనే యోగాగ్నిలో ధ్యానయోగులు హోమం చేస్తున్నారు. ఇక్కడ ధ్యానమే అగ్ని. సర్వేంద్రియ ప్రాణ మనోబుద్ధులు హవిస్సులు. వీటిని వివేకంతో లేదా జ్ఞానంతో హోమము చేయడమే ఆత్మసంయమ యజ్ఞము.

ఇక్కడ వివేక ముంది. ఆత్మానాత్మ వివేక జ్ఞానము ఉంది. వివేకము ఉంది అంటే వివేక జనిత జ్ఞానము కూడా ఉంది అని అర్థము. ఇదే జ్ఞాన ప్రజ్వలనము ***(జ్ఞానదీపితే).*** వివేక వైరాగ్యా లున్నాయే గాని, శమదమాదులు లేవు. వాటిని కూడా పొందాలి. ఆ ప్రయత్నంలో ముముక్షువులు అంతర్ముఖులై ధ్యానమును కొనసాగిస్తున్నారు. ఆత్మసంయమ యజ్ఞమును నిర్వహిస్తున్నారు.

అగ్నిలో ఆహుతులను సమర్పించడము జరిగిన తరువాత, విసనకఱ్ఱతో జ్వలింప చేస్తే అగ్ని దివ్యంగా ప్రజ్వలిస్తుంది. అలాగే ఇంద్రియ ప్రాణ వ్యాపారాలను ఆత్మసంయమ యోగాగ్నిలో అర్పించిన తరువాత, వివేకము అనే విసనకఱ్ఱ నుపయోగించి జ్వలింప చేస్తే ధ్యానయోగాగ్ని మహోజ్జ్వలంగా ప్రకాశిస్తుంది.

*మరి కొన్ని యజ్ఞాలను కూడా భగవానుడు తెలయ జేస్తున్నాడు.*

**ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞా స్తథాஉపరే ।**
**స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాశ్చ యతయః సంశితవ్రతాః ॥** 28

***ద్రవ్యయజ్ఞాః-తపోయజ్ఞాః-యోగయజ్ఞాః-తథా-అపరే***
***స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాః-చ-యతయః-సంశితవ్రతాః***

| | | | |
|---|---|---|---|
| అపరే | = మరి కొందరు | స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాః చ | = స్వాధ్యాయ జ్ఞాన యజ్ఞములు గల వారు |
| ద్రవ్యయజ్ఞాః | = ద్రవ్యయజ్ఞము గల వారు | యతయః | = ప్రయత్నము చేయువారు |
| తపోయజ్ఞాః | = తపస్సనెడి యజ్ఞము గల వారు | సంశితవ్రతాః | = దృఢవ్రతము గలవారు అవుతున్నారు |
| యోగయజ్ఞాః | = యోగ మనెడి యజ్ఞము గల వారు | | |
| తథా | = అలాగే | | |

**కొందరు ద్రవ్య యజ్ఞాన్ని, కొందరు తపో యజ్ఞాన్ని, కొందరు యోగ యజ్ఞాన్ని, కొందరు స్వాధ్యాయ యజ్ఞాన్ని, కొందరు జ్ఞాన యజ్ఞాన్ని ఆచరిస్తూ ఉన్నారు. వీరందరు దృఢ దీక్ష గలవారు. ప్రయత్న శీలురు.**

**వ్యాఖ్య**

యజ్ఞమును యోగసాధనగా, యోగాభ్యాసముగా అర్థం చేసుకోవడం ముఖ్యంగా ఈ నాల్గవ అధ్యాయము లోని యజ్ఞ ప్రకరణంలో వినూత్నంగా చెప్పబడుతూ ఉంది. ఇప్పటి వరకు ఐదు యజ్ఞాలను చూశాం. ప్రస్తుత శ్లోకంలో మరి కొన్ని యజ్ఞాలను తెలుసుకోబోతున్నాం.

**ద్రవ్య యజ్ఞము**

మనకు ఉన్నవి, మనవిగా మన వద్ద ఉన్న వాటిని మనం అనుభవించడమే కాకుండా, పరులతో పంచుకోవడం సత్కార్య మవుతుంది. కాని, ఏవి మనకున్నా, వాటిని భగవత్ప్రసాదాలుగా భావించి, ఈశ్వర భావనతో ఇతరులకు వితరణ చేస్తే అది యజ్ఞ మవుతుంది. ద్రవ్యమునకు సంబంధించిన దానాదికాలను సర్వేశ్వర భావనతో సమర్పించుకుంటే అది యజ్ఞం అవుతుంది ***(ద్రవ్య వినియోగం యజ్ఞ బుద్ధ్యా కుర్వన్తి యే తే ద్రవ్యయజ్ఞాః).*** ద్రవ్యానికి సంబంధించిన విషయం కావటం చేత ఇది ద్రవ్య యజ్ఞము. యజ్ఞ భావన ఉండటం చేత ద్రవ్య వినియోగము అనే ఈ సత్కార్యము ద్రవ్యయజ్ఞ మైంది.





ద్రవ్య వినియోగము ఎప్పుడైతే యజ్ఞముగా భావించ బడిందో, దేశకాలాదులను కూడా మన పెద్దలు పరిగణన లోకి తీసుకున్నారు. యజ్ఞమును ఎలాగైతే ఒక పవిత్ర ప్రదేశంలో, పవిత్ర కాలంలో నిర్వహిస్తామో, అలాగే ఈ ద్రవ్యాది యజ్ఞాలను కూడా పవిత్ర నదీ తీరాలలో, పుణ్య ప్రదేశాలలో, ఆలయ ప్రదేశాలలో ***(తీర్థేషు)*** నిర్వహిస్తారు. అలాగే పవిత్రమైన పుష్కర, ఉత్తరాయణ, ఏకాదశి, సంక్రాంతి మొదలైన పుణ్య కాలాలలో నిర్వహిస్తారు. సువర్ణానికి సుగంధం అబ్బినట్లు, యజ్ఞభావనతో నిర్వహించే దానాదికాలు పవిత్ర దేశకాలాదులలో నిర్వహించడం వల్ల పూర్ణశోభను సంతరించు కుంటాయి. ఈ విధమైన అవగాహన మరో సంస్కృతిలో గోచరించదు. ఇలాంటి పవిత్రతను కలిగి ఉండటం చేతనే భారతీయ సంస్కృతిలో దానక్రియ దివ్యంగా శోభించింది. ద్రవ్య యజ్ఞానికి దారులు తెరిచిన గ్రహీత ఈశ్వరుడుగా శోభించాడు. ఈ కారణం చేతనే దానాన్ని సమర్పించిన తరువాత గ్రహించిన వ్యక్తికి దాత నమస్కరిస్తాడు. అంటే, గ్రహీత మన సంస్కృతిలో ఈశ్వరుడే గాని బిచ్చగాడు కాడు. ఈ సత్యాన్ని మనకు వంట బట్టించడానికి కాబోలు సర్వైశ్వర్య సంపన్నుడైన ఈశ్వరుడు కూడా బిచ్చగాని రూపంలో గోచరిస్తాడు. ఆదిభిక్షువుగా దర్శన మిస్తాడు.

ద్రవ్యము అంటే కేవలం ధనమే కాదు. ద్రవ్య పరిణామంగా ఉపకరించే వన్నీ ద్రవ్యాలే. వాటిని సమర్పించడం కూడా ద్రవ్యయజ్ఞమే అవుతుంది. భూదానం, హిరణ్యదానం, గోదానం, వస్త్రదానం ఇత్యాదు లన్నీ ద్రవ్య యజ్ఞాలే.

ద్రవ్యం విషయంలో వినియోగము అనేది ప్రధాన మైంది. ధనం గలవాడు ధనికుడు ***(ధనవాన్)*** అని అందరూ భావిస్తారు. ధనం కలవాడు ధనికుడు కాడు. ధనాన్ని దానం చేయ గలిగే వాడే ధనికుడు అన్నారు మన పెద్దలు. అంతేకాదు, ధనవంతుడుగా ఉన్న లోభిని చూచి, తన వద్ద ఉన్న ధనం తనది కాదు కనుకనే దానం చేయలేక పోతున్నాడు. తనది కాని ధనాన్ని తన వద్ద ఉంచు కున్నంత మాత్రాన అతనిని ధనికుడు అని ఎలా పిలుస్తారు? అని కూడా సూటిగా ప్రశ్నించారు.

ద్రవ్యం ఉండి వితరణ జరగ నపుడు అది వికారాన్ని పొందుతుంది. ద్రవ్యము మూడు రకాలుగా మార్పు చెంది తీరాలి. ***(1) వినియోగము:-*** ద్రవ్యం తన కన్నా ఉపయోగపడాలి. అంటే ధనవంతుడు తన కున్న ధనాన్ని తానైనా అనుభవించాలి. ఇది వినియోగము. ***(2) వితరణము:-*** అలా తాను వినియోగించుకో లేనపుడు పరులకు వినియోగపడే లాగ వితరణ చేయాలి. ఇదే ద్రవ్య వితరణము లేదా దానము. ***(3) వినాశము:-*** అటు తాను అనుభవించక, ఇటు పరులకు వితరణ చేయక, కేవలం దాచుకోవడమే చేస్తే, అట్టి ద్రవ్యం ఒక దశలో నశించి పోతుంది. అదే వినాశము. ఒక్క ధనమే కాదు, నిరుపయోగమైంది ఏదైనా నశించి పోయేదే. ఈ సత్యం అర్థమైతే, ద్రవ్యయజ్ఞం దివ్యంగా ఆవిష్కరింప బడుతుంది.

**తపో యజ్ఞము**

ద్రవ్యయజ్ఞము చేసే వారు ద్రవ్యయజ్ఞు లని ఎలా అర్థం చేసుకున్నామో, అలాగే తపస్సును యజ్ఞముగా చేసేవారు తపోయజ్ఞులు అవుతారు ***(యే తపస్వినః తే తపో యజ్ఞాః).***

తపింప చేసే దానిని తపస్సు అంటారు ***(తపతీతి తపః).*** అంటే, తపస్సు చేసేవారు తపింప బడుతారు. లేదా పీడింప బడుతారు అని అర్థము. మరి, అలాంటప్పుడు సంతాపాన్ని కలిగించే ***(తప సంతాపే)*** తపస్సును ఎవరు ఆచరిస్తారు? అనే సందేహం రావచ్చు. తపస్సు విలువ తెలిసిన వారే ఆచరిస్తారు. అగ్నిలో కాలిన స్వర్ణమే దివ్యంగా శోభిస్తుంది అనే సత్యాన్ని వంట పట్టించుకున్న వాళ్ళే ఆచరిస్తారు. అగ్నిలో కాలిన బంగారం శుద్ధిపడి

వన్నె తీరినట్లు, తపస్సులో శుద్ధిపడిన సాధకుడు అంతఃకరణ శుద్ధిని పొంది జ్ఞానార్హుడై శోభిస్తాడు. ఈ విధమైన తపస్సు మనోవాక్కాయాలలో గోచరిస్తుంది.

వైకుంఠ ఏకాదశి నాడు, శివరాత్రి నాడు మనం ఉపవాసం చేస్తాము. అదేమిటి? తపస్సే. ఉపవాసం చేయడమే తపస్సు అయితే, దేశంలో ఎంతో మంది దారిద్ర్య రేఖకు దిగువ ఉన్నవారు కడుపు నిండా తినే భాగ్యానికి నోచుకోక, ఒక పూట, రెండు పూటలు ఒకొక్కసారి మూడు పూటలు ఆహారం లభించక పస్తులు పడి ఉంటారు. అలా నిరాహారంగా తపించే వారందరు తపశ్శాలు రౌతారా?

తపస్సు అనేది ధర్మార్థం నిర్వహించే పవిత్ర కార్యము. ఈశ్వర భావనతో, పరమేశ్వరుని కొరకు ఆచరించేది తపస్సు. తపస్సు వల్ల పుణ్యం సిద్ధిస్తుంది. పాపం నశిస్తుంది. అందుచేత, తపస్సు అనేది సంతాపంగా కనిపించినా, అందులో సమర్పణ భావం ఉండటం చేత అది సంతర్పణంగా మారుతూ ఉంది.

కాయాన్ని నియమించడం కాయక తపస్సు. వాక్కును నియమించడం వాచక తపస్సు. మనస్సును నిగ్రహించడం మానస తపస్సు. దేహేంద్రియ మనోబుద్ధులు తపస్సు ద్వారా శుద్ధి పడతాయి. అందుచేత తపస్సు యజ్ఞమైంది. తపస్సును ఆచరించే వారు తపోయజ్ఞు లయ్యారు.

**యోగ యజ్ఞము**

యోగాభ్యాసము కూడా యజ్ఞమే అంటున్నాడు భగవంతుడు. ప్రాణాయామ ప్రత్యాహారాది లక్షణమైన యోగమును యజ్ఞంగా భావించడం జరుగుతూ ఉంది. యోగాభ్యాసం వల్ల, దేహేంద్రియ ప్రాణాలలో ఏ ప్రగతిని మనం సాధిస్తున్నామో అది పురుషార్థ సాధనం కావడం చేత ఇక్కడ యోగాన్ని యజ్ఞంగా పరిగణించడం జరుగుతూ ఉంది. కేవలం శారీరక వ్యాయామమే అయితే, అది ఆరోగ్య ప్రదాయిని అవుతుందే గాని, మోక్షదాయిని కాలేదు. కనుక, ఈశ్వరార్థం అభ్యాసాన్ని కొనసాగించి నపుడే యోగం యజ్ఞంగా మారుతుంది. అందుచేతనే పతంజలి మహర్షి తన యోగ సూత్రాలలో ప్రారంభం లోనే ***ఈశ్వర ప్రణిధానాద్వా*** అంటూ ఈశ్వర భక్తిని ప్రవేశపెట్టారు.

**స్వాధ్యాయ యజ్ఞము**

స్వాధ్యాయ యజ్ఞము అంటే వేదాధ్యయనము. శాస్త్రపఠనము కూడా స్వాధ్యాయమే. స్వాధ్యాయంలో జరిగేది వట్టి గ్రంథ పఠనం కాదు. కేవలం గ్రంథాలను చదివి అర్థం చేసుకోవడం కాదు. శ్రుతి స్మృతి పురాణాలలో ఉన్నదంతా ఈశ్వర జ్ఞానమే. ఈశ్వర జ్ఞానం కలిగితే, జీవు డేమిటో తెలిసి వస్తుంది. జీవుడే ఈశ్వరుడు అని స్పష్ట మవుతుంది. కనుక, స్వాధ్యాయంలో కేవలం గ్రంథాలను చదువుకోవడం జరుగుతుంది అని అందరూ అభిప్రాయ పడతారు. అంతేగాని, తమను తాము చదువుకోవడం ***(స్వ అధ్యాయం)*** అని గ్రహించరు. అలా గ్రహించి నపుడు స్వాధ్యాయం కూడా ఈశ్వరార్థం సాగుతూ ఉంది కనుక, యజ్ఞమే అవుతుంది. అదే స్వాధ్యాయ యజ్ఞము. దానిని ఆచరించే వారు స్వాధ్యాయ యజ్ఞులు ***(యథావిధి శాస్త్రాభ్యాసః యజ్ఞః యేషాం తే స్వాధ్యాయ యజ్ఞాః).*** సాంప్రదాయకంగా సంప్రాప్తమైన వేద, స్మృతి, పురాణాది శాస్త్రాలను అభ్యసించడమే స్వాధ్యాయ మవుతుంది. అంతేగాని, దారి తప్పిన ఆధునిక తత్త్వజ్ఞులు రచించిన గ్రంథాలను అధ్యయనం చేయడం స్వాధ్యాయం కాదు. స్వాధ్యాయమే కానపుడు యజ్ఞమయ్యే అవకాశమే లేదు.

**జ్ఞాన యజ్ఞము**

తనను తాను తెలుసుకొనే అవకాశాన్ని కలిగించేది స్వాధ్యాయ యజ్ఞమైతే, తనను తాను అర్థం





చేసుకోవడానికి సహకరించేది జ్ఞానయజ్ఞము. ఇది స్వాత్మానుభూతికి సహకరిస్తుంది. శ్రవణ మనన నిదిధ్యాసలే ఇందులో ప్రధానాంగములై శోభిస్తూ ఉంటాయి. సిద్ధిని పొందడానికి ఉపకరించే ఏకైక సాధనము జ్ఞానమై ఉన్నందున, జ్ఞానసాధన యజ్ఞమై అలరారుతోంది. శాస్త్ర విషయాన్ని గురుముఖతః అధ్యయనం చేయడమే జ్ఞానసాధన. ఇదే మోక్ష సాధన భూతం కనుక జ్ఞానము యజ్ఞరూపంగా భావించ బడింది. అదే జ్ఞానయోగము.

స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాలను ఇపుడు మనం అర్థం చేసుకున్నట్లు వేరువేరుగా గ్రహిస్తే, ఈ శ్లోకంలో ఐదు యజ్ఞాలు చెప్పబడినట్లు తెలుస్తూ ఉంది. అలా గాక స్వాధ్యాయ జ్ఞాన యజ్ఞాలను కలిపి ఒకే యజ్ఞంగా కొందరు భావిస్తారు. అలా కూడా భావించవచ్చు. దోషం లేదు. స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాలలో జ్ఞానమే ప్రధాన భూమికను పోషించడం వల్ల అలా ఆలోచిస్తారు. అలా భావించి నపుడు ఈ శ్లోకంలో నాలుగు యజ్ఞాలు చెప్పినట్లు అవుతుంది.

స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాలు యతులు నిర్వహిస్తారు ***(యతయః).*** యతులు అంటే, నిరంతరము స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాల లోనే రమించే యత్నములో ఉండే వారు అని అర్థము ***(యతనశీలాః).***

యతనశీలురైన యతి పురుషులు కూడా తీవ్రమైన పట్టుదల కల వారై ఉంటారు. అందుచేత వారు సంశితవ్రతులు ***(సంశితవ్రతాః).*** వ్రతము అన్నపుడే కఠినమైన నియమాలతో జీవించేవారు అని అర్థము. 'శితములు' అంటే తీక్షణ మైనవి లేదా వాడి యైనవి అని అర్థము. 'సంశితములు' అంటే చక్కగా పదునైనవి అని అర్థం ***(సమ్యక్ శితాని).*** వ్రత నియమాలను తీక్షణంగా ఆచరించే వారు సంశితవ్రతులు. అట్టివారు ఆచరించే స్వాధ్యాయ, జ్ఞానార్జనలు కూడా యజ్ఞాలై శోభిస్తున్నాయి.

*ఇంతవరకు అనేక మోక్ష సాధనములను యజ్ఞములుగా అర్థం చేసుకున్నాం. ఇప్పుడు యోగాంగ మైన ప్రాణాయామము కూడా యజ్ఞమే అంటున్నాడు భగవానుడు.*

**అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాఽపరే ।**
**ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామ పరాయణాః ॥** 29

***అపానే-జుహ్వతి-ప్రాణం-ప్రాణే-అపానం-తథా-అపరే***
***ప్రాణాపానగతీ-రుద్ధ్వా-ప్రాణాయామ పరాయణాః***

| | | | |
|---|---|---|---|
| తథా | = అటులనే | అపానే | = అపానము నందు |
| అపరే | = మరి కొందరు | ప్రాణం | = ప్రాణవాయువును |
| ప్రాణాయామ పరాయణాః | = ప్రాణాయామము నందు ఆసక్తి గలవారు | ప్రాణే | = ప్రాణవాయువు నందు |
| ప్రాణాపానగతీ | = ప్రాణాపానగతులను | అపానం | = అపాన వాయువును |
| రుద్ధ్వా | = నిరోధించి | జుహ్వతి | = హోమము చేయుచున్నారు |

**కొందరు ప్రాణాయామ యజ్ఞ పరాయణులు. వారు ప్రాణాపాన గతులను నిరోధించి, అపానంలో ప్రాణాన్ని, ప్రాణంలో అపానాన్ని హోమం చేస్తూ ఉంటారు.**

**వ్యాఖ్య**

దృశ్య ప్రపంచంలో గోచరించే ప్రతి వస్తువు నుండి, విషయం నుండి దృష్టిని మెల్లగా మరలించి, చైతన్య రూపుడైన ద్రష్ట వైపుకు మళ్ళించే ఏ కార్యమైనా పవిత్రమైనదే కనుక, ఇంద్రియాలను విషయాల నుండి మరలించి సంయమ స్థితిలో ఉంచడం యజ్ఞ మని చెప్పబడింది. మనో నిగ్రహము ఎలా యజ్ఞమైందో,

అలాగే మనో నిగ్రహానికి ఉపకరించే ప్రాణాయామము అనే యోగ సాధన కూడా యజ్ఞమే అని చెబుతున్నాడు. దేహంలో నడిచే ప్రాణ సంచారాన్ని పూరక, రేచక, కుంభక ప్రక్రియల ద్వారా క్రమబద్ధం చేయడం వల్ల ప్రాణ నిరోధము, తద్వారా మనో నిగ్రహము జరుగుతూ ఉన్నందున ప్రాణాయామము కూడా యజ్ఞముగా పిలువ బడింది.

మోక్షమును వాంఛించే సాధకుడు జ్ఞాన సాధనను నిరాటంకంగా సాగించడానికి దేహారోగ్యము, మనో నిగ్రహములు ముఖ్యావసరాలై ఉన్నందున, ఈ రెండిటిని సాధించుటకు ఉపకరి స్తున్నందున ప్రాణాయామము అనే యోగసాధన కూడా యజ్ఞ మైంది.

ప్రాణ మనస్సులు పరస్ప రాధీనాలై ఉంటాయి. సన్నిహిత సంబంధం కలిగి ఉంటాయి. వాయు రోధనము జరిగి నపుడు మనస్సు నియమింప బడుతుంది. అలాగే మనో నిగ్రహము జరిగి నపుడు ప్రాణ రోధనము జరుగుతుంది. కనుక యోగము లోని అష్టాంగములలో నాల్గవది అయిన ప్రాణాయామము సాధకునికి అత్యంత ఉపయుక్తమై ఉంది.

***ప్రాణః*** అంటే వాయువు లేదా శ్వాస. ***యామః*** అంటే సంయమము. ప్రాణాయామము అంటే ప్రాణమును సక్రమంగా నియమించుట అని అర్థము. ప్రాణాయామము నందు ఆసక్తి గల వారు ప్రాణాయామ పరాయణులు ***(ప్రాణాయామ పరాయణాః)***. ప్రాణాయామ తత్పరులు.

**ప్రాణాయామం**

ప్రాణాయామము పూరక, రేచక, కుంభకములు అని మూడు భాగాలుగా తెలియ బడుతుంది. పూరకము అంటే గాలిని పూరించుట. అనగా లోపలికి పీల్చుట అని అర్థము. దీనిని అపాన మని పిలుస్తారు.

రేచకము అంటే గాలిని బయటికి విడుచుట. దీనిని ప్రాణమని పిలుస్తారు. ఈ రెండు, అనగా ప్రాణాపానాలు జరుగకుండా ఊపిరిని బంధించడమును కుంభకము అంటారు.

బాహ్యంలో ఉండే వాయువును శరీరంలో ప్రవేశపెట్టి నియమించేది పూరకము. శరీరస్థమై ఉన్న వాయువును బాహ్యానికి విడిచి నియమించేది రేచకము. పూరక రేచకాలతో సంబంధమును కలిగి ఉండేది కుంభకము.

కుంభకము రెండు విధాలుగా తెలుస్తూ ఉంటుంది. ఒకటి అంతః కుంభకము. రెండవది బాహ్య కుంభకము. శక్తి మేరకు గాలిని లోనికి పీల్చి, శ్వాస ప్రశ్వాసములను నిరోధించడము అంతః కుంభకము. అలాగే శరీరస్థ వాయువును వెలుపలకు వదిలి పెట్టి, తిరిగి లోపలికి రాకుండా నిరోధించడము బాహ్య కుంభకము.

**గీతా ప్రాణాయామం**

ప్రస్తుత శ్లోకము నందు అపానము నందు ప్రాణమును, ప్రాణము నందు అపానమును హోమం చేయడం జరుగుతూ ఉంది. అపానము నందు ప్రాణమును హోమము చేయడం పూరకము. ప్రాణము నందు అపానమును హోమము చేయడము రేచకము. ఈ ప్రాణాపాన గతులను నిరోధించి ***(ప్రాణాపాన గతీ రుద్ధ్వా)*** ప్రాణాయామము చేయడం కుంభకము.

పూరకము చేసే టప్పుడు ప్రాణగతి నిరోధము, రేచకము చేసే టప్పుడు అపానగతి నిరోధము, కుంభకము చేసే టప్పుడు ప్రాణాపాన గతుల నిరోధము జరుగుతుంది కాబట్టి, క్రమంగా శ్వాస ప్రశ్వాసములను ప్రాణాయామ





తత్పరులు నిరోధిస్తారు. ఈ మొత్తము ప్రాణాయామ ప్రక్రియను పతంజలి మహర్షి సంక్షేపంగా సూత్రీకరించారు.

**తస్మిన్ సతి శ్వాస ప్రశ్వాసయోః గతి విచ్ఛేద లక్షణః**

అష్టాంగయోగము నందు మూడవది యైన ఆసనము స్థిరపడిన తరువాత ***(తస్మిన్ సతి)***, మన ప్రయత్నము లేకుండా సంచరించే ప్రాణాపాన ధర్మాలైన శ్వాస ప్రశ్వాసాలను పురుష ప్రయత్నం చేత వాటి ప్రవాహమును ***(గతి)*** విచ్ఛేదము ***(నిరోధము)*** గావించుటే, అనగా నిరోధించుటే ప్రాణాయామ లక్షణము.

ప్రాణ సంచారము అందరి లోను అప్రయత్నంగా సాగుతూనే ఉంటుంది. సహజంగా సాగే ప్రాణ సంచారము ప్రయత్నముతో ప్రాణాయామం కావాలి. ఆ తరువాత ఈశ్వర ప్రణిధానము తోడైతే, ప్రాణాయామము కూడా యజ్ఞమై అలరారుతుంది. ఈ కారణం చేతనే సంధ్యావందన, పూజాది కార్యాల యందు ప్రాణాయామం కూడా చేర్చ బడింది. ఏ భగవత్కార్యాన్ని అనుష్ఠించాలన్నా మనస్సు అదుపులో ఉండాలి. ఆ పని ప్రాణాయామం వల్ల జరుగుతుంది. నిత్యము ప్రాణాయామాన్ని అనుష్ఠించే వారికి మనస్సు స్థిరంగా ఉంటుంది. మనస్సు స్థిరపడితే వాక్కు, దృష్టి కూడా స్థిరంగా ఉంటాయి అని యోగశాస్త్రము ***(యథా యథా సదాభ్యాసాత్ మనసః స్థిరతా భవేత్! వాయు వాక్కాయ దృష్టీనాం స్థిరతా చ తథా తథా!)***.

**ప్రాణాయామ ఫలం**

అసంకల్పితంగా, అప్రయత్నంగా సాగే శ్వాస క్రియను ప్రయత్న పూర్వకంగా, నిగ్రహ స్పృహతో ఆచరిస్తే ప్రాణాయామ మవుతుంది. ప్రాణాయామం వల్ల చిత్త నైశ్చల్యం ఏర్పడుతుంది. మనో నిగ్రహం జరుగుతుంది. చిత్త నైశ్చల్యం ఏర్పడినంత మాత్రాన చిత్తశుద్ధి ఏర్పడాలి అనే నియమం లేదు. నిశ్చలమైన మనస్సు, అచంచలమైన ఏకాగ్రత రాక్షసులకు కూడా ఉంటుంది. రావణాసురుడి మనస్సుకు నిశ్చలత తెలుసు. ఏకాగ్రత తెలుసు. అవి ఉండబట్టే కఠోర తపస్సును ఆచరించాడు. కాని చిత్తశుద్ధి లేదు. చెయ్యగూడని పనులు చేయడానికి అదే కారణము.

ప్రాణాయామం వల్ల మనో నిగ్రహము జరుగుతుంది కనుక చిత్త నైశ్చల్యం ఏర్పడుతుంది. ఈశ్వర ప్రణిధానము తోడైతే, చిత్త నైశ్చల్యంతో పాటు చిత్తశుద్ధి కూడా ఏర్పడుతుంది. ఎప్పుడైనా, ఎవరికైనా ప్రార్థన తోనే హృదయం శుద్ధి పడుతుంది. కనుక, ప్రాణాయామం చేసే టప్పుడు ఈశ్వర భావన కలిగి ఉండాలి. కొందరు మంత్రోపాసన కూడా సాగిస్తూ ఉంటారు. అలా కూడా చెయ్యొచ్చు.

*'స'కారేణ బహిర్యాతి 'హ'కారేణ విశే త్పునః*
*ప్రాణస్తత్ర సేవాహం హంస ఇత్యనుచిన్తయేత్ ॥*

గాలి బయటకు వెళ్ళేటప్పుడు 'స' కారము, లోనికి పీల్చేటప్పుడు 'హ' కారమును స్మరిస్తూ 'అదే నేను' ***(సోऽహం)*** అనే భావంతో ప్రాణాయామ పరాయణులైన కొందరు ధ్యానమగ్ను లవుతారు అన్నది ఉపనిషత్తు.

*ప్రాణ నిరోధాన్ని యజ్ఞంగా అభివర్ణించిన భగవంతుడు ఆహార నియమం కూడా యజ్ఞమే అంటున్నాడు.*

**అపరే నియతాహారాః ప్రాణా న్ప్రాణేషు జుహ్వతి ।**
**సర్వేऽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపిత కల్మషాః ॥** 30

***అపరే-నియతాహారాః-ప్రాణాన్-ప్రాణేషు-జుహ్వతి***
***సర్వే-అపి-ఏతే-యజ్ఞవిదః-యజ్ఞ క్షపిత-కల్మషాః***

| | |
|---|---|
| అపరే | = మరి కొందరు |
| నియతాహారాః | = ఆహార నియమము గలవారు |
| ప్రాణాన్ | = ప్రాణములను |
| ప్రాణేషు | = ప్రాణము లందే |
| జుహ్వతి | = హోమము చేస్తున్నారు |
| ఏతే | = ఈ |
| సర్వే అపి | = అందరు కూడా |
| యజ్ఞవిదః | = యజ్ఞము నెరిగిన వారు |
| యజ్ఞక్షపిత కల్మషాః | = యజ్ఞము చేత పాపము పోగొట్టుకున్న వారు |

**ఇంక కొందరు ఆహార నియమాలను పాటిస్తూ, ప్రాణాలను ప్రాణాల యందే హోమం చేస్తారు. వీళ్ళందరూ యజ్ఞవిదులు. యజ్ఞము చేత పాపాలను పోగొట్టుకున్న వారు.**

**వ్యాఖ్య**

ఇరవై ఐదవ శ్లోకం నుండి యజ్ఞ ప్రకరణమును ప్రారంభించిన భగవంతుడు, ఈ శ్లోకంలో ఆహార యజ్ఞాన్ని వివరిస్తున్నాడు. ఈ యజ్ఞంతో కలిపి పన్నెండు యజ్ఞాలను తెలియ చేయడం జరిగింది.

ఆహార సేవనము అనేది భౌతికమైన అవసరం గానే అందరూ భావిస్తారు. కాని, అందుకు విలక్షణంగా భగవద్గీత భావిస్తోంది. ఆహార సేవనం కూడా ఆధ్యాత్మిక సాధనే కనుక, దానిని కూడా ప్రముఖంగా స్వీకరించి చర్చించింది. అంతేకాదు, యజ్ఞంగా పరిగణించింది కూడా. ఆహార సేవనము అనే ఈ అంశాన్ని ప్రస్తుత సందర్భంలో యజ్ఞంగా స్వీకరించడమే గాక, గీతలో అనేకచోట్ల ప్రస్తావించి విశ్లేషించింది.

ఆరోగ్యము అనేది ప్రముఖంగా ఆహారం మీదే ఆధారపడి ఉంటుంది. దేహ శకటానికి ఆహారమే ఇంధనము. **ఆహ్రీయతే ఇతి ఆహారః** లోనికి అనగా శరీరము లోనికి పోయేది ఏదైనా ఆహారము క్రిందికే వస్తుంది. అలా చూచి నపుడు గాలి, నీరు కూడా ఆహారమే. అంతేకాదు, రూపాలు, రంగులు కళ్ళ ద్వారా, శబ్దాలు చెవుల ద్వారా, వాసనలు ముక్కు ద్వారా లోనికి వెళ్తాయి. కనుక ఇవి కూడా ఆహారాలే.

బాహ్యం లోని గాలిని ముక్కు ద్వారా శ్వాసిస్తాము. నాసికం ద్వారా లోని కెళ్తూ ఉంది కనుక, ఆహారమే అయిన వాయువును ప్రాణాయామము ద్వారా క్రమబద్ధం చేయడం ఎలాగైతే యజ్ఞమని భావించామో, అలాగే శబ్దాది విషయాలను ఇంద్రియాలతో నియమించడము కూడా యజ్ఞం గానే అర్థం చేసుకున్నాము. వాయువు లాగా, విషయాల లాగా ఆహారం కూడా దేహం లోకి వెళ్తూ ఉంది కనుక, విషయ పవనాదులను క్రమబద్ధం చేసినట్లే ఆహారం విషయంలో కూడా ప్రవర్తిస్తే, ఆహార సేవనము కూడా మోక్షసాధనకు ఉపకరించి యజ్ఞముగా శోభిస్తుంది.

**ఆహార యజ్ఞము**

మనం తీసుకొనే ఆహారం లోని స్థూలాంశము స్థూలదేహంగా పరిణమిస్తూ ఉంటే, సూక్ష్మాంశము సూక్ష్మ దేహంగా, అంటే మనస్సుగా మారుతూ ఉంది. మనో నిగ్రహాన్ని యజ్ఞంగా అర్థం చేసుకున్నాం కనుక, అట్టి మనస్సును తయారు చేసే ఆహారం విషయంలో నియమాన్ని పాటించడం కూడా యజ్ఞమే అవుతుంది.

కాని, ఇక్కడ ఒక్క విషయాన్ని జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. ఆహారం కేవలం ఆకలి తీర్చుకోవడానికే అయితే, అది అవసరం అవుతుందే గాని యజ్ఞం కాలేదు. కేవలం ఆరోగ్యమే కాకుండా, ఆరాధన కూడా తోడైనపుడే యజ్ఞం అవుతుంది. ఈ దృక్కోణం నుండి ఆహార సేవనమును అర్థం చేసుకొని, తదనుగుణంగా జీవిస్తే ద్రవ్యయజ్ఞులు, తపోయజ్ఞుల లాగే ఆహారయజ్ఞులు శోభిస్తారు.

**మితము - హితము**

ఆహార సేవనమును సాధనగా మలచుకొనే వారిని నియతాహారులుగా అభివర్ణించడం జరిగింది.





నియతము అంటే మితము లేదా పరిమితము అని అర్థము. ఆహారాన్ని పరిమితంగా, మితంగా, సముచితంగా స్వీకరించే వారు నియతాహారులు *(నియతః పరిమితః ఆహారః యేషాం తే నియతాహారాః).* ఆహారాన్ని మితంగా, హితంగా స్వీకరించడం ఎలా? అనే సందేహం ఉంటుంది. ఈ విషయంలో యోగశాస్త్రానికి స్పష్టమైన అవగాహన ఉంది.

*ద్వౌభాగౌ పూరయేత్ అన్నైః తోయే నైకం ప్రపూరయేత్*
*మారుతస్య ప్రచారార్థం చతుర్థం అవశేషయేత్ ॥*

కడుపు లోని ఖాళీ ప్రదేశాన్ని నాలుగు భాగాలుగా విభజిస్తే, అందులో రెండు భాగాలను ఆహారముతో నింపాలి. ఒక భాగమును నీటితో నింపి, మిగిలిన ఒక భాగమును వాయు సంచారానికి విడిచిపెట్టాలి అని ఆరోగ్యప్రద మైన విషయాన్ని యోగశాస్త్రం తెలియ చేసింది. ఇలా గ్రహించిన ఆహారము హితమైనది కనుక, దానిని **మేధ్యం** అంటారు. **మేధ్యం** అంటే పవిత్ర మైనది అని అర్థము. పవిత్రమైన ఆహారము వలన తయారయ్యే మనస్సు కూడా పవిత్రం గానే ఉంటుంది. ఆహారశుద్ధి వలన చిత్తము కూడా శుద్ధి పడుతుంది. చిత్తశుద్ధి ఏర్పడితేనే సత్యసాధనకు అవకాశం ఉంటుంది కనుక, జ్ఞానసాధనకు ఉపకరించే చిత్తశుద్ధికి సహకరించడం చేత ఆహార సేవనము కూడా యజ్ఞంగా పరిగణించ బడింది. ఈ విషయంలో సాధకులు అనుసరించ వలసిన అనేకమైన విషయాలను శాస్త్రము ప్రస్తావించింది.

ఆహారం మితంగా, పరిమితంగా ఉండటమే గాక, అట్టి ఆహారాన్ని సమకూర్చుకోవడానికి వినియోగించే ద్రవ్యము న్యాయార్జితంగా ఉండాలి. అన్యాయంగా ఆర్జించిన విత్తముతో లభించిన ఆహారాన్ని మనిషి మితంగా తీసుకోవచ్చు. కాని అది మితమే గాని హితము కాదు. ధన సంపాదనము చేసిన వ్యక్తికి అది అన్యాయార్జిత మని తెలుసు కనుక, అతని మనస్సు అట్టి ఆలోచన చేత మలిన పడుతూ ఉంటుంది. మనస్సును మలిన పరచే ఆహార సేవనము యజ్ఞము క్రిందికి రాదు. కనుక సాత్త్వికాహారాన్ని పరిమితంగా స్వీకరించడమే గాక, ధన సంపాదనలో కూడా ధర్మానువర్తులై మెలగాలి.

ఇక ఆహార సేవనంలో తరువాత ప్రాధాన్యం ఆకలికే గాని రుచులకు కాదు. ఆకలిని పోగొట్టుకోవడమే గాక, ఆరోగ్యంతో పాటు అంతఃకరణ శుద్ధికి ప్రాధాన్య మిచ్చే సాధకులు, ఆహార విషయంలో రుచులను పట్టించుకో కూడదు. రుచుల విషయంలో అభిరుచులు ఉండ కూడదు.

సాధారణంగా ఆహారం రుచిగా ఉంటే అదే పనిగా లాగించేస్తారు. ఒకవేళ, రుచి లేకుండా ఉంటే, తినడం మానేస్తారు. ఈ రెండూ శ్రేయోదాయకం కావు. బాగుందని లాగించేస్తే ఆయాసం, అనారోగ్యం ప్రాప్తిస్తాయి. బాగలే దని మానేస్తే నీరసం, అశక్తత తోడవుతాయి. అందుచేత రుచులను విస్మరించి, ఆహారాన్ని ఔషధంగా స్వీకరించడం సాధకులు నేర్చుకోవాలి.

రుచికరమైన పదార్థాలను అభిలషించడం వల్ల యజ్ఞభావన కుంటు పడుతుంది. అంతేగాక, రుచులపై అభిరుచి అనేది భోగాసక్తి కనుక, విషయత్యాగ యజ్ఞము కూడా లేకుండా పోతుంది. రాగద్వేషాలు అనేవి అంతఃకరణములో అశుద్ధమును సృష్టిస్తాయి కనుక, రుచులపై ఉండే అభిరుచి ఆహార యజ్ఞానికి అవరోధ మవుతుంది. కనుకనే, రుచికరమైన ఆహారాన్ని సాధకులు ఆశించ కూడదు - ***స్వాదు అన్నం న తు యాచ్యతాం*** అన్నారు 'సాధనపంచకం'లో శ్రీ ఆదిశంకరాచార్య స్వామి.

**సమారాధనము - సంప్రాప్తము**

మనిషికి మనస్సుంది. మనస్సులో ఆశలు ఉంటాయి. ఆశలు ఎన్నయినా ఉండొచ్చు. ఉన్న ఆశ లన్నీ

ఫలించవు. ఏది ప్రాప్తమో అదే అందుతుంది. ఆహారం విషయం కూడా అంతే. కర్మలను యజ్ఞములుగా మార్చుకొనే సాధకులు ఈ విషయంలో చక్కని అవగాహన కలిగి వర్తిస్తారు. రుచులపై అభిరుచి లేని వారు కనుక, ఏది లభిస్తే దానితో తృప్తి చెందుతారు. ప్రారబ్ధ ఫలంగా లభించిన దానిని ఆనందంగా అనుభవిస్తారు. ***(విధివశాత్ ప్రాప్తేన సంతుష్యతాం).***

ప్రారబ్ధ ఫలంగా ఆహారం ప్రాప్తించే టప్పుడు, దానిని ప్రసాదించిన వాడు పరమేశ్వరుడే గాని మరొకరు అయ్యేందుకు అవకాశం లేదు. పరమేశ్వరుడు అనుగ్రహించిన దానిని ఈశ్వర ప్రసాద సిద్ధికై ఆయనకు ముందుగా నివేదించాలి. అదే ఆరాధనము. ఇలా ఈశ్వరారాధనలో సమర్పించ బడిన నైవేద్యము అర్చనానంతరము ప్రసాదంగా మారుతుంది. ప్రసన్నతను కలిగించేదే ప్రసాదం కనుక, ప్రసాదమును స్వీకరించిన ఆహారయజ్ఞులు ప్రశాంతతను పొందుతారు. అంతఃకరణ శుద్ధితో అలరారుతారు. కనుక, భగవంతునికి నివేదించిన ఆహారాన్నే గ్రహించాలి. దానిని కూడా ప్రసాద భావన తోనే స్వీకరించాలి.

ఈ విధమైన నియమాలతో, అవగాహనతో ఆహారాన్ని స్వీకరించడము కూడా యజ్ఞమే అవుతుంది. పవిత్రమైన ఆహారమును పవిత్ర భావనతో స్వీకరించడం చేత మనస్సు పవిత్ర మవుతుంది. పాపం ప్రక్షాళన మవుతుంది. ఈ విధంగా నియతాహారులైన సాధకులు ప్రాణాది వాయువులను ప్రాణాల యందే హోమం చేస్తారు.

**ప్రాణ హోమము - పాపనాశము**

హితమైన, మితమైన ఆహారమును స్వీకరించేవారు ప్రాణాలను ప్రాణాల యందే హోమం చేస్తున్నారు అంటున్నాడు. దీనినే కేవల కుంభక ప్రాణాయామం అంటారు. ఆహార నియమాన్ని పాటించని వారు దీనిని ఆచరించలేరు. కేవల కుంభక ప్రాణాయామంలో ప్రాణవాయువులు బహిర్గతం కాకుండా నిరోధింప బడుతున్నాయి. అలా నిరోధింప బడిన ప్రాణవాయువులు లోపల సంచరించుటకు తగినంత ప్రదేశము కావాలి. అందుచేత కేవల కుంభక ప్రాణాయామ తత్పరులు తప్పక మితాహారులై ఉండాలి. ఇలా మితాహారు లైనందున, ప్రాణాలు ప్రాణాల యందు హోమం చేయబడు తున్నాయి ***(యదస్య అల్ప అశనం తేన ప్రాణాః ప్రాణేషు హుతాః).*** ఈ విధమైన కేవల కుంభక ప్రాణాయామంలో ఇంద్రియ వృత్తులు కూడా ***(ప్రాణాన్)*** ఇంద్రియముల యందే ***(ప్రాణేషు)*** అణగి పోతున్నాయి ***(జుహ్వతి).***

ఇప్పటి వరకు చెప్పిన పన్నెండు యజ్ఞాలు తెలిపిన వారందరూ యజ్ఞవిదులు ***(యజ్ఞవిదః).*** అంతేకాదు, యజ్ఞాల చేత ***(యజ్ఞైః)*** నివారింప బడిన ***(క్షపిత)*** పాపాలు కల వారు ***(కల్మషాః).*** కనుక యజ్ఞవిదు లైన వారు యజ్ఞక్షపిత కల్మషులు. యజ్ఞ ప్రభావం చేత సమస్త పాపాల నుండి విడిపడిన వారు.

అనివార్యం గానో, విధి ప్రభావం చేతనో, లేదా అజ్ఞానం చేతనో వ్యక్తులు పాపాలు చేయవచ్చు. అంతమాత్రాన పాపులు గానే పడి ఉండాలని ఎవ్వరూ భావించరు. పాపాన్ని ప్రక్షాళనం చేసుకొని పవిత్రులు కావాలనే అభిలషిస్తూ ఉంటారు. అలాంటి వారందరు ఇంతవరకు మనం చూచిన పన్నెండు యజ్ఞాలను అన్నిటిని గాని, కొన్నిటిని గాని, కనీసం ఒక్కటైనా గాని ఆచరించ గలిగితే యజ్ఞ వైభవము ఎలాంటిదో చూడటమే గాక, సర్వ పాపాల నుండి విముక్తిని పొంది తరిస్తారు.

*ఈ విధమైన యజ్ఞాలను ఆచరించడం వల్ల కలిగే ఫలిత మేమిటి? ఆచరించకపోతే జరిగే పరిణామ మేమిటి? అదే చెబుతున్నాడు.*





**యజ్ఞశి ష్టామృతభుజో యాన్తి బ్రహ్మ సనాతనమ్ ।**
**నాయం లోకోఽ స్త్యయజ్ఞస్య కుతోఽ న్యః కురుసత్తమ ॥** 31

*యజ్ఞశిష్టామృతభుజః-యాంతి-బ్రహ్మ-సనాతనం*

*న-అయం-లోకః-అస్తి-అయజ్ఞస్య-కుతః-అన్యః-కురుసత్తమ*

| | | | |
|---|---|---|---|
| కురుసత్తమ | = అర్జునా! | అయజ్ఞస్య | = యజ్ఞము చేయని వానికి |
| యజ్ఞశిష్టామృతభుజః | = యజ్ఞశేషమైన అమృతమును భుజించు వారు | అయం | = ఈ |
| సనాతనం | = అనాది యైన | లోకః | = లోకము |
| బ్రహ్మ | = బ్రహ్మమును | న అస్తి | = లేదు |
| యాంతి | = పొందుచున్నారు | అన్యః | = ఇతర లోకము |
| | | కుతః | = ఎక్కడిది? |

**కురుశ్రేష్ఠా! అర్జునా! యజ్ఞ శేషమైన అమృతమును తినేవారు నిత్యమైన బ్రహ్మమును పొందుతున్నారు. యజ్ఞ జీవనము లేని వానికి ఈ లోకమే లేదు. ఇక పరలోకము ఎక్కడి నుండి వస్తుంది?**

**వ్యాఖ్య**

మనం ఆచరించే కార్యాలన్నీ ఏదో ఒక గమ్యం వైపు సాగిపోతూ ఉంటాయి. అలా పయనించడం కర్మ స్వభావము. ఏ కర్మ అయినా ఫలితాన్ని ఆశించే ఆచరింప బడుతుంది. ఫలితము యొక్క వైభవం కర్మ శ్రేష్ఠత్వమును నిర్ణయిస్తూ ఉంటుంది.

మనం ఏ కార్యాన్ని ఆచరించాలన్నా కొద్దో గొప్పో శ్రమించక తప్పదు. శ్రమిస్తేనే దేనినైనా సాధించగలం. ఎంతగా శ్రమించి ఈ ప్రపంచంలో ఏది సాధించినా అది కర్మఫలమే కనుక, కర్మ నశించినట్లే కర్మఫలం కూడా నశిస్తుంది. శరీర శ్రమతో కర్మలను ఆచరించి సంపదను పోగు చేసుకుంటాం. శ్రమించి కర్మ నాచరించిన శరీరము ఎలా నశించి పోతుందో, శారీరక శ్రమ ఫలితంగా ప్రాప్తించిన సంపద కూడా క్షయమై పోతుంది.

లౌకికమైన కర్మల కన్నా యజ్ఞకర్మలు శ్రేష్ఠమైనవి. ఈ యజ్ఞకర్మలు కూడా సకామం, నిష్కామం అని రెండు విధాలుగా ఉంటాయి. దేవతలను ఆరాధిస్తూ, స్వర్గాది ఫలాలను కాంక్షించి ఆచరించే యజ్ఞాలు సకామ యజ్ఞాలు. ఫలాసక్తి లేకుండా కేవలం చిత్తశుద్ధి కొరకు ఆచరించే యజ్ఞాలు నిష్కామ యజ్ఞాలు. ఈ విధమైన నిష్కామ యజ్ఞాలలో సాధకుడు వేసే ప్రతి అడుగులో స్వార్థ త్యాగము తొణికిస లాడుతూ ఉంటుంది.

యజ్ఞము అనేది కర్మ. కర్మ ఆచరింపబడి నపుడు ఫలం వచ్చి తీరుతుంది. ఇక్కడ యజ్ఞఫలము ఏమిటి? అనేది శంక. యజ్ఞ సమాప్తి సమయంలో ఏది అందుతుందో అదే ఫలము.

దేవతా ప్రీత్యర్థం నిర్వహించే సకామ యజ్ఞాలు సమాప్తం కాగానే హోమము చేయగా మిగిలిన ఆజ్య పురోడాశాది హవిస్సులను అమృత ద్రవ్యములుగా స్వీకరించి ఆరగించడము దృష్ట ఫలమైతే, యజ్ఞకర్మ యొక్క పుణ్యఫలంగా అందబోయే స్వర్గప్రాప్తి అదృష్టఫలం. ఈ రెండు ఫలితాలు కూడా నశించి పోయేవే గాని శాశ్వత ఫలాలు కావు. మోక్షఫల హేతువులు కాలేవు.

**అమృతానుభవము**

ఇంతవరకు భగవంతుడు ప్రవచించిన పన్నెండు దైవయజ్ఞాలు ఆచరించిన వారికి లభించే ఫలం ఎలాంటిదో చెబుతున్నాడు.

యజ్ఞములలో శేషించిన దానిని యజ్ఞశిష్టము అంటారు ***(యజ్ఞానాం శిష్టం యజ్ఞశిష్టమ్).*** అంటే, యజ్ఞ సమాప్తిలో మిగిలినది అని అర్థము. దానిని అమృతము అంటారు. ***యజ్ఞశిష్టం తథాఽమృతమ్*** అని శ్రుతి కూడా నిర్ణయించింది. యజ్ఞశిష్టమైన అమృతమును ఆరగించే వారు యజ్ఞశిష్టామృతభుజులు ***(యజ్ఞశిష్టామృత భుజః).*** ఈ విధంగా అమృతమును భుజించే వారు చిరంతనమైన బ్రహ్మమును పొందుతారు అనేది యజ్ఞ ఫలంగా చెప్పబడింది ***(యాన్తి గచ్ఛన్తి, బ్రహ్మ సనాతనమ్ చిరంతనమ్).***

దైవయజ్ఞాలు అని భగవంతుడు ప్రవచించిన పన్నెండు యజ్ఞాలు అగ్నిష్టోమాది యజ్ఞాల వంటివి కావు. ఈ యజ్ఞాలలో హోమగుండాలు కనిపించవు. ఋత్విజుల మంత్రాలు వినిపించవు. ఘృత హవిస్సులు అగుపించవు. కేవలం సాధనలనే యజ్ఞములుగా భావించి ఆచరింపబడిన ఈ యజ్ఞాలలో యజ్ఞశిష్ట మైనది ఏది? అంతేగాక, అగ్నిష్టోమాది క్రతువుల ఫలంగా అమృతాన్నమును భుజించడమే గాక, పరలోక ప్రాప్తి కూడా కలుగుతూ ఉంది. మరి భావప్రధాన మైన ఈ సాధన యజ్ఞాలలో అన్న మేమిటి? పొందే ఫలము ఎలాంటిది? అనే శంకలు తలెత్తుతాయి.

దైవ యజ్ఞాలు తాత్త్విక అవగాహనతో నిండి ఉంటాయి కనుక, ఈ యజ్ఞములను నిర్వహించడం వలన సాత్త్విక సుఖము పెంపొందుతుంది. చిత్తశాంతి కలుగుతుంది. ఇదంతా దృష్టఫలం. ఇలా యజ్ఞములను నిర్వహించే వారు మోక్షాపేక్ష గలవా రైతే ***(ముముక్షవః చేత్),*** కాలాంతరంలో సామర్థ్యాన్ని బట్టి మోక్షాన్ని సాధిస్తారు ***(కాలాతి క్రమాపేక్షయా ఇతి సామర్థ్యాత్ లభ్యతే).*** చిలుకుతూ ఉంటే పెరుగు నుండి వెన్న ఉత్పన్న మైనట్లు, దైవయజ్ఞాలను ఆచరిస్తూ పోగా జ్ఞానసాధనకు ఉపకరించు చిత్తశుద్ధి ఏర్పడి, తద్వారా ఆత్మజ్ఞానమును పొందడము జరుగుతుంది. ఆత్మయే బ్రహ్మము అయినందున, సనాతనమైన బ్రహ్మమును పొందడం జరుగుతుంది ***(యాన్తి బ్రహ్మ సనాతనమ్).***

అగ్నిష్టోమాది వైదిక క్రతువులను చేసే వారికి యజ్ఞశిష్టంగా ఆజ్యపురోడాశాదులు దృష్టఫలం గాను, కాలాంతరంలో స్వర్గాది లోకాలు అదృష్టఫలం గాను ప్రాప్తిస్తాయి.

దైవయజ్ఞాలను నిర్వహించే ముముక్షువులకు చిత్త నైర్మల్యము, చిత్తశుద్ధి దృష్టఫలాలు కాగా, చిత్తశుద్ధి చేత కాలాంతరంలో జ్ఞానప్రాప్తి కలిగి మోక్షము సిద్ధిస్తుంది. ఇదే యజ్ఞ ప్రయోజనం. యజ్ఞఫలం.

ఈ విధమైన యజ్ఞాలను ఆచరించే సుకృతాత్ములు దైవయజ్ఞులైతే, వీటిలో ఏ ఒక్కటి ఆచరించని వారు అయజ్ఞులు అనిపించు కుంటారు. అలాంటి అయజ్ఞులకు ఇహమే లేదు. ఇక పర మెక్కడిది? అంటున్నారు.

**అయజ్ఞులకు ఇహపరాలు ఉండవు**

ఏదైనా చేస్తేనే వస్తుంది. సాధన లేకుండా ఏదీ సాధ్య పడదు. యజ్ఞము చేసిన వారు యజ్ఞశిష్టామృతాన్ని భుజిస్తారు. అయజ్ఞులు పాపాన్నే భుజిస్తారు. ఈ విషయాన్ని మూడవ అధ్యాయం లోనే అర్థం చేసుకున్నాం.

పని చేయని వారు ప్రగతిని సాధించడం ఈ లోకం లోనే చూడలేము. ఇక పరలోకంలో ఏమి చూస్తాం? ఇక్కడ పని చేయని సోమరిపోతు, సాధన లేని అప్రయోజకుడు పరలోకాన్ని ఎలా సాధిస్తాడు? ఈ సందర్భంలో 'లోకం' అనే పద ప్రయోగంలో విశేషార్థ ముంది.

చూడబడేది ఏదో అది లోకము ***(లోక్యతే ఇతి లోకః).*** అంటే, కంటికి కనిపించేది లోకము. కనిపించే చోటే అయజ్ఞునకు ప్రగతి లేనపుడు, కనిపించని చోట ప్రగతి ఎలా ఉంటుంది? అనేది అంతర్భావము.

కనుక, పరమేశ్వరుడు ప్రస్తావించి ప్రవచించిన ఈ పన్నెండు యజ్ఞాలలో కొన్నింటినైనా తప్పక ఆచరించాలి. వీటి వలన చిత్త ప్రశాంతత సమకూరుతుంది. భగవత్కార్యము, పరహిత జీవనము ప్రాప్తిస్తాయి.





ఇవి చెయ్యాలి అని ఆజ్ఞాపించకుండా, అర్జునుని **కురుసత్తమా!** అని సంబోధించడం లోనే 'కురు' పద ప్రయోగం చేత చేసి తీరాలి అని చెప్పకనే చెబుతున్నాడు గీతాచార్యుడు.

**కురుసత్తమా!** అంటే కురుశ్రేష్ఠుడా! అని అర్థము. ఓ శ్రేష్ఠుడా! వీటిని ఆచరించు ***(కురు)*** అని ధ్వనింప చేయడానికే పరమాత్మ అలా సంబోధించాడు.

*పన్నెండు దైవయజ్ఞాలను దివ్యంగా ప్రవచించిన భగవానుడు, యజ్ఞ ప్రకరణమును సమాప్తం చేస్తున్నాడు.*

**ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే ।**
**కర్మజా న్విద్ధి తా న్సర్వా నేవం జ్ఞాత్వా విమోక్ష్యసే ॥** 32

***ఏవం-బహువిధాః-యజ్ఞాః-వితతాః-బ్రహ్మణః-ముఖే***
***కర్మజాన్-విద్ధి-తాన్-సర్వాన్-ఏవం-జ్ఞాత్వా-విమోక్ష్యసే***

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఏవం | = | ఈ విధంగా | తాన్ సర్వాన్ | = | వాటి నన్నింటిని |
| బహువిధాః | = | అనేక రకాలైన | కర్మజాన్ | = | కర్మ నుండి పుట్టిన వానినిగ |
| యజ్ఞాః | = | యజ్ఞాలు | విద్ధి | = | తెలుసుకో! |
| బ్రహ్మణః | = | బ్రహ్మము యొక్క | ఏవం | = | ఈ విధంగా |
| ముఖే | = | ముఖము నందు | జ్ఞాత్వా | = | తెలిసికొని |
| వితతాః | = | విస్తరింప బడ్డాయి | విమోక్ష్యసే | = | ముక్తుడ వవుతావు |

**ఈ ప్రకారంగా అనేక విధాలైన యజ్ఞాలు వేదము ఆరంభం లోనే సవిస్తరంగా చెప్పబడ్డాయి. అవన్నీ కర్మ వలన పుట్టాయని తెలుసుకో.**

**వ్యాఖ్య**

పరమేశ్వరుడు బోధించిన ఈ యజ్ఞము లన్నీ వినూత్నం గాను, విప్లవాత్మకం గాను కనిపిస్తున్నాయి. యజ్ఞ ప్రకరణంలో బోధించిన ఈ పన్నెండు యజ్ఞాలు శాస్త్రోక్తా లేనా? అనే శంకను నివారిస్తూ, యజ్ఞ విచార విషయాన్ని ఇక్కడ సమాప్తి చేస్తున్నారు.

ఈ యజ్ఞాలన్నీ ఊహాజనితాలు కావు. కపోల కల్పితాలు కావు. వేదప్రోక్తాలు. వేద ప్రమాణయుతాలు. ఇవే కావు, మరెన్నో యజ్ఞాలు వేదంలో చెప్పబడ్డాయి. కేవలం యజ్ఞాలే గాక, యజ్ఞవిధి కూడా వివరంగా చెప్పబడి ఉంది. కనుక, ప్రమాణ ఫలంగా తెలుస్తున్న ఈ యజ్ఞాలన్నీ సంప్రదాయానికి భిన్నంగా లేవు.

**బ్రహ్మజాలు**

పరమేశ్వరుడు బోధించిన విధంగా ***(ఏవం)*** అనేక విధాలైన ***(బహువిధాః)*** యజ్ఞములు ***(యజ్ఞాః)*** వేదము యొక్క ***(బ్రహ్మణః వేదస్య)*** ఆరంభము నందే ***(ముఖే ద్వారే)*** విస్తరించి ఉన్నాయి ***(వితతాః).***

ఈ విధమైన యజ్ఞాలు అని చెప్పడం లోనే ఇవి వ్యక్తిగతంగా రచించినవి కావు, సంప్రదాయానుసారం గానే ఉన్నాయి అని విస్పష్టం చేస్తూ, ఇవే కావు, మరెన్నో ఉన్నాయి అని కూడా సూచించడం జరిగింది. ఇవన్నీ వేదజనితాలే అని స్పష్టమైంది. వేదము యొక్క ద్వారము నందే ఉన్నాయి అంటే, వేదము యొక్క ఆరంభ మైన కర్మకాండ యందే ఎక్కువగా గోచరిస్తాయి అని భావము. విస్తరించి ఉన్నాయి అని చెప్పడం వేదము నందు అంతటా ఉన్నాయి అని స్పష్టం చేయడమే. ఇక్కడ బ్రహ్మ అంటే వేదము అని అర్థము.

యజ్ఞము అంటే మనకు కొన్ని అభిప్రాయా లున్నాయి. యజ్ఞము అనగానే యాగశాల, హోమగుండము, హోమద్రవ్యాలు, ఋత్విజులు, యజ్ఞోపకరణాలు - ఇవన్నీ మనస్సులో మెదుల్తాయి. కదుల్తాయి. ఇవేవీ లేకుండా ఇంద్రియాలు, విషయాలు, ప్రాణాయామము, సంయమము అంటూ వినూత్నంగా ప్రసంగిస్తూ ఉంటే, ఇవన్నీ కపోల కల్పితాలే నేమో! వేద ప్రమాణాలు కావేమో అనే సందేహం సహజంగా కలుగుతుంది. వాస్తవానికి ఇవన్నీ వేదము నుండి ఉత్పన్న మైనవే. కాకపోతే, వేదజనితా లేనా? అనే సంశయం కలిగే టంతగా మరుగున పడిపోయాయి అని అర్థము.

***వాచి హి ప్రాణాన్ జుహుమః*** అని ఐతరేయ ఆరణ్యకంలో ఉంది. అంటే, వాక్కు నందు ***(వాచి)*** ప్రాణాలను ***(ప్రాణాన్)*** హోమం చేస్తున్నాము ***(జుహుమః).*** ఇదొక ఉదాహరణ. కనుక, గీతాచార్యుడు అధునాతనంగా బోధించినట్లు అగుపిస్తున్నా దైవయజ్ఞా లన్నీ సనాతనంగా వేదంలో ఉన్నవే.

**కర్మజాలు**

బ్రహ్మజాలుగా ఇంతవరకు మనం గ్రహించిన ఈ యజ్ఞాలన్నీ కర్మజాలు అని గ్రహించ మంటున్నాడు. ఈ యజ్ఞము లన్నీ ***(తాన్ సర్వాన్)*** కర్మము నుండి పుట్టినవి అని ***(కర్మజాన్)*** తెలుసుకో ***(విద్ధి)*** అంటున్నాడు.

కర్మజాలు అంటే కర్మ సంబంధమైనవి అని అర్థము. ప్రయత్నముతో కూడుకున్నవి అని భావము. యత్నశీలురైన కర్తలకే అని సూచితము. ఈ విధంగా తెలుసుకో మంటున్నాడు. అలా తెలుసుకుంటే ఏం జరుగుతుంది? జరుగ వలసింది అంతా జరిగి తీరుతుంది. ఒక్క మాటలో చెప్పాలంటే, ఇలా తెలుసుకుంటే ***(ఏవం జ్ఞాత్వా)*** విముక్తులం అవుతాము ***(విమోక్ష్యసే).*** దేని నుండి విముక్తి? సంసార బంధనము అనే అశుభం నుండి విముక్తు లవుతాము ***(విమోక్ష్యసే అశుభాత్ సంసార బంధనాత్).***

మరి కర్మ సంబంధము లైన యజ్ఞాల వల్లనే మోక్షము సిద్ధించేట ట్లైతే, ఇక జ్ఞాన మెందుకు? ఆత్మజ్ఞానం ఎవరి కొరకు? వేదాంతం యొక్క అవసర మేముంది? అనే ప్రశ్నలు ప్రవాహంలా దూసుకొస్తాయి. ఇలాంటి సంశయాలను నివృత్తి చేయడానికే ఇవన్నీ బ్రహ్మజాలే అయినా కర్మజాలు అని తెలుసుకో అంటున్నాడు. ఇది చాలా అందమైన భావగర్భితమైన శ్లోకం. అంతేకాదు, ఈ అధ్యాయం యజ్ఞప్రకరణ సమాప్తిలో ఉన్నా, చివరి దైన జ్ఞాన ప్రకరణానికి ముఖద్వారంలా శోభిస్తూ ఉంది. విషయం సూక్ష్మం కనుక అవధానం అవసరం.

యజ్ఞ శిష్టమైన అమృతమును భుజించిన వారు సనాతనమైన బ్రహ్మమునే పొందుతారు అని ముప్పై ఒకటవ శ్లోకంలో స్పష్టమైంది. అలాంటప్పుడు ఈ యజ్ఞ కర్మ లన్నీ మోక్షానికి సాక్షా త్సాధనాలుగా తెలుస్తున్నాయి కదా? ఇవన్నీ ప్రశ్నలే. ఈ ప్రశ్న లన్నిటికీ యజ్ఞాలన్నీ కర్మజాలు అని చెప్పడమే సమాధానము. కాస్త విశ్లేషిద్దాం.

కర్మజాలు అంటే కర్మ సంబంధమైనవి. కర్మల నుండి జనించినవి. కర్మలు అంటే కాయక కర్మలు, వాచక కర్మలు, మానస కర్మలు అని అర్థము. ఇలా కర్మల నుండే యజ్ఞాలన్నీ ఆవిర్భవి స్తున్నాయి కనుక అవి కర్మజాలు అని తెలుసుకోవాలి.

ఉదాహరణం చెప్పుకోవాలి అంటే, ఆహారయజ్ఞము దేహ సంబంధ మైనది కనుక అది కాయక యజ్ఞము. స్వాధ్యాయాది యజ్ఞాలు వాచక యజ్ఞాలు. అలాగే సంయమాది యజ్ఞాలు మానస యజ్ఞాలు. ఇలా కాయక, వాచక, మానస యజ్ఞాలు జరగాలి అంటే, వాటిని జరిపించే కర్త ఉండి తీరాలి. కర్త ఎవరు? నేను చేస్తున్నాను ***(అహం కరోమి)*** అని భావించే వాడే కర్త. అంటే తాను దేహము, తానే వాక్కు. తానే మనస్సు అనే అభిమానం కలిగిన వాడే కర్త. ఇదే అహంకారము ***(అహంకర్తా అహంకారః).***

కాని, ఇంతకు ముందు మనం చూచిన కర్మ ప్రకరణంలో ఆత్మను అకర్తగా అర్థం చేసుకున్నాం.





ఆత్మ అకర్త కనుక అకర్తలో కర్మకు అవకాశం లేదు. కర్మ వ్యాపారము లేకుండా శోభించే ఆత్మే అకర్త. ఒకవేళ అకర్తలో కర్మ ఉన్నట్లు గోచరించినా వాస్తవానికి లేనట్లే. అందువల్లనే కదా, కర్మల యందు అకర్మను దర్శించే వాడు జ్ఞానవంతుడుగా శోభించాడు *(18 వ శ్లోకం).*

ఆత్మ అకర్తే గాని కర్త కాదు. దేహేంద్రియ మనస్సుల సమూహమే కర్త ***(కార్యకరణ సంఘాతః).*** కర్తకే కర్మ లన్నీ. యజ్ఞ వ్యాపారా లన్నీ కర్తవే. ఆత్మలో కర్మ సాధ్యమా? ఆత్మ నిర్వ్యాపారి కదా! ***(నిర్వ్యాపారః హి ఆత్మా!).***

ఆత్మ అఖండము, అనంతము కనుక, ఆత్మ కన్నా వేరుగా ఏవీ ఉండలేవు. యజ్ఞాలు, యజ్ఞకర్త కూడా ఆత్మ కన్నా వేరు కాదు. కర్త కూడా ఆత్మే. కాని, ఆత్మ కర్త కాదు. ఈ విధంగా తెలుసుకుంటే ***(ఏవం జ్ఞాత్వా).*** అంటే, యజ్ఞా లన్నీ కర్మజాలే గాని ఆత్మజాలు కావు అని, వ్యాపారా లన్నీ కర్తవే గాని, అకర్త యైన ఆత్మలో లేవు అని తెలుసుకుంటే విముక్తులం అవుతాము. కర్మబంధము నుండి విడి పడతాము. సంసార బంధాలు లేనివాళ్ళ మవుతాము.

మరి, యజ్ఞాలన్నీ కర్మజాలే అయినపుడు, వాటి వల్ల మోక్షము లభించ నపుడు, వాటిని ఆచరించడ మెందుకు? ఆత్మజ్ఞానం కొరకే ప్రయత్నం చేస్తే సరిపోతుంది కదా! సరిపోదు. ముక్తి అలా రాదు.

యజ్ఞాలు సాక్షాత్ మోక్షసాధనాలు కాకపోయినా, మోక్షసాధన మైన జ్ఞానాన్ని పొందటానికి కావలసిన అంతఃకరణ శుద్ధిని ప్రసాదిస్తాయి. పరోక్షంగా మోక్షసాధనాలు అవుతాయి. చిత్తశుద్ధిని ప్రసాదించే కర్మలు ఆత్మను అందించ లేవు ***(చిత్తస్య శుద్ధయే కర్మ న తు వస్తూప లబ్ధయే).*** జ్ఞానం వల్లనే మోక్షం సిద్ధిస్తుంది. కాని, చిత్తశుద్ధి లేనిదే జ్ఞానము ప్రాప్తించదు. ఈ విధంగా కర్మజాలైన యజ్ఞాలు ఆత్మజ్ఞానానికి సహకరిస్తాయి.

*ఇక జ్ఞాన వైభవాన్ని దర్శించే ప్రయత్నంలో చివరిదైన జ్ఞాన ప్రకరణం లోకి ప్రవేశిస్తున్నాం.*

**శ్రేయా న్ద్రవ్యమయా ద్యజ్ఞా జ్ఞానయజ్ఞః పరంతప ।**
**సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే ॥** 33

***శ్రేయాన్-ద్రవ్యమయాత్-యజ్ఞాత్-జ్ఞానయజ్ఞః-పరంతప***
***సర్వం-కర్మ-అఖిలం-పార్థ-జ్ఞానే-పరిసమాప్యతే***

| | | | | | |
|---|---|---|---|---|---|
| పరంతప | = అర్జునా! | | సర్వం | = సమస్తమైన |
| ద్రవ్యమయాత్ | = ద్రవ్య సంబంధమైన | | కర్మ | = కర్మ |
| యజ్ఞాత్ | = యజ్ఞము కంటె | | అఖిలం | = అంతా |
| జ్ఞానయజ్ఞః | = జ్ఞానయజ్ఞము | | జ్ఞానే | = జ్ఞానము నందు |
| శ్రేయాన్ | = శ్రేష్ఠము | | పరిసమాప్యతే | = లీనమౌతూ ఉంది |
| పార్థ | = అర్జునా! | | | |

**పరంతపా! ద్రవ్యమయ యజ్ఞాల కంటే జ్ఞాన యజ్ఞము శ్రేష్ఠము. పార్థా! సమస్తమైన కర్మ లన్నీ జ్ఞానం లోనే పరిసమాప్త మవుతాయి.**

**వ్యాఖ్య**

***బ్రహ్మార్పణం*** అనే ఇరవై నాల్గవ శ్లోకంలో సమ్యగ్దర్శనం కూడా ఒక యజ్ఞముగా చెప్పబడింది. ఈ యజ్ఞమునే తరువాత శ్లోకంలో బ్రహ్మయజ్ఞంగా తెలియ జేయడం జరిగింది. దానిని స్తుతించే ఉద్దేశ్యంతో దైవయజ్ఞా లైన అనేక యజ్ఞాలను గూర్చి కూడా చెప్పడం జరిగింది. దైవయజ్ఞా లన్నీ అంతఃకరణ శుద్ధిని

కలిగిస్తూ ఉంటే, జ్ఞానయజ్ఞము సాక్షాత్ మోక్షైక సాధనంగా శోభిస్తూ ఉంది. ఇదే జ్ఞానము యొక్క శ్రేష్ఠత్వము. జ్ఞానము కలగడానికి ముందు కర్మల యొక్క ఆవశ్యకత ఎంతైనా ఉంది. కాకపోతే, జ్ఞానప్రాప్తిలో కర్మలన్నీ విలీన మౌతున్నాయి. ఈ రెండు విషయాలను ప్రస్తుత శ్లోకం విశద పరుస్తూ ఉంది.

## ద్రవ్యమయ యజ్ఞాలు - జ్ఞానయజ్ఞము

ద్రవ్యమయ యజ్ఞాలు అంటే కర్మ ప్రధాన మైనవి. సాధనరూప మైనవి. సాధ్యమును అపేక్షించేవి. సాధన సాధ్య రూపమైనవి. మంత్ర, తంత్ర, యంత్ర, క్రియాది శ్రమల చేత చేయబడే కర్మయజ్ఞాలే ద్రవ్యమయ యజ్ఞాలు. ద్రవ్య వినియోగం ఉండటం చేత కూడా ఇవి ద్రవ్యమయ యజ్ఞాలు.

ద్రవ్యమయ యజ్ఞము అల్పమైనది. అనంత మైనది కాదు. అందుచేత స్వర్గాది అనిత్య ఫలాల్ని అందిస్తుంది. అనిత్య ఫలాలను అందించే ద్రవ్యమయ యజ్ఞాలు మోక్ష ప్రదాయకాలు కావు. ముక్తి అనేది జ్ఞానం తోనే ప్రాప్తిస్తుంది.

ఫలాసక్తితో ఆచరింపబడే యజ్ఞాలు అనిత్య ఫలాలను అందిస్తాయి. కాని, అవే యజ్ఞాలు ఫలాకాంక్ష లేకుండా అంతఃకరణ శుద్ధి కొరకు నిష్కామంగా అనుష్ఠించి నపుడు సామర్థ్యాన్ని బట్టి జ్ఞానోత్పాదనకు సహకరిస్తాయి.

**సర్వాపేక్షా చ యజ్ఞాది శ్రుతేః అశ్వవత్**

గుఱ్ఱము దుక్కి దున్నుటకు, బండి లాగుటకు, బరువులు మోయుటకు, భారాలను ఈడ్చుటకు ఉపయోగించబడినా, సామర్థ్యాన్ని, యోగ్యతను బట్టి రథోత్సవంలో భగవంతుని రథాన్ని లాగుటకు ఉపయోగ పడునట్లు, ఈ యజ్ఞ దానాది ద్రవ్యమయ యజ్ఞాలు సామర్థ్యాన్ని బట్టి జ్ఞానోత్పాదనకు ఉపకరిస్తాయి. పాప క్షయానికి సహకరిస్తాయి.

ద్రవ్యమయాలైన కర్మయజ్ఞాల ద్వారా ఎంత పొందినా, ఇంకా పొందవలసింది ఉంటూనే ఉంటుంది. జ్ఞానయజ్ఞము మోక్షాన్ని ప్రసాదించడం చేత అన్నీ పొందినట్లే అవుతుంది. అన్నీ చేసినట్లే అవుతుంది. సర్వ కర్మఫలాలను పొందినట్లే అవుతుంది ***(కృత్స్న కర్మకృత్).***

కర్మయజ్ఞాలు సాధన రూపాలు కనుక, దేనిని ఆశించి చేస్తే అదే వస్తుంది. కాని, జ్ఞానయజ్ఞం సమ్యగ్దర్శన వైభవంతో అలరారుతు న్నందున సమస్తము ప్రాప్తిస్తుంది.

ద్రవ్యమయ యజ్ఞాలన్నీ ఫలారంభకాలు. అంటే ఫలాన్ని పుట్టిస్తాయి ***(ఫలస్య ఆరంభకః).*** జ్ఞానయజ్ఞం ఫలారంభకం కాదు. ఫలాన్ని పుట్టించదు ***(జ్ఞానయజ్ఞః న ఫలారంభకః).*** అందుచేత ద్రవ్యమయ యజ్ఞాల కంటే జ్ఞావయజ్ఞము ప్రశస్తము. శ్రేష్ఠము ***(శ్రేయాన్).***

ద్రవ్యమయ యజ్ఞాల కంటే జ్ఞానయజ్ఞం శ్రేష్ఠము అనే వాక్యాన్ని కూడా జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. కర్మయజ్ఞాలలో ఒక దాని కంటే మరొకటి శ్రేష్ఠము అంటే అర్థం చేసుకోగలం. ద్రవ్యమయ యజ్ఞాల కంటే జ్ఞానయజ్ఞము శ్రేష్ఠము అనే విషయాన్ని ఎలా అర్థం చేసుకోవాలి?

కర్మకు, జ్ఞానానికి సంబంధము లేదు. కర్మ జ్ఞానం కాలేదు. జ్ఞానంలో కర్మ లేదు. అలాంటప్పుడు, కర్మయజ్ఞాల కన్నా జ్ఞానయజ్ఞము ప్రశస్త మవి ఎలా చెప్పగలం?

బంతిపూలలో ముద్దబంతి శ్రేష్ఠము అంటే అర్థం చేసుకోగలం. మామిడిపండ్లలో చెరకురసం ప్రశస్త మంటే అర్థం చేసుకోగలం. పనసపండు కన్నా గంగానది శ్రేష్ఠము అంటే ఎలా అర్థం చేసుకోవాలి?





అనిత్య ఫలదాయకము లైన ద్రవ్యమయ యజ్ఞాలన్నీ మోక్షైక ఫలదాయక మగు జ్ఞానయజ్ఞంలో సమాప్త మవుతున్నాయి కనుక, పోల్చుటకు అవకాశం లేకపోయినా, సర్వ శ్రేష్ఠత్వమును స్తుతిస్తూ ద్రవ్యమయ యజ్ఞాల కంటే జ్ఞానయజ్ఞము శ్రేష్ఠమని చెప్పడం జరిగింది. సాధన సాధ్య రూపమైన కర్మయజ్ఞాల కంటే సిద్ధియే ప్రసిద్ధిగా కలిగిన జ్ఞానయజ్ఞము ప్రశస్తము, పవిత్రము అయింది.

## సర్వం సమాప్తం

సాగేది ఏదైనా ఎక్కడో ఒకచోట ఆగక తప్పదు. కాలిబాటలో పయనించే బాటసారి గ్రామాన్ని చేరగానే నడక తనకు తానుగా ఆగిపోతుంది. వెళ్ళదగిన ప్రదేశం మిగిలి ఉండక పోవడమే దానికి కారణము.

గిరి శిఖరాల నుండి పారలి వచ్చిన నదీ ప్రవాహం సాగి సాగి సముద్రాన్ని చేరగానే దానంతట అదే ఆగి పోతుంది. సాగరంలో నది విలీనమైన తరువాత ఇక ప్రవాహం ఉండదు.

అలాగే సర్వకర్మలు సమస్తము జ్ఞానంలో సమాప్త మవుతున్నాయి ***(సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే).*** ఈ శ్లోకపాదంలో ***సర్వమ్, అఖిలం*** అనే రెండు పదాలను ప్రయోగించడం జరిగింది. ***సర్వమ్, అఖిలం*** అనే పదాలు ఒకే భావాన్ని సూచిస్తున్న ట్లున్నాయి.

***ఖిలమ్*** అంటే శేషము. శేషము లేనిది, నిర్విశేష మైనది ***అఖిలమ్*** అని ఒక అర్థము. ***ఖిలమ్*** అంటే అనిత్య ఫలము నిచ్చేది. ***అఖిలమ్*** అంటే నిత్యఫలమైన మోక్షమును ప్రసాదించు జ్ఞానము అని మరొక అర్థము.

***సర్వం కర్మ*** అన్నప్పుడే సర్వకర్మలు అనే అర్థం స్ఫురిస్తోంది. ***కర్మాఖిలమ్*** అని చెప్పడం చేత ఒకే భావాన్ని రెండు పదాల ద్వారా చెప్పడ మేమిటి? అనే సంశయం కలుగుతుంది.

సర్వకర్మలు అనగా శ్రౌత, స్మార్త, లౌకిక కర్మ లన్నీ చివరగా జ్ఞానంలో సమాప్త మవుతాయి అనే అర్థాన్ని స్ఫురింప చేస్తూ ***సర్వం*** అనే పదమును ప్రయోగించడం జరిగింది. కాని, ఈ ***సర్వం*** లో సంశయం తలదూర్చే అవకాశము లేకపోలేదు. అయ్యా! ఇక మీరు రావచ్చు, సర్వం సిద్ధం అన్నప్పుడు, తీరా వెళ్ళి చూస్తే అక్కడే ఏదో ఒక కొరత కనిపించవచ్చు. కాని, ***అఖిలమ్*** అనే పదాన్ని వాడటం చేత శేషం లేదు అని చెప్పడం జరిగింది. అప్పుడే అది సమాప్తం అనిపించు కుంటుంది. ***సమం*** అంటే నిర్దోషమైన బ్రహ్మము ***(నిర్దోషం హి సమం బ్రహ్మ).*** ***ఆప్తం*** అంటే ప్రాప్తము అని అర్థం. ***సమాప్తం*** అంటే బ్రహ్మప్రాప్తి అని భావము. ***పరిసమాప్యతే*** అంటే ***అంతర్భవతి ఇత్యర్థః.*** నదులు సాగరంలో అంతర్భూతా లైనట్లు సర్వకర్మలు జ్ఞానంలో అంతర్గత మయ్యా యని అర్థము. జ్ఞానము అంటే బ్రహ్మాత్మైక్య సాక్షాత్కారము.

*అట్టి పవిత్రమైన జ్ఞానాన్ని ఎవరు పొందుతారు? దానికి ఉపాయ మేమిటి? చెబుతున్నాడు.*

**తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।**
**ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః ॥** 34

***తత్-విద్ధి-ప్రణిపాతేన-పరిప్రశ్నేన-సేవయా***
***ఉపదేక్ష్యంతి-తే-జ్ఞానం-జ్ఞానినః-తత్త్వదర్శినః***

| | |
|---|---|
| తత్ జ్ఞానం | = ఆ జ్ఞానమును |
| ప్రణిపాతేన | = సాష్టాంగ నమస్కారము చేత |
| పరిప్రశ్నేన | = సమయ నియమ వినయాలతో ప్రశ్నించుట చేత |
| సేవయా | = సేవ చేత |
| తత్త్వదర్శినః | = తత్త్వమును దర్శించిన వారు |
| జ్ఞానినః | = జ్ఞానులు |
| తే | = నీకు |
| ఉపదేక్ష్యంతి | = ఉపదేశిస్తారు |
| విద్ధి | = తెలుసుకో |

### (1) ప్రణిపాతము

ఆచార్యుని సమీపించిన తరువాత ప్రణిపాతము చేయాలి. ప్రణిపాత మంటే సాష్టాంగ నమస్కారం చేయడము. క్రింద పడి దీర్ఘ నమస్కారం చేయడం. భక్తి శ్రద్ధలతో దండ ప్రణామాలు ఆచరించడము ప్రణిపాతము ***(ప్రకర్షేణ నిపాతః ప్రణిపాతః).*** అలా చేసే ప్రణిపాతము ఆచార్యుని హృదయానికి సంతసాన్ని కలిగించే విధంగా ఉండాలి. తెగిన చెట్టుకొమ్మ లాగా క్రిందపడి, నిప్పు త్రొక్కిన కోతి లాగా లేచిపోవడము కాకుండా, భక్తిశ్రద్ధలతో ఆచరించి నపుడే అది ప్రణిపాతము అవుతుంది. అలా ప్రణిపాతము ఆచరించిన విద్యార్థిలో ఆచార్యునికి ముముక్షువు కనిపిస్తాడు. జిజ్ఞాస కలిగిన శిష్యుడు అగుపిస్తాడు.

శిష్యుడు ప్రణామం చేయాలని గురువు ఆశిస్తాడా? అలా ఆశించేవాడు ఆచార్యుడు అవుతాడా? అలాగని, ఆచార్యునికి నమస్కరించే సంస్కారం కూడా లేని వాడు శిష్యుడు అవుతాడా? అలాంటి సంస్కార హీనుడు ఏమి సాధించాలని గురువును ఆశ్రయించాడు?

విద్యపై గౌరవం లేని వానికి విద్య అబ్బుతుందా? విద్యపై గౌరవం కలవాడు విద్యను బోధించే గురువు విషయంలో గౌరవం లేకుండా ఉంటాడా? మరి, తనలో ఉన్న భక్తి గౌరవాలను వ్యక్తం చేయడానికి ప్రణామం కన్నా మరో మార్గ ముందా? అందుకనే తనకు గురుదేవునిపై ఉన్న భక్తిశ్రద్ధలను ప్రకటించుకొనే ప్రయత్నంలో భాగంగా ఆచార్యునికి వినమ్రుడై ప్రణిపాతం చేస్తాడు.

అంతేకాదు. విద్యార్జనకు తాను సంసిద్ధుడై ఉన్నట్లు ప్రణిపాతము ద్వారా ప్రదర్శించి మరీ చూపుతాడు. గురుదేవా! నేను మీ పాదాల వద్ద పడి శరణాగతుణ్ణి అవుతున్నాను. నా లోని అభిమానాన్ని, అహంకారాన్ని మీ చరణాల చెంత త్యజిస్తున్నాను. మీరు చెప్పినట్లు ఉంటాను. చేయమన్నది చేస్తాను అని తన వినయాన్ని ప్రదర్శిస్తాడు.

వినయమే విద్యార్థికి భూషణము. వినయము లేనివాడు విద్యార్థి కాలేడు. విద్యను గ్రహించలేడు. అహంకారికి విద్య ప్రాప్తించదు. ప్రాప్తించినా శోభించదు. వర్షము కొండలపై పడుతుందే గాని అక్కడ నిలవదు. కొండలపై నుండి జారి జారి క్రిందికి దిగి పల్లపు ప్రదేశాలను చేరి విశ్రమిస్తుంది. జ్ఞానం కూడా అంతే. జలం ఎలాగైతే పై నుండి క్రిందికి ప్రవహిస్తుందో, అలాగే జ్ఞానగంగ ఎత్తైన గురుదేవుని నుండి కదిలి నమ్రత గల శిష్యుని హృదయంలో చేరిపోతుంది. ఇది దృష్టాంతము. దృష్టాంతము ఎప్పుడూ ఏకదేశీయమే అనే విషయాన్ని విస్మరించ కూడదు. ఎత్తైన గురుదేవుడు అంటే ఉన్నతమైన వాడు అని గ్రహించాలి. అంతే.

వినయము లేని వారికి ఎవరూ విద్యను అందించరు. మనం ఆచార్యుని ఆశ్రయించినంత మాత్రాన గురువు మనకు బోధించాలి అనే నియమ మేమీ లేదు. ఆయన బోధిస్తే మన అదృష్టంగా భావించాలి. బోధించక పోతే నష్టపోయేది మనమే కాని గురువు కాదు.

శిష్యుడు వినయం లేని వాడు కావచ్చు. భక్తిశ్రద్ధలు కొరవడిన వాడు కావచ్చు. అలాగని గురువులు బోధించకుండా ఎందుకుండాలి? గురువులు సమద్రష్టలు కదా! అతడికి వినయం లేదు కనుక బోధించము అనుకోవడంలో విషమత్వం లేదా? అని కొందరు పిడివాదాలు వినిపిస్తూ ఉంటారు.

అలాంటి వారికి అర్థం కావలసిన విషయం ఒక్కటే. బోధ దేని కొరకు? గురువు బోధించడం దేనికి? గురువు బోధించిన జ్ఞానం శిష్యునికి వంటపట్టాలా లేదా? వినయం లేని వాడికి, శ్రద్ధాభక్తులు లేని వాడికి బోధించినా ఉపయోగం ఉండదని తెలిసి ఎవరు బోధిస్తారు? అందుకే, వినయం అనేది యోగ్యతా ప్రదర్శనం కావడం చేత ప్రణిపాతము ప్రశస్తం గాను, ప్రధానం గాను చెప్పబడింది. ఇక రెండవది పరిప్రశ్న.





### పరిప్రశ్న

ప్రణిపాతము చేసి శరణాగతుడైన విద్యార్థికి గురువు శాస్త్రాన్ని బోధిస్తూ జ్ఞానాన్ని ప్రసాదిస్తాడు. వెలిగే దీపమే మరొక దీపాన్ని వెలిగించినట్లు, జ్ఞానం కలిగిన గురువే శిష్యుని హృదయ ప్రమిదలో జ్ఞానదీపాన్ని వెలిగించ గలడు.

గురువు బోధించిన జ్ఞానాన్ని శిష్యుడు తన హృదయంలో నిక్షిప్తం చేసుకోవాలి. జ్ఞానం విషయంలో స్పష్టతను కలిగి ఉండాలి. సంశయాలు లేకుండా చూసుకోవాలి. అంతేకాదు, తనలో ఉద్భవించే సందేహాలను ప్రశ్నల రూపంలో ఆచార్యుని ముందు ఉంచి నివృత్తి చేసుకోవాలి. సంప్రదాయంలో శిష్యులైన వారందరు గురువులను ప్రశ్నించి, జ్ఞానాన్ని సంగ్రహించి, బుద్ధిని విశాలం చేసుకున్నారే గాని, బెల్లం కొట్టిన రాయిలా పడి ఉండలేదు.

*కథం బంధః కథం మోక్షః విద్యాఽ విద్యే ఉభేచకే*
*క ఆత్మా కః పరాత్మా చ తయోరైక్యం కథం వద ॥*

గురుదేవా! బంధ మేమిటి? మోక్షం ఎలా కలుగుతుంది? విద్య అనగా నేమి? ఏది అవిద్య? ఆత్మ ఏమిటి? పరమాత్మ ఎవరు? వీరిరువురికి ఐక్యం ఎలా పొసగుతుంది? దయచేసి చెప్పండి *(వద).* అని ఆచార్యుని అనుకూల సమయాలలో ప్రశ్నించి జ్ఞానాన్ని సముపార్జించుకోవాలి. ఇదే పరిప్రశ్న.

శిష్యుని పరిప్రశ్నలో జిజ్ఞాస కనిపించాలి. జ్ఞానేచ్ఛ అగుపించాలి. ప్రశ్నించడములో అహంకారము తొంగి చూడకూడదు. గురువును పరీక్షించాలి అనే దౌర్భాగ్యపు ఆలోచనలు చోటు చేసుకోకూడదు.

పరిప్రశ్నలో మరొక విషయాన్ని కూడా గ్రహించాలి. శిష్యుడైన వాడు గురువును ప్రశ్నించబోయే ముందు తనను తాను ప్రశ్నించుకుంటూ ఉండటం అలవరచుకోవాలి. నలిపితేనే పువ్వు వాసన తెలుస్తుంది. తనను తాను ప్రశ్నించుకోగలిగి నపుడే తన స్థితి ఏమిటో తనకు తెలుస్తుంది. తానెక్క డున్నాడో తనకు అర్థమైతే, తనకు ఏమి కావాలో గురుదేవుని ప్రశ్నించి తెలుసుకొనే అవకాశము, సామర్థ్యము కలుగుతాయి. ఇక మూడవది గురుసేవ.

### గురుసేవ

సేవ అనేది చాలా పవిత్రమైన కార్యము. దీనిని చాలా విశాలంగా అర్థం చేసుకోవాలి. నిస్వార్థంగా, త్యాగపూరితంగా, హృదయ స్పందనతో సాగే సున్నితమైన కార్యము సేవ. సృష్టిలో ఎక్కడ చూచినా మౌనంగా సేవ కదులుతూనే ఉంటుంది. పచ్చని పైరు, వెచ్చని ఎండ, చల్లని నది, దట్టమైన అడవి - అన్నీ సేవలు అందిస్తూనే మనుగడను సాగిస్తున్నాయి.

సేవలో ఏదో చెప్పలేని కృతజ్ఞతా భావం నిండుకొని ఉంటుంది. మానవ జీవితం సేవతో మిళితమై ఉంది. ఎవరైనా, ఎప్పుడైనా, ఎక్కడైనా సేవిస్తూ నైనా జీవించాలి. లేదా, సేవింప బడుతూ నైనా బ్రతకాలి. సేవను మరచి మనుగడను సాగించడం మనిషికి సాధ్యం కాదు.

శైశవంలో, బాల్యంలో తల్లిదండ్రుల లాలనలో, పాలనలో పెరిగాము. మన పనులు మనం చేసుకోలేని స్థితిలో అన్నీ తల్లిదండ్రులే చేసి పెట్టారు. ఒక దశలో వారి సేవలను అందుకున్నాం. మరొక దశలో కృతజ్ఞతా భావంతో మాతాపితల సేవలో సంతృప్తి చెందుతాం.

చెట్లకు నీళ్ళు పోసి పెంచుతాము. అవి కృతజ్ఞతతో ఫలపుష్పాదులను సమర్పించి ఋణం

తీర్చుకుంటాయి. ఈ ఇచ్చిపుచ్చుకోవడా లన్నీ సేవలే. వాస్తవం చెప్పాలంటే, ఈ ప్రపంచమే ఒక ఆదాన ప్రదానశాల. అన్నీ సేవలే. అంతటా సేవలే. సేవ అనేది ఆసుపత్రి లోనే కాదు, అంగడి లోనూ ఉంది. అన్ని సేవలకు ఆధారమై, ఆశ్రయమైన దేహానికి కూడా అనుక్షణం సేవ చేస్తూనే జీవించాలి. దేహము యొక్క ఋణాన్ని దివారాత్రాలు సేవించినా తీర్చుకోలేక పోతున్నాం. ఇక, దైవ ఋణాన్ని తీర్చుకోగలమా? దైవ మేమిటో తెలిపి, మన మేమిటో అర్థమయ్యేలా బోధించి, బంధాలను తొలగించి, జీవితంలో అందాలను పూయించే గురుదేవుని ఋణాన్ని ఎలా తీర్చుకోగలం? గురుఋణము తీరేది కాదు. తీర్చేది కాదు. విద్యాభ్యాసం కాలంలో గురుదేవుని సేవించే భాగ్యము శిష్యులకు లభిస్తుంది. అన్ని సేవల కన్నా అద్భుతమైన సేవ ఆచార్యుని సేవించడమే. ఇదే శుశ్రూష ***(శ్రోతుం ఇచ్ఛ).***

ఆచార్యులకు ఆశలు ఉండవు. వారికి ఆశించడము తెలియదు. వారికి అందించడమే తెలుసు. అందుకోవడం అర్థం కాదు. గురువు అందించే జ్ఞానమును శిష్యుడు శ్రద్ధతో గ్రహించడమే నిజమైన సేవ. అదే శుశ్రూష. గురువులు శిష్యుల నుండి ఆశించేది అదే. అలాంటి గురుబోధను శిష్యుడు గ్రహిస్తున్నాడా, లేదా అనే విషయాన్ని గుర్తించడానికి శిష్యుని అధ్యవసాయము (నిశ్చయము) ఎలా ఉందో అర్థం చేసుకోవడానికి గురువుకు శిష్యుని శుశ్రూషే ఆలంబనము. అందుచేతనే ముముక్షువులైన శిష్యులు గురుసేవా భాగ్యానికై నిరీక్షిస్తూ ఉంటారు. గురువును కలత పెట్టకుండా కళా హృదయంతో జీవనకళను ప్రదర్శిస్తూ ఉంటారు. గురుసేవ లోనే తమకు సర్వము ప్రాప్తిస్తుందని సదా భావిస్తూ ఉంటారు. అదే వాస్తవము కూడా.

***సీ॥ గురుపాదాంభోజముల్ గొలువక కలుగునే ప్రవిమల వైరాగ్య భాగ్యమహిమ !***
***గురుపాద తీర్థంబు గ్రోలక కలుగునే జ్ఞాన విజ్ఞాన యోగానుభవము!***
***గురు సుప్రసాదంబు గొనకున్న గల్గునే ప్రతి లేని చిత్తోప రతిసుఖంబు !***
***గురుతత్త్వ మాత్మగా న్గొనకున్న గల్గునే నిరతిశయంబైన పరమపదము !***

***తే॥ గీ॥ అట్లు గావున విద్యార్థి యైన యోగి వినయ భయభక్తు లెదలోన బెనగొనంగ,***
***నల చతుర్విధ శుశ్రూష లాచరించి కొనుచు ననిశంబు గురువుల గొలుచు ననఘ !***

ఆచార్య సేవనం లోని అద్భుత వైభవాన్ని అసమానమైన రీతిలో అనితరసాధ్యంగా వర్ణించింది సీతారామాంజనేయ సంవాదము అనే తాత్త్విక గ్రంథము.

సీతారామాంజనేయ సంవాదము అనేది తెలుగులో పద్య గద్య రూపంలో శోభించే గొప్ప తాత్త్విక బృహత్ గ్రంథరాజము. ప్రస్థానత్రయ సారమైన ఈ గ్రంథ రచయిత శ్రీ పరశురామపంతుల లింగమూర్తి. పూర్వపు రోజుల్లో ఆంధ్రదేశంలో పెద్దలందరికీ ఈ గ్రంథము సుపరిచితము. ఇప్పుడు గ్రంథప్రతులు కూడా అలభ్యమే. నాకు తెలిసి మూడు దశాబ్దాల క్రితం ఈ గ్రంథం ఏలూరు నుండి ముద్రితమైంది. ఆ ముద్రణమే చివరిది అనుకుంటాను. ప్రస్తుతము అక్కడక్కడ అవే ప్రతులు కనిపిస్తూ ఉంటాయి. అప్పట్లో, ఆ గ్రంథానికి సుదీర్ఘంగా ఉపోద్ఘాతాన్ని నేనే వ్రాశాను. గ్రంథారంభంలో నేను వ్రాసిన పీఠిక, పూర్వాశ్రమ నామధేయంతో నా చిత్రము ఉంటాయి.

**జ్ఞానము - జ్ఞాని**

మోక్షమును అభిలషించేవాడు ముముక్షువు. మోక్షము అనేది జ్ఞానరూపంలో ఉన్నందున, మోక్షమును కాంక్షించే ముముక్షువు జిజ్ఞాసువుగా మారుతాడు. జిజ్ఞాసువైన ముముక్షువే శిష్యుడుగా ఉంటాడు. గురువు





చెంత శ్రవణ, మనన, నిదిధ్యాసనముల ద్వారా జ్ఞానసాధన చేసి, సాధ్యరూపమైన ముక్తి సిద్ధించే ఉందని గ్రహించి తరిస్తాడు. ఈ మొత్తము ప్రక్రియలో ప్రధానాంశాలుగా మనం మూడు విషయాలు తెలుసుకున్నాం. అవి (1) ప్రణిపాతము (2) పరిప్రశ్న (3) పవిత్రమైన గురుసేవ. ఇవి శిష్యుడు విద్యాభ్యాస కాలంలో చేసి చూపవలసినవి. ఇక, శ్రవణ మనన నిదిధ్యాసనములు శిష్యుడు చేయదగినవి. చేసి చూపవలసిన ప్రణిపాతాదులు, చేయదగినవి అయిన శ్రవణాదులతో ముడిపడి ఉన్నాయి అనే విషయాన్ని కూడా సాధకులు అర్థం చేసుకోవాలి.

ప్రణిపాతములో శ్రవణము, పరిప్రశ్నలో మననము, సేవనములో నిదిధ్యాసనము నెలకొని ఉన్నాయి. కనుక సేవాత్రయాన్ని, సాధనత్రయాన్ని విద్యాభ్యాస కాలంలో ఎక్కడా శిష్యులు వేరు చేసి చూడలేరు.

ఇలా జీవించే భావపుష్టి గల శిష్యులకు జ్ఞానియైన గురుదేవుడు జ్ఞానాన్ని బోధిస్తాడు. అజ్ఞానాన్ని నిర్మూలనం చేస్తాడు. అట్టి గురువులు జ్ఞానులే గాక తత్త్వద్రష్టలు కూడా అంటున్నాడు భగవంతుడు ***(జ్ఞానినః జ్ఞానవన్తః, తత్త్వదర్శినః తత్త్వదర్శన శీలాః).***

శ్రోత్రియ బ్రహ్మనిష్ఠులైన వారే గురువులు. ఇక్కడ జ్ఞానులు అంటే శ్రోత్రియులు అని అర్థము. తత్త్వద్రష్టలు అంటే బ్రహ్మనిష్ఠులు అని అర్థము. అలాంటి వారే జ్ఞానాన్ని అందించ గలరు ***(ఉపదేక్ష్యన్తి కథయిష్యన్తి).***

*పల్లవి: కరుణామయ దేవా!*
*జై జై గురుదేవా!*
*అనుపల్లవి: అజ్ఞాన నాశక! సుజ్ఞాన పోషక!*
*సద్గురు మహాదేవా! ॥ కరుణా ॥*
*చరణములు:*
*1. దేశం కాలం మాయాజాలం సోకని నిరామయ!*
*అండ పిండ బ్రహ్మాండంబున వెలసిన వేల్పువయా!*
*మా భ్రాంతిని బాపుమయా! ॥ కరుణా ॥*
*2. నేనే దైవము - మ్రొక్కు నీ వనుచు*
*పలికెదరు సురులు*
*నీవే బ్రహ్మము - నేనే నీ వని పలుకును గురుకవులు*
*మాకు కామధేనువులు ॥ కరుణా ॥*

అని గురు వైభవాన్ని ప్రస్తుతించింది చైతన్య గీతిక.

ఇక్కడ జ్ఞానులు అంటే జ్ఞానవంతులు. శాస్త్రజ్ఞానము సంపూర్ణంగా కలిగిన వారు. పద, వాక్య, న్యాయ, ప్రమాణ నిపుణులు. వ్యాకరణ వైదుష్యముతో పద నిర్దేశము చేసి, తర్క వైభవంతో వాక్య వివరణము అందించి, మీమాంసలో న్యాయాన్ని జతచేసి శాస్త్రార్థాన్ని శిష్యుల బుద్ధికి పట్టించే గురువులే జ్ఞానవంతులు ***(సర్వార్థాన్ గృణాతీతి గురుః).*** వీరే శ్రోత్రియులు. అంతేగాని, శ్రోత్రియులు అంటే శాస్త్రం తెలిసిన వారు అని స్థూలంగా అర్థం చెప్పుకొని, పాయసంలో తిరిగే గరిటె లాగా ***(దర్వీ సూత రసా నివ),*** గ్రంథాలలో తల దూర్చి గిల గిల తన్నుకొనే గ్రంథ కీటకాలను శ్రోత్రియులుగా భావించ కూడదు. పుస్తకాల పురుగులు ప్రచార మాధ్యమాలలో ఊకదంపుడు ఉపన్యాసాలు చేయడానికి పనికొస్తారేమో గాని బోధ చేయడానికి అర్హులు కారు.

## గురువు - గురువులు

బరువును దించేవాడు గురువు. బరువు అనేది శిష్యుని బుద్ధిలో ఉంది. భుజాలపై ఉండే బరువును దించడానికి కొందరు అవసరమైతే కావచ్చు. కాని, బుద్ధి భారాన్ని తొలగించడానికి గురువు ఒక్కడు సరిపోతాడు. విశ్వం లోని చీకటిని పోగొట్టడానికి ఒక్క ఆదిత్యుడు చాలు. వ్యక్తి లోని అజ్ఞానాంధకారాన్ని అదృశ్యం చేయడానికి గురువు ఒక్కడు సరిపోతాడు. పది మంది గురువులు అవసరం లేదు. కాని, అది అవసరం అనే వాదన కూడా ఉంది. జ్ఞానులు, తత్త్వద్రష్టలు బోధిస్తారు అని ప్రస్తుత శ్లోకంలో బహువచన ప్రయోగం ఉండటమే వారి వాదానికి ఆధారము. అది కూడా చెప్పుకుందాం.

***బహుభ్యః శ్రోతవ్యం బహుధా చ*** - అనేకుల వద్ద అనేక విధాలుగా శ్రవణం చేయాలి అనే నానుడి కూడా ఒకటుంది. ఎందుకు చేయాలి? అంటే, ఈ నానుడి సుడిలో పడ్డవాళ్ళు చిత్ర విచిత్రమైన వాదాలను వినిపిస్తారు.

తుమ్మెద రకరకాల పుష్పాలపై వ్రాలి వాటి లోని మకరందాన్ని జుర్రుకొని తృప్తి చెందినట్లు, శిష్యులైన వారు అనేకుల నుండి విషయాల్ని శ్రవణం చేసి సంతుష్టులై తరించాలి అని వారి కవితా హృదయాన్ని ఆవిష్కరిస్తారు. ఇదొక వాదం.

మరొక వాదం వినండి. ఒక గురువును ఆశ్రయించి నపుడు ఆ గురువు సత్యజ్ఞానము లేనివాడైతే, ఆయన వద్ద శుశ్రూష చేసిన వాడు ఏమి సాధిస్తాడు? కనుక, ఒక గురువు వద్ద కాకుండా అనేకులను ఆశ్రయిస్తూ, ఆలకిస్తూ పోతే, ఏది సత్యమో అదే మనకు వంటపట్టి మనం తరించి పోవచ్చు అనేది వీరి వాదన. ఇలా చాలా వాదనలు వినిపిస్తారు. ఇవన్నీ వినడానికి బాగానే ఉంటాయి. వివేకము లేని వారికి వినసొంపు గానే ఉంటాయి. వివేకం కలిగితే అంతా విడ్డూరం గానే ఉంటుంది.

ముందుగా తుమ్మెదల మోత ఏమిటో చూద్దాం. తుమ్మెదకు ఏం కావాలి? తేనె కావాలి. ఎందుకు కావాలి? ఆకలి తీర్చుకొని తృప్తి చెందేందుకు. అంతే కదూ? సరే, ఒక పువ్వు లోని మకరందము తోనే ఆకలి తీరేటప్పుడు, రెండవ పువ్వుపై ఎందుకు వాలాలి? అయినా, అది వాలుతుంది. ఎందుకో తెలుసా! అది తుమ్మెద కనుక.

కాని, మనిషి తుమ్మెద అని నేను భావించడం లేదు. ఉదాహరణకి, ఉదయాన్నే ఒక మనిషికి ఆకలి వేస్తుంది. అల్పాహారం ఆరగించాలని బయలుదేరి, తుమ్మెద పువ్వుపై వాలినట్లు, ఒక హోటల్‌లో కాలు మోపుతాడు.

బావుంది. ఆకలి తీర్చుకొనే ప్రయత్నంలో ఆరగించడం ప్రారంభిస్తాడు. ఆ తినే దేదో ఆ ఒక్క హోటల్ లోనే పూర్తి చేస్తాడా? లేక, తుమ్మెద పువ్వు నుండి పువ్వుకు ఎగురుతూ తేనెను గ్రోలినట్లు, ఒక హోటల్‌లో ఇడ్లీ, మరొక హోటల్‌లో వడ, వేరొక హోటల్‌లో చేయి కడగకుండానే దోసె ఆరగించి, చివరి హోటల్‌లో కాఫీ త్రాగుతాడా? తుమ్మెదతో పోలిక ఎందుకు? నువ్వు తుమ్మినట్లు తుమ్మెద తుమ్ముతుందా? మనిషి ఇకిలించ గలడేమో గాని గుఱ్ఱం లాగా సకిలించగలడా? విషయ సౌలభ్యానికి ఉదాహరణలు ఉపకరిస్తాయి అనడంలో సందేహము లేదు. కాని, ఉదహరించే నేర్పు లేకపోతే ఉదాహరణలు ఉరిత్రాళ్ళు అవుతాయి.

ఇక రెండవ వాదం. ఎంత మంది గురువుల వద్ద వింటే, అంత జ్ఞానాన్ని అందుకొని తరించ వచ్చు అనే నేతి బీరకాయ వాదంలో వాస్తవ మెంత?

జ్ఞాని, తత్త్వద్రష్ట అయిన ఒక్క గురువే పూర్ణ జ్ఞానాన్ని అందించే టప్పుడు, రెండవ గురువు యొక్క





అవసరం ఏమిటి? మొదటి గురువుకు పూర్ణ జ్ఞానం లేదేమో అని సందేహమా? అదే నిజమైతే, రెండవ గురువుకు పూర్ణ జ్ఞానం ఉందని చెప్పడానికి నీకు ఆధార మేమిటి? మొదటి గురువును విశ్వసించిన మనసే కదా రెండవ గురువును ఆశ్రయించేది? పది మందిని ఆశ్రయించినా, పదివేల మందిని ఆశ్రయించినా ఆ మనస్సే కదా? అన్నిట్లో మునగడమే గాని, తేలే దెప్పుడు?

ఇంతకీ జ్ఞానం గల గురువును ఎన్నుకొనే దెవరు? శిష్యుడే కదూ! అతడికి జ్ఞానం ఉందా? జ్ఞానం లేనివాడు జ్ఞానిని ఎలా గుర్తిస్తాడు? ఎలా ఎన్నుకుంటాడు? ఎందరిని ఆశ్రయించినా, జ్ఞానం ఒక్కటే గనుక, దానిని అందించే గురువు ఒక్కడే అయి ఉండాలి. అలాంటి గురువునే ఆశ్రయించాలి.

**ఉపసీదే దేక మేవ సద్గురుం బ్రహ్మవిత్తమమ్**

బ్రహ్మజ్ఞానుల లోనే సద్గురువు లభిస్తాడు. ఉత్తము డైన అట్టి గురువును ఆశ్రయించాలి. ఇదే సంప్రదాయం. అంతేగాని, అందరినీ గురువులుగా స్వీకరించి, అందరు చెప్పింది వింటూ పోతే, అరగంటకు అరగంటకు టెలివిజన్‌లో ప్రచార ఆర్భాటంతో ప్రవచించే వారి ప్రసంగాలను రోజంతా విన్న వారి పరిస్థితి నిద్రపోయే ముందు ఎలా ఉంటుందో, అదే గందరగోళ పరిస్థితి మేలుకు న్నప్పుడు కూడా ఉంటుంది. కాలక్షేపానికి ఏదైతే ఏమి? అంతా మంచిదే కదా! అని అనుకుంటే పొరపాటు లేదు. కాని, కాలుని నోట పడకుండా, గ్రహపాటును తప్పించుకొని తరించాలి అనుకుంటే మాత్రం ఇంతకు మించిన విషవలయం మరొకటి ఉండదు.

వినాలి అనే దురద ఉండే వాడు ఎవరు చెప్పినా వింటూ పోవచ్చు. కాని అవిద్యా బురదను కడిగేసుకోవాలి అనుకునే వారు మాత్రం సద్గురువు నొక్కడినే ఆశ్రయించాలి.

**తద్విజ్ఞానార్థం స గురుమేవ అభిగచ్ఛేత్ సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్!**

నిత్యాత్మను పొందాలని నిర్ణయించుకొని ముముక్షువు సమిధలను చేతపట్టుకొని ***(శుశ్రూష)*** శ్రోత్రియుడు, బ్రహ్మనిష్ఠుడు అయిన గురుదేవుని సమీపించాలి అని ప్రమాణవాక్యం. ఇక్కడ కూడా ***శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్*** అనే ఏకవచన ప్రయోగము జరిగింది అనేది గమనార్హం.

శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడైన సద్గురువు ప్రాప్తించ నపుడు కేవలం శ్రోత్రియు డైనా ఫరవాలేదు. కాకపోతే, శ్రోత్రియునికి కొన్ని ప్రతిబంధకాలు ఉంటాయి. కాని, గురువు శ్రోత్రియుడు బ్రహ్మనిష్ఠుడు కూడా అయితే శిష్యుడు ధన్యు డౌతాడు. శ్రోత్రియుడై ఏది బోధిస్తున్నాడో అలా తాను బోధించే విషయానికి సంబంధించిన పూర్ణజ్ఞానం కలిగిన వాడు బ్రహ్మనిష్ఠుడు. తాను బోధించేది ఏమిటో తెలిసి బోధించేవాడు.

*గురుబోధలో ప్రాప్తించిన జ్ఞానము యొక్క ఫల మెలాంటిది? చెబుతున్నాడు.*

**యజ్ఞాత్వా న పున ర్మోహ మేవం యాస్యసి పాణ్డవ ।**
**యేన భూతా న్యశేషేణ ద్రక్ష్య స్యాత్మ న్యథో మయి ॥** 35

***యత్-జ్ఞాత్వా-న-పునః-మోహం-ఏవం-యాస్యసి-పాండవ***
***యేన-భూతాని-అశేషేణ-ద్రక్ష్యసి-ఆత్మని-అథో-మయి***

| | | | |
|---|---|---|---|
| పాండవ | = అర్జునా! | ఏవం | = ఈ విధంగా |
| యత్ జ్ఞాత్వా | = ఏది తెలిసికొని | మోహం | = మోహమును |
| పునః | = తిరిగి | న యాస్యసి | = పొందవో |

| | | | | | |
|---|---|---|---|---|---|
| యేన | = | దేని చేత | అథో | = | ఆ తరువాత |
| భూతాని | = | భూతములను | మయి | = | నా యందును |
| అశేషేణ | = | సాకల్యముగా | ద్రక్ష్యసి | = | చూడగలవు |
| ఆత్మని | = | నీ యందు | | | |

**పాండవా! జ్ఞానం కలిగితే తిరిగి మోహము కలగదు. ఈ జ్ఞానము చేత సర్వ ప్రాణులను నీ లోను, ఆ తరువాత నా లోను దర్శించ గలుగుతావు. అట్టి జ్ఞానాన్ని తెలుసుకో.**

**వ్యాఖ్య**

మనం వసించే ప్రపంచం రాకపోకల కూడలి. ఇక్కడ వచ్చేవి వస్తుంటాయి. పోయేవి పోతుంటాయి. అంతేకాదు, వచ్చినవి తిరిగి పోతూ ఉంటాయి. అలాగే పోయినవి తిరిగి వస్తూ ఉంటాయి. ఇలా వస్తూ పోతూ, పోతూ వస్తూ చలనశీలంగా ఉండటం చేతనే ఈ ప్రపంచానికి జగత్తు అనే పేరు వచ్చింది ***(జాయతే గచ్ఛతి ఇతి జగత్).***

అలా కాకుండా, వస్తే తిరిగి పోనిది, పోతే తిరిగి రానిది కూడా ఇక్కడే, ఈ ప్రపంచం లోనే అనుభవానికి అందుతూ ఉన్నాయి. అవేమిటో తెలుసా! జ్ఞానాజ్ఞానములు. విద్యావిద్యలు.

అజ్ఞానం పోతే రాదు. జ్ఞానం వస్తే పోదు. వచ్చిన జ్ఞానం పోకుండా ఉంటుంది కనుక, పోయిన అజ్ఞానం తిరిగి రాకుండా పోతుంది. ఎందుకని? తెలియనిది తెలిసిన తరువాత ఇక తెలియనితనం అనేది ఎలా ఉంటుంది? ఈ విషయాన్నే విస్పష్టం చేస్తున్నాడు గీతాచార్యుడు.

## కనిపించని మోహం

అర్జునా! గురువులు బోధించిన జ్ఞానాన్ని పొందిన తరువాత ***(యత్ జ్ఞాత్వా)*** మరల ***(పునః)*** ఈ విధమైన మోహమును ***(ఏవం మోహమ్)*** పొందవు ***(న యాస్యసి)*** అంటున్నాడు గీతాచార్యుడు.

ఉన్న దానిని లేనట్లు, లేని దానిని ఉన్నట్లు చూడటమే మోహం. ఉన్నది ఉన్నట్లు తెలియక పోవడం చేత లేనిది ఉన్నట్లు తెలుస్తుంది. ఇదే అజ్ఞానము. అజ్ఞానం వల్ల మోహం జనిస్తుంది. అజ్ఞానం ఉన్నంత వరకు మోహం ఉంటుంది. అజ్ఞానం నశిస్తే మోహం గతిస్తుంది. జ్ఞానం అజ్ఞానాన్ని హరిస్తుంది. అజ్ఞానం లేకుండా పోతుంది. అజ్ఞానం ఎప్పుడైతే లేకుండా పోతుందో, అజ్ఞాన జనితమైన మోహము కూడా ఉండ లేక తన దారిన తాను పోతుంది.

జ్ఞానం వస్తే అజ్ఞానం పోతుంది. అలాగే అజ్ఞానం కూడా పోతే రాదు. వెలుగు రాగానే చీకటి పోతుంది. వెలుగు ఉన్నంత వరకు చీకటి తిరిగి రాలేదు. జ్ఞానం వస్తే పోదు. వచ్చిన జ్ఞానము పోకుండా ఉన్నందున, పోయిన అజ్ఞానం గాని, అజ్ఞాన జనితమైన మోహము గాని తిరిగి రావు. రాలేవు. తిరిగి రాని వాటిని పొందే దెలా? కనుక ***(పునః మోహం న యాస్యసి)*** తిరిగి మోహాన్ని పొందవు.

మసక చీకటిలో పడి ఉన్న త్రాడు త్రాడుగా తెలియక పోవడం చేత, ఆ త్రాటిలో పాము కనిపించింది. వాస్తవానికి అక్కడ సర్పము లేదు. లేని సర్పము ఉన్నట్లు తెలుస్తూ ఉంది అంటే, ఆ తెలిసే సర్పము ఎక్కడో లేదు రజ్జువు నందే ఉంది ***(రజ్జు సర్పవత్).*** రజ్జు జ్ఞానం కలిగితే సర్పము లేకుండా పోతుంది. 'ఇది త్రాడు' అనే జ్ఞానం కలిగితే, ఆ జ్ఞానం ఇక పోదు. కనుక, మళ్ళీ ఇది సర్పము అనే మోహం కలిగే అవకాశమే లేదు. మోహం పోయింది అంటే శాశ్వతంగా పోయింది అని అర్థము.





మారేది దేహము. మారనిది ఆత్మ. నీవు మారే దేహానివా? లేక మారని ఆత్మవా? నీవు ఆత్మవే. కాని, దేహం అని భావిస్తున్నావు. నీవు ఆత్మవు అనే జ్ఞానం నీకు లేదు. ఆత్మకు సంబంధించిన అజ్ఞానము నీకుంది. అజ్ఞాన జనితమైన మోహం వల్ల దేహమే ఆత్మగా తెలుస్తూ ఉంది. ఒక దశలో మనస్సు ఆత్మగా తెలుస్తూ ఉంది. అందుచేత నేను కర్తను - నేను భోక్తను అని భావించి కలవర పడుతున్నావు. నేను పుట్టేవాణ్ణి - చచ్చేవాణ్ణి అని దిగులు చెందుతున్నావు. ఇదే అజ్ఞాన జనితమైన మోహము.

గురువులు బోధించిన జ్ఞానం వల్ల నీవు ఆత్మవు అని తెలుసుకుంటావు. ఆత్మ అకర్త కనుక నిన్ను నీవు అకర్తగా, అభోక్తగా అర్థం చేసుకుంటావు. నీవు అజుడ వని, అవినాశి వని గ్రహిస్తావు. ఇదంతా జ్ఞాన వైభవము. ఆత్మజ్ఞాన వైభవము. ఆత్మజ్ఞానం కలిగిన తరువాత, నేను దేహము అనే మోహము అదృశ్య మవుతుంది. అలా ఏదైతే అదృశ్యమైందో అది తిరిగి కనిపించదు.

ఇంతవరకు నీవు దేహము అనే అహంకారము ఉండింది. నీవు ఆత్మవు అని తెలియగానే, 'నేను దేహము' అనే అహంకారము పోతుంది. 'నేను' అనేది ఎప్పుడైతే లేదో 'నాది' అనే మమకారం కూడా లేకుండా పోతుంది. ఇదే మోహ నాశము. అజ్ఞాన నాశము. ఇలా నశించిన మోహము తిరిగి రాదు. కాని, ఇక్కడ భగవంతుడు ***ఏవం*** అనే పదాన్ని వాడి 'ఈ' మోహము తిరిగి రాదు అంటున్నాడు. 'ఈ' ***(ఏవం)*** మోహము ఏమిటి? మోహం అనేది సాధారణ ప్రయోగము. 'ఈ' మోహం అనేది ప్రత్యేకించి అర్జునుని ఉద్దేశించి పలికింది.

***ఏవం మోహం -*** 'ఈ మోహము' అంటే బంధువులను యుద్ధంలో వధించడము అనే కారణంగా ఏర్పడిన దుఃఖము అనే మోహము. చస్తారు, చంపుతారు అనే మోహము. ఆత్మ చచ్చేది కాదు, చంపేది కాదు అనే జ్ఞానము లేకపోవడం చేత ఏర్పడిన మోహము. ఈ విధమైన మోహము తిరిగి కనిపించదు అని అర్థము.

అంటే జీవత్వము పోయింది అని అర్థము. జీవత్వం పోతే మిగిలేది ఆత్మత్వం. ఆత్మ అనంతం కనుక అద్వితీయం. ఆత్మ అద్వితీయ మైనపుడు రెండవది ఉండేందుకు వీలు లేదు. ఒకవేళ ఉన్నట్లు కనిపించినా, ఆ ఉన్నదేదో రజ్జువులో సర్పం లాగా ఆత్మ యందే ఉంది. సర్వమూ ఆత్మ యందే ఉంది.

## కళ్ళ ముందే మోక్షం

ఉన్నది ఆత్మ. చూచేది ఆత్మ. చూడబడేది ఆత్మ. చూచుట అనే జ్ఞానము కూడా ఆత్మ. జ్ఞాతృ - జ్ఞాన - జ్ఞేయముల యందు ఉన్న దంతా ఆత్మ చైతన్యమే. కనుక ఆత్మే తానని తెలుసుకున్న ఆత్మవిదుడు సర్వ భూతాలను తన ఆత్మ యందే దర్శిస్తాడు ***(భూతాని అశేషేణ ద్రక్ష్యసి సాక్షాత్ ఆత్మని).***

అదలా ఉంచితే కనిపించే ఈ సృష్టి కార్యానికి పరమేశ్వరుడు అభిన్న నిమిత్త ఉపాదాన కారణ మని ఇప్పటికే తెలుసుకున్నాం కదా! కార్యమైన జగత్తు కారణమైన పరమేశ్వరుని కన్నా వేరుగా ఉందా? ఉండగలదా? ఘట, కలశ, శరావాదులు మృత్తిక కన్నా వేరుగా ఉండగలవా? అలాంటప్పుడు ఈ సృష్టి ఏమిటి? ఈశ్వరుడే. ఈశ్వరుడు జడమా? చైతన్యమా? చైతన్యమే. మరి నీ వెవరు? ఆత్మరూపుడ వైన నీవూ చైతన్యమే. మరి, జీవ చైతన్యము, ఈశ్వర చైతన్యము అని రెండు చైతన్యాలు ఉన్నవా? లేవు. మరి నీ వెవరు? ఈశ్వరుడు ఎవరు? నీవే ఈశ్వరుడవు. ఈశ్వరుడే నీవు. జీవేశ్వరులు ఇరువు రెక్కడున్నారు? ఒక్కటి గానే ఉన్నారు. ఇదే ఉపనిష త్ప్రతిపాదిత మైన జీవేశ్వరైకత్వ సిద్ధి ***(జీవేశ్వరైకత్వ సర్వోపనిషత్ ప్రసిద్ధం ద్రక్ష్యసి ఇత్యర్థః).*** ఇదే అఖండ అద్వైత దర్శనం. అద్వయ దర్శనం. ఏకత్వానుభూతి. ఆ ఏక వస్తువును నీవుగా భావిస్తే, ఉన్న వన్నీ నీ లోనే ఉన్నాయి అనే అద్భుత దర్శనం కలుగుతుంది ***(ద్రక్ష్యసి ఆత్మని).*** దానినే ఈశ్వరు డని భావిస్తే, ఉన్న వన్నీ

ఈశ్వరుని లోనే ఉన్నాయి అనే అద్వైతానుభూతి కలుగుతుంది ***(మయి వాసుదేవే పరమేశ్వరే భూతాని అశేషేణ ద్రక్ష్యసి)***. ఈ సమస్తము ఆత్మయే ***(ఆత్మైవేదం సర్వం)*** అనే జ్ఞానం కలిగిన తరువాత మోహం మళ్ళీ కనిపిస్తుందా? అనేకత్వ భ్రాంతి కలుగుతుందా? మోహము ఎలా వస్తుంది? శోకం ఎలా ఉంటుంది? ప్రస్తుత శ్లోకంలో దివ్యంగా ప్రవచింప బడిన ఈ సత్యమునే ఈశావాస్యోపనిషత్తు కూడా ధృవ పరచింది.

***యస్మిన్ సర్వాణి భూతాని ఆత్మైవా భూ ద్విజానతః***
***తత్ర కో మోహః కః శోకః ఏకత్వ మనుపశ్యతః ॥***

ఆత్మ తత్త్వము నెరిగిన జ్ఞానికి సర్వభూతములు ఆత్మ గానే తెలుస్తున్నాయి. అలాంటి వ్యక్తిలో మోహము ఎక్కడుంటుంది? శోక మెలా వస్తుంది? అని ఈశావాస్యోపనిషత్తు ప్రశ్నించింది.

*జ్ఞాన వైభవాన్ని తరువాత శ్లోకంలో కూడా వివరిస్తూ కొనసాగిస్తున్నాడు.*

**అపి చేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః ।**
**సర్వం జ్ఞానప్లవే నైవ వృజినం సంతరిష్యసి ॥** 36

***అపి-చేత్-అసి-పాపేభ్యః-సర్వేభ్యః-పాపకృత్తమః***
***సర్వం-జ్ఞానప్లవేన-ఏవ-వృజినం-సంతరిష్యసి***

| | | | |
|---|---|---|---|
| సర్వేభ్యః పాపేభ్యః | = పాపులందరి కంటె | సర్వం వృజినం | = సమస్త పాపమును |
| పాపకృత్తమః | = ఎక్కువ పాపములు చేసిన వాడవు | జ్ఞానప్లవేన ఏవ | = జ్ఞాన మనే తెప్ప చేత |
| అపి చేత్ అసి | = అయినను | సంతరిష్యసి | = దాటుతావు |

**అర్జునా! పాపాత్ము లందరి కంటే నువ్వు మిక్కిలి పాపాత్ముడవే అయినా, అట్టి పాప సముద్రాన్ని జ్ఞాన మనే తెప్ప చేత చక్కగా దాటేస్తావు.**

**వ్యాఖ్య**

భయాలు, బాధలు మనిషికి క్రొత్తవి కావు. భయపడుతూ బ్రతకడం, బాధపడుతూ బ్రతుకును కొనసాగించడం అనివార్యమే కావచ్చు. కాని ఆనందప్రదం కాదు. భయం మనిషిని కృంగ దీస్తుంది. బాధ మనిషిని కృంగిపోయేలా చేస్తుంది.

ఈ భయాలకు, బాధలకు కారణా లున్నాయా? ఉంటే, అవి బాహ్యంలో ఉన్నాయా? ఆంతర్యంలో ఉన్నాయా? అసలు ఉండి బాధిస్తున్నాయా? లేక, లేకనే ఉన్నట్లుగా బాధిస్తున్నాయా? ఉన్నవి అయితే, బాహ్యంలో గాని, ఆంతర్యంలో గాని వాటిని ప్రయత్నం చేసి పోగొట్టుకోవచ్చు. ఒకవేళ లేకనే ఉన్నట్లు అగుపించి ఆవేదనకు గురి చేస్తూ ఉంటే, అలాంటి వాటి విషయంలో చేయగలిగింది ఏమీ ఉండదు, అర్థం చేసుకోవడం తప్ప. పాపం విషయం కూడా అంతే. పాపం భీతిని కలిగిస్తుంది. భయాన్ని పుష్టిస్తుంది.

ఈ క్షణంలో సుఖంగా ఉండే వ్యక్తి మరి కొన్ని గంటల్లో భయానికి లోను కావచ్చు. అప్పుడు భయం వచ్చేదిగా మనకు కనిపిస్తుంది. అంతేగాని, రాక ముందే మనలో ఉంది అనేది అర్థం కాదు. నిష్కారణంగా మనలో అనేక భయాలు చేరిపోయి ఉన్నాయి. క్రొత్తగా సంక్రమించేవి అగ్నికి ఆజ్యం పోసినట్లు, ఉన్న వాటికి తోడై ఆవేదనను అధికం చేస్తాయి.

అర్జునుడు ధర్మాత్ముడు. అధర్మం ఎరుగడు. పుణ్యాత్ముడు. ఏ పాపమూ ఎరుగడు. పాపం చేసే అసుర





స్వభావం లేనివాడు. దైవ సంపదతో పుట్టిన వాడు. ఈ విషయంలో సాక్షాత్తు భగవంతుడే సాక్షిగా నిలిచాడు.

**మా శుచః సంపదం దైవీ మభిజాతోఽసి పాండవ !**

పాండుతనయా! అర్జునా! నువ్వు దైవ సంపదను అనుసరించి జన్మించావు. దుఃఖించకు నాయనా! ***(మా శుచః)*** అని భగవంతుడే గీత - షోడశోధ్యాయంలో స్వయంగా అర్జునునికి యోగ్యతా పత్రాన్ని ఇచ్చి ఆశీర్వదించాడు.

అర్జునుడు పాపం చేయలేదు. ఏ పాప కార్యము చేయలేదు. అయినా పాపాన్ని ఊహించుకొని భయపడుతున్నట్లు విషాదయోగం లోనే కనిపిస్తాడు.

కృష్ణా! దుర్యోధనాదుల్ని చంపడం వల్ల మాకు పాపం వస్తుంది అన్నాడు ***(పాపమే వాశ్రయే దస్మాన్ హత్వైతాన్ - 1 - 36)***. పాపము నుండి మేము ఎలా విడిపడాలో తెలియడం లేదు అని కూడా అన్నాడు ***(కథం న జ్ఞేయం అస్మాభిః పాపా దస్మాత్ నివర్తితుమ్, 1 - 39)***. అయ్యో! ఎంత ఆశ్చర్యము! మహా పాపాన్ని చేయడానికి సిద్ధపడ్డాము కదా! అని విస్తుపోయాడు ***(అహో బత మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్ - 1- 45)***. ఇదంతా ఏమిటి? సర్వజ్ఞుడైన శ్రీకృష్ణుడు అర్జునుణ్ణి పాపరహితుడుగా అంగీకరిస్తుంటే, తాను పాపం చేసినట్లు, చేయబోతున్నట్లు అర్జునుడు భయకంపితు డౌతున్నాడు.

ఇంతకీ అర్జునుని భయానికి కారణమైన పాపము ఉండి బాధిస్తూ ఉందా? లేకనే ఉన్నట్లుగా ఉండి బాధిస్తుందా? ఏమో! అర్థమై చస్తే కదా చెప్పడానికి! అదే అజ్ఞానము అంటే. అర్థం కాకపోవడము అంటేనే అజ్ఞానం ఉంది అని భావము. ఈ అజ్ఞానమే సర్వ భయాలకు, బాధలకు కారణము. అజ్ఞానం ఉన్నంత వరకు భయాలు, బాధలు అంటిపెట్టుకొనే ఉంటాయి. అజ్ఞానం నశిస్తే బాధలు, భయాలు పూర్తిగా లేకుండా పోతాయి. అజ్ఞానం ఎలా నశిస్తుంది? జ్ఞానం వల్ల నశిస్తుంది. కనుక, జ్ఞానం అనేది మనిషికి భగవంతుడు అందించే ఆశీర్వాదం. అదే అభయ ప్రదానం. అభయవరం.

**పాప భయం సహజం**

నేను ఎన్నో తప్పులు చేశాను. చేయకూడని పాపాలు చేశాను. పశ్చాత్తాపంతో కుమిలి పోతున్నాను. నేను ఏయే పాపాలు చేశానో నాకే తెలుసు. నా లాంటి పాపి మరొకడు ఉండడు. నన్ను గూర్చి మీకు తెలియదు. తెలిస్తే నా ముఖం కూడా చూడరు. నాలో అంతా పాపమే. అధర్మమే. నేను చేసిన దంతా పాపమే. అందుకే భగవంతుడు నాకు శాంతి లేకుండా చేశాడు - ఇలా మాట్లాడుతూ బాధపడే వారిని ప్రతిరోజు మనం చూస్తూ ఉంటాము. ఇలాంటి వారే ఎక్కువ శాతం ఆలయాలలో, ఆధ్యాత్మిక ప్రసంగాలు జరిగే ప్రదేశాలలో పని గట్టుకొని ఏడుస్తూ కనిపిస్తారు. పాపానికి సంబంధించిన ఊహలే వారిని అలా ఆవేదనకు గురి చేస్తూ ఉంటాయి. ఇది అర్థం గాక, ఏదో తన ప్రవచన ప్రభావానికే వారు అలా పరవశించి, తన్మయులై కన్నీళ్ళ పర్యంతం అవుతున్నారని ప్రసంగి కూడా అధికంగా ఆవేశానికి లోనవుతూ ఉంటాడు. ఇదొక జాతర! అందరూ అలాంటి వారని నా అభిమతం కాదు. ప్రత్యేకతలు వాటి ప్రాధాన్యాన్ని అవి సంతరించుకుంటూనే ఉంటాయి. అందుకే 'ఎక్కువ శాతం' అని ప్రత్యేక స్పృహతో వ్రాస్తున్నాను. అందరూ టెలివిజన్ చూచే వారే కనుక, మీకు తెలియదని నేను వ్రాయలేదు. నేను తెలియజెప్పాలి కనుక వ్రాశాను. అంతే.

పాపం కన్నా పాప భావనే బుద్ధిని బుగ్గిపాలు చేస్తూ ఉంటుంది. దానికి తోడు, **ముందే ముక్కిడి - పైగా పడిసెము** అనే సామెత చందంగా పాప భయంతో ముందే మనిషి దిగాలు పడుతుంటే, నువ్వు పాపం తోనే

పుట్టావు, నువ్వు జన్మతః పాపివి అంటూ కొందరు ప్రబోధకులు అదే పనిగా చెవిలో ఇల్లు కట్టుకొని జోరీగ ల్లాగా రొద చేస్తూ ఉంటారు. ఇదెక్కడి చోద్యమో!

మనిషి పాపంతో ఎలా పుడుతాడు? పూర్వజన్మలో పాపం చేసి ఉండాలి. పోనీ అలా సరిపెట్టుకుందా మంటే, జన్మలు లేవు, ఉండేది ఒకే జన్మ అంటారు. మరి, గత జన్మ లేనపుడు, ప్రతి మనిషికి ఒకే జన్మ ఉన్నపుడు, పుట్టిన తరువాత పాపం చేశాడు అంటే అర్థం చేసుకోగలం. పాపం తోనే పుట్టాడు అంటే, దానిని ఎలా అర్థం చేసుకోవాలో నా వరకైతే నాకు ఎంత ఆలోచించినా అంతు పట్టడం లేదు. బాల్యంలో నేను ఆసనాలు వేసేవాణ్ణి. అప్పుడు కూడా నాకు శీర్షాసనం ఒక్కటే వచ్చేది కాదు. కాని, ఇప్పుడు ఈ విషయాన్ని ఆలోచిస్తూ ఉంటే, శీర్షాసనం రాకపోయినా వేసినట్లే ఉంటుంది.

సరే, అదలా ఉంచండి. చేయని నేరానికి జన్మతః మనిషి పాపిగా పుట్టాడనే అనుకుందాం. పాపిగా పుట్టిన వాడు పెరుగుతూ పాపం చేయడం తప్పు ఎలా అవుతుంది? పాపిగా జన్మ నెత్తిన వాడు పాపం కాక మరేం చేస్తాడు? ఏ పాపం చేయకనే పాపపు జన్మ ఎత్తి నపుడు, జీవించడానికి పాపం చేస్తే తప్పేమిటి? తప్పు కానపుడు పాపం చేయడం తప్పు అంటూ బోధలు చేయడం ఎందుకు?

పాపాన్ని తలచుకొని భీతి చెందేవారు కొందరైతే, పాపాన్ని చూపెట్టి భయపెట్టే వారు మరి కొందరు. మరి ఈ భయాలకు, బాధలకు కారణమైన పాపాన్ని పోగొట్టే వారెవరు? ఈ పాపపు మూటల్ని మూలుగుతూ ఎంత కాలం మోయాలి? భయపడకండి! భయాలను పోగొట్టి అభయ ప్రదానం చేసే గీతాచార్యుడు పరిష్కారాన్ని చేత పట్టుకొని సిద్ధంగా ఉన్నాడు. వినండి!

**మహాపాపానికి మహిమ గల మందు**

అర్జునా! పాపాత్ము లందరి కంటే ***(సర్వేభ్యః పాపేభ్యః)*** నీవు మిక్కిలి పాపాత్ముడివి అయినా ***(పాపకృత్తమః అసి చేత్ అపి)*** జ్ఞానం అనే తెప్ప చేత ***(జ్ఞాన ప్లవేన ఏవ)*** సమస్త మైన పాపాన్ని ***(సర్వమ్ వృజినమ్)*** చక్కగా దాటేస్తావు ***(సంతరిష్యసి)*** అంటున్నాడు భగవంతుడు.

దేహానికి వ్యాధులు రాకపోవు. వ్యాధి వచ్చినపుడు మందు తీసుకుంటాం. వ్యాధి నయ మవుతుంది. కాని, కొన్ని మొండి వ్యాధు లుంటాయి. అవి వస్తే, మనిషి పోవలసిందే గాని అవి పోవు. అలాంటి వ్యాధుల విషయంలో మనుషులు భయ భ్రాంతులకు లోనవుతూ ఉంటారు. వ్యాధులలో తరతమ భేదా లున్నట్లే, పాపాలలో కూడా తరతమ భేదా లుంటాయి.

సాధారణ పాపాలు చేసేవాడు 'పాపకృత్'. అసాధారణ పాపాలు చేసేవాడు 'పాపకృత్తరుడు'. మిక్కిలి భయంకరమైన పాపాలు చేసేవాడు 'పాపకృత్తముడు'. మొండి వ్యాధికి చికిత్స ఉండదు కనుక, అలాంటి రోగికి వైద్యం చేయడానికి వైద్యుడు సాహసించడు. కాని, పాపం విషయంలో మిక్కిలి దారుణమైన పాపాన్ని చేసిన వ్యక్తిని ***(పాపకృత్తమః)*** ఎన్నుకొని, అతని మహాపాపాన్ని పోగొట్టే మహిమ గల దివ్యౌషధము ఉంది అని సాహసోపేతంగా అభయ ప్రదానం చేస్తున్నాడు బృందావన భిషగ్వరుడు. అమృతమయ మైన ఆ దివ్యౌషధమే జ్ఞానము. ఆత్మజ్ఞానము.

పాపాలు చేసే పాపాత్ముడు ఎక్కడుంటాడు? పాపాల మధ్యే ఉంటాడు. మరి, అతిశయించిన పాపాలను చేసిన పాపకృత్తముడు ఎక్కడుంటాడు? వాడు చేసిన వన్నీ, చేసే వన్నీ పాపాలే కనుక పాప సముద్రంలో పడి ఉంటాడు. మరి, ఈ పాప సముద్రాన్ని అతడు ఎలా దాటుతాడు? సాధారణంగా మనుషులు సముద్రాన్ని ఎలా దాటుతారు? నావ చేత దాటుతారు. ఇక్కడ కూడా అంతే. జ్ఞానము అనే నావ ***(ప్లవః)*** చేత దాటుతారు.





నావ ఉండాలే గాని సముద్రం ఎంత గంభీర మైతే మాత్రం ఏమవుతుంది? జ్ఞానం అనే నావ ఉండాలే గాని పాప సముద్రాన్ని దాటడం కష్టమా?

*ఏనాటి పాపమో నీకు దూర మైతి*
*ఎవరు పెట్టిన శాపమో తిరిగి చేర నైతి*
*నీవు వెలిగించు దీపమే దిక్కు నాకు*
*నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!*

అని ఒక చైతన్య వెన్నముద్ద.

**విజ్ఞాన నౌక**

జ్ఞానము అనే నావ చేత పాప సముద్రాన్ని అవలీలగా దాటేయవచ్చు అంటున్నాడు గీతాచార్యుడు. ఇంతకీ ఆ జ్ఞాన మేమిటి? ఆత్మజ్ఞానమే. ఆత్మే తాను అనే జ్ఞానము. ఆత్మ తాను అని తెలియడ మంటే, ఆత్మ అకర్త, అభోక్త అని అర్థం చేసుకోవడము. ఆత్మ అకర్త అనే జ్ఞానము ఎంతవర కైతే కలగదో, అంతవరకు తాను జీవుడు అనే ప్రతివాడు భావిస్తూ ఉంటాడు.

ఎవడు కర్తగా తెలుస్తున్నాడో వాడే జీవుడు. ఇంతకీ కర్త ఎవరు? కర్మ చేసేవాడు. దేహేంద్రియ ప్రాణ మనోబుద్ధులతో తాదాత్మ్యం చెంది, ***అహం కరోమి*** - నేను చేస్తున్నాను అని భావించేవాడే జీవుడు. ఆత్మే జీవుడు అని భావించి జీవాత్మ అంటాడు. ఇలా భావించడం చేత, జీవుడు ఆచరించే కర్మలను ఆత్మ యందు ఆరోపించుకొని, ఆత్మను కర్తగా భావిస్తాడు. ఆత్మ యైన తాను కర్తను అనుకుంటాడు. కర్మ చేసే దెవరు? ఇంకెవరు? కర్తే కదా! మరి, పాపం చేసింది ఎవరు? తానే. పాపకర్త ***(పాపకృత్).*** తానే పాపం చేసిన వాడుగా తెలుస్తూ ఉన్నాడు కనుక, ఈ పాపం నుండి ఎలా బయట పడాలి? అని దుఃఖిస్తూ ఉంటాడు.

ఇంతకీ ఆత్మ కర్తా? లేక, అకర్తా? ఆత్మ చైతన్య స్వరూపము కనుక అఖండంగా ఉంది. అఖండమైన చైతన్యము అనంతము కనుక అది నిష్క్రియము. అంటే, కర్మకు అవకాశము లేనిది. కర్మ చేయనిది. చేయలేనిది. అట్టి ఆత్మ కర్త ఎలా అవుతుంది? కాదు. కాలేదు. ఇంతకీ నీ వెవరు? నేను ఆత్మను. అయితే నీవు అకర్తవు. ఇప్పుడు చెప్పు! పాపం చేసిం దెవరు? ఎవరైనా కావచ్చు. నువ్వు మాత్రం కావు. ఎందుకని? నువ్వు అకర్తవు కనుక. ఇది జ్ఞానము. నీవు ఆత్మవు, అకర్తవు అనే జ్ఞానము. నీవు ***(త్వం)*** ఆత్మవే, లేదా బ్రహ్మమే ***(తత్)*** అయి ఉన్నావు ***(అసి).*** ఇది జ్ఞానము. తత్త్వమసి మహావాక్య జ్ఞానము. ఈ తత్త్వమసి జ్ఞాన నౌక చేత కర్మ సముద్రాన్ని అవలీలగా దాటేయవచ్చు అంటున్నాడు భగవంతుడు.

**పాప సాగర తరణము**

నీవు ఆత్మవు. ఆత్మ అకర్త. కనుక నీవు అకర్తవు. ఇది సత్యజ్ఞానము. నేను కర్తను అని భావించడం మిథ్యా జ్ఞానము. అకర్తే సత్యము. కర్త సత్యము కాదు అని తెలియడమే జ్ఞానము. మరి కర్త ఎవరు? మిథ్య. మిథ్యగా తెలిసే కర్త ఆత్మ కాదా? అలా అనడం లేదు. కర్త ఆత్మే. కాని, ఆత్మ కర్త కాదు. అకర్త.

స్వప్నంలో స్వప్నద్రష్ట ఏవేవో చేస్తాడు. మంచిచెడులు ఎన్నో ఆచరిస్తాడు. దానం చేస్తాడు. దహనం చేస్తాడు. చివరికి మేలుకుంటాడు. స్వప్నంలో ఇవన్నీ చేసినవాడు, మేలుకున్నవాడు ఒక్కడేనా? లేక ఇద్దరా? ఒక్కడే. స్వప్నంలో పాపం చేసిన వాడెవరు? మేలుకున్న వాడే. మరి, మేలుకున్న వాడికి స్వప్నగత పాపాలు అంటుతాయా? అంటవు. ఎందుకని? మేలుకున్నవాడు **పాపకృత్** కాదు. ఇదీ జ్ఞానం.

స్వప్నంలో ఉన్న కర్త ఎలా సత్యం కాదో, జాగ్రదవస్థలో కర్మ పంకిలంలో కూరుకుపోయిన కర్త కూడా సత్యం కాదు. ఆత్మయే సత్యం. అకర్తయే సత్యం. అది నీవే. నీవు అకర్తవు. ఈ సత్యం అర్థం గాక నేను కర్తను అని నీవు భావించినా, వాస్తవానికి నీవు కర్తవు కావు. కర్తవు కానపుడు పాపివి ఎలా అవుతావు? నువ్వు పాపివి అని నీవు అనుకున్నా, నీవు పాపివి కావు.

ఇది సత్యం. ఈ సత్యం అర్థం కాని వాడు కూడా నువ్వు పాపివి కావు అనగానే వెంటనే ఒప్పేసుకుంటాడు. నీ పాపం నీది కాదు అనేది అందరికీ అంగీకారమే. పాపం నీది కానపుడు, పుణ్యం మాత్రం నీ దెలా అవుతుంది? కాని, పుణ్యం నీది కాదు. పుణ్యఫలం నీకు లేదు అంటే, ఇంత జ్ఞానాన్ని విన్న మనిషి కూడా అంగీకరించడు. అలా అంగీకరించక పోవడం మానవ నైజం. కాని, అది మహర్షి నైజం కాదు. జ్ఞాని నైజం కాదు.

తీసుకున్న అప్పు తిరిగి ఇవ్వ నవసరం లేదు అనే వాక్యము అందరికీ వినసొంపుగా ఉంటుంది. ఏ అప్పు? ఎవరి అప్పు? అనే ప్రశ్నలు పడ్డప్పుడే శీర్షాసనం అనుభవానికి అందుతుంది. మనం తీసుకున్న అప్పు తిరిగి ఇవ్వ నవసరం లేదు అంటే హాయిగా ఉంటుంది. మన వద్ద నుండి తీసుకున్న అప్పు తిరిగి ఇవ్వ నవసరం లేదు అంటే ఎలా ఉంటుంది? గొంతులో వెలగపండు పడ్డట్టే ఉంటుంది. ఇదే మానవ నైజం.

కాని, జ్ఞాన మనే ఓడలో పుణ్యపాపాలు రెండిటికి స్థానం లేదు. ఆత్మ అకర్త అని తెలియగానే పాపం చేసిన వాడూ లేడు. పుణ్యం చేసిన వాడూ లేడు. పుణ్యకర్మ అయినా, పాపకర్మ అయినా కర్త ఉంటేనే. కర్త ఉంటే జ్ఞానం లేనట్లే. కనుక 'పాపం' అన్నప్పుడు అది ఉపలక్షణం అని గ్రహించాలి. పాపం అంటే, పుణ్యం కూడా అని అర్థం. అందుచేత పాప సముద్రాన్ని దాటుతాడు ***(వృజినార్ణవం పాప సముద్రం సంతరిష్యసి)*** అంటే, పుణ్యపాపాల సముద్రాన్ని దాటుతాడు అని అర్థం చేసుకోవాలి. ఆచార్యుల వారి భాష్యము అలాగే ఉంది. ***ధర్మః అపి ఇహ ముముక్షోః పాపమ్ ఉచ్యతే*** - ముముక్షువుకు ధర్మం లేదా పుణ్యం కూడా పాపం గానే చెప్పబడుతుంది అని శ్రీ శంకరభాష్యము.

**తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ నిరంజనః పరమం సామ్య ముపైతి**

అప్పుడు జ్ఞాని పుణ్యపాపాల నుండి విడిపడి, నిరంజనుడై, ఆత్మే పరమాత్మ అనే సమస్థితిని పొందుతున్నాడు అని వేద ప్రమాణము.

ఈ విధంగా జ్ఞానము అనే నావ నెక్కి పుణ్య పాప సాగరాన్ని దాటి, శాంతి తీరాన్ని చేరి తరించి పోతున్నాడు ఆత్మవిదుడు ***(సర్వం జ్ఞాన ప్లవేనైవ వృజినం సంతరిష్యసి).*** అకర్త యైన ఆత్మ తానే అని తెలిసిన ఆత్మజ్ఞాని సమస్త పాపాన్ని దాటిపోతున్నాడు అన్నది శ్రుతిమాత ***(సర్వం పాప్మానం తరతి).***

ఈ శ్లోకంలో భగవానుడు పాపాన్ని ప్రోత్సహించడం లేదు. అలాగని, పాపాన్ని నిరసించడమూ లేదు. జ్ఞానాన్ని ప్రశంసిస్తున్నాడు. అంతే.

*ఆత్మజ్ఞానం పాపాన్ని ఎలా నశింప చేస్తుందో సోదాహరణంగా వివరిస్తున్నాడు.*

యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసా త్కురుతేఽర్జున ।
జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసా త్కురుతే తథా ॥ 37

**యథా-ఏధాంసి-సమిద్ధః-అగ్నిః-భస్మసాత్-కురుతే-అర్జున**
**జ్ఞానాగ్నిః-సర్వకర్మాణి-భస్మసాత్-కురుతే-తథా**





| | | | | | |
|---|---|---|---|---|---|
| అర్జున | = | అర్జునా! | భస్మసాత్ కురుతే | = | భస్మం చేస్తూ ఉందో, |
| సమిద్ధః | = | బాగా మండుతున్న | తథా | = | అలాగే |
| అగ్నిః | = | నిప్పు | జ్ఞానాగ్నిః | = | జ్ఞాన మనే అగ్ని |
| యథా | = | ఎలా | సర్వకర్మాణి | = | సర్వ కర్మలను |
| ఏధాంసి | = | కట్టెలను | భస్మ సాత్ కురుతే | = | భస్మం చేస్తూ ఉంది |

**అర్జునా! ప్రజ్వలించే అగ్ని కట్టెలను భస్మం చేస్తుంది కదా! అలాగే జ్ఞాన మనే అగ్ని కర్మల నన్నిటినీ భస్మం చేస్తుంది.**

**వ్యాఖ్య**

జ్ఞాన మనే నావ చేత ఆత్మవిదుడు పాప సముద్రాన్ని దాటుతాడు అని అర్థం చేసుకున్నాం. సముద్ర యానం చేసేవాడు సముద్రాన్ని దాటి తీరం చేరవచ్చు. అతడు దాటేశాడు కదా అని సముద్రం అదృశ్య మవుతుందా? అలాగే ఆత్మవిదుడు పాప సముద్రాన్ని దాటవచ్చు. అంతమాత్రాన పాపం పోతుందా? పాపం నశిస్తుందా? సముద్ర తరణము జరిగిన తరువాత కూడా సముద్రము అలాగే ఉన్నట్లు, పాప సాగర తరణము జరిగిన తరువాత, పాపం కూడా అలాగే నశించకుండా ఉండవచ్చు కదా! అనే శంకను పరిహరిస్తూ, ఆత్మజ్ఞానము కలిగిన తరువాత పాపము సమూలంగా నశించి పోతుందని దృష్టాంత పూర్వకంగా చెబుతున్నాడు ***(జ్ఞానం కథం నాశయతి పాపమ్ ఇతి సదృష్టాంతమ్ ఉచ్యతే).***

**మందాగ్ని కాదు - మండే అగ్ని**

ప్రజ్వలించుచున్న అగ్ని ***(సమిద్ధః అగ్నిః)*** కట్టెలను ***(ఏధాంసి)*** భస్మం చేస్తుంది ***(భస్మసాత్ కురుతే).*** అలాగే, జ్ఞానాగ్ని ***(జ్ఞానాగ్నిః)*** సమస్తమైన కర్మరాశిని ***(సర్వ కర్మాణి)*** భస్మం చేస్తుంది ***(భస్మసాత్ కురుతే).***

అగ్ని అంటే, నిప్పురవ్వ కూడా అగ్నే. వెలిగే వత్తి కూడా అగ్నే. కాని, ఇలాంటి మందాగ్నులు కట్టెలను దగ్ధం చేయడానికి ఉపకరించవు. రాశి పోసిన కట్టెలను భస్మం చేయాలి అంటే, అది ప్రజ్వలితాగ్నిగా ఉండాలే గాని మందాగ్నిగా ఉంటే సరిపోదు. అందుచేత, ***సమిద్ధః అగ్నిః*** అన్నాడు భగవంతుడు. అలాగే కర్మ రాశిని భస్మం చేయడానికి అల్పజ్ఞానాలు, స్వల్ప జ్ఞానాలు పనికిరావు. పూర్ణ జ్ఞానమే కర్మ సమూహాన్ని పూర్తిగా నశింప చేస్తుంది. అదే జ్ఞానాగ్నిగా చెప్పబడింది.

జ్ఞానాగ్ని అంటే జఠరాగ్ని అనే పదాన్ని అర్థం చేసుకున్నట్లు కాదు. జఠరంలో, అంటే కడుపులో ఉండే అగ్ని కనుక అది జఠరాగ్ని అయింది. ఇక్కడ జ్ఞానాగ్ని అంటే జ్ఞానములో ఉండే అగ్ని అని కాదు. జ్ఞానమే అగ్ని అని అర్థం చేసుకోవాలి ***(జ్ఞానమేవ అగ్నిః).*** ఈ జ్ఞానాగ్ని సర్వ కర్మలను భస్మం చేస్తుంది.

ఈ విషయము అనేక సూక్ష్మాంశాలతో నిండి ఉంది. కాస్త అవధానంతో అర్థం చేసుకోవాలి. మండే అగ్ని కట్టెల మోపును భస్మం చేస్తుంది అంటే అర్థం చేసుకోగలం. జ్ఞానాగ్ని కర్మ సమూహాన్ని దగ్ధం చేస్తుంది అన్నప్పుడు విషయం జటిలంగా మారుతూ ఉంది.

**జ్ఞానం కర్త అవుతుందా?**

కర్మ క్షయానికి జ్ఞానము ఎలా సాక్షాత్తు కారణము? అనేది శంక. కర్మనాశము విషయంలో జ్ఞానానికి ప్రత్యక్ష ప్రమేయము ఉందా? జ్ఞానము అజ్ఞాన విరోధి. వెలుగు చీకటిని నిర్మూలించి నట్లు, జ్ఞానము అజ్ఞానమును నశింప చేస్తుంది. కర్మనాశము ఎలా చేస్తుంది?

అజ్ఞాన నివృత్తి విషయంలో కూడా ఒక్క విషయాన్ని మనం మరచి పోకూడదు. చీకటిని పోగొట్టాలి అనే

కర్తృత్వ బుద్ధితో వెలుగు రాలేదు. వెలుగు వస్తుంది. చీకటి అదృశ్య మవుతుంది. వెలుగులో నిలిచే శక్తి చీకటికి లేదు. అలాగని వెలుగుకు కర్తృత్వాన్ని ఆపాదించ గలమా? అజ్ఞానం విషయంలో జ్ఞానం పాత్ర కూడా అలాంటిదే.

జ్ఞానం వస్తుంది. అజ్ఞానం అదృశ్య మవుతుంది. జ్ఞానాజ్ఞానములు రెండూ ఒక్క చోట ఉండలేవు. చీకటి వెలుగుల్ని ఒకే చోట చూడలేము కదా! అజ్ఞానాన్ని పోగొట్టాలి అనే కర్తృత్వ బుద్ధి జ్ఞానానికి ఉండదు. కర్తృత్వ బుద్ధి జ్ఞానానికి ఉంటే, అది జ్ఞానం అనిపించుకోదు. కర్మ అనిపించు కుంటుంది. కనుక అజ్ఞానాన్ని నివృత్తి చేయాలి అనే కర్తృత్వముతో జ్ఞానము ఉదయించదు. జ్ఞానోదయం జరగగానే అజ్ఞాన తిమిరము అదృశ్య మవుతుంది. అంతే.

అజ్ఞానము జ్ఞాన విరోధి. అట్టి అజ్ఞానాన్ని అంతం చేస్తున్నా, జ్ఞానానికి కర్తృత్వాన్ని ఆపాదించలేక పోతున్నాం. అలాంటప్పుడు కర్మనాశము విషయంలో జ్ఞానం ప్రత్యక్షంగా కర్తవ్యాన్ని ఎలా నిర్వర్తిస్తుంది?

ఒకవేళ, జ్ఞానము కర్మనాశము విషయంలో ప్రత్యక్ష పాత్రను పోషించిందే అనుకుందాం. అప్పుడు విషయం మరీ జటిలం కావడం లేదా? కర్మ అజ్ఞాన జనితం కదా! కర్మ అనే కార్యానికి అజ్ఞానం కారణం కదా! మరి, జ్ఞానము కర్మ నాశము విషయంలో ప్రత్యక్ష పాత్రను పోషించి సర్వ కర్మల్ని దగ్ధం చేసిందనే అనుకుందాం. అప్పుడు కార్య రూపంలో ఉన్న కర్మలు నశించాయే గాని, కారణ రూపమైన అజ్ఞానమునకు నాశము సంభవించ లేదు కదా! కారణమైన అజ్ఞానము నశించకుండా ఉండే టప్పుడు కార్యరూప మైన కర్మ సమూహములు జ్ఞానం చేత నేడు నశింపబడినా, రేపు మళ్ళీ కార్యరూపంలో అగుపిస్తాయి కదా! ఆవేదనకు గురి చేస్తాయి కదా! అలాంటప్పుడు జ్ఞానం వల్ల కర్మ నాశము ఎలా సంభవం?

**జ్ఞానం వల్ల కర్మ నాశము సంభవమే**

జ్ఞానము అజ్ఞానమును నివృత్తి చేస్తుందే గాని, కర్మ నాశములో ప్రత్యక్ష కార్యానికి దిగలేదు కదా అనే శంక వాస్తవమే. ఇదెంత వాస్తవమో కర్మనాశములో జ్ఞానానికి ప్రత్యక్ష ప్రమేయం లేకపోయినా, అజ్ఞాన నివృత్తికి కారణమైన జ్ఞానము, అజ్ఞాన కార్యమైన కర్మల యొక్క నాశమునకు కూడా కారణ మౌతూ ఉంది అనేది కూడా అంతే వాస్తవము. ఒక క్రియ అనేక కార్యాలను సాధిస్తుంది. సోదాహరణంగా వివరిస్తాను.

ఒక క్రియ అనేక కార్యాలను సాధించుట సంభవము అనేది సహేతుకము. అనుభవ సిద్ధము. శ్రీరాముడు సంగ్రామంలో రావణాసురునిపై బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు. బ్రహ్మాస్త్ర పాతానికి (1) రావణుని రొమ్మును భేదించుట అనే రావణ వక్షచ్ఛేదము (2) ప్రాణములు లేచిపోవుట అనే ప్రాణ నిర్గమనము (3) శరీరము పడి పోవటము అనే దేహ పతనము, ఈ మూడు జరిగాయి. బ్రహ్మాస్త్ర ప్రయోగము అనే ఒక్క క్రియకు మూడు కార్యాలు సాధింప బడ్డాయి అని మనకు అర్థ మవుతూ ఉంది.

ఈ దృష్టాంతమును ఆధారం చేసుకొని అర్థం చేసుకుంటే, ఆత్మజ్ఞానము ప్రాప్తించ గానే (1) అజ్ఞానము నివృత్తి కావడము (2) అజ్ఞానము వలన సంభవించిన కర్తృత్వ భ్రమ నశించడము (3) అట్టి భ్రమ చేత ఉత్పన్నమైన కర్మ సమూహము దగ్ధం కావడము ఒకే సమయంలో జరుగు తున్నాయి. ముండకశ్రుతి కూడా ఈ సత్యాన్నే ప్రవచించింది.

***భిద్యతే హృదయ గ్రంథిః ఛిద్యన్తే సర్వసంశయాః***
***క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే॥***

పరమాత్మ సాక్షాత్కారము అనే జ్ఞానము కలుగగానే (1) అజ్ఞాన ముడి విడిపోతుంది (2) సర్వ సంశయాలు





పటాపంచ లవుతాయి (3) సర్వకర్మలు నశించి పోతాయి అని ముండకోపనిషత్తు *(2-2-9).* ఆత్మజ్ఞానము సందేహ నివృత్తి కొరకు రాలేదు. కర్మనాశానికి ప్రయత్నించనూ లేదు. జ్ఞానము అజ్ఞానమును నశింప చేసింది. అజ్ఞానము నశించగానే అజ్ఞాన కార్యాలైన సందేహాలు తీరిపోయాయి. కర్మలు కాలిపోయాయి. ఈ విధంగా ఒక క్రియ అనేక కార్యాలను సాధించడము సంభవమే నని ఋజువయింది.

**భస్మాంతం**

జ్ఞానాగ్ని సర్వ కర్మలను ఎలా దగ్ధం చేస్తుందో తెలుసుకున్నాం. ఇప్పుడు ఇంకొక సందేహం. గతంలో ఆచరించిన కర్మలు ఆచరింప బడగానే, అంటే పూర్తి కాగానే, సహజం గానే లేకుండా పోయాయి కదా! నశించి పోయాయి కదా! అలాంటప్పుడు జ్ఞానోత్ప త్త్యనంతరం కర్మలు నశిస్తాయి అనడం ఏమిటి? అనే సందేహం వస్తుంది.

కర్మలకు ఆద్యంతాలు ఉంటాయి కనుక కర్మాచరణము జరిగిన తరువాత కర్మలు లేకుండా పోతాయి. ఈ విషయంలో ఎవరికీ సందేహము లేదు. కాకపోతే, భూమిలో నాటిన బీజము నశించినా, ఆ బీజము మొలకెత్తి, వృక్షమై, ఫలాన్ని అందించినట్లు, కర్మ క్షయించినా, కర్మఫలము కాలంలో అందుతుంది. కనుక, జ్ఞానము కర్మలను నశింప చేస్తుంది అంటే, ఫలాన్ని ఉత్పత్తి చేసే శక్తిని నశింప చేస్తుందని భావము. ఈ విధంగా కర్మనాశము జరుగుతుంది. అంటే, గత కర్మల ప్రభావము (జ్ఞానోత్పత్తికి పూర్వము ఆచరించిన కర్మల యొక్క ప్రభావము అంటే సంచితము), అలాగే రాబోవు కర్మఫల ప్రభావము (జ్ఞానోత్ప త్త్యనంతరము ఆచరించే కర్మల వలన జరిగే ఫలోత్పాదనము అంటే ఆగామి) జ్ఞానము వల్ల నశించిపోతూ ఉన్నాయి.

ఇదే వాస్తవమైతే, అజ్ఞాన కార్యములైన కర్మలన్నీ నశించి తీరాలి. అంటే, సంచిత ఆగామి కర్మలే గాక, ప్రారబ్ధము కూడా అజ్ఞాన కార్యమే కనుక, జ్ఞానం ప్రాప్తిస్తే ప్రారబ్ధం కూడా నశించాలి. ప్రారబ్ధం నశిస్తే, ప్రారబ్ధ కార్యమైన దేహం కూడా పతనం కావాలి. అలాగైతే ఏ ఒక్క జ్ఞానిని కూడా మనం దర్శించ లేము. ఎందుకని? జ్ఞానం కలిగితే అజ్ఞాన కార్యమైన ప్రారబ్ధకర్మ ఫలితంగా ప్రాప్తించిన దేహము రాలిపోతుంది కనుక.

కాని, అలా జరగడం లేదు. జ్ఞానం కలిగిన తరువాత కూడా జ్ఞాని దేహము, అంటే ఏ దేహంలో జ్ఞానం కలిగిందో, ఆ దేహము పతనం కాకుండా పచార్లు చేస్తూనే ఉంది. ఈ విషయం అందరి అనుభవంలో ఉంది.

ఈ కోణం నుండి చూచి నపుడు కార్యం ఉంది అంటే కారణం ఉండాలి కనుక, కార్య రూపంలో దేహం గోచరిస్తూ ఉంది కాబట్టి, దేహానికి కారణమైన అజ్ఞానము ఉన్నట్లే అంగీకరించాలి. మరి, అజ్ఞానం ఉండే టప్పుడు ఇక జ్ఞాన మెక్క డున్నట్లు? ఈ రెండు సంశయాలను కూడా నివృత్తి చేసుకుందాం. అప్పుడే కర్మనాశము ఏమిటో పూర్ణంగా అర్థ మవుతుంది.

జ్ఞానోదయంలో అజ్ఞాన నివృత్తి జరిగి నపుడు, సంచిత ఆగామిలతో పాటు ప్రారబ్ధం ఎందుకు నశించదు? ఇది మొదటి సంశయము. దీనిని ముందు అర్థం చేసుకుందాం.

మనం భుజించక ముందు ఆహారాన్ని త్యజించ వచ్చు. అలాగే భుజించిన తరువాత మిగిలిన ఆహారాన్ని కూడా త్యాగం చేయవచ్చు. అలా కాకుండా భుజించిన ఆహారాన్ని త్యాగం చేయడం సాధ్య పడుతుందా? సాధ్యపడదు. ఎందుకని? జీర్ణక్రియ ఆరంభమైంది కనుక. అలాగే జ్ఞానోత్పత్తికి ముందు ఉన్న సంచిత కర్మము నశిస్తుంది. జ్ఞానోత్ప త్త్యనంతరము సంభవించే ఆగామి కర్మ కూడా క్షయిస్తుంది. కాని, ఫలితాన్ని ఇచ్చే కార్యమును

ఆరంభించిన ప్రారబ్ధము నశించడం జరుగదు. ప్రారబ్ధము ఉన్నంత వరకు జ్ఞాని దేహం లోనే ఉంటాడు. ప్రారబ్ధ క్షయానంతరము దేహ పతనం జరిగిన తరువాత ఇంతవరకు దేహము నందు శోభించిన జ్ఞాని, సర్వవ్యాపక అఖండ చైతన్యంగా భాసిస్తాడు **(పిండస్థః ఆత్మా సర్వవ్యాపీ భవతి).**

రెండవ సంశయం. ప్రారబ్ధాధీన మైన దేహము కార్యరూపంలో తెలుస్తూ ఉంది కనుక, కారణమైన అజ్ఞానము కూడా ఉండాలి అనేది రెండవ సంశయము. కార్యం ఉన్నంత మాత్రాన కారణం మిగిలి ఉండాలి అనే నియమం కూడా అవసరం లేదు.

ఎండమావిలో జలము ఉన్నట్లు మనకు కనిపించింది. జలము కార్యము. ఎండమావి కారణము. ఎండమావికి సంబంధించిన జ్ఞానము కలిగిన తరువాత అది ఎడారే గాని ఎండమావి కాదని తెలిసి పోతుంది. కాని, అప్పుడు కూడా దూరంగా జల దర్శనం అవుతూనే ఉంటుంది. కాని, కారణమైన ఎండమావి మాత్రం లేదు. సత్య దర్శనంలో నిరస్త మైంది. కార్యం కనిపిస్తూ ఉన్నా, కారణం లేనిదే అయింది. అలాగే ప్రారబ్ధాధీనంగా జ్ఞాని శరీరం గోచరిస్తూ ఉన్నా, దేహానికి కారణమైన అజ్ఞానం మాత్రం లేనిదే అయింది.

ఈ విధంగా ఆత్మజ్ఞానం కలిగిన తరువాత కర్మ లన్నీ దగ్ధమై పోయాయి. కట్టె లన్నీ కాలిపోయిన తరువాత భస్మం మిగుల్తుంది **(భస్మసాత్ కురుతే).** కర్మలన్నీ దగ్ధమైన తరువాత కూడా జ్ఞాన భస్మం మిగుల్తుంది. అదే విభూతి. అఖండ అద్వయ అనుభూతి స్వరూపం.

*ఇదీ జ్ఞాన వైభవం. ఈ జ్ఞానానికి మించిన పవిత్ర వస్తువు ఉంటుందా? మించినదే కాదు. సమాన మైనది కూడా ఉండదు. జ్ఞానానికి జ్ఞానమే సాటి. ఈ సత్యాన్ని విస్పష్టం చేస్తున్నాడు.*

**న హి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే ।**
**తత్స్వయం యోగసంసిద్ధః కాలే నాత్మని విన్దతి ॥** 38

***న-హి-జ్ఞానేన-సదృశం-పవిత్రం-ఇహ-విద్యతే***
***తత్-స్వయం-యోగసంసిద్ధః-కాలేన-ఆత్మని-విందతి***

| | | | |
|---|---|---|---|
| జ్ఞానేన సదృశం | = జ్ఞానముతో సమానమైన | యోగసంసిద్ధః | = యోగ సిద్ధిని పొందిన వాడు |
| పవిత్రం | = పవిత్ర మైనది | తత్ | = ఆ జ్ఞానమును |
| ఇహ | = ఈ లోకమున | స్వయం | = స్వయముగనే |
| న హి విద్యతే | = లేనే లేదు | ఆత్మని | = ఆత్మ యందు |
| కాలేన | = కాలక్రమమున | విందతి | = పొందుతాడు |

**ఈ లోకంలో జ్ఞానంతో సమానమైన పవిత్ర వస్తువు లేనే లేదు. అట్టి జ్ఞానాన్ని యోగసిద్ధిని పొందిన వాడు ఒక కాలంలో తన యందే ఉన్నట్లు అనుభూతిని పొందుతాడు.**

**వ్యాఖ్య**

**శుద్ధి కార్యాలు**

సిద్ధి కలగాలి అంటే శుద్ధి ఉండాలి. శుద్ధి లేనిదే సిద్ధి కలగదు. స్నానం చేసి ఆలయానికి వెళ్తాం. చేతులు కడిగిన తరువాతే భోం చేస్తాం. మలినాన్ని తొలగించేది ఏదైనా శుద్ధి కార్యమే. అలా శుద్ధి చేసేవి ప్రపంచంలో చాలా ఉన్నాయి.

దేహంపై మట్టి పడితే దేహం మలిన పడుతుంది. వస్త్రం మీద పడితే వస్త్రం మురికి అవుతుంది. మురికి





చేసే మట్టే మురికిని పోగొడుతుంది కూడా. అందుచేత, మృత్తికా స్నానం శ్రేష్ఠ మని వైద్యశాస్త్రం ప్రతిపాదించింది. కనుక మట్టి కూడా మాలిన్యాన్ని పోగొడుతుంది.

జలం కూడా శుద్ధి చేస్తుంది. అగ్ని అయితే బంగారునే శుద్ధి చేస్తుంది. అందుకే, అగ్ని **పావకః** అని పిలువబడింది. ***పునాతి ఇతి పావకః.*** పావనం చేస్తుంది కనుక అగ్ని పావకము. మట్టి, నీళ్ళు, నిప్పు శుద్ధి చేసినట్లే గాలి కూడా శుద్ధి చేస్తుంది.

శరీరంతో సహ స్థూలమైన వాటిని శుద్ధి చేసేవి ఈ విధంగా ఎన్నో ఉన్నాయి. ఆచార శుద్ధి, ఆహార శుద్ధి, వ్యవహార శుద్ధి ఇలా ఎన్నో ఎన్నెన్నో శుద్ధికి సంబంధించిన విషయాలు, శుద్ధి సాధనాలు ఉన్నాయి. శుద్ధి సాధనాలు ఎన్నైనా ఉండొచ్చు. అన్నీ అన్నిటికి పనికిరావు.

చెవిని శుద్ధి చేసే ఔషధ చుక్కలు కంటిని శుద్ధి చేసేందుకు పనికి రావు. కంటిని శుద్ధి చేసేవి పంటిని శుద్ధి చేసేందుకు ఉపకరించవు. ఒక్కొక్క మందు ఒక్కొక్క రోగాన్ని పోగొట్టినట్లు, ఒక్కొక్క శుద్ధి సాధనము తత్సంబంధమైన వాటినే శుద్ధి చేస్తుంది.

**పాపశుద్ధి**

స్థూల దేహాన్ని, స్థూల వస్తువుల్ని శుద్ధి చేయడానికి శుద్ధి సాధనాలు ఉన్నాయి. వాడుకలో ఏదైనా మలిన పడుతుంది. మలిన పడ్డ వాటిని శుద్ధి చేసుకుంటూ నిర్మలంగా మార్చుకుంటూ ఉంటాము. దేహేంద్రియాలను, గృహ, వాహన, వస్తు పరికరాలను ఎలా వాడుకుం టున్నామో అలాగే మనస్సును కూడా వాడుకుం టున్నాము. వాస్తవం చెప్పాలంటే దేహం కంటే మనస్సునే అందరూ ఎక్కువగా వాడు కుంటారు. అలాంటప్పుడు మనస్సు కూడా మలిన పడుతుంది కదా! అవును మనస్సు మలిన పడుతుంది. బుద్ధి అశుద్ధ మవుతుంది. మరి సూక్ష్మమైన చిత్తాన్ని ఎలా శుద్ధి చేసుకోవాలి?

***న వారిణా శుద్ధ్యతే అంతరాత్మా*** - నీటితో మనస్సును శుద్ధి చేయలేము అన్నది ఉపనిషత్తు. మరి, మనస్సును ఎలా శుద్ధి చేసుకోవాలి? సంకల్పాల వల్లనే బుద్ధి అశుద్ధమైంది కనుక సంకల్పాల ద్వారానే శుద్ధి చేసుకోవాలి. దుష్ట సంకల్పాలతో మలిన పడిన మనస్సును సత్సంకల్పాలను సాగించడం ద్వారా శుద్ధి చేసుకోవాలి. పాపం చేయడం ద్వారా అపవిత్రమైన బుద్ధిని పుణ్య కర్మాచరణము ద్వారా శుద్ధి చేసుకోవాలి.

యజ్ఞ యాగాది కర్మలు పాపాన్ని పోగొడతాయి. అశ్వమేధ యాగాన్ని చేస్తే బ్రహ్మహత్యా పాతకము కూడా ప్రక్షాళన మవుతుంది అన్నది శాస్త్రము ***(తరతి తరతి బ్రహ్మహత్యాం యో అశ్వమేధేన యజతే).*** యజ్ఞ యాగాది కర్మలు పాపాన్ని పోగొడతాయి. పుణ్యాన్ని ప్రసాదిస్తాయి. కాని, చిత్తశుద్ధిని ప్రసాదించలేవు. ఈ విషయాన్ని జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. అశ్వమేధ యాగం చేసి బ్రహ్మహత్యా పాతకాన్ని పోగొట్టుకున్న వాడు, ఆ పాపం నుండి విడిపడిన తరువాత, తిరిగి బ్రహ్మహత్యా పాతకానికి ఒడి గట్టడనే నమ్మకం లేదు. చేసిన పాపాన్ని యజ్ఞయాగాదులు ప్రక్షాళనం చేస్తాయి గాని, చేసిన పాపాన్ని మళ్ళీ చేయకుండా మనిషిని నివారించ లేవు. పాపం చేసే అవకాశమే లేని విధంగా మనిషిని పవిత్రునిగా మార్చలేవు.

ఇంతెందుకు? పవిత్ర గంగాస్నానం విషయమే చూడండి! పవిత్రమైన గంగలో మునక వేస్తే దేహం శుద్ధి పడుతుంది. చేసిన పాపం నశిస్తుంది. గంగాస్నానం పాపహరం అనుటలో సందేహం లేదు. కాని, పాప నివారకం అని చెప్పలేము. గంగాస్నానం చేసిన తరువాత కూడా మనుషులు పాపాలు చేస్తూనే ఉన్నారు.

ఈ విధంగా శుద్ధి సాధనా లన్నీ పవిత్ర మైనవే. అపవిత్రాన్ని తొలగించేవే. కాని, పోయిన మాలిన్యాన్ని తిరిగి రాకుండా మాత్రం నివారించ లేవు. అందుచేతనే రోజూ ఇల్లు చిమ్ముతాం. రోజుకు మూడుసార్లు

స్నానం చేస్తాం. ప్రతి సంవత్సరం గంగలో మునుగుతాం. ఏ నదికి పుష్కరం వస్తే ఆ నదీ తీరంలో చేరి పోతాం. ఇవన్నీ పాపశుద్ధికి పనికొస్తాయే గాని చిత్తశుద్ధికి ఉపకరించవు. మరి, చిత్తశుద్ధికి సాధన ఏమిటి?

### చిత్తశుద్ధి

కర్మయోగము ద్వారానే చిత్తము శుద్ధి పడుతుంది. ఉపాసన లన్నీ చిత్త చాంచల్యాన్ని అరికడతాయి ***(కర్మోపాసనాదేః).*** కర్మయోగం బుద్ధిని శుద్ధి చేస్తుంది. ఇది చాలా పవిత్రమైన శుద్ధి సాధనము. కర్మయోగమును బహిరంగ సాధన, అంతరంగ సాధన అని రెండు విధాలుగా అర్థం చేసుకోవచ్చు.

కర్మలను కర్తృత్వ బుద్ధి లేకుండా ఆచరిస్తూ, కర్మఫలాన్ని భోక్తృత్వ బుద్ధి లేకుండా ప్రసాదంగా స్వీకరిస్తూ, కర్మను పూజగా మార్చుకోవడం కర్మయోగంలో బహిరంగ సాధన. దీని వల్ల చిత్తశుద్ధి ఏర్పడుతుంది.

అలాగే పూజ, ఉపాసన, జపము, ధ్యానము, ప్రార్థన - ఇవన్నీ కర్మయోగంలో అంతరంగ సాధనలు. వీటి వల్ల చిత్తశుద్ధితో పాటు చిత్త నైశ్చల్యము కూడా ఏర్పడుతుంది. ఈ విధంగా కర్మయోగం చేత సంస్కరింప బడిన బుద్ధి జ్ఞానానికి సిద్ధపడుతుంది.

విషయంలో ఇదొక అందమైన మలుపు. జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. పాపశుద్ధి సాధనలు పాప ప్రక్షాళనం చేస్తాయే గాని, పాపాచరణమును అరికట్టి పాప నివారణమునకు ఉపకరించవు. చిత్తశుద్ధిని ప్రసాదించ లేవు.

కర్మయోగంలో బుద్ధి శుద్ధి పడుతుంది. కర్మయోగ సాధన లన్నీ శుద్ధి కార్యాలకు ఉపకరించేవే కనుక, కర్మయోగంలో కూడా పాప ప్రక్షాళనం జరుగుతుంది. కాకపోతే, కర్మయోగంలో సాగే అలౌకిక కర్మఫలంగా ప్రాప్తించే పుణ్యాన్ని మాత్రం కర్మయోగం ఆపలేదు. పాపాన్ని పోగొడుతుంది. పుణ్యాన్ని ప్రసాదిస్తుంది. బుద్ధిని శుద్ధి చేస్తుంది. కాని, పుణ్యాన్ని పోగొట్ట లేదు. జ్ఞానాన్ని ప్రసాదించ లేదు. పాపాన్ని సరే ప్రక్షాళనం చేసుకోవాలి. పుణ్యాన్ని ఎందుకు పోగొట్టుకోవాలి అంటారా? రెండూ బంధాలే కనుక. కాకపోతే పాపం ఇనుప సంకెల. పుణ్యం బంగారు సంకెల. రెండూ సంకెళ్ళే. రెండూ బంధాలే. ఈ విషయాన్ని శ్లోక వ్యాఖ్యానంలో చివరగా చూస్తాం. చిత్తశుద్ధిని కలిగించే కర్మయోగము బుద్ధిని జ్ఞానానికి సిద్ధం చేస్తుందే గాని జ్ఞానాన్ని ప్రసాదించ లేదు. జ్ఞానం తోనే జీవుడు జీవమాలిన్యం నుండి విడి పడతాడు. ఈశ్వరుడై శోభిస్తాడు. అందుచేత, పాపశుద్ధి సాధనల కన్నా, చిత్తశుద్ధి సాధనల కన్నా జీవశుద్ధికి ఉపకరించే జ్ఞానము సర్వోత్కృష్టము. ఇట్టి జ్ఞానముతో సమానంగా తులతూగే పవిత్రమైన శుద్ధిసాధనం మరొకటి లేదు. ఉండదు ***(న హి జ్ఞానేన సదృశం పవిత్రం ఇహ విద్యతే).*** అందుచేత జ్ఞానము పవిత్రము. పావనము. శుభకరము. మంగళ స్వరూపము.

### జ్ఞానము పవిత్ర తమము

శుద్ధి సాధనలలో కొన్ని దేహాన్ని శుద్ధి చేస్తాయి. కొన్ని ఇంద్రియాలను శుద్ధి చేస్తాయి. కొన్ని ప్రాణాన్ని శుద్ధి చేస్తాయి. మరి కొన్ని చిత్తాన్ని శుద్ధి చేస్తాయి. కాని, జ్ఞానము మనిషినే శుద్ధి చేస్తుంది. అందుచేత, జ్ఞానంతో సమాన మైనది, పవిత్ర మైనది మరొకటి లేదు అంటున్నాడు త్రిజగద్గురువు గీతాచార్యుడు ***(జ్ఞానేన తుల్యం పవిత్రం న విద్యతే).***

జ్ఞానం అంటే ఆత్మజ్ఞానం. మన మేమిటో మనకు తెలిసేటట్లు చేసే జ్ఞానం. నీ వెవరు? ఆత్మవే. నీవు ఆత్మవు అని తెలియజేసేదే ఆత్మజ్ఞానం. నీవు ఆత్మవు అని తెలియక పోవుట చేత అనాత్మకు సంబంధించిన లక్షణాలను ఆత్మ యందు ఆరోపించుకొని దుఃఖించడం జరుగుతూ ఉంది. ఇదే బంధము. ఇదే అశుద్ధం. అపవిత్రం. నేను కర్తను. నేను భోక్తను అనే అజ్ఞానం అపవిత్ర మైంది. ఆత్మజ్ఞానము అజ్ఞానమును పోగొట్టి, కర్తృత్వము నుండి, బంధము నుండి మనిషిని విడుదల చేస్తుంది.





జ్ఞానాన్ని ప్రక్కన పెడితే ఏ శుద్ధి సాధన లయినా కర్తను శుద్ధి చేసేవే గాని కర్తను లేకుండా చేసేవి కావు. నీవు అకర్తవు అనే జ్ఞానాన్ని ప్రసాదించ లేవు. పాపమే కాదు, పుణ్యం కూడా బంధమే నని అందుకే అన్నాను. పాపంలో ఎలాగైతే కర్త ఉన్నాడో, పుణ్యంలో కూడా కర్త ఉన్నాడు. నేను కర్తను అనుకోవడమే బంధము కనుక, పుణ్యం కూడా బంధిస్తూనే ఉంది. నారతో బంధించేది పాపమైతే, పట్టుతో బంధించేది పుణ్యం. రెండూ బంధాలే. కర్త తొలగితేనే బంధము తొలగుతుంది. ఆ పని జ్ఞానం ఒక్కటే చేస్తుంది.

***సర్వమిద మహం చ బ్రహ్మైవ*** - ఈ సమస్త ప్రపంచము, నేను, అంతా బ్రహ్మమే అనే అఖండ బ్రహ్మాకార వృత్తియే జ్ఞానము. దీనినే ***ఏకభావ అవగాహినీ వృత్తి*** అంటారు. ఇదే జ్ఞానవృత్తి. పవిత్రమైన ఈ జ్ఞానవృత్తి అజ్ఞానవృత్తిని తొలగిస్తుంది. కర్తను అదృశ్యం చేస్తుంది. అకర్తను ప్రకాశింప చేస్తుంది. ఈ విధంగా జ్ఞానం మనిషిని అనితర సాధ్యంగా పవిత్రం చేస్తూ ఉంది. జ్ఞానం కేవలం పవిత్రం చేయడమే కాదు, మళ్ళీ అపవిత్ర మయ్యే అవకాశం లేకుండా చేస్తుంది. తాను అకర్త అని తెలిసిన తరువాత మళ్ళీ తాను కర్త అనే మోహం ఏర్పడే అవకాశమే లేదు. ఇదే జ్ఞానమహిమ.

### సిద్ధం సుమతి

మాలిన్యాన్ని ఎవ్వరూ ఇష్టపడరు. మహిమనే అందరూ వరిస్తారు. మహిమను వరిస్తే సరిపోదు. మహిమను పొందటానికి అర్హతను సాధించుకోవాలి. జ్ఞానాన్ని అందరూ వాంఛిస్తారు. జ్ఞానార్హత పొందిన వారికే జ్ఞానం ప్రాప్తిస్తుంది. అర్హతను సాధించి జ్ఞానానికి సిద్ధ పడాలి. మతి శుద్ధిపడాలి. కర్మయోగము ద్వారా మతి సుమతిగా మారి జ్ఞానానికి సిద్ధం కావాలి. సిద్ధం సుమతి - ప్రాప్తం సద్గతి. అంతే.

కర్మయోగం ద్వారా చిత్తశుద్ధిని పొంది జ్ఞానానికి అర్హతను సంపాదించిన వాడు యోగసంసిద్ధుడు ***(కర్మయోగేన సమాధియోగేన చ సంసిద్ధః సంస్కృతః యోగ్యతాం ఆపన్నః ముముక్షుః).*** బహిరంగ సాధనమైన కర్మయోగము చేత, అంతరంగ సాధనమైన తపోధ్యానాదుల చేత చిత్తశుద్ధిని, చిత్త నైశ్చల్యమును సాధించి, జ్ఞానానికి యోగ్యతను పొందిన వాడు యోగసంసిద్ధుడు. అట్టివాడు గురుదేవుడు ప్రబోధించే జ్ఞానాన్ని అందుకొని తరించి పోతాడు. సిద్ధుడౌతాడు. జ్ఞానసిద్ధు డౌతాడు.

### ఎక్కడ పొందుతాడు?

జ్ఞానవృత్తి ఏర్పడటమే జ్ఞానాన్ని పొందడము అని ఇప్పటికే తెలుసుకున్నాం. జ్ఞానవృత్తి ఎక్కడ ఏర్పడుతుంది? వృత్తి కనుక బుద్ధి లోనే ఏర్పడుతుంది. శుద్ధిపడి సిద్ధపడిన బుద్ధి లోనే ఏర్పడుతుంది. ఈ విధంగా యోగసంసిద్ధుడు జ్ఞానమును తన లోనే పొందుతాడు. తన బుద్ధి లోనే పొందుతాడు ***(ఆత్మని విన్దతి).*** ఇక్కడ 'ఆత్మని' అంటే తనలో, తన బుద్ధిలో అని అర్థము. సంస్కరింపబడిన బుద్ధిలో అని భావము.

### ఎప్పుడు పొందుతాడు?

ఏదైనా సరే, ఒకటి వస్తుంది అని తెలియగానే ఎప్పుడొస్తుంది? అని ప్రశ్నించడం మనకు అలవాటు. జ్ఞానం విషయంలో కూడా ఈ వైఖరికి మినహాయింపు ఉండదు. జ్ఞానాన్ని పొందుతాడు అనగానే ఎప్పుడు పొందుతాడు? అని ప్రశ్నిస్తాము. మన బుద్ధి భగవంతుడికి తెలుసు కనుక, కాలంలో పొందుతాడు అన్నాడు ***(కాలేన విన్దతి).***

**కాలేన** అనగానే కొందరు కాలంలో పొందుతాడు అని భావిస్తారు. కొందరేమో కాలం చేత అని, మరి కొందరు కాలానికి అని ఇలా రకరకాలుగా ఆలోచించారు. వారి భక్తి ఏ విభక్తి చుట్టు తిరిగితే అలా గ్రహించారు.

ఏది పొందినా కాలం లోనే కదా, కాలం చేతనే కదా! మరి, ఇక్కడ కాలం శబ్దార్థ మేమిటి? ఆచార్యుల వారు **మహతా కాలేన** - చాలా కాలానికి అని భాష్యం చెప్పారు. ఆచార్యుల వారు అలా అన్నారో లేదో, అంతే వ్యాఖ్యాతలు రెచ్చిపోయి శతకోటి జన్మ లెత్తిన తరువాత గాని జ్ఞానం ప్రాప్తించదు అని వారి వీరరసంతో విశ్వంలో నీరసం నింపారు. ఈ నీరసాలను, నిరుత్సాహాలను వేదాంతం ప్రోత్సహించదు. పైగా నిరసిస్తుంది.

ఆచార్య హృదయానికి ఎల్లలు ఉండవు. ఎద సౌందర్యం తోనే దానిని గ్రహించాలి. ఇక్కడ జ్ఞానాన్ని పొందడానికి కాలం అవసరం లేదు. జ్ఞానం కాలానికి పరిమితమైంది కాదు. కాలాన్ని ప్రకాశింప చేసేది. కాల మంతా అంతఃకరణ శుద్ధికే గాని జ్ఞానప్రాప్తికి కాదు. చిత్తశుద్ధికి ఆచరించే సాధనలకే చాలా కాలం పడుతుంది.

జ్ఞానం కాలంలో కలగదు. జ్ఞానం కాలంలో తెలియదు. జ్ఞానం కలిగే సమయంలో కాలం కాలంగా లేదు. అదే **మహతా** శబ్దం. **మహ పూజాయామ్. మహతా** అంటే పూజార్హమైన సమయము. మంగళ వేళ అని అర్థము. **మహత్** అంటే పవిత్రమైన జ్ఞానము అని కూడా అర్థము.

ఒక ప్రదేశము నుండి మరొక ప్రదేశానికి కారులో పోయే టప్పుడు గమ్యం చేరడానికి ఎంత కాలం పడుతుంది? అంటాము. ఎందుకంటే, అది ప్రయాణము కనుక. ప్రయత్నము కనుక. కార్యము కనుక. ఒక పేజిని టైప్ చెయ్యడానికి ఇంతకాలం పడుతుంది అని చెబుతాము. అది పని కనుక. మరి జ్ఞానము అలాంటి దేనా? ఆత్మ ఒక ప్రదేశములో ఉందా, ప్రయాణం చేసి చేరడానికి? లేక ఆత్మ ఒక కార్యమా, కాలంలో చేయడానికి? ఆత్మ ఒక వస్తువా, తయారయ్యే కాలం చెప్పడానికి?

ఆత్మ సిద్ధ వస్తువు. సిద్ధించే ఉంది. సాధ్యవస్తువును పొందడానికి సమయం అవసరం. సిద్ధవస్తువును తెలుసుకోవడానికి కాలనియమ మేమిటి? అంతఃకరణ శుద్ధి ఏర్పడిన పుణ్యాత్మునికి, గురువు దొరికితే చాలు. జ్ఞానం ప్రాప్తిస్తుంది. అంతే.

*జ్ఞానాన్ని పొందడానికి ముఖ్యంగా ఏమి కావాలి? జ్ఞానం పొందిన తరువాత ఏమి ప్రాప్తిస్తుంది? చెబుతున్నాడు.*

**శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరః సంయతేన్ద్రియః ।**
**జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తి మచిరే ణాధిగచ్ఛతి ॥** 39

***శ్రద్ధావాన్-లభతే-జ్ఞానం-తత్పరః-సంయతేంద్రియః***
***జ్ఞానం-లబ్ధ్వా-పరాం-శాంతిం-అచిరేణ-అధిగచ్ఛతి***

| | | | |
|---|---|---|---|
| శ్రద్ధావాన్ | = శ్రద్ధ కలవాడు | లబ్ధ్వా | = పొంది |
| తత్పరః | = తదేక నిష్ఠావంతుడు | పరాం | = శ్రేష్ఠమైన |
| సంయతేంద్రియః | = ఇంద్రియ నిగ్రహము గలవాడు | శాంతిం | = శాంతిని |
| జ్ఞానం | = ఆత్మజ్ఞానమును | అచిరేణ | = శీఘ్రముగా |
| లభతే | = పొందుతాడు | అధిగచ్ఛతి | = పొందుతాడు |
| జ్ఞానం | = జ్ఞానమును | | |

**శ్రద్ధ గలవాడు, తదేక నిష్ఠ గలవాడు, ఇంద్రియములను చక్కగా నిగ్రహించిన వాడు, జ్ఞానమును పొందుతాడు. జ్ఞానమును పొంది, ఆ తరువాత వెంటనే పరమశాంతిని పొందుతాడు.**





**వ్యాఖ్య**

జ్ఞానమును తప్పక పొందాలి అంటే సాధనకు సంబంధించి ఎలాంటి లక్షణాలు కలిగి ఉండాలి? జ్ఞానమును పొందిన తరువాత ప్రాప్తించే ఫలం ఎలాంటిది? ఈ రెండు విషయాలను ఈ శ్లోకంలో బోధిస్తున్నాడు.

జ్ఞానమును పొందడము అంటే జ్ఞానాన్ని అందుకోవడమే కదా! మరి జ్ఞానాన్ని అందించే వాడెవరు? సద్గురువు. సద్గురువు బోధిస్తే జ్ఞానం ప్రాప్తిస్తుంది. సద్గురువు జ్ఞానాన్ని ఉపదేశించడానికి శిష్యునికి ఉండవలసిన యోగ్యతలు, శిష్యుడు చేయవలసిన కర్తవ్యాలు (1) ప్రణిపాతము (2) పరిప్రశ్న (3) సేవ - ఈ విషయాలను ముప్పై నాల్గవ శ్లోకం లోనే చెప్పడం జరిగింది కదా! మళ్ళీ ఇక్కడ చెప్పడం ఎందుకు? అనే శంక చాలా మందికి కలుగుతుంది. ప్రణిపాతాది మూడు విషయాలను గూర్చి చెప్పి నపుడు, అలాంటి శిష్యునికి గురువులు ఉపదేశిస్తారు అని చెప్పడం జరిగిందే గాని, గురువులు ఉపదేశించిన జ్ఞానం శిష్యునికి లభిస్తుంది అని చెప్ప లేదు. కేవలం పై మూడు విషయాలలో శిష్యుడు నిష్ణాతుడుగా కనిపించవచ్చు. కాని, జ్ఞానాన్ని పొందడానికి అవి సరిపోవు. ఎందుకని?

ప్రణిపాతాదులు బహిరంగ సాధనలు. అవి ప్రదర్శనలు. వాటి వెనుక వాస్తవాలు లేకపోవచ్చు. ప్రణిపాతం చేసినంత మాత్రాన దాని వెనుక ప్రణిధానం ఉందని భావించలేము. మోసగాళ్ళు అన్నిచోట్ల ఉంటారు. వంచకులైన వారు గురువును కూడా వంచిస్తారు. గురుభక్తి లేకపోయినా ఉన్నట్లు నటించే ప్రమాదం లేకపోలేదు. ***మాయావిత్వాది సంభవాత్*** అన్నారు భాష్యంలో శ్రీ శంకరులు. మోసపూరిత నమస్కారాలు, మాయాపూరిత సేవలు చేయవచ్చు. అలాంటి మాయావికి బోధించినా జ్ఞానం ప్రాప్తించదు. ***ప్రణిపాతాదిస్తు బాహ్యః అనైకాన్తికః అపి భవతి*** - దొంగ దండాలు, మోసపూరిత సేవలు బాహ్యంలో కనిపిస్తూ ఉండినా, వాటి వెనుక ఉన్నదంతా మాయే కనుక, జ్ఞానప్రాప్తి విషయంలో నిశ్చయము లేదు అన్నారు ఆచార్యులు. 'ఫలితం తప్పక వస్తుంది' అని చెప్పలేని పరిస్థితిని ***అనైకాంతికం*** అంటారు. కనుక, గురుబోధ జరిగినా ఫలితం రాకపోవచ్చు. శిష్యుడు ఎలా ఉంటే గురుబోధ ఫలించి జ్ఞానం ప్రాప్తిస్తుందో, అవి ప్రణిపాతాదుల వలె బాహ్య సాధనలు కాకుండా, అంతరంగ సాధనలై ఉన్నాయి. ఇవి కలవారు తప్పక జ్ఞానాన్ని పొందుతారు.

అర్జునా! (1) శ్రద్ధ కలవాడు ***(శ్రద్ధావాన్)*** (2) నా యందే తదేక నిష్ఠ కలవాడు ***(మత్పరః)*** (3) చక్కగా ఇంద్రియములను అదుపులో ఉంచుకున్న వాడు ***(సంయతేన్ద్రియః)*** జ్ఞానమును పొందుతాడు ***(జ్ఞానం లభతే).*** ఇవి జ్ఞానప్రాప్తికి ఉపాయాలైన అంతరంగ సాధనలు.

**శ్రద్ధావంతుడు**

శ్రుతి వాక్యము నందు, గురు వాక్యము నందు సత్యత్వ బుద్ధిని కలిగి ఉండటమే శ్రద్ధ. అట్టి శ్రద్ధ కలవాడు శ్రద్ధావంతుడు ***(శ్రద్ధావాన్ శ్రద్ధాలుః).*** ప్రతిబంధకాల మధ్య ప్రయాణం సజావుగా సాగదు. ప్రగతి సిద్ధించదు. జ్ఞానం వల్ల మోక్షం కలిగే టప్పుడు జ్ఞానాన్ని ప్రసాదించే శాస్త్రము నందు, అనగా ప్రమాణము నందు విశ్వాసం లేకపోతే జ్ఞానం ఎలా ప్రాప్తిస్తుంది? అలాగే ప్రమను, అనగా జ్ఞానమును కలిగించేది కనుక శాస్త్రం ప్రమాణమైంది ***(ప్రమాకరణం ప్రమాణం).*** మరి, ప్రమాణ ఫలం సిద్ధించాలి అంటే, ప్రమాణాన్ని అందించే గురువు నందు విశ్వాసం ఉండాలా లేదా? లేదనే అనుకుందాం. అప్పుడు ఉన్న దేమిటి? ఇంకేముంది? ఉన్నదంతా సందేహమే. సందేహాలే ప్రయాణంలో ప్రతిబంధకాలు. సందేహాలు ఎలా దూర మవుతాయి? జ్ఞానం కలిగి నప్పుడే దూర మవుతాయి. కనుక ప్రతిబంధకా లైన సంశయ, విపరీత భావనలను జ్ఞాన ప్రకాశంతో ప్రగతికి సోపానాలుగా మార్చేది శ్రద్ధ. కనుక శిష్యుడు శ్రద్ధావంతుడై ఉండాలి. కేవలం శ్రద్ధ కూడా సరిపోదు. శాస్త్ర, గురు

వాక్యాల యందు శ్రద్ధ ఉండినా, సహజంగా సోమరిపోతుగా ఉంటాడు. జ్ఞానం విషయంలో తదేక నిష్ఠ లేకుండా ఉంటాడు **(శ్రద్ధాలు త్వేఽపి భవతి కశ్చిత్ మన్దప్రస్థానః).** శ్రద్ధ ఉన్నా, మందభాగ్యులు సాగించే మంద ప్రయాణాలు ఆనంద ధామాన్ని చేర్చలేవు. కనుక శ్రద్ధతో పాటు ప్రమేయ విషయము నందు పరమాసక్తి ఉండాలి. అట్టి తత్పరుణ్ణే 'మత్పరుడు' అంటున్నాడు గీతాచార్యుడు.

**మత్పరుడు**

కొందరు శ్రద్ధతో శాస్త్రం వింటారు. గురుభక్తి కలిగి ఉంటారు. కాని, సాధనలో ఆసక్తి చూపరు. నీరసించిన ముఖాలతో, సోమరి సోయగాలను ఒలకబోస్తూ కాలాన్ని వెళ్ళదోస్తూ ఉంటారు. అలాంటి వారి శ్రద్ధ బూడిదలో పోసిన పన్నీరు అవుతుంది.

సాధకుడైన వాడు లక్ష్య సిద్ధి యందు చిత్తశుద్ధిని కలిగి ఉండాలి. పరమేశ్వరుని పొందడమే (మోక్షాన్ని పొందడమే) ఏకైక లక్ష్యంగా పెట్టుకొని, సాధన యొక్క ఆవశ్యకతను గుర్తించి, పురుషార్థ ప్రాప్తికి సాధనలో తీవ్రతను పెంచుకొని, సదా పరమేశ్వరుని యందే బుద్ధిని ఉంచి జీవించేవాడు మత్పరుడు. శ్రద్ధావత్వము, మత్పరత్వముతో పాటు సంయతేంద్రియత్వము కూడా ప్రధానంగా ఉండాలి.

**సంయతేంద్రియుడు**

మత్పరుడై జీవించాలి అంటే ఇంద్రియాలు అనిత్య విషయాల వెంట పరుగు లెత్తకుండా ఉండాలి. శ్రోత్రాది జ్ఞానేంద్రియాలను, మనోబుద్ధ్యాది అంతఃకరణమును నియమించి, అట్టి నిగ్రహము వల్ల ఏర్పడిన శక్తి ఉత్పాదకత్వమును ఆధ్యాత్మిక ప్రగతి ప్రయాణంలో వినియోగించుకొనే వాడు సంయతేంద్రియుడు. ఎవని ఇంద్రియాలు విషయాల నుండి మరలి అంతర్ముఖ మవుతాయో, అతడే సంయతేంద్రియుడు. ***(సంయతాని విషయేభ్యః నివర్తితాని యస్య ఇంద్రియాణి సః సంయతేంద్రియః).*** ప్రణిపాతాది బాహ్య సాధనలను వంచన లేకుండా ఆచరించి, ఇప్పుడు మనం తెలుసుకొనిన ఈ మూడు లక్షణాలను కలిగిన ముముక్షువు, జ్ఞానాన్ని తప్పక పొందుతాడు. జ్ఞానం కలిగిందా, తత్ఫలితంగా పూర్ణశాంతిని పొందుతాడు.

మనస్సులో వైరుధ్యం లేనపుడు, మనస్సు విరామంలో శయనించి నపుడు మనస్సులో అశాంతి ఉండదు. అశాంతి లేని ఆ మానసిక పరిస్థితిని సాధారణంగా మనుషులు శాంతి అని పిలుస్తారు. మనస్సు లోని శాంతినే శాంతి అని భావించడం చేత మనశ్శాంతి లేదు అని కూడా చెబుతుంటారు.

అశాంతి, శాంతి అనేవి మనస్సులో కలిగే అనుభవాలు. ఇవి వస్తూ పోతూ ఉంటాయి. ఆగమాపాయాలు. అందుచేత అనిత్యాలు. కర్మయోగం వల్ల మనస్సులో నిర్మలమైన శాంతి ఏర్పడుతుంది. ఇది అనుభవమే. కాని, స్వరూపం కాదు. మనస్సుపై ఆధార పడకుండా, మనస్సుకు ఆధారమైన ఆత్మ, శాంతి స్వరూపము. ఇదే నిత్యశాంతి. దీనినే భగవంతుడు ఈ సందర్భంలో **పరాంశాన్తిం** అంటున్నాడు. అంటే మహత్తర మైన శాంతి అని అర్థము. మోక్షరూప మైన శాంతి ***(మోక్షాఖ్యాం శాంతిం).*** జ్ఞానం వల్ల ఇట్టి మోక్షరూప శాంతిని అతి శీఘ్రంగా పొందుతారు ***(అచిరేణ అధిగచ్ఛతి)*** అంటున్నాడు. ఇక్కడ సమయ ప్రాధాన్యం లేదు. గదిలో చీకటి ఉంది. దీపం వెలిగిస్తే చీకటి పోవడానికి, వెలుగు రావడానికి ఎంత సమయం పడుతుంది? ఇదీ అంతే. ఈ విధంగా శాంతి రూపమైన ఆత్మను పొంది ***(శాంతోఽయం ఆత్మా)*** ఆత్మవిదుడు ముక్తు డవుతున్నాడు ***(ఆత్మవిత్ ముక్తోభవతి).***

*శ్రద్ధావంతుడైన ముముక్షువు ఇలా సద్గతిని పొందుతూ ఉంటే, శ్రద్ధ లేనివాడు దుర్గతిని పొంది పతన మవుతున్నాడు. అదే వివరిస్తున్నాడు.*





**అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి**
**నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః ॥** 40

*అజ్ఞః-చ-అశ్రద్దధానః-చ-సంశయాత్మా-వినశ్యతి*
*న-అయం-లోకః-అస్తి-న-పరః-న-సుఖం-సంశయాత్మనః*

| | | | | | |
|---|---|---|---|---|---|
| అజ్ఞశ్చ | = | జ్ఞానం లేనివాడు | లోకః | = | లోకము |
| అశ్రద్ధధానశ్చ | = | శ్రద్ధ లేనివాడు | న అస్తి | = | లేదు |
| సంశయాత్మా | = | శంకితుడు | పరః | = | పరలోకము |
| వినశ్యతి | = | నశిస్తున్నాడు | న | = | లేదు |
| సంశయాత్మనః | = | శంకితునికి | సుఖం | = | సుఖము |
| అయం | = | ఈ | న | = | లేదు |

**జ్ఞానము లేనివాడు, శ్రద్ధ లేనివాడు, సందేహాలకు నిలయమైన వాడు నశించి పోతున్నాడు. సంశయాలు కలవానికి ఇహము లేదు. పరము లేదు. సుఖమూ లేదు.**

**వ్యాఖ్య**

**జ్ఞాన శూన్యుడు**

వివేకవంతుడు, శాస్త్ర విషయము నందు, గురు వాక్యము నందు సత్యబుద్ధి గల శ్రద్ధావంతుడు శాంతిని పొంది తరిస్తున్నా డని గడచిన శ్లోకం వివరిస్తే, వివేకము లేనివాడు, శ్రద్ధ లేనివాడు, సంశయచిత్తుడు ఇహపరాలకు నోచుకోని వాడై, దుఃఖమయ జీవితాన్ని పొంది నశించిపో తున్నాడని ఈ శ్లోకం చెబుతోంది.

***అజ్ఞః*** అంటే జ్ఞానము లేనివాడు. ఆత్మజ్ఞానం లేనివాడు. పైగా అనాత్మజ్ఞుడు. అనాత్మజ్ఞుడు అంటే అనాత్మను తెలిసిన వాడు. అనాత్మను ఏమని తెలిసిన వాడు అంటే, అనాత్మే ఆత్మ అని తెలిసిన వాడు. కనుకనే అజ్ఞుడు అంటే ***అనాత్మజ్ఞః*** అన్నారు భాష్యంలో శ్రీ శంకరులు.

ఆత్మను గూర్చి తెలియని అజ్ఞుడు అనాత్మే తాను అని భావిస్తాడు. అనాత్మ ఏదైనా నశించేదే కనుక, తానూ నశించే వాడే అని భావించి, కాలక్రమాన నశించి పోతాడు ***(అజ్ఞః వినశ్యతి).***

అనాత్మను ఆత్మగా అజ్ఞుడు ఎందుకు భావిస్తాడు? వివేకం లేకపోవడం చేత. ఆత్మానాత్మ వివేకం లోపించడం చేత. వివేకము లోపించడం నేరం కాదు. వివేకానికి ప్రయత్నించక పోవడం దోషం. అజ్ఞుడు ఎందుకని వివేకం కొరకు యత్నించడు అని ఆలోచిస్తే, శ్రద్ధ లేనివాడు కనుక అనే సమాధానం వస్తుంది.

**శ్రద్ధాహీనుడు**

శ్రద్ధ లేనివాడు అంటే శాస్త్ర విషయముల యందు విశ్వాసము లేనివాడు. గురువాక్యము నందు నమ్మకం లేనివాడు. అలాంటి వ్యక్తికి శాస్త్ర మెలా తెలుస్తుంది? శాస్త్రం తెలియని వానికి జ్ఞానం ఎలా ప్రాప్తిస్తుంది? జ్ఞానం లేని వాడు పరమార్థ తత్త్వాన్ని ఎలా విశ్వసిస్తాడు? పరమార్థం తెలియని వాడికి లౌకిక విషయాలే వాస్తవాలుగా గోచరిస్తాయి. దృశ్య ప్రపంచమే సత్యంగా కనిపిస్తుంది. దేహాదులు శాశ్వతంగా కనిపిస్తాయి. అదే తన స్వరూపంగా అర్థ మవుతుంది. దేహాదులు నశిస్తాయి కనుక దేహమే తాను అని విశ్వసించే అజ్ఞుడు కూడా నశించి పోతాడు ***(అశ్రద్ధధానః వినశ్యతి).***

**ఆఖ్యాయిక**

మిత్రమా! ఇటీవల మీ ఇంటి నుండి పూజా గంట వినపడటం లేదు. ఆలయంలో కూడా మీరు కనిపించడం లేదు. పూర్వం లాగా భజనలు చేయడం గాని, భక్తి విషయాలు ముచ్చటించడం గాని చెయ్యడం లేదు. కారణ మేమిటి? అని పొరుగింటి స్నేహితుడు ప్రశ్నించాడు.

ఏముంది మిత్రమా! నేను ఎంతగా భక్తి చేశానో నీకు తెలిసిందే. ఎందుకనో, ఇటీవల నాకు భక్తి విషయంలో ఆసక్తి లేకుండా పోయింది. కనిపించని దేవుణ్ణి నమ్ముకోవడం కన్నా, కనిపించే మంచి మనుషుల్ని నమ్ముకోవడమే మంచిదనే నిర్ణయాని కొచ్చాను అన్నాడు భక్తిని విడిచిపెట్టిన అభక్తుడు.

కారణం ఏమిటి? అని తిరిగి ప్రశ్నించ గానే, ఏమీ లేదు మిత్రమా! నా జీవిత మంతా భగవంతుడి పైనే ఆశలు పెట్టుకొని జీవించాను. ఎప్పుడూ ఏదీ కోరలేదు. నిష్కామ భక్తినే నమ్ముకొని జీవించాను.

ఇటీవల నే నొక ఆపదలో చిక్కుకున్నాను. నా ప్రయత్నంతో దాని నుండి బయట పడలేక పోయాను. మరో మార్గం లేక, ఎప్పుడూ భగవంతుణ్ణి ఏదీ కోరని నేను ఈ ఆపద నుండి బయట పడేయ మని ప్రార్థించాను. కాని, భగవంతుడు ఏ మాత్రము సహకరించ లేదు. నా మొర వినలేదు. నన్ను ఆపద నుండి రక్షించ లేదు.

కాని, ఒకనాటి సాయంత్రం నాకు పరిచయం లేని ఒక వ్యక్తి పార్కులో కలిశాడు. నా పరిస్థితిని ఆలకించి చలించి పోయాడు. తాను సహాయం చేస్తానని ముందు కొచ్చాడు. ఆపద నుండి నన్ను రక్షించాడు. అంతే. అప్పటి నుండి నాకు దేవుడి మీద విశ్వాసం సన్నగిల్లింది. మనుషుల మీదే ప్రేమ నిలిచి పోయింది అన్నాడు.

ఈ భక్తుని విచిత్ర గాధను ఆలకించిన పొరుగింటి మిత్రుడు విస్తుపోతూ, మిత్రమా! నీ వేనా ఇలా మాట్లాడుతోంది? చూడు! పరిచయమున్న వాళ్ళు, బంధుమిత్రులే సహకరించని ఈ రోజుల్లో, అపరిచితు డైన వ్యక్తి ఎలా సహకరిస్తాడు? అలా సహకరించాలి అనే భావన అతనిలో కదిలించిం దెవరు? అది భగవంతుని దయ కాదా? అలా కాకుండా మరో విధంగా భగవంతుడు నిన్ను ఎలా కాపాడుతాడు? అన్నాడు.

ఆ మాటలకు భక్తుడు దిగ్భ్రాంతి చెందాడు. నిజమే. పరమేశ్వరుడు తనను రక్షించాడు. తన అవగాహన లోనే లోపముంది అని పశ్చాత్తాపం చెంది, మిత్రమా! నువ్వు చెప్పింది అక్షరాల సత్యం. నాకు ఆ ఆలోచనే తట్టలేదు. అయినా, ఎప్పుడూ నువ్వు భక్తుడివిగా కనిపించ లేదు. నీకు ఈ అవగాహన ఎలా వచ్చింది? అని ప్రశ్నించాడు.

మిత్రమా! గతంలో నువ్వు బోధించిన విషయాలే తప్ప నాకు భక్తి విషయంలో మరో జ్ఞానం లేదు. నీ మాటల్ని నేను శ్రద్ధతో అర్థం చేసుకున్నాను అంతే. అన్నాడు.

ఎవరి విషయంలో నైనా, సాధన ఫలించాలి అంటే శ్రద్ధ ఉండి తీరాలి. శ్రద్ధ లేని భక్తి ముంచేదే గాని తేల్చేది కాదు. శ్రద్ధ లేని వారికి శుద్ధే కలగదు. ఇక సిద్ధి కలుగుతుందా?

**నిత్య శంకితుడు**

ఇక మూడవ వాడు సంశయచిత్తుడు. సందేహాల పుట్ట. మనిషికి సంశయం ఎప్పుడొస్తుంది? ఉన్నది ఉన్నట్లుగా అర్థం కానపుడు అజ్ఞానం ఉంటుందే గాని, సందేహం రాదు. ఒకటి అనేకంగా అర్థమయ్యే టప్పుడు, వాటిలో ఏది సత్యమో అర్థం కాక సందేహం పుట్టు కొస్తుంది. అతడే సంశయచిత్తుడు ***(సంశయాత్మా).***





ఇక్కడ ఆత్మ అంటే అంతఃకరణము అని అర్థము. ఎవరి చిత్తములో నిరంతరము సందేహాలు నిండి ఉంటాయో అతడే సంశయచిత్తుడు. సంశయాత్మ. సంశయచిత్తుడు ప్రతి విషయం లోను అస్పష్టం గానే ఉంటాడు. అయోమయంగా వ్యవహరిస్తాడు. కారణం, అన్నిటి లోను సందేహమే కలిగి ఉంటాడు.

దేనినీ నమ్మలేడు. ఎవరినీ నమ్మలేడు. స్నేహము కావాలి అనుకుంటాడు. స్నేహితుల్ని నమ్మలేడు. ఎందరితో స్నేహం చేసినా ఏ ఒక్కరినీ నిలుపుకో లేడు. మిత్రుల్ని సందేహించే స్వభావమే మిత్రుల్ని లేకుండా చేస్తుంది.

కొందరు భర్తలు భార్యల్ని నమ్మరు. అలాగే కొందరు భార్యలు భర్తల్ని నమ్మరు. పరస్పరం సందేహించుకుంటూ కలహించుకుంటూ ఉంటారు. అందుచేత కుటుంబం కల్లోలంగా మారుతుంది.

సందేహము అనేది ఉన్న దానిని చూడనివ్వక పోవడమే గాక, లేని దానిని ఉన్నట్లు చూపిస్తుంది. ప్రతిచోట అనుమానమే. ప్రతి మనిషిపై సందేహమే. ఇది అలవాటు కాదు. చిత్తానికి పట్టిన జాడ్యం. మనసుకు సంక్రమించిన క్యాన్సర్ లాంటిది. సంశయచిత్తుడు సంతోషంగా ఉండలేడు. ప్రక్క వారిని సంతోషంగా ఉండ నివ్వడు.

రోగం పోవాలి అంటాడు. మందిచ్చే వైద్యుణ్ణి నమ్మడు. సంసారంలో ఉంటాడు. కుటుంబీకుల్ని నమ్మడు. ప్రక్కవారిని నమ్మడు. వాస్తవం చెప్పాలంటే తనను తానే నమ్మడు.

తననే తాను నమ్మలేని వాడు గురువును నమ్ముతాడా? గురువును నమ్మలేని వాడు శాస్త్రాన్ని నమ్ముతాడా? గురువును, శాస్త్రాన్ని సందేహించే వాడు సత్యాన్ని ఎలా గ్రహిస్తాడు? సత్యాన్ని గ్రహించలేని వాడు అసత్యంలో కూరుకుపోయి నశించి పోతాడు ***(సంశయాత్మా వినశ్యతి).***

జ్ఞానం లేనివాడు నశిస్తాడు ***(అజ్ఞః).*** శ్రద్ధ లేనివాడు నశిస్తాడు ***(అశ్రద్ధధానః).*** సందేహచిత్తుడు కూడా నశిస్తాడు ***(సంశయాత్మా).*** ఈ ముగ్గురూ నశించేవారే అయినా, వీరిలో సంశయచిత్తుడే నికృష్టుడు కనుక అతణ్ణి గూర్చి అధికంగా చెప్పడం జరిగింది ***(సంశయాత్మా తు పాపిష్ఠః సర్వేషామ్).*** ఈ ముగ్గురిలో ***సంశయాత్మ*** పాపిష్ఠుడు అన్నారు శ్రీ శంకరులు. ఎందుచేత? వాడికి ఇహము లేదు. పరము ఉండదు. సుఖం మిగలదు. అందుచేత పాపిష్ఠుడు.

అందరినీ సందేహించడమే గాని ఎవ్వరినీ నమ్మడు కనుక ఈ లోకంలో సుఖపడలేడు ***(న అయం సాధారణః అపి లోకః అస్తి).*** పరలోకము ఒకటి ఉంది అని నమ్మడు కనుక, దానిని పొందడానికి సాధన చేయడు. సాధన చేయడు కనుక పరలోకం సాధ్యం కాదు ***(తథా న పరలోకః).*** ఇక సుఖము అనేది అతడి జీవితంలో కుందేటి కొమ్మే.

ఒకవేళ సుఖ కారణం ఉండి సుఖం కలిగినా, ఇది సుఖమేనా? అని సుఖాన్ని కూడా సంశయిస్తాడు కనుక, సంశయచిత్తుడు సుఖపడలేడు. కనుక సర్వవినాశ కారణమైన సంశయచిత్తాన్ని సాధకుడు దూరం చేసుకోవాలి ***(తస్మాత్ సంశయః న కర్తవ్యః).***

*ఎందుచేతనంటే, చెబుతున్నాడు.*

**యోగసంన్యస్త కర్మాణం జ్ఞానసంఛిన్న సంశయమ్ ।**
**ఆత్మవన్తం న కర్మాణి నిబధ్నన్తి ధనఞ్జయ ॥** 41

***యోగసంన్యస్త కర్మాణం-జ్ఞానసంఛిన్న సంశయం***
***ఆత్మవంతం-న-కర్మాణి-నిబధ్నంతి-ధనంజయ***

| | |
|---|---|
| ధనంజయ | = అర్జునా! |
| యోగసంన్యస్త కర్మాణం | = యోగము చేత విడువబడిన కర్మలు గల వానిని |
| జ్ఞానసంఛిన్న సంశయం | = జ్ఞానము చేత పోగొట్టబడిన సందేహములు గల వానిని |
| ఆత్మవంతం | = నిష్ఠ గల వానిని |
| కర్మాణి | = కర్మములు |
| న నిబధ్నంతి | = బంధింపవు. |

**ధనంజయా! కర్మయోగము చేత కర్మల నుండి విడిపడిన వాడు, జ్ఞానము చేత సందేహాలు పోగొట్టుకున్న వాడు, ఆత్మనిష్ఠ గల వానిని కర్మలు బంధించవు.**

**వ్యాఖ్య**

సముద్రంలో అలలు ఉన్నట్లు మనస్సులలో సంశయాలు ఉంటాయి. ఈ సంశయాల సందడి వల్ల అంతఃకరణములో ఆవేదనా అంగడి తెరువ బడుతుంది అనేది అందరి అనుభవంలో ఉన్న విషయమే. కాని, సంశయం మనిషినే నశింప చేస్తుంది, సంశయమే వినాశానికి కారణ మవుతుంది అనే భయంకర సత్యాన్ని గడచిన శ్లోకంలో భగవంతుని ముఖతః ఆలకించాం. వినాశరూప మైన ఈ దారుణ సంశయం నుండి బయటపడి, సర్వోత్కృష్ట మైన స్థితిని పొందేది ఎలాగో ఈ శ్లోకంలో చెబుతున్నాడు. ఇంతకీ, సంశయము ఎలా వినాశ హేతువో కూడా అర్థం కావాలి.

సుదూరంగా ఒక వ్యక్తి కనిపించి నపుడు దూరంగా ఉండటం చేత ఆ వ్యక్తి పురుషుడా, స్త్రీయా? అనే సందేహం మనకు కలగవచ్చు. అంతమాత్రాన ఆ సందేహం నివృత్తి కాకపోతే మనిషి నశిస్తాడా? ఒక పాత్రలో తెల్లని ద్రవం కనిపిస్తే, అది సున్నపు జలమా, లేక క్షీరమా? అనే సందేహం కలగవచ్చు. ఇలా, నిరంతరము ఎన్నో సందేహాలు మన మనస్సులలో కదుల్తూ ఉంటాయి. అవన్నీ వినాశహేతువు లవుతాయా? సందేహ మనేది సంఘర్షణను కలిగిస్తుంది అంటే అర్థం చేసుకోగలం. సర్వనాశనానికి దారి తీస్తుంది అనే విప్లవాత్మక నిర్వచనాన్ని, భయంకర సత్యాన్ని సామాన్య దృక్కోణం నుండి అర్థం చేసుకోవడం సాధ్యం కాదు.

మోక్ష మనేది కర్మ వలన సిద్ధిస్తుందా? జ్ఞానం వలన ప్రాప్తిస్తుందా? లేక జ్ఞానకర్మ సముచ్చయ ఫలమా? ఇది సందేహము. జీవబ్రహ్మలు ఇరువురా? లేక ఒక్కరేనా? ఆత్మజ్ఞానం పరోక్షమా, అపరోక్షమా? ఇవన్నీ ప్రస్తుతం సంశయాలు. ఇవి నివృత్తి కాకపోతే, జన్మలు పొరలిపోతూ ఉంటాయి. జీవుడు ఆ ప్రవాహంలో పడి దొర్లిపోతూ ఉంటాడు. ఆత్మనిశ్చయ జ్ఞానమే సర్వసంశయ నివారణకు ఉపాయమై వినాశమును నివారిస్తుంది. ఈ సత్యాన్నే ప్రస్తుత శ్లోకంలో భగవంతుడు విస్పష్టం చేస్తున్నాడు. ఆత్మజ్ఞానమును పొందిన వాడు సర్వసంశయ రహితుడై ***(ఛిద్యన్తే సర్వ సంశయాః)***, సమస్త కర్మ బంధముల నుండి విడిపడి ***(క్షీయన్తే చాస్య కర్మాణి)*** తరించి పోతున్నాడు.

అర్జునా! కర్మలను యోగముచే సన్యసించిన వాడు ***(యోగసన్న్యస్త కర్మాణం)*** జ్ఞానముచే సంశయములను నివృత్తి చేసుకున్న వాడు ***(జ్ఞాన సంఛిన్న సంశయమ్)*** ఆత్మనిష్ఠుడు ***(ఆత్మవన్తమ్)*** అయిన జ్ఞానిని కర్మలు బంధించవు ***(కర్మాణి న నిబధ్నన్తి)*** అంటున్నాడు భగవంతుడు.

ఆత్మబంధువులారా! ఈ సందర్భంలో ఒక్క విషయాన్ని మనం స్మృతికి తెచ్చుకోవాలి. ప్రస్తుతం ఏ సంశయ రూపాన్ని మనం చర్చిస్తున్నామో, ఆ విధమైన సంశయంతో మూడవ అధ్యాయం - కర్మయోగం ప్రారంభంలో మనకు అర్జునుడు కనిపిస్తాడు. కృష్ణా! మిశ్రమ భావాలను కలగాపులగం చేసి బోధిస్తూ నన్ను





కలవర పెడుతున్నావు. దేని చేత నేను శ్రేయస్సును పొందుతానో దానిని నిశ్చయించి చెప్పు అని సూటిగా ప్రశ్నించాడు.

అర్జునుని సమాధాన పరుస్తూ, ఇంతకు పూర్వమే తాను చెప్పి ఉన్న ద్వివిధ బ్రహ్మనిష్ఠను పరిచయం చేశాడు భగవానుడు. సాంఖ్యులకు జ్ఞానయోగము, కర్మ మార్గానుయాయులకు కర్మయోగము అని తెలిపి, ఈ కర్మ జ్ఞానాలనే యోగద్వయాన్ని మూడు, నాలుగు అధ్యాయాలలో విపులంగా, విశేషంగా విశ్లేషిస్తూ బోధించాడు శ్రీకృష్ణ పరమాత్మ. నాల్గవ అధ్యాయాన్ని ఉపసంహరిస్తూ, ద్వివిధ బ్రహ్మనిష్ఠ ఫలం ఎలా ప్రాప్తిస్తుందో ప్రవచిస్తున్నాడు.

**కర్మయోగము**

యోగము చేత సర్వకర్మలను సన్యసించిన వాడు యోగసంన్యస్త కర్ముడు. ఇక్కడ యోగము అంటే కర్మయోగము అని అర్థము (ఇక్కడ యోగం అంటే జ్ఞానయోగము, కర్మయోగము కూడా అని శ్రీ శంకర భాష్యము).

సమత్వం యోగమని కర్మయోగం విషయంలో అర్థం చేసుకున్నాం. ఈశ్వరార్పణం అనే సమత్వబుద్ధి చేత సర్వ కర్మములను భగవంతుని యందు సమర్పించిన వాడు కర్మయోగి. ఇతడు యోగ సంన్యస్త కర్ముడు. ఆచార్య మధుసూదన సరస్వతి భాష్యము ఈ విషయాన్నే ప్రతిఫలిస్తుంది ***(యోగేన భగవదారాధన లక్షణ సమత్వ బుద్ధి రూపేణ సంన్యస్తాని భగవతి సమర్పితాని కర్మాణి)***. విషయాలు ప్రేరేపిస్తున్నా, ఇంద్రియాలు విషయాలను గుర్తించినా, ఆసక్తి ఆ వైపు సాగకుండా ఉండటమే గాక, ఫలాసక్తి లేని కారణంగా మనస్సు పరమార్థం లోనే పవిత్రంగా నిలిచి ఉంటుంది. ఇదే కర్మయోగ యజ్ఞంలో ప్రాప్తించే ప్రసాదము. అట్టి ప్రసన్నచిత్తుడైన కర్మయోగి, గురుముఖతః ఆత్మజ్ఞానాన్ని పొంది సంఛిన్న సంశయుడు అవుతాడు.

**జ్ఞానయోగము**

ఆత్మజ్ఞానం కలిగితేనే సంశయాలు సమూలంగా నశిస్తాయి. అలా సంశయ నివృత్తి జరిగిన వాడు జ్ఞానసంఛిన్న సంశయుడు. అతడే జ్ఞానయోగి. ఆత్మజ్ఞాన యోగి. అంటే కర్మయోగాన్ని ఆచరించడం వల్ల అశుద్ధి క్షయం కావడం అనే హేతువు గల జ్ఞానం చేత తొలగింపబడిన సందేహాలు కలవాడు ***(కర్మయోగానుష్ఠానాత్ అశుద్ధి క్షయహేతుక జ్ఞాన సంఛిన్న సంశయః*** - శ్రీ శంకర భాష్యము). ఈ దశలో బ్రహ్మాత్మ జ్ఞానం కలిగి ఆత్మ యొక్క ఏకత్వము అనుభూతిగా నిలిచిన కారణంగా సర్వ సంశయాలు నివృత్తి చేయబడుతున్నాయి. ఇది జ్ఞాన యోగము ***(జ్ఞానేన ఆత్మేశ్వరైకత్వ దర్శన లక్షణేన సంఛిన్నః సంశయః యస్య సః జ్ఞాన సంఛిన్న సంశయః*** - శ్రీ శంకర భాష్యము). తాను అకర్త అనే జ్ఞానం చేత దేహేంద్రియ మనోబుద్ధి రూపమైన అభిమాన సంబంధిత సంశయాలు పూర్ణంగా నశించిన వాడు.

ఈ విధంగా కర్మల నుండి, కర్మఫలాల నుండి విడిపడిన వాడు, సర్వసంశయ విముక్తుడు ఆత్మవిదుడు ***(ఆత్మవన్తమ్)***. ఆత్మవన్తం అన్నప్పుడు ఆత్మవిదుడు అని భావించ వచ్చు. లేదా, దేహేంద్రియ మనోబుద్ధులను తన అదుపులో ఉంచుకున్న అప్రమత్తుడు అని కూడా గ్రహించ వచ్చు. అలాంటి వాడు తన నుండి సాగే కర్మ లన్నిటిని గుణాల చేష్టలు గానే చూస్తాడు. ఆత్మవంతునిలో సాగే దేహ సంబంధమైన సహజకర్మలు గాని, లోక సంగ్రహార్థం లీలామాత్రంగా సాగే పుణ్యకర్మలు గాని అతనిని బంధించవు ***(కర్మాణి న నిబధ్నన్తి)***. కర్మల యందు అకర్మ దర్శనం చేయడం చేత *(4 - 18)* కర్మలు, తత్సంబంధ మైన కర్మఫలాలు అతనిని బంధించవు. కర్త లేడు కనుక కర్మలు బంధించవు. కర్మదోషాలు ఆ దివ్యాత్ముని చేరలేవు.

**యథా పర్వత మా దీప్తం నాశ్రయన్తి మృగద్విజాః**
**తద్వ ద్బ్రహ్మవిదం దోషా నాశ్రయన్తి కదాచన ॥**

ఏ విధంగా అగ్నిశిఖలతో ప్రకాశిస్తూ జ్వలిస్తున్న పర్వతాన్ని మృగాలు, పక్షులు చేరలేవో, అలాగే బ్రహ్మవిదుడైన వానిని దోషాలు ఎప్పుడూ చేరలేవు.

*కనుక, ఆత్మకు సంబంధించిన సర్వ సంశయాలను తొలగించుకొని, ఆత్మవిదుడై శోభించుటకు కావలసిన జ్ఞానమునకు హేతువైన కర్మయోగమును ఆచరించేందుకు సంసిద్ధం కమ్మని బోధిస్తూ, ఈ నాల్గవ అధ్యాయాన్ని భగవానుడు సమాప్తి చేస్తున్నాడు.*

**తస్మా దజ్ఞాన సమ్భూతం హృత్స్థం జ్ఞానాసి నాత్మనః ।**
**ఛిత్త్వైనం సంశయం యోగ మాతి ష్ఠోత్తిష్ఠ భారత ॥** 42

**తస్మాత్-అజ్ఞాన సంభూతం-హృత్స్థం-జ్ఞానాసినా-ఆత్మనః**
**ఛిత్త్వా-ఏనం-సంశయం-యోగం-ఆతిష్ఠ-ఉత్తిష్ఠ-భారత**

| | | | |
|---|---|---|---|
| భారత | = అర్జునా! | సంశయం | = సందేహమును |
| తస్మాత్ | = అందుచేత | జ్ఞానాసినా | = జ్ఞాన మనే కత్తి చేత |
| హృత్స్థం | = హృదయము నందున్న | ఛిత్త్వా | = నరికి |
| అజ్ఞాన సంభూతం | = అజ్ఞానము వలన పుట్టిన | యోగం | = యోగమును |
| ఆత్మనః | = నీ యొక్క | ఆతిష్ఠ | = ఆచరించు |
| ఏనం | = ఈ | ఉత్తిష్ఠ | = లే! |

**అర్జునా! అందుచేత, అజ్ఞానం చేత హృదయంలో పుట్టిన సంశయాన్ని జ్ఞాన మనే ఖడ్గంతో నరికి, నిష్కామ కర్మయోగాన్ని ఆచరించు. ఇక, లే!**

**వ్యాఖ్య**

సంశయము అనేది సర్వ వినాశ హేతువని, సర్వ అనర్థదాయక మని నలభైయవ శ్లోకంలో తెలుసుకున్నాం. పతన హేతువైన సంశయాన్ని హృదయంలో ఉంచుకో కూడదు. విష సర్పాన్ని ఇంట్లో ఉంచుకొని సుఖంగా ఎలా జీవించలేమో, అనుక్షణం ప్రమాద సూచకమైన భయంతో ఆందోళన చెందుతూ ఉంటామో, అలాగే సంశయాన్ని బుద్ధిలో పెట్టుకొని శాంతి జీవనాన్ని కొనసాగించ లేము. **తస్మాత్** - అందువలన సంశయ విచ్ఛేదనం గావించాలి అంటూ, **తస్మాత్** అనే పదంతో శ్లోకాన్ని ప్రారంభించాడు భగవంతుడు.

అంతే కాదు. సంశయం ఎప్పుడయితే హృదయంలో ఉందో, ఈ సందేహ రూప ప్రతిబంధకము వల్ల కర్మయోగానుష్ఠానము గాని, తత్ఫలంగా ప్రాప్తించే జ్ఞానం గాని సంభవించే అవకాశము లేదు కాబట్టి, **తస్మాత్** - ఈ కారణం చేత కూడా సంశయ నాశము జరగాలి అని అర్థము.

**ఎక్కడ నుండి పుట్టింది ?**

సందేహము ఏదైనా కావచ్చు. దూరం నుండి మనకు అభిముఖంగా ఒక వ్యక్తి వస్తూ ఉంటే, అతడెవరో స్పష్టంగా మనకు అర్థం కానపుడు సంశయం కలుగుతుంది. ఆ వచ్చే వ్యక్తి ఎవరు? రామయ్యా, లేక మాధవయ్యా? అనే సందేహాన్ని వెలిబుచ్చుతాము. ఇదీ సందేహమే. కాని, ప్రస్తుతం మనం చర్చించే సందేహము అలాంటి సాధారణ సందేహాల కోవ లోకి రాదు. ఇది ఆత్మకు సంబంధించిన సంశయము. ఆత్మ ఏమిటో తెలియక పోవడం చేత ఏర్పడిన సందేహము. ఆత్మకు సంబంధించిన జ్ఞానము లేకపోవుట చేత సంభవించింది





కనుక ఇది అజ్ఞాన సంభూతం. పాపిష్ఠము *(పాపిష్ఠమ్ అజ్ఞాన సంభూతం అజ్ఞానాత్ అవివేకతః జాతం)*. అజ్ఞానం వల్ల ఏర్పడిన అవివేకం నుండి పాపిష్ఠ మైన ఈ ఆత్మసంశయం జనించింది. అజ్ఞాన జనితమైన సంశయాన్ని అంటిపెట్టుకొని శోకమోహాదులు, రాగద్వేషాలు, కామక్రోధాలు, ఇలా సర్వదోషాలు చెంరేగుతూ ఉంటాయి. కనుక ఈ సంశయ శత్రువును సమూలంగా నశింప చేయాలి. శత్రువును వధించాలి అంటే శత్రు స్థావరం తెలిసి రావాలి. అప్పుడే వధించడం సాధ్య పడుతుంది. మరి, ఈ సంశయ శత్రువు యొక్క రహస్య స్థావరాన్ని ఎలా తెలుసుకోవాలి?

**ఎక్కడ ఉంది?**

సర్వానర్థ హేతువైన సంశయ శత్రువు బయట లేదు. దూరంగా లేదు. లోపలే ఉంది. మనలోనే ఉంది. హృదయంలో ఉంది. అంటే, ప్రతి మనిషి బుద్ధిలో చేరిపోయి ఉంది *(హృత్ స్థం, హృది బుద్ధౌ స్థితం)*.

సంశయ మోహాదులన్నీ అజ్ఞానం నుండే పుడుతాయి. అజ్ఞానం హృదయగతం. సంశయం కూడా హృదయగతం. సంశయ మనే బిడ్డకు అజ్ఞానము తల్లి. తల్లి ఉన్నచోటే బిడ్డ ఉంటుంది.

అజ్ఞానము కారణంగా ఉంది. సంశయము కార్యరూపంలో చిత్రవిచిత్రంగా విజృంభిస్తూ ఉంది. కారణ రూపమైన అజ్ఞాన నాశము వల్లనే కార్యరూప సంశయము విచ్ఛేద మవుతుంది. అజ్ఞానం, అజ్ఞానజనిత సంశయము హృదయగతంగా ఉన్నందున, హృదయ జనిత ఆత్మజ్ఞానము చేతనే కార్యరూప సంశయముతో సహ కారణరూప అజ్ఞానాన్ని నశింప చేయాలి.

**ఎలా ఉంది?**

అజ్ఞాన సంభూతమై, హృదయస్థంగా ఉన్న సంశయం ఏ రూపంలో ఉందో తెలుసా? దోషపూరితంగా ఉంది. శోకమయంగా ఉంది. మోహ జాడ్యంతో కూడుకొని ఉంది. ద్వైత భ్రాంతిలో కొట్టుమిట్టాడుతోంది.

హృదయాన్ని ఒక భయంకర అరణ్యంగా మార్చేసింది. శాఖోపశాఖలుగా విస్తరించిన అభిమాన వృక్షాలతో దారులన్నీ మూసేసింది. ఈ సంశయ దోషం చేత మార్గం తెలియక పరిభ్రమించే సాధకుడు కర్మ, జ్ఞాన యోగాలలో ప్రవృత్తి లభించక పోవడం చేత ఉభయభ్రష్టు డవుతున్నాడు.

ఈ సంశయారణ్యాన్ని ఛేదించాలి. సందేహ వృక్షాలను ఖండించాలి. దీనికి ఖడ్గం అవసరం. సాధారణ ఖడ్గాల చేత ఈ సంశయ అరణ్యాన్ని ఖండించ లేము. ఈ అరణ్యం బాహ్యంలో లేదు. అంతర్యంలో అల్లుకు పోయింది. ముందుకు సాగకుండా అవాంతరంగా నిలిచింది. ప్రగతిని నిరోధించే ప్రతిబంధక మైంది.

వినాశ హేతువైన ఈ అజ్ఞాన జనిత సంశయము బాహ్యంలో లేదు. అంతర్యంలో ఉంది. హృదయాన్నే ఆవరించుకొని ఉంది. స్వాశ్రయ మగు సంశయ నివారణమునకు స్వాశ్రయ జ్ఞానమే పరిష్కారము.

**ఎలా ఉన్నా ఖండించక తప్పదు**

సంశయము స్వాశ్రయము అంటే, నీవే ఆశ్రయముగా గలది అని అర్థము. నీ యందే ఉంది. నీకే కలిగింది. కనుక నీ హృదయాన్ని ఆశ్రయించుకొని, నీ హృదయం లోనే ఉంటూ, నీ హృదయాన్ని కలుషితం చేస్తున్న ఈ సంశయ భూతాన్ని స్వాశ్రయమైన, అంటే నీ హృదయము నుండి జనించిన జ్ఞాన మనే ఖడ్గం చేతనే ఖండించాలి. కనుక, శోకమోహాదులను సృష్టించే ఈ సంశయ భూతమును ఆత్మజ్ఞానము అనే ఖడ్గం చేత ఖండించాలి. శోకమోహాదులను హరించే ఆత్మదర్శనమే జ్ఞానం. అదే ఖడ్గము. అదే **జ్ఞానాసి**. అంటే జ్ఞానమనే ఖడ్గము *(**జ్ఞానాసినా శోకమోహాది సమ్యగ్ దర్శనం జ్ఞానం. తదేవ అసిః ఖడ్గః తేన జ్ఞానాసినా**)*. జ్ఞాన మనే ఖడ్గం చేత, నీకు సంబంధించిన, అనగా ఆత్మ సంబంధమైన సంశయాన్ని ఛేదించాలి *(**ఆత్మనః ఏనం సంశయం ఛిత్త్వా**)*.

ఈ సంశయం ఆత్మకు సంబంధించింది. ఆత్మకు సంబంధించిన అజ్ఞానం వల్ల సంభూత మైంది. నీ అజ్ఞానం వల్ల ఏర్పడిన సందేహము కనుక నీవు పొందే జ్ఞానం వల్లనే పోవాలి. మరో మార్గం లేదు. అంటే, నీకు కలిగిన సంశయాన్ని నీవు తొలగించుకోవాలే గాని పరులు తొలగించ లేరు. నీ హృదయంలో పరులకు ప్రవేశం లేదు. విష్ణుదత్తుని సంశయాన్ని దేవదత్తుడు తొలగించ లేడు.

దూరంగా ఉన్న చెట్టు మోడును చూచి, అది స్థాణువా, లేక పురుషుడా? అనే సందేహం కలిగితే, ఈ సంశయాన్ని మన ప్రక్కనే ఉన్న మరొకడు తొలగించవచ్చు. ఎందుకని? అది బాహ్యంలో ఉంది కనుక. పైగా అతనికి కూడా దృశ్యంగా ఉంది. కాని, నీ హృదయగత సంశయాన్ని మరొకడు ఎలా నివారిస్తాడు? పరుడు నివారించలేడు కనుక నీవే నివారించుకోవాలి ***(న హి పరస్య సంశయః పరేణ ఛేత్తవ్యతాం ప్రాప్తః యేన స్వస్య ఇతి విశిష్యతే).***

ఎవరి సందేహం వారిదే. ఎవరి జ్ఞానం వారిదే. ఎవరి అజ్ఞానము వలన సంభూతమైన సంశయం వారి జ్ఞానం వల్ల కలిగే వివేకంతో నశించ వలసిందే. ఒకరి హృదయం లోకి మరొకరి ప్రవేశం సాధ్యపడదు కనుకనే, ఎవరిని వారే ఉద్ధరించుకోవాలి ***(ఉద్ధరే దాత్మ నాత్మానం** - 6 - 5).*

కర్తను సంస్కరించడానికి, శుద్ధి చేయడానికి ఉపకరించేది కర్మయోగము. కర్మలో అకర్మను దర్శించి, తనను కర్తగా కాకుండా అకర్తగా దర్శించడానికి సహకరించేది జ్ఞానయోగము. కర్మయోగాన్ని ఆచరించిన వానికి జ్ఞానయోగంలో అవాంతరాలు ఉండవు. కనుక, కర్మయోగమును ఆచరించు ***(ఆతిష్ఠ కురు ఇత్యర్థః)*** అంటున్నాడు భగవంతుడు.

అర్జునా! ఇక లే! ***(ఉత్తిష్ఠ)*** అంటున్నాడు. కూర్చోవడం అంటే కర్మను సన్యసించడం. దానిని అంగీకరించని భగవంతుడు, అర్జునా! పైకి లే! అంటున్నాడు. కర్మయోగానికి నడుము బిగించు అంటున్నాడు. లే! సంశయము నుండి పైకి లే! మోహము నుండి పైకి లే! రాగద్వేషాల నుండి పైకి లే! అజ్ఞానం నుండి పైకి లే! కర్మయోగాన్ని ఆచరించు!

ఉత్తిష్ఠ! అంటే లెమ్మని అర్థము. కర్మయోగాన్ని ఆచరించడానికి లెమ్మని భావము. మరి, కర్మ యోగానుష్ఠానానికి నేను యజ్ఞయాగాదుల నాచరిస్తాను. యుద్ధం చెయ్యను అని అర్జునుడు అనొచ్చు. కనుకనే, ఇక్కడ అర్జునుణ్ణి ***భారతా!*** అని సంబోధించాడు భగవంతుడు. భరత కులమున అనగా క్షత్రియ వంశాన జన్మించిన వాడు కనుక, లేచి యుద్ధం చెయ్యమని ఆజ్ఞాపిస్తున్నాడు. కనుక ఉత్తిష్ఠ అంటే, యుద్ధము చేయడానికి నిలబడు అని అర్థము ***(ఉత్తిష్ఠ ఇదానీం యుద్ధాయ భారత ఇతి).***

కర్మయోగం కానపుడు ఏ కర్మ అయినా బంధమే. అదే కర్మయోగ మైనపుడు, ఫలాసక్తి లేకుండా కర్మలను ఆచరించడం చేత ఏ కర్మ కూడా బంధము కాదు. ఇది అర్థమైతే, క్షత్రియ ధర్మంగా తనకు ప్రాప్తించిన యుద్ధకర్మను ఆచరించడానికి సంశయించాల్సిన అవసరం లేదు.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే జ్ఞానయోగో నామ చతుర్థోఽధ్యాయః

**ఈ విధంగా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రము, శ్రీకృష్ణార్జున సంవాదము అయిన భగవద్గీత యందు జ్ఞానయోగ మనే నాల్గవ అధ్యాయము.**



# చైతన్య భగవద్గీత

## అథ పంచమోఽధ్యాయః - అయిదవ అధ్యాయము

## కర్మసన్న్యాస యోగః - కర్మసన్న్యాస యోగము

మంచి విషయాలు ప్రపంచంలో ఎన్నో ఉంటాయి. అన్నీ అందరికీ అవసరం లేదు. ఆచరించ దగినవే అయినా, అందరూ అన్నిటినీ ఆచరించ లేరు. అలాగే, శ్రేయోదాయక మైనవి ఎన్నయినా ఉండొచ్చు. కానీ తన కేది శ్రేయస్కరమో అదే వాంఛనీయము.

### సిద్ధిరూప సన్యాసము

కర్మల వలన అంతఃకరణము పక్వమైతే జ్ఞానము ప్రాప్తిస్తుంది. కర్మయోగము చేత శుద్ధిపడిన బుద్ధి కలవానికి సన్యాసము సిద్ధిస్తుంది. సన్యాసమునకు పరమగతి జ్ఞానమే. ఇక్కడ జ్ఞానము అంటే ఆత్మజ్ఞానము. ఆత్మజ్ఞానము లోనే సర్వకర్మ సన్యాసము జరిగి పోతుంది. ఈ విధమైన జ్ఞానకర్మ సన్యాసము ఆత్మవిదునికే గాని అనాత్మజ్ఞునికి కాదు.

జ్ఞానకర్మ సన్యాసమునకు ఆత్మజ్ఞుడే కర్త. ఇక్కడ కర్త అంటే, తాను అకర్త అనే జ్ఞానం కలిగిన కర్త. అంటే తాను అకర్తగా శోభించే వాడే గాని, కర్తగా వ్యవహరించే వాడు కాదు. మరి కర్త లేనపుడు కర్మ సన్యాసము సంభవము కాదు కదా! కర్త లేనపుడు కర్తవ్యం ఎలా ఉంటుంది? కనుక, కర్మ సన్యాసము అనేది కర్తవ్యం కాదు. జ్ఞానం యొక్క ఫలం. ఆత్మవిదునికి జ్ఞాన సామర్థ్యం ఉన్నందున కర్మ సన్యాసము అనేది నిశ్చితము. కాయ పెరిగి నపుడు పూలరేకులు వాటంతట అవే ఊడి రాలి పోయినట్లు, సిద్ధిప్రాప్తిలో ఆత్మవిదునిలో సహజంగా జరిగే కర్మత్యాగమే సన్యాసము.

**తద్బ్రహ్మాఽహ మస్మీతి కృతకృత్యో భవతి నైఽవాస్తి కించి త్కర్తవ్యమ్**

'అనంతమైన బ్రహ్మ స్వరూపమును నేనే అయి ఉన్నాను. కృతకృత్యత పొందినాను. నేను చేయదగిన కర్తవ్యము ఏ కొద్ది కూడా లేదు'. ఇది అకర్తగా ఆత్మవిదుని అద్వైతానుభూతి. ఇదే జ్ఞానకర్మ సన్యాసము. ఆత్మజ్ఞాన ఫలంగా జరిగిన కర్మత్యాగము. ఇది చేసేది కాదు, చూచేది. ఇక్కడ కర్త లేడు, అకర్త ఉన్నాడు. కర్మ లేదు, జ్ఞానం ఉంది. ఒకవేళ ఆత్మవిదునికి కర్మ తెలిసినా, అది అకర్మ గానే తెలుస్తూ ఉంది. స్వరూప వైభవంతో శోభించే ఈ జ్ఞానకర్మ సన్యాసాన్ని నాల్గవ అధ్యాయంలో భగవంతుడు అద్భుతంగా ప్రవచించాడు.

***కర్మణి అకర్మ యః పశ్యేత్*** - ఎవడు కర్మలలో అకర్మను దర్శిస్తాడో *(4 - 18).*

***స యుక్తః కృత్స్న కర్మకృత్*** - అట్టి ఆత్మజ్ఞాని సర్వ కర్మలను చేసినవాడే అయ్యాడు *(4 - 18).*

***కృత్వాఽపి న నిబధ్యతే*** - కర్మ చేసినా దాని చేత బద్ధుడు కాడు *(4 - 22).*

***సర్వం కర్మాఖిలం జ్ఞానే పరిసమాప్యతే*** - సర్వకర్మలు జ్ఞానము నందు అంతర్భూత మవుతాయి *(4-33).*

***యత్ జ్ఞాత్వా న పునర్మోహం*** - అది తెలిసిన తరువాత మరల మోహం దరి చేరదు *(4 - 35).*

***జ్ఞానాగ్నిః సర్వ కర్మాణి భస్మసాత్ కురుతే*** - జ్ఞానమనే అగ్ని సర్వ కర్మలను భస్మం చేస్తుంది *(4 - 37).*

***ఆత్మవన్తం న కర్మాణి నిబధ్నన్తి*** - ఆత్మజ్ఞానిని కర్మలు బంధించ లేవు *(4 - 41).*